యర్రంశెట్టి శాయి

# హ్యూమరాలజీ



# హ్యూమరాలజీ

## యర్రంశెట్టి శాయి

ఇంద్రధనుస్సు పబ్లికేషన్స్
ప్లాట్ నెంబర్ 92, శాతవాహన నగర్,
యల్.బి. నగర్, హైద్రాబాద్-74

**HUMOUROLOGY**
By :
Yerramsetti Sai



First Volume Revised :
Feb, 2005

Price : 150/-
US $15

Cover Design :
**RAMANA**

Cartoons :
**BABU**

Type Setting :
**VASAVI DTP WORKS**
Ph : 040-23047931.

Printed At :
**VAASU OFFSET PRINTERS**
**విజయవాడ. ఫోన్ : 2438324.**

Published by :
**Indradhanussu Publications**
Plot No.92, Satavahana Nagar,
L.B.Nagar, Hyderabad - 74.

For Copies :
**VISALANDHRA BOOK HOUSE** (All Branches)
**PRAJASAKTHI BOOK HOUSE** (All Branches)

ఈ కథలు పచ్చినిజాలు.

ఇందులోని పాత్రలూ, సంఘటనలూ

ఏవీ కల్పితాలు కాదు. మన తెలుగు

వాళ్ళందరినీ ఉద్దేశించి రాసినవే. మన రాత ఇలా

అఘోరించడానికి పూర్తిబాధ్యత

మన దేశంలోని తుగ్లక్‌టైప్ ప్రజాస్వామ్యందే.

ఒకవేళ హ్యూమరాలజీలో ఏపాత్రయినా మనలో గానీ

లేక మనకు తెల్లారిలేస్తే కనిపించే వాళ్ళల్లోగానీ ఎవరినీ

పోలిలేక పోయినట్లయితే అది కేవలం కాకతాళీయం.

అందుకు రచయితకు ఎలాంటి బాధ్యతా లేదు.

**- యర్రంశెట్టి శాయి**



# ఇదీ వరుస....

V

# హ్యూమరాలజీ గురించి.....

ప్రస్తుతం మన దేశంలో - ముఖ్యంగా మన రాష్ట్రంలో - ఓ సగటు మనిషి జీవితం ఎంత అస్తవ్యస్తంగా, ఎంత దారుణంగా తయారయిందో మనందరికీ తెలిసిందే!

ఎప్పుడు ఏ రాజకీయ నాయకుడు మనల్ని, మన రాష్ట్రాన్ని ముంచేస్తాడో తెలీదు. ఎప్పుడు ఏ బ్యాంక్ మన డబ్బు దోచుకుంటుందో తెలీదు. ఎప్పుడు ఎవడు మనల్ని మోసగిస్తాడో, దగా చేస్తాడో ఎవరికీ తెలీదు. ఎప్పుడు ఎవరు ఎవర్ని కిడ్నాప్ చేస్తారో, ఎప్పుడు ఏ గూండా ఎవరి మీద దౌర్జన్యానికి దిగుతాడో వాళ్ళకే తెలీదు. రోడ్ మీద నడిచే ఆడపిల్ల ముఖం మీద ఎవడు యాసిడ్ కొడతాడో - ఎవరు ఎత్తుకుపోయి రేప్ చేస్తారో అంతా దైవాధీనం సర్వీసే! మర్డర్లు చేసే వాడికి శిక్షలు పడవ్! పైగా మంత్రి పదవులొస్తాయ్. ప్రజల్ని ముంచేసిన వాడిని ప్రభుత్వమే దాచేస్తుంది. లేదా విదేశాలకు తోలేస్తుంది. దొంగలు రాత్రికి రాత్రే దొరలవుతారు. మనవంతు సేవ మనమూ చేయాలని పోలీసులు ప్రజల భరతం పడితే వాళ్ళకు ప్రమోషన్లొస్తాయ్!

ఈ మోసాలు, ఈ దారుణాలు, మారణ హోమాలూ, చూసి చూసి మనకు పిచ్చెక్కుతుంది. బి.పి. పెరిగిపోతుంది. ప్రెజర్ పెరిగిపోతుంది. టెన్షన్స్ ఎక్కువయిపోతాయ్.

వీటన్నిటి నుంచీ ఎలా తప్పించుకోవాలో తెలీక - ఏం చేస్తే మనశ్శాంతి దొరుకుతుందో అర్థం కాక మనం గుళ్ళూ గోపురాలతో పాటు ఆస్ట్రాలజీ, న్యూమరాలజీల వైపు పరిగెడుతాం. అప్పటికీ ఫలితం కనిపించకపోతే వాస్తాలజీని (వాస్తు) పట్టుకుని ప్రాకులాడుతాం!

ఎన్ని చేసినా, ఏం తంటాలు పడినా మనకు ఒరిగేదేమీ ఉండదు. ఎందుకంటే ఈ దిక్కుమాలిన సిస్టమ్‌లో, ఈ అవినీతి రాజ్యంలో ఇవన్నీ ఒక భాగం కనుక!

అయినాగానీ ఈ నరకాన్ని వద్దనుకున్నప్పుడు మర్చిపోడానికీ, అవసరమయినప్పుడల్లా నవ్వుకోడానికీ ఒకే ఒక్క మార్గం ఉంది. అదే ఈ హ్యూమరాలజీ!

ఎన్ని సమస్యల్లో ఇరుక్కున్నా, ఎన్ని చికాకులు చుట్టుకున్నా, వాటన్నిటినీ మరిపింపజేసి మళ్ళీమళ్ళీ తల్చుకుని నవ్వేలా చేసే టానిక్ హ్యూమరాలజీ !

కె.వాసు
(సినీ దర్శకులు)

6

తెలుగోళ్ళ జీవితాలతో
చెలగాటాలాడుతున్న
పొలిటికల్ డెకాయిట్స్
దుర్మార్గం మీద
ఆల్ టైమ్ గ్రేట్ సెటైర్

# దొంగలొస్తున్నారు స్వాగతం చెప్పండి!



**అబ్బో!** అబ్బో! తెలుగుజాతి చరిత్ర ఎంత గొప్పదో? తెలుగునాడులోనే రత్నాలు వీధుల్లో కుప్పలుగా పోసి అమ్మేరట! ప్రజలంతా ఎలాంటి కంప్లెయింట్సూ లేకుండా సకల సౌభాగ్యాలతో తులతూగారట!

మరిప్పుడో!"ఆంధ్రప్రదేశ్" ఆ హ్హ హ్హ హ్హ- టుది పవర్ ఆఫ్ ఇన్ఫినిటీ!

నిర్భయ్‌నగర్ కాలనీ చాలా హడావిడిగా ఉంది. కాలనీ వాళ్ళందరూ కాలనీ మధ్య పార్కులో చేరారు.

"సోదరులారా!" అన్నాడు గోపాల్రావ్-అని చుట్టూచూశాడు. ఆడా మగా పిల్లా పీచూ అతనేం చెప్తాడా అని ఎదురుచూడసాగారు. గోపాల్రావ్ జర్నలిస్టు. అంచేత ఎప్పుడూ ఒకరు చెప్పింది రాసుకోడమేగాని మాట్లాడడం తెలీదు. అందుకని ఆ తరువాతేం మాట్లాడాలో తెలీదు. రెండు క్షణాలాగి మళ్ళీ "పెద్దలారా" అన్నాడు. మరుక్షణం ఆగి "పిల్లలారా"అన్నాడు.

"పోనీలే-మామూలుగా మాట్లాడు" అన్నారెవరో. ఆమాటతో గోపాల్రావు ఉత్సాహం పుంజుకున్నాడు.

"మన కాలనీ కూడా ఊరికి చివరగా వుంది కాబట్టి ఏక్షణాన్నయినా దొంగలు "క్యూ"కట్టి దోచుకోవచ్చని అనుమానంగా ఉంది. ఎందుకంటే మాన్యూస్ పేపర్ల వార్తలను బట్టి దొంగలు ఇప్పటికే హైద్రాబాదులోని ఊరిబయట కాలనీలన్నీపూర్తి చేశారు. వాళ్ళ లిస్టులో మనకాలనీ ఒక్కటే మిగిలిపోయింది. కనుక మనం ముందే చోరనిరోధకచర్యలు తీసుకుంటే బావుంటుందని ఇవాళ ఇక్కడ కలుసుకున్నాం! కనుక ఏచర్యలు తీసుకోవాలో ఎవరికితోచింది వారు చెపితే బాగుంటుంది" అంటూ ముగించాడు.

శాయిరామ్‌లేచి నిలబడ్డాడు.

"సోదరులారా! మనకాలనీని మనం రక్షించుకోవాలి. 'యూనిటీ ఈజ్‌స్ట్రెంగ్త్' అన్నారెవరో. ఎందుకన్నారామాట? ఇదిగో- ఇందుకే- ఈదొంగలబాధ పడలేకే అన్నారని నేను గట్టిగా నమ్ముతున్నాను. కనుక అందరూ తమతమ సలహాలను అందజేయవలసిందిగా కోరుతున్నాను- అని అందరివంకా సలహాలకోసం చూశాడతను.

జనం మధ్యలోనుంచి వెంకట్రావ్ లేచి నిలబడ్డాడు.

"ఈ సమస్యకు బెస్ట్ సొల్యూషన్ ఏమిటంటే మనందరం రాత్రుళ్ళు కాలనీకి కాపలా కాయటం" అన్నాడు సీరియస్‌గా.

"మనమందరమూనా?" ఎవరో అడిగారు.

"మనందరం అంటే నా వుద్దేశ్యం రోజుకి కొంతమంది చొప్పున కాలనీకి కాపలా కాయాలన్నమాట."

అందరూ "అవునూ" అంటూఅరచారు.

"ఇదే చాలా పర్‌ఫెక్ట్‌సిస్టమ్" అన్నాడు రంగారెడ్డి.

ఓ మూలనుంచి శంకర్రావులేచి నిలబడ్డాడు.

అందరూ చిరాగ్గా అతనివేపు చూశారు. ప్రతి విషయానికీ ఏదో ఒక అడ్డుచెప్పటం అతనికలవాటని అందరికీ తెలుసు.

"కానీ ఆ రామగిరికాలనీలో దొంగలు, ముందుకాపలా తిరిగేవాళ్ళని కత్తితో పొడిచి తరువాతదోచుకున్నారుగా?" అనుమానంగా అడిగాడతను.

దాంతో అందరూ నిశ్శబ్దమయిపోయారు.

శాయిరామ్‌కేం మాట్లాడాలో తెలీలేదు. తను చెప్పిన సూచనని అతనలా ఒకమాటతో కొట్టిపారేయడం అసలునచ్చలేదు.

"అదివేరే-ఇదివేరే" అన్నాడు.

"అవును-అదివేరు-ఇదివేరు" అన్నాడు రంగారెడ్డి పుంజుకుంటూ.

"ఏది వేరు?"అడిగాడు శంకర్రావు.

"అదే-రామగిరి కాలనీలో సంగతి వేరయ్యా! అక్కడ కాపలాతిరిగింది ఇద్దరే! అందుకని దొంగలు అంతధైర్యంచేయగలిగారు. మనకాలనీలో రోజుకి నలుగురు తిరుగుతూంటారు."

"ఒకవేళ దొంగలు ఎనిమిదిమంది వస్తే?" మళ్ళీ అడిగాడు శంకర్రావ్. దాంతో అందరూ మళ్ళీ నిశ్శబ్దం అయిపోయారు. అందరికీ శంకర్రావు మీద వళ్ళుమండిపోతోంది. ఇలా ఆదిలోనే హంసపాదు పెట్టేస్తాడనే అతనిని మీటింగ్‌కి పిలవలేదు. అయినా వచ్చి అందరినీ చెరిగేస్తున్నాడు.

"దొంగలు సాధారణంగా నలుగురే వస్తారని పేపర్లో చదివాను" అన్నాడుశాయిరామ్ ఓక్షణం ఆలోచించి" అంతకంటే ఎక్కువమంది ఉంటే వాళ్ళకేవర్కవుట్‌అవదు".

"అవును "అన్నాడు రంగారెడ్డి.

"కనుక సోదరులారా-మనం అమలు చేయబోతున్న మొదటి సూచన ఏమిటంటే"-అంటూ శంకర్రావుని బైపాస్ చేయబోయాడు శాయిరామ్. కానీ శంకర్రావు మళ్ళీ అడ్డుపడి పోయాడు.

"మొన్న కాంతినగర్ కాలనీలో ఎనిమిదిమంది దొంగలొచ్చేకదా నానా రభసాచేసి, పదిమందినిపొడిచి వెళ్ళింది?"

మళ్ళీ అంతానిశ్శబ్దం అయిపోయింది.

చివరకు శాయిరామే కోలుకున్నాడు.

"వస్తేరానీయవయ్యా! అంతగా ఎక్కువమందివస్తే-వాళ్ళకు అడ్డుతొలిగిపోతేసరి-గొడవుండదుగా?"

"అయితే మరింక రాత్రుళ్ళు అలా నిద్రలు పాడుచేసుకుని తిరగటంఎందుకు?"

రంగారెడ్డి తల రెండుచేతులతో పట్టుకున్నాడు.

"ఎందుకేమిటి? దొంగలు నలుగురు కంటె తక్కువ వచ్చినప్పుడు ఉపయోగం కాదూ?" అన్నాడు గోపాల్రావ్.

"అవునవును-సో-అది సెటిలయిపోయింది. ఇక రెండోనలహా ఎవరయినా ఇవ్వగలరా?"

జనం నుంచి డిటెక్టివ్ నవలా రచయిత్రి రాజేశ్వరి లేచి నిలబడింది.

అంతా నిశ్శబ్దం అయిపోయింది.

"మనం ఓకొత్తపద్ధతి అవలంబిస్తే బాగుంటుంది" అందామె.

"ఏమిటది?"

"ప్రతి పదిఇళ్ళకూకలిపి మనం కంబైన్డుగా ఒక వార్నింగ్‌బెల్ ఏర్పాటు చేసుకోవాలి. దాని మీట బెడ్‌రూమ్స్‌లో మంచం పక్కనే ఉంటుందన్నమాట. ఏఇంట్లోదొంగలుపడ్డా వాళ్ళు ఆమీట నొక్కితే మిగతా తొమ్మిది ఇళ్ళల్లోనూ బెల్ మోగుతుందన్నమాట! దాంతో అందరూ కలసివచ్చి ఆ దొంగలను పట్టుకొని పోలీసులకు అప్పగించవచ్చు. ఎలా వుంది."

"వండర్‌ఫుల్" అంటూచప్పట్లు కొట్టారందరూ.

"ఈ వార్నింగ్ బెల్‌సిస్టం వెంటనే అమలుచేయాలి." అంటూ అరిచారెవరో. శంకర్రావ్ మళ్ళీలేచి నిలబడేసరికి మళ్ళీ అంతానిశ్శబ్దం అయిపోయారు.

"మళ్ళీ ఏమిటి? ఈ సిస్టంలో కూడా నీకు లోపం కనిపించిందా?"అడిగాడు రంగారెడ్డి చిరాకుగా.

"అవునూ! వార్నింగ్‌బెల్‌మోగుతుంది, రైటే! ఒప్పుకున్నాం! కానీ పదిళ్ళల్లో ఆబెల్ ఎవరి చ్చారో-అంటే ఏఇంట్లోనుంచి వచ్చిందో ఎలా తెలుస్తుంది?"

శాయిరామ్‌కి శంకర్రావు మీద వళ్ళుమండిపోతోంది.

"ఎందుకుతెలీదూ? బాగానే తెలుస్తుంది" అన్నాడు కోపంఅణచుకుంటూ.

"అదే-ఎలా తెలుస్తుందీ అనడుగుతున్నాను."

రాజేశ్వరికి కూడా శంకర్రావ్‌మీద కోపంముంచుకొచ్చింది. తను తన డిటెక్టివ్ మెదడు ఉపయోగించి, ఎన్నో రోజులు ఆలోచించికనుక్కున్న అద్భుతమయిన ఉపాయాన్ని అతగాడలా ఎలాంటి శ్రమలేకుండా-తీసిపారేయడం భరించలేక పోయింది.

"ఎలా తెలుస్తుందేమిటి? ఆ వచ్చినవాళ్ళందరూ కలుసుకుంటే ఏ ఇంటిమెంబరు రాలేదో తెలిసిపోదూ?"అంది అతనో వట్టితెలివితక్కువ వెధవాయి అన్నట్లు చూసి.

"అలా నడిరాత్రి అందరి అటెండెన్సు తీసుకుని, ఆబ్సెంటెవరో చూసి తేల్చుకునేలోగా ఆదొంగలపనికాస్తా పూర్తయిపోతుంది కదా? అదీగాకుండా ఒకవేళ వాళ్ళుమెయిన్‌స్విచ్‌ఆఫ్ చేశారనుకోండి."

"ఇక చాలు ఆపు" అరిచాడు శాయీరామ్.

శంకర్రావ్ ఆపేసి మళ్ళీకూర్చున్నాడు.

"శ్రీమతి రాజేశ్వరిగారు చెప్పినట్లు పదిళ్ళకు కలిపి ఒకాలింగ్‌బెల్ ఎర్పాటుచేసే పద్ధతి ప్రవేశపెట్టాలని నిర్ణయించడమైనది" అన్నాడు శాయీరామ్.

"సోదర సోదరీమణులు ఇంకేమయినా సలహాలు ఇవ్వగలిగితే త్వరగా చెప్పండి" అడిగాడు రంగారెడ్డి.

"కాలనీవాళ్ళ డబ్బుబాంక్‌లోనూ, నగలన్నీ బాంక్ లాకర్లలో పెట్టటం మంచిదని ఇందు మూలముగా నేను మనవి చేస్తున్నాను" అన్నాడు కొత్తగాకాలనీ బాంకు బ్రాంచికి మేనేజరుగా వచ్చిన మార్తాండరావ్. "అలా అయితే దొంగలకు దొంగిలించేందుకు ఏమీ ఉండదు."

అందరూ ఉత్సాహంగా "అవును ఈ అయిడియా చాలా బాగుంది" అంటూ అరిచారు.

శంకర్రావ్ మళ్ళీలేచి నిలబడ్డాడు

.మార్తాండరావ్ చిరునవ్వుతో అతనివేపు చూచాడు. తను చెప్పినదాంట్లో లోపాలు ఎన్నటం ఎవరివల్లవుతుంది?

"అయ్యా! నాదో సందేహం!" అన్నాడు వినయంగా.

"ఆవిషయం వేరే చెప్పక్కరలేదులే"అన్నాడు గోపాల్రావ్ తాపీగా.

"ఏమిటో అఘోరించు!"లోపల అనుకోబోయి పైకి అనేసినాలిక్కరుచుకున్నాడు రంగారెడ్డి.

"మార్తాండరావ్‌గారి సలహా నాకేంనచ్చలేదు. నగలు చేయించేది ఎందుకు? అన్నీ లాకర్లలో పెట్టిదాచుకోవడానికా! సరే-చెవులదుద్దులు, గాజులు, నెక్లెస్‌తీసి బాంక్ లాకర్లలో పెడతాం! మరి ముక్కుపుడక, మంగళసూత్రంమాటేమిటి? అవికూడా లాకర్లలోపెట్టాలా?"

శంకర్రావ్‌పాయింట్ ఆడాళ్ళను బాగా ఆకర్షించినట్లు కనిపించింది.

"అవునూ ! మంగళసూత్రం లాకర్లో ఏమిటి-నా తలకాయ" ఎవరో అనడం స్పష్టంగా వినిపించింది శాయీరామ్‌కి.

"ఇక డబ్బూ అంతే! కనీసం అయిదారువందలయినా ఇంట్లో ఉంచుకోకుండా అంతా బాంకులోపడేస్తే సడెన్‌గా ఎవరికయినా ప్రాణంమీదకొస్తే ఏంచేయాలి? ఎవడిస్తాడు డబ్బు?" అడిగాడు శంకర్రావ్.

"అవునూ-మొన్న సీతారామయ్యగారి ఆఖరిపిల్లకి ఇలాగే ప్రాణంమీదకు ముంచుకొస్తే పాపం-చేతిలో పట్టుమని పాతిక రూపాయలులేకపోయె-"పార్వతీదేవి కొంచెం గట్టిగా వత్తాసు పలికిందతనికి.

మార్తాండరావ్ మొఖం చిన్నబోయింది. తన సలహాలోని రెండు అంశాల్నీకూడా శంకర్రావ్ అలా చీల్చిచెండాడడం అతనికి నచ్చలేదు. అందుకని ఎదురుతిరిగాడు.

"దాన్దేముందీ? డబ్బు ఎప్పుడు కావాలంటే అప్పుడు విత్‌డ్రాచేసుకోవచ్చుగా! బాంకు ఎలాగూ కాలనీలోనే వుంది-ఉదయం సాయంత్రం ఓపెన్ ఉంటుంది."

కాని శంకర్రావ్ ఏమాత్రం బెదరలేదు.

"మరి అర్ధరాత్రిసంగతేమిటి? అప్పుడు డబ్బు కావాలంటే ఎలా?సరే అదలా వదిలేయండి. మనదేశంలో సంవత్సరానికి మూడునెలలు మొత్తం ఆఫీసులకూ బాంకులకూ శెలవులుంటాయ్. మరి ఆ మూడునెలలూ డబ్బుదాచుకున్నవాడేంచేయాలి. అడుక్కుతినాలి.మొన్నటికి మొన్న వరుసగా మూడురోజులు బాంకుమూసేశారు. అప్పుడు నేను మనకాలనీ వాళ్ళందరినీ అడుక్కుని భోజనంచేయగలిగాను."

"అవును! బాంక్ వద్దూ, గుడ్డూ వద్దు" అన్నారొకరు. దాంతో శంకర్రావ్ విజృంభించాడు.

"ఇంకో విషయంకూడా చెప్తున్నాను-మన నగలకు బ్యాంకుల్లో మాత్రం ఏమిరక్షణ ఉంది? ఆమధ్య మా ఆవిడ గొలుసు బాంకులోతాకట్టుపెట్టి, తరువాత విడిపించుకుంటే. ఆగొలుసులో చిన్నముక్కకొట్టేసి అతుకుపెట్టారెవరో! గాజులకు కూడా చిన్నచిన్న ముక్కలుకోసి కనిపించాయి-"

అంతా హాహాకారాలు చెలరేగాయ్.

"అవ్! నాకు అట్లానే జరిగింది" అన్నాడు యాదగిరి లేచినిలబడి.

మార్తాండరావ్ ముఖానవెత్తురులేదు.

"సోదరులారా! ఎక్కడో ఓవ్యక్తి అలాంటిదురాగతానికి పాల్పడినంతమాత్రాన అన్ని బాంకులూ అంతేనంటారా?" అనడిగాడు దీనంగా. సావిత్రమ్మ కోపంగా లేచింది.

"బాంకులన్నీ దగా-దొంగలు-నా గొలుసువి కూడా రెండులింకులు కొట్టేశారు" అంది మెడలోని గొలుసుతీసి గాలిలోవూపుతూ.

చాలామంది ఆడాళ్ళు లేచి ఆమెచుట్టూమూగారు.

శాయిరామ్, రంగారెడ్డి,గోపాల్రావ్ కలిసి అందరినీ కూర్చోమని బ్రతిమాలసాగారు.

అంతా సద్దుమణిగాక చూసేసరికి మార్తాండరావ్ ఎక్కడా కనిపించలేదు.

ఆ తరువాత ఇంకెవ్వరూ సలహాలివ్వలేదు.

అంచేత అప్పటికప్పుడే కాలనీ సభ్యులందరినీ నలుగురు నలుగురు చొప్పున గ్రూపులుగా విభజించి ఎవరు ఏరోజునైట్‌వాచ్‌మెన్‌ఉద్యోగం చేయాల్సిందీ నిర్ణయించారు.

డిటెక్టివ్ రచయిత్రి రాజేశ్వరికే ఆమెసూచించిన వార్నింగ్‌బెల్స్‌లను అమర్చే కార్యక్రమం అప్పజెప్పారు. ఆమె వారంరోజులు గడువు అడిగింది. దాంతో సభముగిసింది. సరిగ్గా ఆరాత్రే రెండింటికి శాయిరామ్ ఇంట్లోకి దొంగలొచ్చారు.

వాళ్ళంతట వాళ్ళేలేపేవరకూ శాయిరామ్‌కి మెలకువరాలేదు. నలుగురూ నిక్కర్లూ-చొక్కాలూ తొడుక్కొని చేతుల్లో మెరిసేకత్తులు పట్టుకుని నిలబడి ఉన్నారు. శాయిరామ్‌కి వణుకూ, దడా వచ్చేసినయ్.

"దొ....దొ....దొ....దొంగలు" అన్నాడు వణికిపోతూ.

"ష్! ఏటా ఎదవకూతలు! దొంగలు కాకపోతే దొరలొత్తారా, నీబోడికొంపకి! నోర్మూసుకుని ఆ ఇనుపబీరువా తాళంచేతులివ్వు!"

శాయిరామ్ మాట్లాడకుండా తలగడకిందున్న తాళంచేతులు వాళ్ళకిచ్చాడు.

అవి తీసుకుని ముగ్గురూ లోపలికెళ్ళారు.

ఇదే అదననుకొని "దొంగ-దొంగ" అని తీతువులా అరిచాడు శాయిరామ్. మరుక్షణంలో దొంగ అతని నోరుమూసి చేతిమీద ఒక్కపోటు పొడిచాడుకత్తితో!

"నోర్మూసుకోకపోయావంటే ఛాతీలోగుచ్చుతాను"అన్నాడు కోపంగా.

శాయిరామ్ నోరు మూసేశాడు.

స్టీలు అల్మరాలోని నగలూ, డబ్బూ, ఇంకా కొన్ని విలువయిన వస్తువులూ అన్నీ చక్కగా ప్యాకింగ్‌చేసుకు వెళ్ళిపోయారువాళ్ళు. శాయిరామ్ భార్యస్వల్పంగాగాయమయిన భర్తచేయిచూసి శోకాలుపెడుతూ పాతచీరచింపుకొచ్చింది.

అతను అర్జంటుగా చేతికికట్టుకట్టుకుని బయటకు పరుగెత్తి "దొంగ దొంగలు" అంటూ కేకలువేశాడు.

నలుగురు సభ్యులున్న వాచ్‌మెన్‌పార్టీ అతని ఇంటిముందున్న మల్లెపందిరి కింద నుంచి బయటికొచ్చారు ధైర్యంగా.

"దొంగలు వెళ్ళిపోయారా?" అడిగారు.

"ఇప్పుడే-ఇటే వెళ్ళారు."

"హమ్మయ్య! ఈ ఒక్క ఇంటితో వదుల్తారో వదల్రో అని హడలిచచ్చాం" అన్నాడొకతను.

"వాళ్ళురావడం మీరుచూశారా?"ఆశ్చర్యంగా అడిగాడు శాయిరామ్.

"చూడకపోవడం ఏమిటి? వాళ్ళే మమ్మల్ని కత్తిచూపి తీసుకొచ్చి ఈ మల్లెపందిరికింద కూర్చోబెట్టారు."

"మరి మీరు ఎదురుతిరగలేదూ?"

"వాళ్ళు తిరగనిస్తేకదా! మేమునలుగురం ఆచివరింటివేపు వెళుతోంటే వెనుకనుంచి మెడమీద కత్తిపెట్టారు. 'తిరుగుతే చస్తారు-పదండి' అన్నారు. ఇంకేం చేస్తాం! మల్లెపందిరి కిందకివెళ్ళాం! అక్కడనుంచీ కదలొద్దన్నారు కదల్లేదు."

"శాయిరామ్‌కి వళ్ళు మండిపోయింది.

అప్పటికే కాలనీవాళ్ళంతా ఒక్కొక్కరే గుమిగూడిపోయారక్కడ.

"నేను చెప్పలేదూ? వాళ్ళు నలుగురున్నా-మనం పదిమందున్నా ఒక్కటే!" అన్నాడు శంకర్రావ్ ఆవులిస్తూ.

"అవును- మనకేమో పెళ్ళాం బిడ్డలుండిరి. వాడేమో ప్రాణాలకు తెగించినవాడాయె" అన్నాడు వెంకట్రావ్.

అందరూ శాయిరామ్ పోగొట్టుకున్న ఆస్థిలెక్కలువేశారు. మొత్తం పదకొండువేల ఆస్థి గోవిందా!

"పదండి! పోలీసులకు రిపోర్టిద్దాం!" అన్నాడు గోపాల్రావ్ ఆవేశంగా.

"పోలీసుస్టేషన్‌కి ఎందుకు? ముందు పోలీస్‌కంట్రోల్‌రూమ్‌కి ఫోన్‌చేయండి" ఎవరో అరిచారు.

"అవును! ఆదొంగలు ఎంతోదూరం వెళ్ళివుండరు. ఈరోడ్డువెంట ఇప్పుడే వెళ్తున్నారని చెప్తే-కంట్రోల్‌రూమ్‌వాళ్ళు వైర్‌లెస్‌లో అందరూ మాట్లాడుకుని ఆదొంగల్ని ఇట్టేపట్టేస్తారు."

"అయితే పదండి! మార్తాండరావ్‌గారింట్లో ఫోన్ ఉంది."

అందరూ మార్తాండరావ్ ఇంటిదగ్గరకెళ్ళారు. "గోపాల్రావ్‌ని మాట్లాడమనండి! జర్నలిస్టు అంటే భయపడతారు పోలీసులు" అన్నారొకరు.

గోపాల్రావ్ కంట్రోల్ రూమ్‌నెంబర్ డయల్ చేశాడు గర్వంగా.

'ఎంగేజ్‌డ్' అన్నాడు. ఓ క్షణం ఆగి మళ్ళీరింగ్‌చేశాడు. మళ్ళీ 'ఎంగేజ్‌డ్' అన్నాడు. అక్కడున్న వాళ్ళందరికీ ఆశ్చర్యంకలింగింది.

"కంట్రోల్‌రూమ్‌ఫోన్ ఎంగేజ్ ఎలాఉంటుదయ్యా-అదీ ఇంతరాత్రప్పుడు-ఒకవేళ అది చెడిపోయి అఘోరించిందేమో! లోకల్ అసిస్టెన్స్‌కి కొట్టోరింగ్" సలహా ఇచ్చాడు రాజేశ్వర్రావు.

లోకల్ అసిస్టెన్స్ కూడా ఎంగేజే వినిపించింది.

"భలేతమాషాగా వుందే! అర్ధరాత్రికూడా ఇంత డిమాండ్ ఉంటుందా కంట్రోల్ రూమ్‌కి, లోకల్ అసిస్టెన్స్‌కీనూ" ఆశ్చర్యంగా అన్నాడు కుటుంబరావ్.

గోపాల్రావ్ మళ్ళీ కంట్రోల్‌రూమ్ కిరింగ్ చేశాడు-ఉహు! ఇంకా ఎంగేజ్ చూపిస్తూనే ఉందది. పావుగంట గడిచిపోయింది. అనుకోకుండా లోకల్‌అసిస్టెన్స్ నెంబరు రింగయింది.

"హలో అసిస్టెన్స్" అంది ఆపరేటరు.

"పోలీసు కంట్రోల్‌రూమ్ ఎంగేజ్ చూపిస్తోందండి. ఇరవైనిమిషాలనుంచీ! అర్జంటుగా అక్కడికి కనెక్షన్ ఇవ్వండి- దొంగలు పారిపోతున్నారు."

ఆమెక్షణం తర్వాత మాట్లాడింది.

"సారీ! ఇటీజ్ ఎంగేజ్‌డ్-"

"ఎంగేజ్‌డా?

"అవును"

"ఇందాకట్నుంచీ ఎంగేజ్‌డేనా?"

"అవునండీ!"

"ఇంతరాత్రప్పుడు ఎంగేజ్ ఏమిటండీ నా మొఖం?" స్టయిల్‌గా అన్నాడు గోపాల్రావ్.

"మీ మొఖంసంగతి నాకు తెలీదుగానండీ ఆఫోన్‌మాత్రం ఎంగేజ్‌ఉంది!"

గోపాల్రావ్ కంగారుగా చుట్టూచూశాడు, పొరపాటున ఆమాటయెవరయినా విన్నారేమోనని.

"ఇదిగో చూడండి! నేను న్యూస్‌పేపరు జర్నలిస్టుని.ఈ టైమ్‌లో కంట్రోల్‌రూమ్ ఎంగేజ్ ఎలా వుంటుంది? మరోసారి ట్రైచేయండి."

"కంట్రోల్‌రూమ్ ఎప్పుడు బిజీగా ఉండేదీ తెలీని జర్నలిస్టులు కూడా ఉన్నారంటే ఆశ్చర్యంగా ఉంది" అందామె.

"అంటే రాత్రి రెండుగంటలసమయంలో అదెప్పుడూ ఎంగేజ్ ఉంటుందన్నమాట!"

"అవును స్వామీ అవును!" అనేసి ఫోన్‌పెట్టేసిందామె.

"రాత్రంతా ఆఫోన్ అలా ఎంగేజ్ ఉంటుందేమిటి?" ఆశ్చర్యంగా కుటుంబరావ్ నడిగాడు.గోపాల్రావ్.

"అవునయ్యా! ఎడతెరిపిలేకుండా దొంగతనాలు జరగబట్టే-ఇలా ఫోన్‌లకెగబడుతున్నారు జనం" ఎవరో అన్నారు.

"ఒక్క దొంగతనాలేమిటి! మనం ఉన్నది ఆంధ్రప్రదేశ్ రాజధానిలోకదా! దోపిడీలు,మర్డర్‌లు ,కార్లలో తిరుగుతూ ఒంటరిగా కనిపించిన ఆడవారిని ఎత్తుకుపోయి మానభంగాలు చేయడం, రౌడీలు వీరవిహారాలు చేయడం-ఇవ్వన్నీ రాత్రుళ్ళే ఎక్కువగా జరుగుతాయికదా! అందుకే కంట్రోల్‌రూం తెగబిజీగా ఉంటుంది."

మరోసారి కంట్రోల్‌రూమ్‌కి రింగ్‌చేశాడు గోపాల్రావ్. అతని మొఖంవెలిగిపోయింది. హఠాత్తుగా చెయ్యిపైకెత్తి "సైలెన్స్! నిశ్శబ్దంగా ఉండండి! దొరికింది" అంటూ వెర్రికేకవేశాడు.

"హలో!" అన్నాడు అవతలి వ్యక్తి.

"హలో! నేను జర్నలిస్టు గోపాల్రావ్‌ని మాట్లాడుతు న్నానండీ! నిర్భయ్ నగర్ కాలనీనుంచి మాట్లాడుతున్నానన్నమాటండీ! సంగతేమిటంటే శాయిరామ్ ఇంట్లోదొంగలు పడ్డారండీ. ఇప్పుడే సూట్‌కేసులతోసహా నాగార్జునసాగర్ రోడ్డువేపు వెళ్ళారండీ. వాళ్ళుమొత్తం నలుగురు. నలుగురు చేతుల్లో నాలుగు కత్తులు-ఇవేవాళ్ళ ఆనవాళ్ళు. సొమ్ములన్నీ తీసుకొనివాళ్ళ సూట్‌కేసులలో పెట్టుకుని పోయారండీ-చాలాండీ, ఇంకేమయినా వివరాలుకావాలా?" గుక్కతిప్పకుండా మాట్లాడడం చేత ఆయాసపడసాగాడు గోపాల్రావ్. అందరూ అతనివేపు అభినందనపూర్వకంగా చూశారు.

"ఫుల్‌డిటెయిల్స్-బట్ క్రిస్ప్! ఎంత చక్కగా ఇచ్చాడండి వివరాలు" మెచ్చుకోలుగా అన్నాడు రాజేశ్వర్రావ్.

"అతనెప్పుడూ అంతేనండీ! జర్నలిస్టుకదా! టు-ది-పాయింట్-మాట్లాడతాడు! అంతే!" ఇంకెవరోపొగిడారు.

"హలో" అన్నాడు గోపాల్రావ్ పొంగిపోతూమళ్ళీ.

"హలో" అంది అవతలిగొంతు.

"నేను చెప్పినవన్నీ నోట్ చేసుకున్నారా? ఏమిటి? నేనా? నేను ప్రముఖ జర్నలిస్ట్ గోపాల్రావ్‌ని."

"................"

గోపాల్రావ్ మొఖం పాలిపోయింది.

"ఆ! ఏమిటి? మీరు మాట్లాడుతోంది కంట్రోల్‌రూమ్ నుంచి కాదా? మరెక్కడినుంచి? "మీ ఇంట్లోనూ దొంగలుపడ్డారా? గంటసేపటినుంచీ మీరూ కంట్రోల్‌రూమ్ కోసం

ప్రయత్నిస్తున్నారా? మరాసంగతిముందేచెప్పరే. అనవసరంగా సంబరపడ్డాను- కంట్రోల్‌రూమ్ దొరికిందని-"

అంతా మళ్ళీ నిరుత్సాహపడిపోయారు.

"ఇలా కంట్రోల్‌రూమ్ కోసం కూర్చుంటే పుణ్యకాలం కాస్తాపూర్తయిపోతుంది. త్వరగా పోలీస్‌స్టేషన్‌కు వెళ్దాంపదండి" అన్నాడు వెంకట్రావ్.

"అవును పదండి!"

"అందరూ ఎందుకులెండి! ముందు నలుగురు వెళ్తే సరిపోతుంది. అందరం వెళ్ళామంటే మళ్ళీ కొత్తదొంగలబాచ్‌వచ్చి అన్నిఇళ్ళూ ఊడ్చుకుపోతారు" అన్నాడు రంగారెడ్డి.

"గోపాల్రావ్‌ని తీసుకెళ్ళండి. జర్నలిస్ట్ అంటే కొంచెం త్వరగా యాక్షన్ తీసుకుంటారు" అన్నారెవరో.

గోపాల్రావ్, శాయిరామ్, వెంకట్రావ్, రంగారెడ్డికలిసి పోలీస్‌స్టేషనుకి బయల్దేరారు.

"ఎవరది?" అంతదూరంలో ఉండగానే అరిచాడు సెంట్రి.

"నిర్భయ్‌నగర్ కాలనీవాళ్ళం" అన్నాడు గోపాల్రావ్.

"ఏంగావాలి?"

"మాకాలనీలో దొంగతనం జరిగింది. కంప్లయింట్ ఇవ్వాలి."

"అదుగో-ఆయనతోచెప్పండి!" అన్నాడు లోపలకుర్చీలో నిద్రపోతున్నతనినిచూపుతూ.

అందరూలోపలికెళ్ళి అయిదు నిమిషాలపాటు తంటాలుపడి అతనినిలేపారు. తననిద్రకలాభంగం కలిగించినందుకు అతనికి కోపంవచ్చింది.

"ఏం కావాలి?" అడిగాడు చిరాకుగా.

"దొంగతనం జరిగింది."

"ఎక్కడా?"

"శాయిరామ్ గారింట్లో."

"ఏ శాయిరామ్?"

"కె.యల్. శాయిరామ్."

"నేనడిగేది అదికాదు-ఎవడా శాయిరామ్"

"నేనే" అన్నాడు శాయిరామ్ ముందుకొచ్చి.

"ఆ! ఏం జరిగింది?"

"దొంగలువచ్చికర్రచూపించి నగలూ, డబ్బూ,ఇంకా ఇతర వస్తువులు ఎత్తుకు పోయారండీ."

"ఎంతమంది ఉన్నారువాళ్ళు?"

"నలుగురండీ"

"ఎలా వున్నారు?"

"నల్లగా-పొడుగ్గాఉన్నారండి."

"ఇంతకు ముందెక్కడయినా చూసినగుర్తుందా?"

"లేదండీ."

"నీపేరేమిటి?"

"శాయీరామ్ అండీ."

" ఏ శాయీరామ్?"

"కె. యల్. శాయీరామ్-"

"మీ అయ్యపేరేమిటి?"

"మా ఫాదర్ పేరా?"

"అవును."

"ఆయన పేరెందుకు?"

"కావాల్నయ్యా."

"శంభులింగం."

"ఏ శంభులింగం?"

"కె.యల్. శంభులింగం"

"నీతాత పేరు?"

" నా తాత పేరుకూడా కావాలా?"

"కావాల్నయ్యా."

"బసవరాజు."

"ఏ బసవరాజు."

"కె.యల్. బసవరాజు."

"దొంగతనం ఎన్నిగంటలకు జరిగింది?"

"రెండు గంటలకు."

"తలుపులు తెరిచిఉంచావానువ్వు."

"నేనెందుకు తెరుస్తాను"

"మరెలా వచ్చిన్రువాళ్ళు?"

"తలుపులు  పగలగొట్టుకుని వచ్చారు."

"అంతవరకూ నువ్వెందుకు  లొల్లిపెట్టలేదూ?"

"పెట్టేంత టైముంటే ఈ గొడవంతా ఎందుకొస్తుంది?"

"అళ్ళనింకెవరయినా చూసినోళ్ళున్నారా?"

"నైట్‌వాలంటీర్ పార్టీవాళ్ళుచూశారు-"

"ఎవరాళ్ళు?"

"శ్రీధరం, రత్నాకరం, కిషోర్, రాజేష్-"

"వాళ్ళంతా నమ్మదగినవాళ్ళేనా?"

శాయిరామ్ ఉలిక్కిపడ్డాడు. "అదేంటండీ ? వాళ్ళు మాకాలనీవాళ్ళేగా?"

"కాలనీ ఏమిటయ్యా! ఇంట్లోసొంతమనుషులే మర్డర్లుచేస్తున్రు-ఇయ్యాల్రేపు."

"అబ్బే వాళ్ళంతా నమ్మకస్తులే!"

"మీదేకాలనీ?"

"నిర్భయ్‌నగర్ కాలనీ!"

"నిర్భయ్‌నగర్ కాలనీయా?" ఇంకా చిరాకుగా అన్నాడతను.

"అవును."

"మరి ఇక్కడికెందుకొచ్చారు?"

"ఇంకెక్కడికెళ్ళాలి! రిపోర్టివ్వాల్సింది పోలీస్‌స్టేషన్‌లోనేగా?"

"పోలీస్‌స్టేషన్‌లో కాకపోతే మంగలిషాపులో ఇస్తారేమిటి? నేననేది అదికాదయ్యా! ఇది మీ ఏరియా పోలీస్‌స్టేషన్‌కాదు."

"మరి మా ఏరియాపోలీస్‌స్టేషనెక్కడుంది?"

"ఆరోడ్డుచివర ఉంది."

"అంతదూరం వెళ్ళాలా ఇప్పుడు?"

"రిపోర్టివ్వాలంటే-"

అనేసిమళ్ళీనిద్రకోసం వెనక్కువాలాడతను.

"ఇంకిప్పుడెందుకులే రిపోర్టివ్వటం! పొద్దున్నవెళదాం!" అన్నాడు రాజేశ్వర్రావ్.

"అవును, ఎలాగూ దొంగలీపాటికి మరోరెండుమూడుఇళ్ళుకూడా చూచుకునివాళ్ళిల్లు చేరుకుని ఉంటారు" అన్నాడు రంగారెడ్డి.

నలుగురూ మళ్ళీకాలనీకి చేరుకున్నారు. అప్పటికే కాలనీఅంతా నిశ్శబ్దం అయిపోయిం ది. అందరూ నిద్రపోయినట్లున్నారు. వాళ్ళనుచూడగానే కుక్కలు హఠాత్తుగా నాలుగువేపులనుంచి వచ్చి మొరగసాగాయి. వాలంటీర్ పార్టీవాళ్ళు కర్రలు తీసుకుని పెద్దగా కేకలు వేసుకుంటూ పరుగుతో వచ్చారు. మరుక్షణంలో అందరిళ్ళల్లోనూ లైట్లువెలిగిపోయినయ్. క్షణాల్లో కాలనీవాళ్ళందరూ వాళ్ళచుట్టూ మూగిపోయారు.

"ఇందాకవచ్చిన దొంగలేనా?" అన్నాడు మార్తాండరావ్. వాళ్ళమొఖాలమీద టార్చ్‌లైటు వేస్తూ.

శాయిరామ్‌కి వళ్ళు మండిపోయింది.

"సిగ్గులేకపోతేసరి! నిజంగా దొంగలొచ్చి దోచుకుపోయినపుడు ఒక్కడూదిక్కులేడుగానీ ఇప్పుడు భూమి ఈనినట్లువచ్చేశారు" అన్నాడు చిరాకుగా.

"అవును, కుక్కలూ అంతేగా" తాపీగా అన్నాడు రంగారెడ్డి.

"మీరిద్దరూ స్కూటర్ మీద వెళ్ళి మనఏరియా పోలీస్‌స్టేషన్‌లో రిపోర్టిచ్చిరండి. నేనూ, రంగారెడ్డి వెళ్ళి మాపేపర్లో ఈవార్త ఎక్కించేసివస్తాము" అన్నాడు గోపాల్రావ్.

"ఏమనిరాస్తావు న్యూస్?" ఎవరో అడిగారతనిని సంబరంగా.

నిర్భయ్‌నగర్‌లో భయంకరమైడెకాయిటీ! ఇంటియజమాని శాయిరామ్‌తో ఢీ? పదకొండువేల ఆస్థి లౌ! చేతికి కత్తిపోట్లు-పోలీసువారి నిర్లక్ష్యం. ఇదంతామెయిన్‌హెడ్డింగ్ అన్నమాట. కింద నాలుగు పేరాలు వివరాలు రాస్తాను."

"అబ్బ ఒండర్‌ఫుల్-" అన్నాడు రాజేశ్వర్రావ్. మర్నాడు ఉదయం ఆరుగంటలకల్లా న్యూస్‌పేపర్‌కొని కాలనీ వాళ్ళంతా తమ కాలనీ దొంగతనం వార్త ఉత్సాహంగా చదువుకోసాగారు. మరికాసేపట్లో పోలీస్‌వానూ, జీపూ వచ్చేసినయ్ అక్కడకు.

అందులోనుంచి బిలబిలమంటూ పోలీసులు, పోలీసుకుక్కలు, పోలీసు అధికారులు, ఓఫోటోగ్రాఫరూదిగి శాయిరామ్ ఇంట్లోకివెళ్ళారు కాలనీవాళ్ళంతా శాయిరామ్ ఇంటిముందు మూగిపోయి ఉత్సాహంగా చోద్యం చూడసాగారు. కుక్కలు దొంగలవాసన గుర్తెట్టుకుని వాళ్ళను పట్టుకోడానికి బయటికొచ్చాయ్. అందరూవాటి వెనకే బయల్దేరారు. అవికాలనీచుట్టూ రెండు రౌండ్లు తిరిగి గోపాల్రావ్ ఇంట్లోదూరి మొరగసాగాయ్!

"అదేమిటి? అతన్ని చూసి మొరుగుతాయ్?" అన్నారు జనం.

"మీరెవరు?" అన్నాడు పోలీసు అధికారి గోపాల్రావ్నిచూసి.

"జర్నలిస్ట్ గోపాల్రావ్ ఇతనేనండీ! ఈ దొంగతనం గురించి ఇవాళ పేపర్లో రాసింది ఇతనే" పరిచయంచేశాడు శాయిరామ్.

"ఓహో" అనుమానంగా తలపంకించాడతను.

"అయితే పోలీసుస్టేషనుకి పదండి."

గోపాల్రావ్ అదిరిపడ్డాడు. "పోలీసుస్టేషనుకా? ఎందుకు?"

"మిమ్మల్ని ప్రశ్నించాల్సివుంది."

ఈలోగా కుక్కలు మళ్ళీజుయ్మంటూ పరుగెత్తి వెంకట్రావ్ ఇంట్లోదూరాయ్. అది చూసి వెంకట్రావ్కి చలిజ్వరం వచ్చేసింది. "ఇదేం అన్యాయంసార్! చిన్నప్పటినుంచీ పూచిక పుల్ల కూడా ముట్టుకుని ఎరగను." అన్నాడు ఏడుపుమొఖంతో.

కుక్కలు అక్కడనుంచి గుంపులోనిలబడ్డ యాదగిరిని చూసి మొరగటం ప్రారంభించేసరికి పోలీసు అధికారికి చిరాకేసుకొచ్చింది.

"అంటే మేమందరం దొంగలమేనంటారా?" అడిగాడు యాదగిరి.

అందరూ ఘొల్లున నవ్వారు.

"ఇంక వీటిని తీసుకుపోండి" అన్నాడు ఇన్స్పెక్టర్.

కుక్కలుమళ్ళీ వాన్ ఎక్కి వెళ్ళిపోయాయి.

కాలనీవాళ్ళంతా పోలీస్ అధికార్లచుట్టూ మూగారు.

"ఇలా విచ్చలవిడిగా దొంగతనాలు జరుగుతూంటే మీరేంచేస్తున్నట్లు?"అందరితరపునా వకాల్తాపుచ్చుకున్నట్లు అడిగాడు గోపాల్రావ్.

పోలీసు అధికారికి వళ్ళుమండిపోయింది.

"నువ్వెవరివి?"

"జర్నలిస్టుని?"

"ఓహో-అయితే పోలీసుడిపార్ట్‌మెంట్ ఏంచేస్తుందో అదివరకు మీ పేపర్లురాయలేదా?"

"రాశాం!"

"రాస్తేమళ్ళీ అడుగుతారేం?"

"డెకాయిటీలు ఎక్కువయిపోయాయి కాబట్టి!"

"డెకాయిటీలు ఎక్కువవ్వలేదు" కోపంగా అన్నాడు పోలీసుఅధికారి.

"అబద్ధం" అరిచాడు గోపాల్రావ్

"అవును అబద్ధం" అన్నారు, అందరూ వత్తాసుగా.

"అబద్ధం ఏమీలేదు."

"అయితే మరి డెకాయిటీలు రోజుకోటి జరుగుతోంటే లేదంటారేమిటి?"

పోలీసు అధికారి తల రెండుచేతుల్తోపట్టుకున్నాడు.

"అవి దొంగతనాలు! అంటే వాటిని 'రాబరీ' అంటారు! డెకాయిటీలువేరు."

"రెండూ ఒక్కటేగా? ఏరాయి అయినా మా పళ్ళేగావూడేది?" ఎవరో అరిచారు.

"కాదయ్యాబాబు! రెండూ వేరు."

"ఏమిటో ఆతేడా?"

"నలుగురుగానీ- ఇంకా తక్కువగానీ దొంగలు వస్తే అదిరాబరీ. అయిదుగురుగానీ, ఇంకాఎక్కువగానీ వస్తే అదిడెకాయిటీ-"

"అయితే ఇప్పుడు శాయిరామ్ గారింట్లో జరిగింది డెకాయిటీకాదంటారు?"

"మేము దాన్ని 'రాబరీ' కేటగిరిలో వేసుకుంటాం!"

"మీరు దేనికిందేసుకుంటే మాకెందుకండీ ఇప్పుడీ దోపిడీ...."

"ఇది దోపిడీ కాదన్నానా, దొంగతనం అను! ఆ!"

"అబ్బా ఏదొకటిలెండి సార్!"

"అలా వీల్లేదు. దేనికదే. మీయిష్టంవచ్చినట్లు మీరు పేర్లుపెడితే ఎలా? ప్రతి దానికీ- ఓపేరూ, ఓమెయిన్‌హెడ్డు, ఓప్రొసీజరూ ఉంటాయ్."

"అయితే యిప్పుడేమంటారు?"

"ఇది రాబరీకిందవస్తుంది, డెకాయిటీ అనటానికి వీల్లేదు."

"సరే,అనం! అయితే యిప్పుడు రాబరీకిందవచ్చిందికాబట్టి మనకేమయినా లాభం వుందా"

"ఎందుకులేదు? అన్నీ ఒకటిగా లెక్కవేసి-ఆసంఖ్యచూస్తే గుండెపగిలిపోదూ అందరికీ? అందుకేయిలా విభజించేస్తే చాలా తక్కువగా కనబడతాయ్. చూశారా మా డిపార్ట్ మెంట్‌కి ఎంతలాభమో-" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"పోనీయింకోపని చేయకూడదా సార్!"

"ఏమిటది?"

"సరదా దొంగతనాలు, అవసరంకొద్దీ దొంగతనాలు, ఆకలి దొంగతనాలు, అలవాటు చొప్పున చేసిన దొంగతనాలు, మానసిక బలహీనతవల్ల చేసేదొంగతనాలు-యిలా బోలెడు భాగాలుగా విభజిస్తే అస్సలు తగ్గిపోతాయిగా! యించుమించుగా ఏమీలేనట్టేస్టేట్ మెంట్లివ్వచ్చు."

ఆయన అర్జంటుగా జీపెక్కివెళ్ళిపోయాడు.

ఆసాయంత్రంమళ్ళీకాలనీ మీటింగ్ జరిగింది.

"నేను ఆరోజేచెప్పాను. పది ఇళ్ళకు కలిపి ఓవార్నింగ్‌బెల్ ఏర్పాటుచేయమని. కానీ ఎవరూ వినిపించుకోలేదు. ఇప్పటికయినా దానివిలువ గుర్తించియేర్పాటు చేశారంటే ఆదొంగల్ని మనమే పట్టుకోవచ్చు." అందిడిటెక్టివ్ రచయిత్రి ఆవేశంగా. అప్పటికప్పుడే చందాలు పోగుచేశారు. నలుగురు ఎలక్ట్రీషియన్లు ఆరాత్రంతా పనిచేసిమర్నాటికి వార్నింగ్‌బెల్స్ ఏర్పాటుజేసేశారు. చాలాసార్లువాటిని ప్రయోగాత్మకంగా మోగించిసంతృప్తిచెందారు.

స్వయంగా రాజేశ్వరే రాత్రిళ్ళురాబరీ డ్రిల్స్ నిర్వహించింది. అంటే రాత్రిరెండింటింకి ఏదోక ఇంట్లోనుంచి వార్నింగ్‌బెల్ వస్తుందన్నమాట. దాంతో అందరూ బయటకు పరుగెత్తుకురావాలి. ఆడ్రిల్స్ విజయవంతంగా పూర్తయినాయి. ఆమర్నాడే సీతాపతి ఇంట్లో దొంగలుపడ్డారు. వాడు ఎలాగోలా ధైర్యం తెచ్చుకుని వార్నింగ్‌బెల్ కొట్టాడు. కాని ఆచుట్టుప్రక్కల వాళ్ళందరియిళ్ళూ, ముందే బయటినుంచీ గొళ్ళాలు పెట్టేశారు దొంగలు. అన్నీ ఎత్తుకుపోయాక సీతాపతేవెళ్ళి అందరి తలుపులు గొళ్ళాలు తీయాల్సివచ్చింది.

మర్నాడే మళ్ళీ కాలనీ మీటింగ్ ఏర్పాటు చేశాడు శాయీరామ్

"సోదరులారా! మనం చేయగలిగినవన్నీ చేశాం! యిప్పుడు మనకు తెలిసొచ్చిన విషయం ఏమిటంటే మన ఉపాయాలేమీపనికిరావని! యింకా కొత్తఉపాయాలేమైనా

ఎవరయినా సూచించగలరా?" అడిగాడతను. ఎవ్వరూ మాట్లాడలేదు. చివరకు రంగారెడ్డిలేచి నిలబడ్డాడు.

"ఈ సమస్యకు ఒకే ఒక్కపరిష్కారం ఉంది." అన్నాడతను.

"ఏమిటిది?"

"దొంగలకుమనమే స్వాగతంచెప్పడం!" అందరూ నవ్వారు.

"రంగారెడ్డికి పిచ్చిపట్టింది" అనుకున్నారు కొందరు.

"అయ్యా! నాకేం పిచ్చిపట్టలేదు. ఫాక్ట్‌చెబుతున్నాను. దొంగలకు మనందరంకలసి స్వాగతం చెప్దాం. బాబూ మా ఇళ్ళు అలా ఇష్టంవచ్చినట్లుదోచుకోకండి. మీకు నెలనెలా మేమే ఎంతోకొంత ముట్టచెబుతాం అని రిక్వెస్టుచేద్దాం" మళ్ళీకేకలుచెలరేగినయ్.

కాసేపుకోలాహలం తరువాత శాయిరామ్‌లేచాడు.

"మన సోదరుడు రంగారెడ్డి సూచించిన ఉపాయమే బాగున్నట్లుతోస్తోంది" అన్నాడు వెంకట్రావ్.

మరి కాసేపట్లో అందరూరంగారెడ్డి ఆలోచన బాగానేవుందనే నిర్ణయానికొచ్చారు. వెంటనే రంగారెడ్డి అధ్యక్షుడిగా దొంగల స్వాగతంకమిటీ ఒకటివేశారు. శాయిరామ్, యాదగిరి, గోపాల్రావు, సీతాపతి అందులోసభ్యులు.

"ఇంతకూదొంగలకు ఆహ్వానం పంపడం ఎలా?" అడిగాడు యాదగిరి.

"దానిదేముందీ? అన్ని న్యూస్‌పేపర్లలోనూ ఆహ్వానపత్రాలు పబ్లిష్‌చేద్దాం-వాళ్ళెలాగూ న్యూస్‌పేపర్లు చదువుతారు కాబట్టి తెలుసుకుని సంప్రదింపులకు వచ్చేస్తారు."

ఆరోజే టాక్సిలో సిటీఅంతా తిరిగి నాలుగు భాషల్లో ఎనిమిది న్యూస్ పేపర్లలో ఆహ్వానాలు ప్రకటింపజేశారు వాళ్ళు.

"మహారాజశ్రీ దొంగలకు! నిర్భయ్‌నగర్ కాలనీవాసుల సుస్వాగతం! అర్యా! మా కాలనీలో మీకు వచ్చేశనివారం రాత్రిఘనమయిన స్వాగతసభయేర్పాటు చేయబడుతుంది. కనుక మీరెల్లరు మాస్వాగతాన్ని మన్నించి, సభకు విచ్చేసి మాతో సంప్రదింపులు జరపవలసిందిగా ప్రార్థిస్తున్నాము. మీరు జరుపుతున్న దొంగతనాలవల్ల రాత్రుళ్ళు మీకు, మాకు నిద్రాభంగము కలుగుచున్నది. అంతేకాదు, తరచుగా మీ కత్తిపోట్లువల్ల మాశరీరాలకు గాయాలు-వాటిని మాన్పించుటకు డాక్టరు బిల్లులు మీమీద రిపోర్టు ఇచ్చుటకు పోలీస్ స్టేషన్లచుట్టూ తిరగడం, దానికి ఆటో, టీ ఖర్చులు, కొన్ని నగలు బాంకులాకర్లలో దాయడం

మూలాన దానికయ్యే లాకర్ ఛార్జీలూ, సగంలో కొంత బంగారం బాంకువారుకొట్టేయడం-లేదా బాంకులోనే దొంగతనం జరగడం-ఇవన్నీ ఆలోచించి మేమీనిర్ణయానికొచ్చాము. కనుక మీరు తప్పక శనివారం రాత్రిమాచే ఏర్పాటుచేయబడిన ఆహ్వానసభకు విచ్చేసిమాతో సంప్రదింపులు జరిపి, పరిష్కారపత్రాలమీద సంతకంచేసి, ఆతరువాత మేమొసంగు చందన,తాంబూలాది సత్కారములు గైకొని మమ్మానందింప జేయవలసిందిగా ప్రార్థిస్తున్నాము-ఇట్లు ఆహ్వాన సంఘం-"

శనివారం రాత్రికాలనీ ఆవరణ అంతాపండగ వాతావరణం అలుముకుపోయింది. పెద్దషామ్యానాలు,పెద్దవేదిక, రంగురంగులదీపాలు, మైకులు,రికార్డులతో హడావుడిగా ఉంది.

"దొంగమహాశయులకు సుస్వాగతం" అన్న బోర్డు దేదీప్యమానంగా వెలుగుతోంది. సరిగ్గా రెండింటికి ఆరుగురుదొంగలు కారుదిగారు.

వెంటనే రంగారెడ్డి , మిగతా కమిటీసభ్యులు ఎదురువెళ్ళి పూలదండలువేసి స్వాగతం పలికారు. అందరూ వేదికమీద కూర్చున్నారు. ఆదొంగల్లోకందరికీ ఛీఫ్‌దొంగను మాట్లాడవలసిందిగా కోరారు. దొంగలేచి మైక్‌దగ్గరకొచ్చాడు.

"సోదరసోదరీమణులారా! మేము దొంగలమే. వప్పుకుంటున్నాం. కానీ మేము దొంగలమయింది మాకేం సరదాపుట్టికాదు. అది ఒక వృత్తిగా స్వీకరించాం! అందులో తప్పేమిటో నాకు అర్థంకావటంలేదు. రాజకీయాలు ఒక వృత్తి, అలాగే గూండాయిజం ఒక వృత్తి, అలాగే మర్డర్లుచేయడం ఒక వృత్తి. ఈ వృత్తులన్నీ కూడా మనంచేసేది కేవలం డబ్బు సంపాదనకేనని అందరికీ తెలుసు. మరి దొంగతనాలుకూడా డబ్బుసంపాదనకే కదాచేసేది! దీన్ని 'ఇల్లీగల్' అని ఎందుకంటున్నారో నాకు తెలీటంలేదు. ఇప్పటికయినా మీలో చైతన్యం కలిగి దీనిని చట్టసమ్మతం చేయడానికి ప్రయత్నిస్తున్నందుకు నాకు ఆనందంగాఉంది. మాక్కావలసిందేమీలేదు. మాకూ, మాభార్యాబిడ్డలకూ మూడుపూటలా తిండీ,ఖరీదయిన బట్టలూ, సొంతిళ్ళూ, కారు మెయింటెనెన్స్ ఖర్చులు, పెట్రోలుఖర్చులూ, రోజు కోవిస్కీబాటిలూ- ఇంతే మాక్కావలసింది. వీటికోసమే మేము దొంగతనం చేస్తున్నాం. మిమ్మల్ని కత్తులతో పొడుస్తున్నాం!మీరు మరివీటన్నిటికీ సరిపోయే డబ్బు నెలనెలా మాకుపడేస్తే మేము ఇంక మీ జోలికెందుకు వస్తాం. చస్తేరాము. జైహింద్-" అంటూ స్పీచ్ ముగించాడతను.

అందరూ తప్పట్లుకొటారు.

మరుక్షణంలో సంప్రదింపులు ప్రారంభమయ్యాయి.

చివరకు అందరూ ఓ నిర్ణయానికొచ్చారు..ఒప్పందంమీద సంతకాలయ్యాయి.

కాలనీ రిజిష్టర్‌లో దొంగగానమోదయిన వారందరికీ నెలకు అయిదువేలుచొప్పున జీతం (కన్సాలిడేటెడ్) ఇవ్వబడుతుంది. సంవత్సరానికొకసారి దీపావళి పండగ ముందు వేతనానికి సమానమయిన బోనస్ కూడా ఇవ్వబడుతుంది. దీనికి ప్రతిఫలంగా వారు నిర్భయ్‌నగర్ కాలనీలో దొంగతనాలుచేయరు, ఇంకొకరిని చేయనీరు.

అందరూ ఆ ఎగ్రిమెంట్‌కి హర్షం వెలిబుచ్చారు. ఆతరువాత అల్పాహారవిందు జరిగింది. విందులో దొంగలనాయకునితో తనింటర్వ్యూ ప్రారంభించాడు జర్నలిస్టు గోపాల్రావు.

"అయ్యా! తమరి స్వగ్రామం ఏది?"

దొంగల లీడర్ నవ్వాడు. "మాగ్రూపులో ఆంధ్రప్రదేశ్‌కి చెందినవారెవరూ లేరు ప్రస్తుతానికి" అన్నాడు.

"అదేమిటి? మీ స్వంత రాష్ట్రంలో మీరు దొంగతనం చేసుకోకుండా, పరాయి రాష్ట్రాల్లో ఎందుకు చేస్తున్నారు?

దొంగలనాయకుడు ఆప్రశ్నకు చిరాకుపడ్డాడు.

"నీళ్ళు ఎటుప్రవహిస్తాయి?"అనడిగాడు గోపాల్రావుని.

"పల్లంవేపు."

"అవునా? మరి మేమూ అంతే! ఏరాష్ట్రంలో పోలీసుడిపార్ట్‌మెంట్ చేతకానిది ఉంటుందో అక్కడ హాయిగా బ్రతకొచ్చుగదా మేము!"

"ఓహో అదా సంగతి!" అసలు రహస్యం తెలిసినట్లు రాసుకున్నాడు గోపాల్రావ్.

"అంటే మీ ఉద్దేశ్యం-కేవలం పోలీస్‌డిపార్టుమెంట్ దేనికీ పనికిరాదు అన్నరాష్ట్రంలోనే దొంగతనాలు చేస్తారన్నమాట! అంతేనా? "

"అంతేకాదు- ఇంకోటి కూడా వుంది."

"అదేమిటి? ప్రజలు! ఇక్కడి ప్రజలు గంగిగోవుల్లాంటివారు. కత్తిచూపించగానే సర్వస్వం యిచ్చేస్తారు. ఎన్ని దొంగతనాలు చేసినా- ఎంతమందిని చావగొట్టినా కిక్కురుమనకుండా పడివుంటారు. ప్రజలను రక్షించటం చేతకాని ప్రభుత్వాన్ని తీసిపారేయాలని కోరుకోరు! కనుక మేము హాయిగా రిటైరయేవరకూ సుఖప్రదమయిన జీవితం గడపొచ్చు ఈ రాష్ట్రానికి స్వర్ణాంధ్రప్రదేశ్ అని అందుకే మేము పేరుపెట్టాం!"

"సరే-ఇప్పుడు మీరు ఇంతధైర్యంగా వచ్చారు కదా ఇక్కడికి! ఒకవేళ పోలీసులు వచ్చి పట్టుకుంటే ఏంచేసేవారు?"

ఆదొంగల నాయకుడు పకపకా నవ్వాడు.

"ఏమిటి నవ్వుతారు?"

"ఇంత చిన్న విషయం తెలీదంటే ఆశ్చర్యంగా వుంది."

"ఏమిటా చిన్న విషయం?"

"పోలీసులెప్పుడయినా దొంగతనం జరుగుతుండగా గానీ, మర్డర్ జరుగుతుండగా గానీ లేక యింకేదయినా క్రైమ్ జరుగుతుండగా గానీ ఎవరినయినా పట్టుకోవడం గురించివిన్నారా?"

"లేదు."

"మరింక ఇప్పుడు మాత్రం ఎలా పట్టుకుంటారయ్యా, భలే జర్నలిస్టులయ్యా మీరు! మీలాంటి జర్నలిస్టులుండబట్టే దేశం యిలా అఘోరించింది-వస్తా" అంటూ లేచాడతను.

అందరూ కారువరకూ వెళ్ళివాళ్ళకి వీడ్కోలు ఇచ్చారు. అంతే! ఆతరువాతెప్పుడూ మాకాలనీలో దొంగతనం జరగలేదు. ✳



# శంకర్‌దాదా జిందాబాద్ !



**మా కాలనీ** పేరు మీకు తెలుసుకదా!

మా కాలనీ అంటే నా ఉద్దేశ్యం నిజంగా మాసొంతకాలనీ అనికాదు.

మేమంతా ఆకాలనీలో అద్దెకుంటున్నాం. ఆకాలనీ ఇళ్ళు ఓనర్లందరూ హౌసింగ్ బోర్డువాళ్ళు. సొంతిళ్ళులేనివాళ్ళకోసం కట్టించిఇచ్చిన హౌసింగ్‌బోర్డుకాలనీలోని సొంత ఇళ్ళలో ఉంటున్నారు.

ఆరోజు ఆదివారం అవడంవల్ల ఉదయం ఎనిమిదిగంటలవరకూ హాయిగా నిద్ర పోవచ్చని నేను ప్లాన్‌వేశాను. ఎందుకంటే నిద్ర అనేది తెలుగు రాజధానిఘోరులకు రేషన్‌లో దొరికేమంచినీళ్ళలాంటిది.

ఎందుకంటే రాత్రి పన్నెండింటివరకూ ఆచుట్టుప్రక్కల గుడిలోనో,మసీదులోనో లౌడ్ స్పీకర్లలో పాటలూ, అరుపులూ కేకలూ వినబడుతూనే ఉంటాయ్. అంచేత అంతవరకూ గ్యారంటీగా ఎవరికీ నిద్రవుండదు. పోనీపన్నెండుతర్వాతే పడుకుందామా అంటే, మాకాలనీ పంపుల్లో నీళ్ళు రాత్రి ఒంటి గంటనుంచీ రెండింటివరకూ మాత్రమే వస్తాయ్.

"పోనీ రెండింటికి పడుకోవచ్చుకదా- దానికింత రాద్ధాంతంఎందుకట?" అని మీరు విసుక్కోవచ్చు.

కానీ రెండింటికి కూడా పడుకోవడానికి వీల్లేదు. ఎందుకంటే రెండింటినుంచీ మూడు న్నరవరకూ మన ఆంధ్రప్రదేశ్‌లో దొంగలుపడే టైము. రోజూ ఆటైములో మనింట్లోనో, పక్కింట్లోనో, లేదా కాలనీలో ఏదోక ఇంట్లో దొంగలు పడక తప్పదుకదా! మరి ఆదొంగలు అలా ఊడ్చుకెళ్ళి పోయాక మనం నలుగురినీ పిలవడం-లేదా నలుగురూ మనల్ని పిలవడం-అందరూ కలసి ఆ దొంగతనం గురించి మాట్లాడుకోవడం- జోకులేసుకోవడం- జరుగుతుంది కదా!ఇక నాలుగ్గంటలకు పాలవాన్ వచ్చేస్తుంది.

అయిదు గంటల్లోపల పాలపాకెట్ తెచ్చుకోకపోతే- ఆతరువాత దొరకదు. మనపాల పాకెట్‌ని మరోపావలా ఎక్కువధరకుఎవరికో అమ్మేస్తాడుబూత్‌వాడు. లేదా ఆపాకెట్‌లోనిపాలు కొన్ని తీసేసి నీళ్ళు కలిపేస్తాడు.

"పోనీ నాలుగున్నరకు పడుకోవచ్చుకదా, మాయరోగమా?" అని మీరనవచ్చు కానీ సరిగ్గా నాలుగున్నరకే పనిమనిషి తలుపులుకొడుతుంది. ఆమె టైము నాలుగున్నరనుంచీ అయిదు వరకూ. ఆ అరగంటసేపూ అంట్లు ఎగిరి పడటం, దొర్లడంలాంటి శబ్దాలు ఎవరాపగలరు?పోనీ ఆపనిమనిషిని ఆరున్నరకు రమ్మందామా అంటే- "నేను నాలుగున్నరయితేనే వస్తాను! ఇష్టంలేకపోతే రిజైన్ చేస్తాను" అని వార్నింగిస్తుంది. అంచేత అయిదింటివరకూ నిద్రఖాళీ!

ఆతరువాత వంటచేసే కార్యక్రమం ప్రారంభమయిపోతుంది. అప్పుడేన్యూస్‌పేపర్.

ఇవాళ పేపర్లో ఏమిరాశారో చూద్దాం అనేకోరిక నిద్రను పూర్తిగాతరిమేస్తుంది. ఇక ఆరింటికి లేచి రెడీఅవడం ప్రారంభిస్తేగానీ ఎనిమిదింటికి యింట్లోనుంచి బయటపడటం సాధ్యంకాదు. ఎనిమిదింటి నుంచి బస్‌స్టాప్‌లో ఆంధ్రప్రదేశ్ వారి ఆర్.టి.సి.బస్ కోసం పడిగాపులు పడితేగాని తొమ్మిదిగంటలకు బస్సు దొరకదు.తొమ్మిదింటినుంచీ గంటన్నరపాటు అదిచీమలావేగంగా ప్రయాణిస్తేగానీ మనరాజధాని ట్రాఫిక్‌లో పదికిలోమీటర్ల దూరం వెళ్ళ లేదుకదా!

కనుక ఆదివారం ఒక్కరోజుమాత్రమే కరువుతీరా నిద్రపోయేందుకు ఎక్కువ అవకాశాలున్నాయ్.

అయితే ఆరోజు ఆరింటికల్లా తలుపులు గట్టిగాబాదడం వినిపించేసరికి అప్పుడేపడుతున్న నిద్రకాస్తా ఎగిరిపోయింది.

ఎవరా తలుపింత భీకరంగా, యింతపొద్దున్నే బాదుతున్నారని చిరాగ్గాలేచి వెళ్ళితలుపు తెరిచాను.

ఎదురుగ్గా శాయీరామ్ నిలబడి వున్నాడు.

"హలో-గుడ్‌మాణింగ్!" అన్నాడు నవ్వుతూ.

"గుడ్‌మాణింగ్" అన్నాను కోపంగా.

"మనకాలనీలో ఎనిమిదింటికి మీటింగుంది" అన్నాడు చిరునవ్వుతో.

నాకు వళ్ళుమండిపోయింది.

"మొన్నేకదా దొంగలతాలూకు మీటింగయింది?" అన్నాను చిరాగ్గా.

"అవును."

"అప్పుడు వాళ్ళూ మనం ఓ అగ్రిమెంటుకొచ్చేంకదా!"

"వచ్చాం!"

"మరింకెందుకిప్పుడీ మీటింగ్?"

"ఎలక్షన్‌మీటింగ్!"

"ఎలక్షన్‌మీటింగా?"

"అవును!"

"నీకేం పిచ్చెక్కలేదుకదా! మొన్నేగా ఎలక్షన్లయ్యాయి?"

"అయ్యాయిగానీ- అప్పుడు మన నియోజకవర్గంనుంచి గెలిచిన కాంగ్రెస్ (డబ్లూ) అభ్యర్థి ఆత్మహత్యచేసుకున్నాడు. అందుకని బైఎలక్షన్-"

"అరె! ఎందుకు ఆత్మహత్యచేసుకున్నాడట?"

"తప్పక మినిస్టర్ అవుతాడని ఉన్న ఆస్తంతా ఖర్చుచేశాడట! తీరాచూస్తే మంత్రి పదవిదొరకలేదు. ఉట్టి *MLA*గాఉంటే ఖర్చుచేసినదానికి పదింతలే సంపాదించేఅవకాశం ఉంటుందట! ఇంకేం చేస్తాడు పాపం!"

"అయితే ఇప్పుడు మనం మీటింగ్ ఎందుకుపెట్టుకోవాలి?"

"ఎందుకేమిటి? ప్రతిఎలక్షన్‌కి మనకాలనీ వాళ్ళందరంకలిసి మీటింగ్ పెట్టుకుని ఏపార్టీకి ఓటువేయాలో నిర్ణయించుకోవడం మామూలేగా?"

"ఇంకా నిర్ణయించుకునేది ఏముంది? మన కాలనీ ఎప్పుడూ కాంగ్రెస్ (డబ్లూ) కేగా వోటువేసేది?"

"కానీ ఈసారి కొత్తపార్టీ వచ్చిందికదా? అందుకని మళ్ళీ ఓసారి డిస్కస్ చేసుకుంటే..."

"కొత్తపార్టీఏమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు.

"కాంగ్రెస్ (జెడ్)"

"కాంగ్రెస్ జడ్డా?"

"అవును!"

"అంటే ఈ కాంగ్రెసుల్లో అదే ఆఖరిదన్న మాట! దీంతో ఇంకపార్టీ చీలేందుకు అవకాశం లేనట్లేగా!"

"ఎందుకులేదూ?"

"ఎందుకేమిటి? ఇంగ్లీషులిపిలో జెడ్ వరకేగా ఉంది."

శాయీరామ్ నవ్వేడు.

"పిచ్చివాడా? రెండక్షరాలతో మళ్ళీ కొత్తసిరీస్ మొదలుపెట్టవచ్చుగా?"

"నాకర్థంకాలేదు"

"అంటే?"

అంటే కాంగ్రెస్(ఎ- బి), కాంగ్రెస్(జడ్- హెచ్) అలా లక్షలకొద్ది కాంబినేషన్లతో బోలెడు పార్టీలు ఏర్పాటుచేసుకోవచ్చు."

"నిజమే" ఒప్పుకున్నాను.

"అయితే పద త్వరగా మరి. ఎనిమిదింటికల్లా మీటింగ్ మొదలెట్టాలి."

వారానికోరోజు దొరికే ఈ రేషన్ నిద్రని వదులుకోవడానికి నాకు మనసొప్పలేదు.

"నాక్కొంచెం పనివుంది గురూ! మీరు మీటింగ్ స్టార్టుచేసేయండి. తరవాత వస్తాను" అన్నాను అబద్ధమాడేస్తూ.

"అదేంకుదరదు. కాలనీ కమిటీ వైస్‌ప్రెసిడెంట్ వయ్యుండి నువ్‌రాకపోతే అందరూ గొడవచేస్తారు."

"సరే"అన్నాను గత్యంతరంలేక.

ఇంకోసారి ఛస్తే కాలనీ కమిటీ పదవులేమాత్రం ఒప్పుకోకూడదని అప్పటికప్పుడే నిర్ణయించుకున్నాను.

శాయీరామ్ వెళ్ళిపోగానే- నేను రెడీఅయి మీటింగ్ జరిగే చోటుకి చేరుకున్నాను. అప్పటికే శాయీరామ్ ఆర్గనైజింగ్ సెక్రటరీ కాబట్టి తానే దగ్గరుండి వేదిక, మైక్, షామియానాలు అన్నీ ఏర్పాట్లు చేయించేశాడు.

ఎనిమిదింటింకి కాలనీలోని వాళ్ళుచాలామంది మీటింగ్ కొచ్చేశారు.

"కాలనీకమిటీ ప్రెసిడెంట్ గోపాల్రావ్‌గారు ముందు మాట్లాడుతారు."అన్నాడు శాయిరామ్ మైక్ దగ్గర నిలబడి.

గోపాల్రావ్ మైక్ దగ్గరకొచ్చాడు.

"సోదరులారా! ఉన్నపార్టీలతోనే మనమందరం నానా ఇబ్బందులూ పడుతూంటే గోరు చుట్టుపై రోకటిపోటులా ఇప్పుడు కాంగ్రెస్ (జడ్) అవతరించింది. ఆపార్టీతాలూకూ అభ్యర్థి నిన్నే మన కాలనీకొచ్చి మనం ఆయనకే ఓట్లువేస్తే మన కాలనీలో ప్రతిఇంటికీ ఓ ఇత్తడి బిందె ఇస్తానన్నాడు. కనుక మనం ఇప్పుడు పరిస్థితిని సమీక్షించాల్సిన పరిస్థితి ఏర్పడింది."

"ఇత్తడిబిందె ఏసైజుది?" ఎవరో ఒకామె ఆడవాళ్ళలో నుంచి అడిగింది.

"సైజువివరాలు ఆయనింకా అందజేయలేదని నేను మనవి చేస్తున్నాను."

"మిగతా పార్టీలవాళ్ళు ఏమంటున్నారు?" మరొకావిడడిగింది ఆశగా.

"మిగతావాళ్ళల్లో కాంగ్రెస్(డబ్ల్యూ)వాళ్ళు మళ్ళీఅదివరకులాగానే ప్రతిఓటుకి ఓచెంచా ఫ్రీగా ఇస్తారు. టోకున అరడజను ఓట్లున్న ఇంటికి చెంచాకుతోడుగా స్టీలుగిన్నెకూడా ఇస్తారు.ఇక టిడిపి (ఎక్స్) వాళ్ళు ప్రతి ఇంటికి ఓప్లాస్టిక్ బకెట్ ఇస్తామంటున్నారు. టిడిపి 'క్యూ' వాళ్ళు ప్రతి ఇంటికీ ఓ అమెరికన్ బ్రాయిలర్ చికెన్ ఇస్తారట. ఒకవేళ ఎవరయినా కోడి తిననివారుంటే వాళ్ళకి కోడికిబదులుగా కోడిగుడ్లు ఇచ్చేస్తారు. కాంగ్రెస్(జి) వాళ్ళు ప్రతి ఓటరుకి పదకొండుగాలన్ల గుడంబా పోస్తారట కనుక...."

అతనిమాట పూర్తికాకుండానే సావిత్రమ్మలేచి నిలబడింది.

"మిగతా పార్టీలు ఇస్తామంటున్న సామాన్లన్నీ ఇదివరకు ఎలక్షన్లలోనే సమకూర్చుకున్నాం ఇంతవరకూ ఎవరూ ఇత్తడిబిందె ఇవ్వలేదు. కాబట్టి మనఓటుకాంగ్రెస్(జెడ్)కేవేసేద్దాం."

దాంతో అంతా రణగొణధ్వనులు మొదలయ్యాయ్.

"ఆ బిందెసైజు తెలుసుకోందే మాటెలా ఇస్తాం?" అని ఒకరు.

"నాచీరలన్నీ బొత్తిగా చిరిగిపోయాయి పిన్నిగారూ! బిందె బదులు నాలుగుచీరలిమ్మంటే ఇవ్వరంటారా" అని ఇంకొకావిడ.

"కిందటిసారి వాళ్ళిచ్చిన స్టీలుచెంచాలు తుప్పు పట్టిపోయాయి. ఆ సచ్చినోళ్ళని ముందా చెంచాలు వాపసు తీసుకుని మంచివి ఇమ్మని కబురు చేయండి" అని ఇంకొకావిడ.

ఈ రణగొణ ధ్వనిలోంచి ఒకావిడ కంఠం ఖంగుమనిమోగింది.

"అన్ని వస్తువుల ధరలూ పెరిగిపోయాయి! ఇంకా ఈ బిందెలూ, చీరలూ, చెంచాలు ఏమిటి? నామొఖం! టి.వి. సెట్లుగానీ, స్టీలు అల్మరాలుగానీ ఇవ్వమని అడగరాదూ?"

"అవునవును. ఎంతకాలం ఈ చిల్లరబేరాలు?" ఇంకెవరో సపోర్టుచేశారు.

నేను గొంతు సవరించుకున్నాను.

"అంతఖరీదయినవి ఎవరిస్తారు? ఒక్కో ఇంటికి ఓ టి.వి సెట్టంటే చూడండి మరి--కనీసం రెండుకోట్ల రూపాయలు ఖర్చుచేయాల్సిఉంటుంది వాళ్ళకి. అదెలాసాధ్యం?" అన్నాను నచ్చచెప్తూ.

"ఏం మాయరోగమేమిటి?స్టాంపుల కుంభకోణాల్లోనూ, ప్రభుత్వభూములకుంభ కోణాల్లోనూ ఇంకా ఇతరత్రా ఇంతకు పాతికరెట్లు సంపాదించుకోరా." విరుచుకుపడిందొకావిడ.

"సంపాదించుకున్నాగానీ- వాళ్ళుఖర్చుచేయరు-" నన్ను సమర్థిస్తూఅన్నాడు గోపాల్రావ్.

"చేయకపోతే పోనీండి. మన ఓటు కూడావాళ్ళకేయం" అందామెమొండిగా.

ఆడాళ్ళతోనూ, పోలీసులతోనూ ఎప్పుడూ వాగ్వివాదం పెట్టుకోకూడదని మా గోపాల్రావ్ చెప్పిన విషయం నాకు గుర్తుంది. అంచేత ఆవిషయం శాయీరామ్‌కికూడా గుర్తుచేశాను.

అతను వెంటనే సైలంటయిపోయాడు.

ఈలోగా ఓటాక్సీ వేగంగా వచ్చి ఆగిందక్కడ. అందరం ఆశ్చర్యంగా అటువేపు చూడసాగాం. టాక్సీలోంచీ మా కాలనీలోనే ఉంటున్న శ్యామల్రావుఖద్దరు చొక్కా, పంచెతోదిగి చిరునవ్వుతో మాఅందరికీ నమస్కారం చేశాడు. అందరికీ మతిపోయినట్లయింది ఆ అవతారంచూసి.

"శ్యామల్రావ్‌గారికి జై" అంటూవెనుకే వాళ్ళపెద్దబ్బాయి కూడాదిగాడు.

శ్యామల్రావ్ చిరునవ్వుతో వేదికమీదకు వచ్చినిలబడి జనార్ధన్‌తోనూ, శాయీరామ్ తోనూ, నాతోనూ కరచాలనం చేశాడు.

"తమరుఅనుమతిస్తే నా ఓటర్లకు ఓ అభ్యర్ధన చేస్తాను" అన్నాడు చిరునవ్వుతో.

"మీ ఓటర్లేమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు జనార్ధన్.

"మీరంతా నా నియోజకవర్గంలోని ఓటరులే కదా! కనుక మన కాలనీ ఓట్లన్నీ నాకే వేయడం న్యాయమని మనవిచేస్తాను" చిరునవ్వుతో అన్నాడు.

ఆ చిరునవ్వు చూస్తుంటే నేను చూస్తున్నది కలో నిజమో అర్థంకావటంలేదు నాకు. నేను ఆకాలనీలోగత పదేళ్ళుగా ఉంటున్నాను. ఈ పదేళ్ళలో ఏ ఒక్కరోజుకూడా అతను నవ్వటం ఎవ్వరూ చూడలేదు.

"అంటే..... అంటే.....మీరూ ఎలక్షన్‌లో....."

"అవున్నాయనా! మన నియోజకవర్గంనుంచేపోటీ చేస్తున్నాను." అప్పుడే పుణ్యక్షేత్రాలన్నీ సందర్శించి వచ్చిన పెద్దమనిషిలా శాంతంగా అన్నాడతను

మా సంభాషణ అంతా మైకులోఅందరికీ వినబడుతూండడంవల్ల సభలోకలకలం బయల్దేరింది.

"సోదరులారా! మీకు నన్ను నేను పరిచయంచేసుకోవాల్సిన అవసరంలేదని నాకు తెలుసు. ఎందుకంటే నేను మీ వాడిని. మీలోపుట్టి పెరుగుతున్న మన కాలనీవాడిని, ఎలక్షన్లో నేను కూడా ఎమ్మెల్యేగా పోటీచేస్తున్నానని మీకందరకూ తెలియజేయడానికి ఎంతో సంతోషి స్తున్నాను. నిజానికి నాకసలు రాజకీయాలంటే మీ అందరిలాగానే చిరాకు. కానీ ఈరోజున మనదేశంలో అస్తవ్యస్త పరిస్థితులు చూశాక గుండెద్రవించిపోయి ఒక్కదూకు దూకాను. కనుక నన్ను మీరందరూ తప్పక ఎన్నుకుంటారని ఆశిస్తున్నాను. నన్ను ఎన్నుకుంటే 159 నెంబర్ బస్‌ని కాలనీలోపలి వరకూ లాక్కొస్తాను. పైప్సలో మంచినీళ్ళుదొరికే టైముని అర్థరాత్రినుంచి ఉదయంమూడింటికి మార్చేస్తాను. మనకాలనీలో ఉన్న పిచ్చికుక్కల్ని పక్కకాలనీలోకి తరిమే యిస్తాను! ఇంకా ఇలాంటివి బోలెడుచేస్తాను-" అంటూ ఆ తరువాతేం చెప్పాలో తెలీక ఆగాడతను.

"ఇంతకూ మీరేమిస్తున్నారు మరి? బిందెలా, చీరలా?" సావిత్రమ్మ అడిగింది మధ్యనుంచి.

"అమ్మా, మీకో నమస్కారం నాకు అంతటి తాహతులేదు, నేనేమీ ఇవ్వలేను."

"మరి అవతలివాళ్ళు ఇవ్వన్నీ ఇస్తుంటే ఎవరొదులుకుంటారు?"

"అయ్యో! వదులుకోమని ఎవరన్నారమ్మా ఎవరేమిస్తే అది తీసుకోండి. ఎలక్షన్లుండగానే ఇల్లు చక్కబెట్టుకోమన్న సామెత ఉండనేవుందిగదా అందరిదగ్గరా అన్నీ తీసుకుని ఓటుమాత్రం నాకు వేయండి. నాలాంటి బీదాడికి ఓటుదానం చేస్తే ఎంతోపుణ్యంమీకు. దానాలన్నిటిలోకి 'ఓటుదానం' గొప్పదని మన శాస్త్రాలుఘోషిస్తున్నాయికదా."

అందరూ చర్చించుకోవడం మొదలెట్టారు. చర్చముగిసేవరకూ అతను నమస్కారంపెడుతూ అలాగే ఉండిపోయాడు.

చివరకు అందరూ కలసి శ్యామల్రావుకే ఓటువేయాలన్న నిర్ణయానికొచ్చారు.

ఆ నిర్ణయం విన్నవెంటనే శ్యామ్రావు ఆనందంతో పొంగిపోయాడు.

"నాకు చాలాసంతోషంగా ఉంది.మనకాలనీ ఓట్లంటే మాటలుకాదు. సుమారు అయిదువేల ఓట్లు. నేనింక ఎలాంటి ఢోకాలేకుండా గెలుస్తాను. నమస్తే నమస్తే" అంటూ నమస్కారాలు చేసుకుంటూ టాక్సీ దగ్గరకు వెళ్ళాడు. వెనకే అతని కొడుకు "శ్యామ్రావ్గారికి జై" "దేశ్కీనేతా-శ్యామ్రావ్బన్తా" "ఇండిపెండెంట్ అభ్యర్థి శ్యామ్రావ్ జిందాబాద్-"అని అరుచు కుంటూ వెళ్ళాడు.

టాక్సీ వెళ్ళిపోగానే గోపాల్రావ్ మళ్ళీమైకు దగ్గరకొచ్చాడు.

"కాలనీ వాళ్ళందరం కలసిశ్యామ్రావ్గారికే ఓటు వేయాలని నిర్ణయించడం నిజంగా చాలా గొప్పవిషయం. శ్యామ్రావుగారు డబ్బుకి బీదాడేగాని చదువులో కాదు. ఆయన రెండుసార్లు బి.ఏ. పాసయ్యారు. ఒకసారి కార్పొరేషన్ ఎలక్షన్లో నుంచుని ఓడిపోయారు. గనుక రాజకీయఅనుభవం కూడావుంది."

అతనలా మాట్లాడుతూండగానే మరో అరడజను టాక్సీలు వచ్చి ఆగాయ్ అక్కడ. మొదటి టాక్సీలో నుంచి ఎర్రటర్కీబనీనూ, పచ్చ పాంటూ వేసుకున్న నల్లని లావుపాటి ఆకారందిగింది. ఆ ఆకారం వెనుకే మరికొన్ని ఆకారాలు పంచరంగుల బనీన్లు, దుబ్బు జుట్టూ, చేతుల్లో కత్తులూ చైన్లతో దిగారు. ఒక్కొక్కరే రొమ్ముమ్ విరుచుకుని నడుస్తూ అక్కడషామియానాలో ఉన్న మాకు గస్తీపోలీసుల్లా నిలబడ్డారు.

"ఈ కాలనీ ప్రెసిడెంటెవళ్ళువయా ఈడ?" అంటూ ఓపచ్చబనీను నా దగ్గరకొచ్చి అడిగాడు.

"ప్రెసిడెంటా-అదుగో-వారే!" అంటూ గోపాల్రావుని చూపించాను.

"ఏయ్ ప్రెసిడెంటూ-జరాబయటకొచ్చి శంకర్దాదాని కలువ్!" అన్నాడతను జనార్ధన్తో.

"శకర్దాదానా!" ఉలిక్కిపడి అడిగాడు గోపాల్రావ్.

"అవ్!"

అందరం మొఖాలు చూచుకున్నాం.

శంకర్దాదా అంటే మా ఏరియాలో తెలీనివారు లేరు. వాడుచేసే కిరాతకాలు అందరికీ తెలుసు.

ఎప్పుడూ తన గాంగ్ని వెంబడేసుకుని రోడ్లమీద అడ్డుపడ్డవాడినల్లా పొడుస్తూ-ఉంగరాలు, గడియారాలు, డబ్బు లాక్కుపోవడం పండుగమామూళ్ళు కత్తిచూపి వసూలు చేయటం చాలా మామూలు విషయం.

"ఇప్పుడు...నా...నా...నా...తో ఏమిటి ఏ...ఏ...ఏ... పని?" ఖంగారుగా అడిగాడు. గోపాల్రావ్

"గట్ల పరిషానెందుకవుతున్నావ్-శంకర్‌దాదా జర్ర నీతోమాట్లాడాల్నని వచ్చిండువయా - నడుమళ్ళా!"

"అలాగే-పదండి! మీరు కూడారండి వెళ్దాం!" అన్నాడు గోపాల్రావ్ మావంక చూస్తూ.

ముగ్గురంకలిసి శంకర్‌దాదా దగ్గరకెళ్ళాం

"నమస్కారమండీ? నేనే గోపాల్రావ్‌ని" వినయంగా అన్నాడు గోపాల్రావ్

"నమస్తే అన్నా! నిన్నుకలవాలని నాల్గుదినాలకెళ్ళి కోషిష్‌చేస్తున్న!" అని షేక్‌హాండిచ్చి నావంకచూసి "నువ్వెవలు?" అనడిగాడు.

"నాపేరు ఉదయార్కర్!"

"నీపేరు గాదువయ్యా అడిగేది- నువ్వెవలు అనడుగుతున్న!"

"అదా-అదీ-నేను కాలనీవైస్ ప్రెసిడెంట్‌నండీ!" వినయంగా అన్నాను.

"నీయవ్వ-గట్లచెప్పరాదువయ్యా! నాకు తెలీకనేపాయె.ఏదీ-చెయ్‌కలుపు-" అంటూ చేయిజాపాడు.

అయిష్టంగానే కరచాలనంచేశాను.

"నేను కాలనీకమిటీ ఆర్గనైజింగ్ శెక్రటరీనండీ!" ఎందుకయినా మంచిదని అడగకముందే చెప్పేసుకున్నాడు శాయిరామ్.

"నీయవ్వ-మంచిగయింది- అందరు ఈడనే జమయిన్రు! చెయ్ కలుపు" అంటూ శాయిరామ్‌తో కూడా కరచాలనం చేశాడు.

"అదిసరేగానీ, నేనిప్పుడు ఈడకి ఎందుకొచ్చినానో ఎరుకనా?" అడిగాడతను.

"తెలీదండీ!"

"నేను ఎలక్షన్ల ఎమ్మెల్లెగానిలబడినా-సమజయిందా! అగో-ఆపని మీదనే ఈడకొచ్చినా! మీరు నాకు జర్ర మదద్‌చేయండ్రి! మీకాలనీ ఓళ్ళందరూ- మీమాటకు ఇజ్జతిస్తరని మా గాంగోళ్ళుచెప్పిన్రు!" ముగ్గురం షాక్‌తిన్నట్లయిపోయాం!

"అలాగేనండీ అందరికీచెప్పి తప్పకమీకేవేయిస్తాము-" అన్నాడు గోపాల్రావ్ షాక్‌నుంచి త్వరగాతేరుకుని.

"అయితే నడుమల్లా! మైక్‌లనేనుగూడ జరమాట్లాడ్నీకి కోషిష్‌జేస్త?" అంటూ మైక్ దగ్గరకు నడవసాగాడు. ముగ్గురం అతని వెనకే నడిచాము.

"సోదర సోదరీమణులారా, ప్రస్తుతం అర్జంటుగా ఓ విషయం మనవి చేయదల్చుకున్నాను. మననియోజకవర్గం నుంచి శంకర్‌దాదా కూడా పోటీ చేస్తున్నట్లు ఆయనే స్వయంగా ఇక్కడికొచ్చి తెలియజేశారు. శంకర్‌దాదా గురించి నేనుమీకు చెప్పాల్సిందేమీలేదు. ఆయన పేరు చిన్నపిల్లలక్కూడా తెలుసు. కనుక మన ఓట్లన్నీ ఆయనకే వేయాలని ఆయన కోరుతున్నారు. ఇప్పుడు శంకర్‌దాదా మాట్లాడతారు" అనేసి పక్కకు జరిగాడు శాయిరామ్.

శంకర్‌దాదా మైక్‌దగ్గరకొచ్చి అందరికీ నమస్కారం పెట్టాడు.

"ఈడున్నోళ్ళందరికీ సలాం జెప్తున్న! శాయిరామ్ అన్న నాగురించి మీకు మంచిగా చెప్పిండు. ఈడున్నోళ్ళల్ల కొంతమంది సొంచాయిస్తుండొచ్చు. దాదాగిరీ చేసేటోడు-ఎమ్మెల్లేగ ఎట్ల నిలబడ్డాడు అని. నిజంవయ్యా, నేను మర్డర్లు చేసినా, దొంగతనం జేసిన, జైలుకెల్లిన, రేప్‌లుచేసిన, కానీ ఇన్నిదినాలు మనదేశం పరిపాలించేటోండ్లలో ఇవన్నీ చెయ్యనోళ్ళేవలు? మంచిగా సొంచాయించండ్రి! ఇయ్యాల్రేపు పేపర్లలో చూస్తున్రు గదా. దొంగ సిమ్మెంటమ్ముకునేటోడొకడు, ప్రభుత్వం భూములమ్ముకునేటోడొకడు, దొంగస్టాంపులమ్మేటోడొకడు. డాక్టర్ల కొలువులమ్ము కునేటోడొకడు- గిట్ల మినిష్టర్లందరూ దందాలు జేస్తున్రు. గసంటోళ్ళకు ఓట్లువేస్తారువయ్యా? నన్ను గిట్ట గెలిపించిన్రంటే-ఖసమ్‌తోటి జెప్తున్న-నేను ఈ మర్డర్లు చేసెడిది-దొంగతనాలు, రేప్‌లు చేసెడిది-అన్నీ ఇడచిపెడత ఏం జెప్తున్న? సమజయిందా. ఇంక నేను పోవాల్నామల్లా?"

ఎవ్వరూ ఏమిమాట్లాడలేదు. అందరూ భయంతో గుడ్లప్పగించి చూస్తుండి పోయారు.

"అచ్చామైజారవూ అన్నా. ఈళ్ళందరితో ఓట్లెయిపించే జుమేదారిమీది. ఏమంటున్న? నాల్గుదినాలు అయినాక వస్తమల్లా." అనేసి వెళ్ళిపోయాడతను. మరుక్షణంలో టాక్సీలన్నీ వెళ్ళిపోయినయ్.

"ఏమిటి? రౌడీవెధవకు మనం ఓట్లెయ్యాలా? అయ్యో ఏంకాలమొచ్చింది."

"ఇలా ఎవడు బడితే వాడే నిలబడితే ఎలా?"

"మన కాలనీలో అందరూ గ్రాడ్యేట్లు, పోస్ట్‌గ్రాడ్యుయేట్లు ఉండి- అందరూ కలసి అక్షరంముక్కరాని రౌడీకా ఓట్లువేసిగెలిపించడం-" ఇలా రకరకాల వ్యాఖ్యలు గుప్పుమని చెలరేగాయి. శంకర్‌దాదా వెళ్ళిపోగానే శాయిరామ్ మైక్‌దగ్గరకొచ్చాడు.

"సోదర సోదరీమణులారా, ఇప్పుడు అనుకోని పరిస్థితి ఎదురయింది మనకి. శంకర్‌దాదా ఓట్లుతనకే వేయమని వార్నింగిచ్చాడు. వేయకపోతే ఏంజరుగుతుందో మనందరం

తెలిగ్గా ఊహించవచ్చు. వాళ్ళగాంగ్ వాళ్ళందరూ కత్తులు తీసుకుని మనకాలనీ అంతా స్వైరవిహారం చేసేస్తారు. అంచేత మనం ఇంతకుముందు శ్యామల్రావుగారి కిచ్చినమాట ఉపసంహరించు కుందాం, ఏమంటారు?"

యాదగిరిలేచి నిలబడ్డాడు.

"మీరూరికే పరిషానవుతున్నారుగానీ మనం వాడికి వోటువేయలేదన్న విషయం శంకర్‌దాదాకెట్లా తెలుస్తుందివయ్యా?

"పిచ్చాడిలాగున్నావ్-మనకాలనీపక్కనున్న పోలింగ్‌బూత్‌లో వోట్లు లెక్కట్టేవ్పుడు తెలీదూ?"

"తెలిస్తే ఏంజేస్తాడంటావ్?"

"కత్తులు- స్వైరవిహారం- మనలో వెయ్యిమందికి కత్తిపోట్లు, పాతికమంది దుర్మరణం- ఇలాసాగిపోతుంది ఆమర్నాడు పేపర్లోవార్త." అన్నాడు రంగారెడ్డి.

అందరూ నిశ్శబ్దం అయిపోయారు. మీటింగ్ అర్ధంతరంగా ముగిసిపోయింది.

"సోదరులారా, తిరిగి మనందరం వచ్చే ఆదివారం ఇక్కడ కలుసుకుని ఎవరికివోటు వేయాలో ఫైనల్‌గా నిర్ణయించుకుందాం" అన్నాడు శాయిరామ్.

అందరూ ఎవరిళ్ళకు వాళ్ళుబయలుదేరారు.

నాల్రోజులన్నా అవకముందే కాలనీవాళ్ళందరూ బలవంతంగా అర్ధరాత్రి సమావేశం జరపాల్సివచ్చింది. అందుక్కారణం సిరాజుద్దీన్ అనే అభ్యర్థి. అతగాడు తనతాలూకు వందమంది అనుచరులతో కాలనీని చుట్టుముట్టి అందరికీ కత్రలుచూపి లాక్కొచ్చారు. శాయిరామ్ కళ్ళను లుముకుంటూ సమావేశంప్రారంభించాడు.

"సోదరులారా! మన నియోజకవర్గంనుంచి పోటీచేస్తున్న అభ్యర్థి శ్రీసిరాజుద్దీన్ గారి విన్నపంవల్ల- మనం అర్జంటుగా....

"విన్నపం గాదువయ్యా-జబర్దస్తేచేసినా! గట్లచెప్పనికి భయమేమున్నది" అన్నాడు సిరాజుద్దీన్ పౌరుషంగా.

"ఆ! అదే బలవంతంగా మనల్నిక్కడ సమావేశపరచడానికి కారణం ఏమిటంటే మన కాలనీ వాళ్ళందరూ ఆయనకే ఓట్లువేయాలని ఆయన అబ్యర్థిస్తున్నారు-"

"ఇగో-గదే గలత్ మాట! నాకేం గర్జివయ్యా బతిమాలానికి? జబర్దస్తీ చెప్తున్న, పూరా వోట్‌నాకే ఎయ్యాల్న! ఏమంటున్న? ఎయ్యకుంటే కత్తితోకిరికిరవుతది! సమజయిందా?"

"ఆ,అయింది సార్! ఇంత క్లియర్‌గా చెప్పాక ఇంక అర్థమవకుండాఎలా ఉంటుంది?"

"అయితే నాగురించీ, నేనంతకు ముందుచేసిన ప్రజాసేవ గురించి కూడా చెప్పు అళ్ళకు" అన్నాడు సిరాజుద్దీన్.

"సోదరులారా! సిరాజుద్దీన్‌గారి గురించి మీకు వేరే చెప్పనవసరంలేదు. ఆయన కూడా చిన్నప్పటినుంచీ జైలుకెళ్తూనే వున్నారు. ఈరోజున కూడా నిజానికిజైల్లోనే ఉండాల్సింది గాని మన ఓట్లకోసం జామీను మీద వచ్చారు. ఆయన అంతర్రాష్ట్రీయ జేబుదొంగ అన్న విషయం మీరు పేపర్లలో చూసేవుంటారు! లేదా అనుభవపూర్వకంగానయినా గ్రహించివుంటారు. కేవలం తనొక్కడే సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ స్కీముక్రింద ప్రారంభించిన అతని 'పిక్ పాకెట్'సంస్థ, నేడు అనేక వేలమంది సభ్యులతో కిటకిటలాడిపోతోంది. అప్పుడు సంవత్సరానికి పాతికవేలు టర్నోవర్ ఉంటే ఇప్పుడది ఇరవైకోట్లరూపాయలకు చేరుకుంది. "సిరాజుద్దీన్‌గారిది మంచి మనసు" అనడానికి నిదర్శనం ఆయన ఆ సంస్థ ద్వారా ఎంతో డబ్బు ఇంకా సంపాదించే అవకాశంఉన్నా-ఆ వృత్తిని మానేయడం! నిజంగా ఎంతో గొప్పవిషయం ఇది. కామధేనువు లాంటి వృత్తినెవరయినా వదులుకోగలరా-ఒక్కసిరాజుద్దీన్‌గారు తప్ప."

అందరూ తప్పట్లు కొట్టారు.

"ఇగో-తాలీ బజాయించితే నేను ఖుష్ అవుతాననుకోకండ్రి. కాలనీలోని ఓట్లన్నీ నాకేపడాల్న.! ఇయాల్టినుంచి ఈ కాలనీలోకి ఇంకెవళ్ళూ రాకుండా మా షాగిర్దీల్ని పహరాపెడ్తన్న-ఇంకెవళ్ళమాటా ఇనకండ్రి. ఇంకెవళ్ళకీ వోటెయ్యకండ్రి. సమజయిందా?"

"అయింది" అన్నాయి కొన్ని గొంతులు.

"ఇకపోండ్రి! ఓట్ల ఇసయంల నకరాలుచేస్తేమాత్రం కత్తితో కిరికిరవుతది" సిరాజుద్దీన్ వెళ్ళిపోయాడు.

అతని శిష్యులు ఇద్దరుమాత్రం అక్కడేగస్తీ తిరగసాగారు. అందరం నిశ్శబ్దంగా ఎవరిళ్ళకు వాళ్ళుచేరుకున్నాం.

ఆదివారం రానేవచ్చింది.

కాలనీవాళ్ళందరూ సమావేశానికి హాజరయ్యారుగానీ ఎవరిమొహాన్నా కళలేదు. ఎవరూ బిందెలగురించీ, స్టీలుగిన్నెల గురించీ, చీరలగురించీ మాట్లాడటంలేదు.

"సోదర సోదరీమణులారా! ఎవరెంతబెదిరించినా మనకాలనీ ఓట్లన్నీ కొద్దోగొప్పో చదువూసంస్కారమున్న శ్యామ్‌రావ్‌గారికే వేయాలని అందరూ అభిప్రాయం వెలిబుచ్చారు"

అని గోపాల్రావ్ చెప్పగానే అంతటా తప్పట్లుమార్మోగిపోయాయ్. సరిగ్గా అప్పుడే టాక్సీలోంచి దిగాడు శ్యామల్రావ్.

ఆయనవెనుకే ఆయన కొడుకు "ఈరిగాడూ జిందాబాద్" అని అరుస్తూ మా మధ్య కొచ్చాడు.

అందరూ నిర్ఘాంతపోయారు. శ్యామల్రావ్ చిరునవ్వుతో మాట్లాడసాగాడు.

"సోదర సోదరీమణులారా! నేను కాంగ్రెస్ (జడ్) అభ్యర్థిఅయిన ఈరిగాడినే బలపరుస్తూ పోటీనుంచి విరమించుకుంటున్నానని తెలియజేయడానికి సంతోషిస్తున్నాను. కనుక మీఅందరి ఓట్లుకూడా ఈరిగాడికే వేస్తారని ఆశిస్తాను." అనేసి నమస్కారంచేసి వెళ్ళిపోయాడు.

అందరిమోఖాలు పాలిపోయాయ్.

"మోసం, దగా ఈరిగాడి దగ్గర లక్షరూపాయలు కొట్టేసి విత్ డ్రా అయిపోయాడు" అన్నాడు రంగారెడ్డి.

"ఆ! లక్షరూపాయలు కొట్టేశాడా?" అరిచారు అందరూ.

"అవును. నిన్న ఈరిగాడి మనుషులే స్వయంగా చెప్పారుగాని నేను నమ్మలేదు" కొద్దిసేపు అంతా కోలాహలంతోనిండిపోయింది.

కేవలం లక్షేకాదు. ఎలక్షన్‌లో నిలబడ్డ ప్రతిఅభ్యర్థికీ గవర్నమెంటు ఇచ్చే న్యూస్‌ప్రింటూ,పెట్రోలూ, వోటర్స్‌లిస్ట్‌లు, టెలిఫోన్ సౌకర్యం ఇవ్వన్నీకూడా శ్యామల్రావ్ గారు బ్లాకులో అమ్ముకుని పది లక్షలరూపాయలవరకూ సంపాదించాడని, ఆ తరువాత ఆయనకొన్న ఇల్లూ చేసినకూతురిపెళ్ళీ ఋజువుచేశాయ్.

కొద్దిసేపు అంతా కోలాహలం-

"ఇంతకూ ఇప్పుడు మనఓటు ఎవరికి?" అడిగారు కొందరు.

"ఈరిగాడికే వేస్తే సరి" నేను సలహా ఇచ్చాను.

"నీకెంత ఇచ్చాడు వాడు?" ఎవరో అరిచారు. నేను సైలెంటయిపోయాను.

"ఈరిగాడా! వాడుచేసేది సారావ్యాపారం. కల్తీసారాతో ఆమధ్య అరవైమందినిటపా కట్టించాడు. వాడు ప్రజాప్రతినిధా?"

"వద్దు-వద్దు" అని అరిచారు కొంతమంది స్త్రీలు.

"పోనీ కాంగ్రెస్ (క్యూ) అభ్యర్థి అంగముత్తుకి వేద్దామా?"

"వాడికా! వాడు రోడ్డుమీద కనబడ్డ ఆడాళ్ళ మంగళసూత్రాలు లాక్కునిపారిపోతాడు కదా!"

"పోనీ కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి సంగతేమిటి?"

"వాడికసలు చదువేలేదుగా! బండిలో కూరగాయలమ్మేవాడు!"

"అయితే ఇండిపెండెంట్ రామ్‌సింగ్ మాటేమిటి?"

"వాడా? వాడిదగ్గరనుంచీ మొన్నేగా పోలీసులు స్మగుల్డ్‌సామాను పట్టుకుందీ?"

దాంతో జనార్ధన్‌కి చిరాకేసుకొచ్చింది.

"సోదరులారా! ఇలా అందరికీ వంకలు పెట్టటం నాకేంనచ్చలేదు. మనదేశంలో ఎలక్షన్‌లో నిలబడేవారందరూ ఇంచుమించుగా ఇలాంటివారే! వాళ్ళలోనే మన ఓటు ఎవరొకరికి వేయకతప్పదు" అన్నాడు విసుగ్గా.

అందరూ మళ్ళీతర్కంలో పడ్డారు.

చివరకు అందరూ కలిసిగోపాల్రావుకే ఆబాధ్యత అంటగట్టారు.

మా నియోజకవర్గంలో నిలబడ్డవారందరిలోనూ ఎక్కువచదుకున్నవాడూ, తక్కువ మర్డర్‌లూ, రేప్‌లూ, జేబుదొంగతనాలూ, స్మగుల్డ్‌వ్యాపారం చేసేవాడూ అయిన అభ్యర్థిపేరు సూచించాల్సిందిగా అదేశించారు.

వాళ్ళ ఆదేశంమేరకు మేము ముగ్గురం అన్నిపోలీస్‌స్టేషన్లకూ వెళ్ళి అతి తక్కువ నేరాలుచేసిన అభ్యర్థిపేరుగాలించి విజయంసాధించాం!

మా నియోజకవర్గంలో పోటీచేస్తున్నవాళ్ళందరిలోకీ శంకర్‌దాదా ఒక్కడే అందరి కంటే ఎక్కువ చదువుకున్నాడు (రెండో క్లాసు). అలాగే అతనొక్కడే అతితక్కువ మర్డర్లుచేశాడు. (రెండొందల ఆరు) అతి తక్కువరేప్‌లు చేసిందికూడా అతనే (పదహారు). అతి తక్కువకాలం జైల్లో ఉన్నది కూడా అతనే (ఆరేళ్ళు) మరి చూస్తూ చూస్తూ వాడికెలా ఓట్లువేస్తాం? కానీ ఓపక్క శంకర్‌దాదా కత్తులతో కాలనీఅంతా స్వైరవిహారం చేసే దృశ్యంకూడా మా కళ్ళ ముందు కనబడుతోంది. చివరకు ఎవరికీ వోటు వేయకూడదని నిర్ణయించుకున్నాం.

అయితే ఈ విషయం ఎలా తెలిసిందోగాని సిరాజుద్దీన్‌కి తెలిసింది. ఆరాత్రి అతగాడు మా కాలనీకొచ్చి అందరినీ అర్జంటుగా బయట సమావేశపరచేశాడు.

"ఖబడ్దార్! వోట్లు నాకేస్తామని వాదాచేసి గిప్పుడు పల్టాయించి పోతారు? నీయవ్వ-మీకు మంచిగా బుద్ధిజెప్త!నేనెసుంటోడ్నో మీకెరుకలేదు!" అంటూ వార్నింగిచ్చాడు.

ఎవ్వరం మాట్లాడలేదు.

"అగో! మాట్లాడరు? సరే బిడ్డా! నేన్‌జూసుకుంట!పదండ్రి!" అనేసి కోపంగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

అరాత్రి ఎవ్వరికీ నిద్రలేదు. భయం!

తెల్లారుజామున ఎవరో కెవ్వునకేకలు పెట్టేసరికి అందరం ఉలిక్కిపడిలేచి బయటకు పరుగెత్తాం!

తీరాచూస్తే శాయీరామ్‌కి కలవచ్చిందట-తనని సిరిజుద్దీన్ చంపుతున్నట్లు-అందుకని వెర్రికేకలు పెట్టాడట

ఎలాగోలా తెల్లారింది.

అందరం వోటింగ్ చేయడానికి బయలుదేరాంగానీ కాలనీ బయట సిరాజుద్దీన్ శిష్యులు కర్రలు తీసుకుని నిలబడి కనిపించారు.

"ఏయ్! సాయింత్రం వరకూ కాలనీ వోళ్ళెవరూ బయటకు రాకండ్రి!వచ్చిన్రో కిరికిర వుతది!" అన్నారు బెదిరింపుగా.

వాళ్ళతో గొడవెందుకని అందరం మళ్ళీ ఇళ్ళల్లోకొచ్చేశాం.

తీరా మధ్యాహ్నం రెండవుతుండగా కాలనీ అంతా శంకర్‌దాదా తాలూకూరౌడీలు నిండిపోయారు.

"నీయవ్వ! మంచిగ చెప్తె ఇనరుబే? లేండ్రి! నడవుండ్రి వోట్లెయ్యనికి!" అంటూ అరవసాగారు.

"అయ్యా, ఓట్లేస్తే సిరాజుద్దీన్ మమ్మల్ని చంపుతానంటున్నాడండీ" అన్నాడు జనార్ధన్.

"ఇగో-ఇదంతా మాకు తెల్వదు-మంచిగ చెప్పినాం. ఇనకుంటే మీదే జుమేదారి" అనేసి వెళ్ళిపోయారువాళ్ళు.

సాయంత్రం మూడవుతుండగా మళ్ళీ కాలనీవాళ్ళందరం అత్యవసరం సమావేశం జరిపాం.

"ఆ రౌడీ వెధవల్తో ఎందుకొచ్చింది? వెళ్ళివాడికే వేసేద్దాం పదండి " అన్నాడు శాయిరామ్.

"చూస్తూ చూస్తూ వాడినా ఎన్నుకునేది?" అన్నారొకరు.

"మనచేత్తో మనమే కళ్ళుపొడుచుకుంటామా?" అందింకొకావిడ. గోపాల్రావ్ రెండుచేతుల్తో తల పట్టుక్కూచున్నాడు.

మరో అరగంటతర్వాత నాకో అయిడియా వచ్చింది.

"సోదరులారా! త్వరగా పోలింగ్‌బూత్‌కెళదాం పదండి. వెళ్ళి బాలెట్‌పేపరు వెనుక ముద్రవేసి వచ్చేద్దాం దాంతో మన ఓట్లన్నీ 'ఇన్‌వాలిడ్' అవుతాయ్ ఎవరికీ వేయలేదన్న

సంతృప్తి మనకూ ఉంటుంది-వాడికే వేశామనివాడుఅనుకుని మనజోలికి రాకుండా ఉంటాడు-"

అందరూ నా ఆలోచనకు చప్పట్లుకొట్టారు. కొంతమందీలలు కూడా వేశారు. వెంటనే ఎలక్షన్‌బూత్‌కి ఊరేగింపుగా వెళ్ళాం.

కానీ పదినిమిషాల్లో వెనక్కు తిరిగిరావాల్సివచ్చింది. కారణం అప్పటికే మా ఓట్లు ఎవరో వేసేశారు.

ఆ మర్నాడు రాత్రి మాకాలనీకొచ్చిన పెద్ద ఊరేగింపు చూడ్డానికి అందరం బయటకొచ్చి నిలబడ్డాం! శంకర్‌దాదా పెద్ద కార్లో దండల మధ్య నిలబడి అందరికీ నమస్కరిస్తున్నాడు. "శంకర్‌దాదా జిందాబాద్!" అంటూ కేకలు మార్మోగిపోతున్నాయి. అప్రయత్నంగా అక్కడ గుమికూడిన మేముకూడా అరిచాము.

"శంకర్‌దాదా జిందాబాద్!" *



# కరాటే చదువులు



**చాలా** హడావుడిగా ఉందా ప్రాంతం.

ఆవరణమంతా కార్లతోనూ, స్కూటర్లతోనూ,నిండిఉంది. వరండాలో వేసిన బెంచీల మీద వాటితాలూకు ఓనర్లందరూ ఆపబ్లిక్‌స్కూల్‌గురించీ, దాని స్టాండర్డ్‌గురించీ చాలా ఎగ్జయిటింగ్‌గా మాట్లాడుకుంటున్నారు.

గొడవ కొంచెం ఎక్కువయ్యేసరికి ప్యూన్ బయటికొచ్చాడు, ఆఫీసులో నుంచి. "ష్! సైలెన్స్!" అన్నాడు గట్టిగా.

అంతా నిశ్శబ్దం అయిపోయారు.

"ఎందుకువయ్యా-గట్లలోల్లి పెడతారు! ఇదేం స్కూలనుకున్రా, మీాఇల్లనుకున్రా?" కోపడ్డాడు ప్యూన్.

అక్కడున్న వాళ్ళలో గెజిటెడ్ ఆఫీసర్లున్నారు. కోటీశ్వరులయిన వ్యాపారులున్నారు. మాలాంటిగుమాస్తాగాళ్ళూఉన్నారు.

అయినా ఎవ్వరూ జవాబివ్వలేదు.

జవాబిస్తే ఆ ప్యూన్‌కి ఆగ్రహం కలుగుతుందనీ, అప్యూన్‌కి ఆగ్రహం కలుగుతే అప్రిన్స్‌పాల్‌కి ఆగ్రహం కలుగుతుందనీ అప్రిన్స్‌పాల్‌కి ఆగ్రహంకలుగుతే మహాప్రఖ్యాతిగాంచిన ఆ పబ్లిక్‌స్కూల్లో తమ పిల్లలకు సీటు దొరకదనీ అందరికీ తెలుసు.

గోపాల్రావ్ ప్రాస్‌పెక్టస్ తీసి అందులోని రూల్స్ మళ్ళీ చదివాడోసారి! అంతకుముందు వారంరోజుల్నుంచీ ఇద్దరం ప్రాన్‌పెక్టస్‌లో ప్రతిలైనూ చదివి, చర్చించుకుని అర్థంచేసుకుంటూనే ఉన్నాం! అయినా ఏదోభయం!

"గురూ! మనవాళ్ళను అలా చెట్టుకిందకు తీసుకెళ్ళి ఓసారిమళ్ళీఅన్నీ అప్పజెప్పించుకుందామా?" అడిగాడు గోపాల్రావ్.

"పద!" అన్నాను.

నేను కిరణ్‌గాడిని, వాడుచిన్నిగాడి ని నడిపించుకుంటూ దూరంగా ఉన్న ఓచెట్టుకిందవెళ్ళి నిలబడ్డాం.

"ఒరే చిన్నీ చెప్పమ్మా!వాటీజ్ యువర్‌నేమ్?" అడిగాడు గోపాల్రావ్.

"మైనేమీజ్ కె. శరత్‌బాబు."

"వాటీజ్‌దిస్?" అన్నాడువాడు పుస్తకంలోని పిల్లిబొమ్మను చూపించి.

"దిసీజ్ కాట్ సి ఎ టి కాట్!"

"టెల్ మీ ఆల్ఫాబెట్స్ ఫ్రం ఎ-టు-జడ్-"

వెంటనే వాడు ఎబిసిడిలు ఊపిరితిరగనంత స్పీడులో చెప్పేశాడు.

"ఇంకేం ఢోకాలేదులేరా?" అన్నాన్నేను ధైర్యం తెచ్చుకుని.

"అవును!" సంతృప్తిగా అన్నాడు వాడు.

తర్వాత ఇద్దరం కలసి కిరణ్‌గాడిని కూడా టెస్టుచేశాము.

అడగడం ఆలస్యం టకీమని చెప్పేశాడు వాడు.

ఒకటా-రెండా?

అంతకుముందు మూడునెలలనుంచీ వాళ్ళను చిత్రహింసలు పెట్టి వాళ్ళుపెట్టే చిత్రహింసలు భరించి నేర్పించాము అవన్నీ! లేకపోతే వాళ్ళకి మంచి స్కూల్లో ఎడ్మిషన్ దొరకదని తెలుసుకదా! మళ్ళీ ఇద్దరం వెళ్ళి బెంచిలమీదకూర్చున్నాం.

మమ్మల్ని చూసి మిగతావాళ్ళు కూడా చెట్లకిందకు పిల్లలను తీసుకెళ్ళి వాళ్ళతో అన్నీ చెప్పిస్తున్నారు.

హఠాత్తుగా ప్యూన్ మళ్ళీ తలుపు తీసుకుని బయటికొచ్చాడు.

"అరె! ఎన్నిసార్లు చెప్పాలివయ్యా సైలెన్స్ గుండమని! ఏయ్-ఇగో నీకే చెప్పేడిది-ఎందుకట్ల లొల్లిపెడుతున్నావ్?" ఓగెజిటెడ్ ఆఫీసర్ని పట్టుకుని దబాయించాడతను.

గెజిటెడ్ ఆఫీసరు ఖంగారుపడ్డాడు. "పిల్లలకు కోచింగ్ ఇస్తున్నాను-" అన్నాడు దీనంగా.

"అదంతా గిప్పుడు చేస్తారువయ్యా- ఇన్నిదినాలకెల్లి ఏం జేసినావ్? ఇంకబంద్ చెయ్-" అని అందరివేపూ ఓసారి చూశాడు.

"హెచ్. శ్రీనివాసరావ్ ఎవరు" అనడిగాడు అందరి ముఖాల వంక సెకండ్‌రౌండ్ చూస్తూ."నేనే" అంటూ ఓమూల వాళ్ళపాపకు బిస్కెట్లు తినిపిస్తున్న వ్యక్తిలేచి నిలబడ్డాడు.

"పాపనీసుకుని లోపలకు నడు!"

అతను ఖంగారుగా పాపచేతిలో బిస్కెట్లులాగి అవతలపారేసి ప్రిన్సిపాల్‌రూమ్‌లోకి ఈడ్చుకుపోయాడు.

అందరూ ఊపిరి బిగపట్టేశారు.

లోపల ఏం జరుగుతుందా అన్న ఆత్రుత !

పావుగంట తర్వాత చెమటలు తుదుచుకుంటూ బయటి కొచ్చాడతను. అందరం అతని చుట్టూమూగాము.

"ఏమి అడుగుతున్నారండీ?" అన్నాడొకతను.

"ఏమడిగితే ఏం లాభం లెండి-ఎడ్మిషన్ దొరకలేదు-" అన్నాడతను. నీరసంగా అక్కడినుంచి వెళ్ళిపోతూ. అందరికీ భయం పట్టుకుంది.

మరోవ్యక్తిని లోపలకు తీసుకెళ్ళాడు ప్యూన్.

అతను బయటకొచ్చాక అందరూ మళ్ళీ అతనిచుట్టూ మూగేశారు

"ఏమడిగాడండీ పాపను?" ప్రశ్నించాడొకతను కాగితం పెన్నూరడీగా పట్టుకుని.

"పాపనేమీ అడగలేదండీ?" బెంచీమిద కూలబడుతూ అన్నాడతను.

"మరి?"

"నన్నే అడిగాడు ప్రశ్నలన్నీ!"

"మిమ్మల్నా?" అందరి గుండెలూ గుభేలుమన్నయి.

"అవును!"

"ఏమడిగారు?"

"వేరీజ్ మూర్ ఐలెండ్?" అనడిగారు.

"ఆ!" అందరూ అదిరిపడ్డారు.

"మూర్ ఐలెండా?" ఓలక్షాధికారి తెల్లబోతూ అడిగాడు

"అవును."

"అంటే ఏమిటసలది?"

"అది ఒక ద్వీపం అటండీ! ఎక్కడుంది అనడిగారు-" విసుక్కుంటూ చెప్పాడా వ్యక్తి తెలుగులో.

"ద్వీపం అంటే" మళ్ళీ అడిగాడా బిజినెస్ మ్యాన్.

"ద్వీపం అంటే కూడా తెలీదుటయ్యా" ఇంకెవరో ఫోజుతో అడిగాడు.

"ద్వీపం అంటే మూడువేపుల నీరు ఒకవేపు నేలవుంటుంది" అన్నాడు ఒకతను తెలిసినట్లు.

"కాదు-" ఇంకెవరో అరిచారు.

"ద్వీపం అంటే చుట్టూసముద్రం మధ్యలో భూమివుంటుంది."

"చుట్టూ సముద్రమే ఉండనక్కరలేదు. నది నీరు చుట్టూవున్నా దానిని ద్వీపమే అంటారు" అన్నాడు గెజిటెడ్ ఆఫీసర్‌గారు.

"కాదు" తను తాలూకాఫీసులో ఎల్డీసీగా పని చేస్తున్నానని అంతకుముందే పరిచయం చేసుకున్నాయన ఎదురుతిరిగాడు.

"చుట్టూ నీరువుంటే దానిని లంక అంటారు. సముద్రం వుంటే ద్వీపం అంటారు" అన్నాడతను.

కొంతమంది ఆలోచనలోపడ్డారు. అతని మాటలునిజమా కాదా అని!

"ఇంతకూ ఆ మూర్ ద్వీపం ఎక్కడుందసలు?" గోపాల్రావ్ బుర్రగోక్కుంటూ నన్నడిగాడు.

"సౌత్ అమెరికా దగ్గర" అన్నాన్నేను తడుముకోకుండా.

"కరెక్ట్! బ్లాకసీలో ఉందది" అన్నాడు మరో ఆఫీసరు నన్ను సమర్థిస్తూ.

"కాదు మన ఇండియా దగ్గరే ఉందది" అన్నాడు మరొకతను. అంతా ఆశ్చర్యపోయారు.

"మన ఇండియా దగ్గరా?"

"అవును బంగాళాఖాతం సముద్రంలో ఉంది."

"నో! ఇటీజ్ నాట్ బే ఆఫ్ బెంగాల్. అరేబియా సముద్రం" అన్నారింకెవరో

"అదికూడా కాదు. ఇండియన్ ఓషన్, అంటే హిందూ మహాసముద్రం" అన్నాడు మరొకతను.

"అసలు మనకి మొత్తం ఎన్ని సముద్రాలున్నాయి?" అడిగారెవరో.

"అది సరేగాని- అసలీ ప్రశ్న మన పేరెంట్స్‌నెందుకడిగినట్లు?". ఒకాయన ఆలోచిస్తూ అన్నాడు.

"అవును! నిజమే! మూర్ ఐలెండ్ సంగతి మనకెందుకుట?"

ఈలోగా మరో వ్యక్తి ప్రిన్సిపాల్ రూమ్‌లోంచి బయటపడ్డాడు హుషారుగా.

అందరూ అతని చుట్టూమూగారు.

"మిమ్మల్నేం అడిగారు?"

"19x19 ఎంతో చెప్పమన్నారు. ఠకీమని చెప్పేశాను. అంతే! మా అబ్బాయికి సీటు ఇవ్వడానికి వప్పుకున్నాడు."

"అంటే మీ అబ్బాయినేమీ అడగలేదా?"

"ఒక్కముక్కకూడా అడగలేదు."

"ఇదెక్కడి విడ్డూరం-తండ్రిని ప్రశ్నలడిగి కొడుకుని యల్ కె.జిలో చేర్చుకోవడం" ఒకాయన ఆశ్చర్యపోతూ అన్నాడు.

"వాళ్ళు తండ్రి ఇంటలిజెన్స్‌ని పరీక్షిస్తున్నారండీ. తండ్రి ఇంటిలిజెంట్ అయితే కొడుకు ఇంటిలిజెంటయి ఉంటాడని ఐడియా! కనుక అందరూ అలాంటి తెలివిగల పిల్లలనే స్కూల్లో చేరుకుంటే స్కూలుకిమంచి పేరొస్తుందనీ వాళ్ళ అభిప్రాయం." ఒకాయన వివరించాడు.

"నన్నడిగితే అలా అనుకోవడంపరమ తెలివితక్కువతనం" ఆఫీసరుగారన్నారు.

"ఎందుకని"

"పండిత పుత్రఃపరమశుంఠః" అని మన పూర్వీకులు ఘోషించలేదుటండీ?

"అవును! వారుచెప్పింది నిజమే. కావాలంటే చరిత్ర తిరగేసుకోండి. గొప్ప గొప్పవారి పుత్రులంతా వెధవలే. అది ఈనాటి రాజకీయాలకు కూడా వర్తిస్తుంది..." అన్నాడు సర్వే ఆఫ్ ఇండియాలో పనిచేస్తున్న ఆఫీసరుగారు.

"అది సరేగాని 19x19 ఎంత?" గోపాలావ్‌నన్నడిగాడు. నేను లోలోపల ఎక్కాలు చదవటం మొదలుపెట్టానుగానీ పంథొమ్మిదిల దగ్గర కొచ్చేసరికి ఆగిపోతోంది.

అందరూ ఆన్సర్ కోసం ఆశగా నావంక చూడడం గమనించేసరికి అక్కడున్నవారెవరికీ ఆన్సర్‌తెలీదనే నాకు అర్థమైపోయింది.

వెంటనే ఓకాగితం, పెన్నూ తీసుకుని త్వరత్వరగా 19x19 లెక్కకట్టడం ప్రారంభించాను.

"మూడు వందల అరవయి ఒకటి" ఆన్సర్ అందరికీ గట్టిగా చదివివినిపించాను.

అప్పటికప్పుడే అందరూ వరండా అంతా తిరుగుతూ పంధొమ్మిదిపంధొమ్మిదులు-మూడొందల అరవయి ఒకటి అని మననం చేసుకోసాగారు. మరో పెద్ద మనిషిని లోపలకు పిలిపించారు.

ఆయన దిగాలుపడిన ముఖంతో బయటకొచ్చాడు. కాసేపటికి అందరూ ఆయనను చుట్టుముట్టేశారు.

"మిమ్మల్నేమడిగారు?" అడిగాడు గోపాల్రావ్ ఆత్రుతగా

"నన్నేమీ అడగలేదు. నేను రైల్వేలో ఎల్డీసీగా పనిచేస్తున్నానని తెలీగానే సీటుదొరకదు వెళ్ళిపొమ్మన్నారు."

"అదేమిటి?" అందరం ఆశ్చర్యపోతూ అడిగాము.

"ఈస్కూలు ప్యూనుక్కూడా మాకంటే ఎక్కువ జీతం వస్తుందిట! కనుక మాలాంటి లోక్లాస్ వాళ్ళకు అడ్మిషన్ ఇవ్వరట..."

ఈలోగా మరో వ్యక్తి లోపల్నుంచి ఆనందంగా బయటకురావటంతో అందరూ అతని దగ్గరకు పరిగెత్తారు.

"మా బాబుని ఎబిసిడీలు చెప్పమన్నారు. వాడు తడుముకోకుండా చెప్పేశాడు.అంతే ఎడ్మిషన్ ఇచ్చేశారు."

ఆమాట వినేసరికి అందరికీ బోలెడు ధైర్యం వచ్చింది.

నేనూ, గోపాల్రావ్ కిరణ్‌గాడిని-చిట్టిగాడిని కూర్చోబెట్టి మళ్ళీ ఎబిసిడీలు చెప్పించాము.

ఈలోగా గోపాల్రావ్ పేరు పిలవనేపిలిచారు.

ఇరవయి నిమిషాల తర్వాత సీరియస్‌గా బయటకు వచ్చాడు. అందరం మామూలుగానే వాడిచుట్టూ మూగాము.

"ఏమడిగారు?"

గోపాల్రావ్ హఠాత్తుగా పూనకం వచ్చినట్లు వూగిపోయి, పళ్ళుబిగపట్టి, చిన్నిగాడ్ని పట్టుకుని చావగొట్టసాగాడు.

అందరూ కలసి వాళ్ళిద్దర్నీ విడదీశాం.

"రాస్కెల్-నెలరోజుల నుంచి ప్రాక్టీస్ చేయించామా? పీడులోపలకెళ్ళాక నోరువిప్పడే! వాటీజ్‌యువర్ నేమ్ అంటే మాట్లాడడు. పిల్లి బొమ్మను చూపించి వాటీజ్‌దిసి అంటే నవ్వుతాడుగానీ నోరు మెదపడు. ఏబిసిడీలు చెప్పమ్మా అంటే అడ్డంగా తలూపుతాడు."

నాగుండెల్లో రాయిపడింది. బహుశా అదేరాయి అందరి గుండెల్లోపడినట్లుంది. ఎవరిపిల్లల్ని వాళ్ళు బుజ్జగించివాళ్ళకు నేర్పిందంతా మళ్ళీ వెళ్ళగక్కించటం ప్రారంభించారు.

నాపేరు రానే వచ్చింది.

కిరణ్‌గాడిని తీసుకుని లోపలకెళ్ళాను. ఒక కళ్ళజోడు అతను, ఓబట్టతలతను, ఓ ఆంగ్లోఇండియన్ ముసలామెకూర్చుని ఉన్నారు.

"హల్లో కిరణ్-కమియర్‌బాయ్" అంటూ కిరణ్‌ని తన దగ్గరున్న స్టూల్ మీద కూర్చో బెట్టిందామె.

నేను వేరే కుర్చీలో కూర్చున్నాను.

"వాటీజ్‌యువక్వాలిఫికేషన్?" అందా ఆంగ్లో ఇండియన్ నా వేపుచూసి. నాకేమి అర్థంకా లేదు ఆమె మాటలు. ఎందుకయినా మంచిదని ఓచిరునవ్వు నవ్వాను మాట్లాడకుండా!

"వయాయు లాఫీన్?" అందామె మళ్ళీ.

నాకు భయం మొదలయింది! ఆమె మాట్లాడే భాష ఇంగ్లీష్‌లాగానే వుంది కాని ఇంగ్లీషు మాత్రంకాదు.

మళ్ళీ ఓసారి నవ్వీబట్టతలాయనవు చూశాను.

"వయ్ డోంటుయు ఆన్సర్?" అన్నాడతను చిరాకుగా.

నాకు చెమటలు పట్టినయ్...

"మీరేమంటున్నారు?" అనడిగాను ఆయనను దీనంగా. కళ్ళజోడతను నా పరిస్థితిని చూసి జాలిపడ్డాడు.

"అతనికి ఇంగ్లీషు రాదు కాబోలు-" అన్నాడు వాళ్ళందరితోనూ జాలిగా.

"అవునండీ! నేను తెలుగు మీడియం" అన్నాను వినయంగా.

"మైగాడ్" అన్నాడు బట్టతల వ్యక్తి బట్టతలను సవరించుకుంటూ.

"కిరణ్-టెల్‌మీ-వాటీజ్ యువర్ నేమ్?" అడిగిందామె. వాడునావేపు చూశాడు.

"కమాన్-వాటీజ్ యువర్ నేమ్? చెప్పు-" అన్నాన్నేను వాడితో. వాడు మళ్ళీ అందరివేపు చూశాడొకసారి. నోరు మెదపలేదు- ఆమె మళ్ళీ అడిగింది. వాడు మళ్ళీ అందరి మొహాలు

చూశాడు. నాకు వాడిమీద ఒళ్ళు మండిపోయింది. చెంపలు పగలకొట్టాలన్న కోరికను అతికష్టంమీద అణచుకున్నాను.

"చెప్పు నీ పేరు చెప్పు." అన్నాను ఆత్రుతగా.

వాడు నోరుకదపలేదు.

"టెల్ ఎ బి సి డి...." అందామె.

వాడు ససేమిరా పలకలేదు.

"ఎ బి సి డి చెప్పరా?" అన్నాన్నేను కసిగా

వాడు మాట్లాడలేదు

"ఓ-వెరీ పూర్-" అందామె మళ్ళీ.

నాకు అర్థమైపోయింది వాడికి సీటు దొరకడం దుర్లభమని.

"సారీ సీటు దొరకదు" అన్నాడు కళ్ళజోడు.

"వీడు కొంచెం కొత్తగా ఫీలవుతున్నాడండీ! అందుకని చెప్పడానికి జంకుతున్నాడు. అంతే!నిజానికి వాడికి అన్నీవచ్చు. కొన్ని పదాలుకూడా చెప్పగలడు-" బ్రతిమాలుతూ అన్నాను.

"సారీ-మిస్టర్-పోనీ మీకయినా మంచి మార్కులొస్తే తీసుకునే వాళ్ళం" అన్నాడతను.

"నాకా? నాకు మార్కులేమిటి?"

"ఈ ఇంటర్వ్యూలో మేము పేరంట్‌నీ, పిల్లలకూ కూడా వాళ్ళకెపాసిటీ చూసి మార్కులేస్తాము...."

"అదేమిటి? చదివేది వాళ్ళయితే మమ్మల్నెందుకుపరీక్షించడం?"

"ఇంటి దగ్గరకూడా పిల్లలవిషయంలో జాగ్రత్తతీసుకునే తెలివిగల తల్లిదండ్రులుంటేనే సీటు ఇవ్వాలని మా మేనేజ్‌మెంట్ నిర్ణయం యూకెన్ గో! ఓ! మీరు తెలుగు మీడియం కదూ- మిరిక వెళ్ళవచ్చు."

నేను కిరణ్‌గాడిని బయటికి ఈడ్చుకొచ్చాను.

"ఏమయింది?" అడిగారు జనం చుట్టూ మూగి.

"నేనూ, మా కుర్రాడు ఇద్దరం ఫెయిలయ్యాం" అన్నానేను.

పిల్లలను తీసుకుని నేనూ, గోపాల్రావ్ బయటికొస్తుంటే ఓకారు ఎదురొచ్చి ఆగింది. వెనుక సీట్లో కూర్చున్నవ్యక్తి కారు దిగుతూనే నన్ను చూసి-

"అరె! నువ్వీడకొచ్చినావేమి సంగతన్నా?" అన్నాడు నన్ను గుర్తుపట్టి.

"ఏం లేదు రాములూ! వీళ్ళిద్దరికీ స్కూల్లో ఎడ్మిషను ట్రైచేద్దామని..."

ఈలోగా ప్యూన్‌పరుగుతో వచ్చి అతనికి సెల్యూట్ కొట్టి నిలబడ్డాడు.

"అరెయ్-ఇగో-సూడు- ఈ దొరల్ని తోలుకపోయి నా కమరాలో కూర్చుండబెట్టు-నేను ప్రిన్సిపాలుడితో జరంత మాట్లాడొస్త! పదండ్రన్నా! అడ కూర్చోండ్రి! ఇప్పుడే వస్తా!" అని సరాసరి ప్రిన్సిపాల్ రూమ్‌లో కెళ్ళిపోయాడు. నేనూ, గోపాల్రావు ప్యూన్‌తోపాటు మేడమీదకెళ్ళి సెక్రటరీ అని బోర్డువున్న గదిలోకెళ్ళి కూర్చున్నాము. ఎయిర్‌కండిషన్ ఏర్పాటు ఉండటంచేత చాలా చల్లగా ఉందాగది. లోపల చాలా ఖరీదయిన ఫర్నిచరు.

"ఇప్పుడు నీతో మాట్లాడితను ఈ స్కూలు సెక్రటరీయా?" అడిగాడు గోపాల్రావ్ ఆశ్చర్యంతో.

"అలాగే కనబడుతోంది!" అన్నాను ఆశ్చర్యంనుంచి తేరుకుంటూ.

"ఎట్లా తెలుసు నీకతను?"

"నేను ఎక్సయిజ్ డిపార్టుమెంటులో పని చేసేటప్పుడు పరిచయం. సారా దుకాణం కాంట్రాక్టర్- ఆఏరియాలో రౌడీ."

రాములు లోపలికొచ్చి కూర్చున్నాడు.

"ఆ! చెప్పన్నా! నువ్వు ఎడ్మిషన్ గురించి వచ్చినావ్?"

"అవును! అది సరేగానీ ఈస్కూలు..."

"నాదే అన్నా! గుడంబదందా నడిచినంతకాలం మంచిగానే ఉండేగానీ, ధూల్‌పేటలో పోలీసులు జులుం ఎక్కువయిందన్నా! ఇక అళ్ళతో కిరికిరెందుకని ఆ దందా బంద్‌చేసి ఈ స్కూల్‌దందా షురూజేసిన! ఇగో-నిజం చెప్తున్న-ఇను! ఈస్కూల్ నడిపే దందాలఇంత లాభముం దని ముంగటే ఎరికుంటే నేను ఆ ఫాల్తుగుడంబ పక్కకే పోకపోతుండె! పెద్ద పెద్దోండ్లు వచ్చి స్కూల్ల సీటు గురించి క్యూల నిలబడుతున్రు! ఇక పైసలు ఎన్ని గట్టమంటే అన్ని కట్టనికి తయారు... రెండేండ్లకిందట ఇరవైవేలతో ఈస్కూలు షురూజేసిన! గిప్పుడుకమాయ్ ఎంతనో ఎరుకనా? రెండు లక్షలు. గిట్లుండాల దంద అంటే!"

నేనూ, గోపాల్రావ్ నివ్వెరపోయి వింటూండిపోయాము అతని మాటలు.

"అది సరేగాని మా పిల్లలిద్దరికి ఎడ్మిషన్‌కావాలి మీస్కూల్లో! ఇప్పిస్తావా?" అడిగాన్నేను అయిష్టంగానే. గుడంబా వ్యాపారం చేసే ఓరౌడీ నడిపే స్కూల్లో మా పిల్లలుచదువు నేర్చుకోవడం నాకు నచ్చలేదు. రాములు ఓ నిమిషం మాట్లాడలేదు. ఏదో ఆలోచనలోపడ్డాడు.

"పోనీలే-కష్టమయితే ఇంకో స్కూల్లో ప్రయత్నిస్తాము" అన్నాను నేను అతని ధోరణిచూసి.

"కష్టం గురించికాదన్నా! నేను వేరే విషయం గురించి సోంచాయిస్తున్నా!"

"ఏమిటది?"

"నువ్వు నాకు చాలాసార్లు మదద్ చేసినావ్! గసంటప్పుడు నీకు నిజం చెప్పకుండా లోపట జేయనికి నాకిష్టంలేదు. నీపిల్లగాడుభీ నా పిల్లగాడు లెక్కచూడాలి గదా! వీళ్ళని వేరే మంచి స్కూల్ల జేర్పించు! నా స్కూలు మంచిగలేదు."

నేనూ, గోపాల్రావ్ మొఖాలు చూచుకున్నాం! ఆస్కూలు ఎంతో గొప్పదన్నపుకార్లు వినే మేము అక్కడికొచ్చామసలు.

"నీ స్కూలు ఎందుకని మంచిదికాదు?" అడిగాన్నేను.

"ఏమి జెప్పాల? సదువు మంచిగుండదు."

"అదేమిటి? ఎక్కువ ఆంగ్లోఇండియన్ టీచర్లున్నారు కదా?

"అగో అక్కడనే లోపటయేది అందరూ! ఆ చట్‌కారోళ్ళు ఏం సదివిన్రనుకుంటున్నావు? ఎనిమిదో కలాసు. అదికూడా పాస్‌కాలే! తప్పిన్రు. ఇంక ఆళ్ళు పిల్లగాండ్లకేమ్ జెప్తరు? వాండ్లకేతెలియకపాయె! ఇంక మిగిలినోండ్లలో ఇద్దరు పోరీలు మా బంధువులే ! ఇద్దరూ అయిదో క్లాస్‌తోనే బంద్‌చేసిన్రు. ఈళ్లందరికీ జరన్త ఇంగ్లీష్ మంచిగొస్తది గనుక నడిచిపోతున్నది. లేకుంటే అప్పుడే కిరికిరి అవుతుండె. అసలు నా కొడుకులిద్దరు ఏడ జదువుతున్రో నీకెరుకనా?"

"ఎక్కడ?"

"గవర్నమెంట్ స్కూల్ల. ఆడ ఫీజుతక్కువ. సదువెట్లెయిన జెప్పనీ గానీ మంచి టీచరొకన్ని ట్యూషన్ పెట్టిన!"

"సరే వస్తా" అన్నాన్నేను లేచి నిలబడుతూ

"ఇగో ఒక్కమాట. ఈ మాట ఎవళ్తోను చెప్పకు మళ్ళా."

"అబ్బే-చెప్పను. నే నెందుకు చెప్తాను?"

"గదే అంటున్న-నువ్వు నా పాత దోస్తువని చెప్పిన."

నేనూ, గోపాల్రావ్ బయటికొచ్చాం!

"దిసీజ్ టూ మచ్ !" అన్నాడు గోపాల్రావ్.

టూ మచ్చేనని నేనూ అంగీకరించాను.

"ఇప్పుడేం జేద్దాం?" అడిగాడు గోపాల్రావ్

"సెయింట్ ఆంథోని కిండర్‌గార్డెన్ స్కూల్‌కెళ్దాం పద."

"అక్కడ మాత్రం దొరుకుతుందంటావా?"

"ప్రయత్నం చేయకతప్పదు కదా."

ఇద్దరం సెయింట్ ఆంథోని స్కూలుకి చేరుకున్నాం సైకిల్ మీద. అక్కడి వ్యవహారం కొంచెం ప్రోత్సాహకరంగానే కనిపించింది.

ప్రిన్సిపాల్ అప్పటికప్పుడే కిరణ్‌గాడిని, చిన్నిగాడిని ఇంటర్వ్యూచేసి,రిజల్ట్ కూడా పావుగంటలో చెప్పేశాడు. సీటు దొరికిందట. వెంటనే చెరో ఆరువందలూ ఎడ్మిషన్ ఫీజుగా కట్టేయాలట.

"ఇప్పుడంత డబ్బు తేలేదండీ, రేపు కడతాం" అన్నాడు గోపాల్రావ్.

"ఊహు, రేపటికయితే గ్యారంటీలేదండీ. ఈలోగా ఇంకెవరయినా వస్తే ఎడ్మిషన్స్ క్లోజయిపోతాయి తరువాత మీ ఇష్టం."

"పోనీ ఓ గంట టైమిస్తారా?"

ఆయన టైమ్ చూసుకున్నాడు.

"ఓ.కే. గంట టైమిస్తున్నాను" అన్నాడు చిరాగ్గా.

గోపాల్రావ్ సైకిల్‌మీద రివ్వున దూసుకెళ్ళి అరగంట తర్వాత నురగలుకక్కుకుంటూ వచ్చి ఇద్దరికీ ఫీజు కట్టేశాడు.

"హమ్మయ్య పెద్ద సమస్య తీరిపోయింది" అన్నాడు. సరిగ్గా అప్పుడే ఓపెద్దమనిషి హడావిడిగా స్కూలు గేటు దగ్గర్నుంచి మావేపు వచ్చాడు.

"ఫీజు కట్టేశారా?" అన్నాడు ఆత్రుతగా.

"ఆ కట్టేశాం- ఎందుకలా అడిగారు?" అన్నాను ఆశ్చర్యంగా.

గాలిలోకి చేతులుఎత్తి "గోవిందా-గోవిందా" అంటూ అరిచాడు, దణ్ణంపెడుతూ. మా గుండెల్లో రాయి పడింది.

"ఏమిటది? ఎందుకలా అంటున్నారు?" అడిగాడు గోపాల్రావ్ పాలిపోయిన మొఖంతో.

"మీ ఫీజు గోవింద!"

"ఏం ఎందుకని?"

"ఎందుకేమిటండీ మావాడిని కిందటేడు ఈస్కూల్లోజేర్పించాను. వాడికిలెక్కల్లో ఎ+బి హోల్‌స్క్వేర్ అంటే ఎస్క్వేర్ ప్లస్  బిస్క్వేర్ అని చెప్పాడట ఆ ఇడియట్. వీడింక పిల్లలకేం నేర్పుతాడు?"

"అంటే లెక్కల మాష్టారుకి లెక్కలు తెలీదా?"

"గోవిందా....గోవింద." అసలు లెక్కల మేష్టరంటూ ఒకడుంటేకదా. ప్రిన్సిపాల్ సెవెన్త్‌క్లాస్ వాళ్ళకి లెక్కలు, సైన్సూ చెప్తాడు. అందుకే మొన్న పరీక్షకెళ్ళినముప్పయిమంది కుర్రాళ్ళలో ఇరవైమంది ఫస్ట్‌క్లాసులోనూ, మిగతా పదిమంది సెకండ్‌క్లాసులోనూ తప్పారు."

"తప్పారా?"

"అవును. ఫస్టు సెకండ్‌క్లాసుల్లో"

"దేముడో-ఇప్పుడేమిటి చేయడం?"

"ప్రజాసేవ చేయండి. ఈ గేటుదగ్గర కాసేపురోజూ కూర్చుని- కొత్తగా బలి అయేందుకు వచ్చేవాళ్ళను రక్షించండి." అనేసి వెళ్ళిపోయాడతను.

గోపాల్రావ్, నేనూ ఒకరి  మొఖాలొకరు చూచుకున్నాం.

"పద. మన ఫీజు మనకిమ్మని అడుగుదాం" కోపంగా అన్నాడు వాడు.

"వాడివ్వనంటే."

"మర్డర్‌చేసేద్దాం. జైల్లోగడపడానికి నేను సిద్ధంగా ఉన్నాను."

ఇద్దరం మళ్ళీ ప్రిన్సిపాల్  గదిలోకి జొరబడ్డాం.

"మా ఫీజు మాకిచ్చేయ్" అన్నాడు గోపాల్రావ్ చొక్కాచేతులు పైకిమడిచి.

"ఒక్కసారి ఫీజు కట్టాక-ఏ పరిస్థితులలోనూ తిరిగి ఇవ్వబడదని రసీదువెనుక రాశాంకదా? అది మారూలు-"

"ఇవ్వకపోతే మొఖం పగలగొట్టాలని మాకూరూలుంది."

"అతను కోపంగా కుర్చీలోంచి లేచాడు.

"అసలు ఎందుకు వాపస్ ఇవ్వాలి నేను?"

"ఎందుకంటే నీ బోడి స్కూల్లో క్వాలిఫైడ్ టీచర్లులేరు గనుక."

"ఏ స్కూల్లో ఏడిచారుగనుక-నా స్కూలులో ఉండటానికి?"

"మీ స్కూల్లో అందరూ ఫస్ట్‌క్లాసులో తప్పుతున్నారు."

"అది వాళ్ళకర్మ! నేను 'పాస్ చేయటం' గారంటీ ఇవ్వటంలేదు."

"వాళ్ళ కర్మకాదు. నీకు చదువుచెప్పటం రాకపోవటంమూలాన తప్పుతున్నారు."

"ఎవడాడు రాదంది?"

"అయితే ఎ+బి హోల్ స్క్వేర్ ఎంతో చెప్పు."

"సడన్‌గా చెప్పమంటే ఎలా? ప్రిపేరవ్వాలి. ఎల్లుండిమాణింగ్ ఒకసారి కనబడండి! చెప్తాను!"

"పోనీ న్యూటన్స్‌సెకండ్ లాఆఫ్‌మోషన్ ఏమిటో చెప్పు."

"ఫస్ట్‌లా ఆఫ్‌మోషన్ మొదటి లైనుకొంచెం చెప్పండి మిగతాది చెప్పేస్తాను."

"ఛస్తేచెప్పను-"

"అయితే నేనూ సమాధానం చెప్పను-"

"చెప్పలేకపోతే నా ఫీజు నాకిచ్చేయి. రెండిట్లో ఏదోకటి చెయ్యి."

అతను చాలాసేపు ఆలోచించి ఏవేవో తప్పులు చెప్పటంమొదలు పెట్టాడు.

"నీకు రాదులేగానీ డబ్బిచ్చేయ్" అన్నాడు గోపాల్రావ్.

"నేనివ్వను."

గోపాల్రావ్ ఠక్కునవాడి చొక్కా పట్టుకున్నాడు. అంతే! ఐదునిమిషాలపాటు అక్కడేం జరుగుతుందో నాకు తెలీదు. బల్లమీద-వస్తువులూ,గోడలకున్న కాలెండర్లూ, కుర్చీలూ, చెత్తబుట్టా, ఫోనూ, అన్నీ ముక్కలుముక్కలయిపోయినాయి, వాళ్ళ యుద్ధంలో! ఈలోగా ఆ స్కూలు సెక్రటరీ కాబోలు వచ్చి గోపాల్రావ్‌ని పట్టుకోబోయాడు. మరో పక్కనుండి ఆస్కూలు ప్యూన్ అతనికి సహాయంగా వచ్చాడు. ఇంక నేను చూస్తూ ఊరుకోలేకపోయాను. వాళ్ళిద్దర్నీ చెరోతన్నూ తన్ని కిందపడగానే కుర్చీలు మీదవేసి నొక్కిపట్టాను. మరో ఐదు నిమిషాలు భీకర సంగ్రామం జరిగింది. బయట నిలబడ్డ కిరణ్‌గాడు, చిన్నిగాడు లోపలికొచ్చి ఆదృశ్యంచూసి ఎంతో ఆనందించారు. సినిమాసీనుల్లో ఫైటింగ్ చూడడం వారికెంతో ఇష్టం. అదే ఎదురుగ్గా జరుగుతోంది మరి.

"డాడీ-వాడిని పిస్టల్‌తో కాల్చేయ్" అని సజెషన్ ఇచ్చాడు చిన్నిగాడు.

హఠాత్తుగా ప్రిన్సిపాల్ మెడ గోపాల్రావ్ చేతుల్లో ఇరుక్కోవడంతో ఊపిరాడక "బాబోయ్ మీ డబ్బిచ్చేస్తాను వదలండి" అనరిచాడు ప్రిన్సిపాల్.

ఇద్దరం బట్టలుదులుపుకుంటూ లేచి నిలబడ్డాం. ప్రిన్సిపాల్ చేతిమీద నుంచిరక్తం కారుతోంది. గోపాల్రావ్‌గాడి కన్నువాచిపోయింది. నాకాలుప్రాక్చరయిందేమో అనుమానం. చివరకు ఇద్దరికీ చెరో వందరూపాయలూ కాన్సిలేషన్ ఫీజుకింద తీసుకుని మిగతా డబ్బిచ్చేశాడు ప్రిన్సిపాల్.

ఇద్దరం చిరిగిన బట్టలతోనూ, చెరిగిపోయిన జుట్టుతోనూ, ఒగరుస్తూ బయటికొచ్చి పిల్లలను+సైకిళ్ళనూ నెమ్మదిగా తీసుకుని నడవసాగాము. నాలుగడుగులు వేశామోలేదో శంకర్రావ్ ఎదురయ్యాడు. మా అవతారాలు చూసి ఆశ్చర్యపోయాడు.

"ఏమిటీ అవతారాలు? స్కూలుఫీజు వాపస్ గొడవేనా?" అడిగాడు నవ్వుతూ.

"అరె! నీకెలా తెలుసు?" ఇద్దరం ఉలిక్కిపడి అడిగాము.

"స్కూల్స్ తెరిచేరోజుల్లో అందరం నాలుగుచోట్ల యుద్ధం చేస్తేనేగదా ఈచెత్త స్కూల్స్ తప్పించుకునేది."

"నేను ఆరుగురు శెక్రటరీలను, పధ్నాలుగుమంది ప్రిన్సిపాల్స్‌నీ కత్తితోపొడిచాను-ఫీజు వాపసుకోసం."

"అంతమందినా?"

"అవును మరి. చాలా చోట్లనేనూ కత్తిపోట్లుతిన్నాననుకో-తప్పదు మరి. మనపిల్లల్ని ఆంధ్రప్రదేశ్‌లో చదివించాలంటే తల్లిదండ్రులు ఈమాత్రం రిస్కీతీసుకోవాల్సిందే."

"ఒకవేళ ప్రిన్సిపాల్ స్త్రీ ఉంటే ఎలా?" అడిగాడు గోపాల్రావ్.

"అప్పుడు మా ఆవిడను పంపిస్తాను. దానికి ఈమధ్యేకరాటే నేర్పించాను దీనికోసమని. ముగ్గురు లేడీ ప్రిన్సిపాల్స్‌ను చావగొట్టి ఫీజు వాపస్ తీసుకొచ్చింది, ఇప్పటికి-కనుక ముందు మీ భార్యలను కరాటే స్కూలుకి పంపించండి. వీలయితే మీరూ నేర్చుకోండి వస్తా-ఇంకో శెక్రటరీ ఈపక్కకల్లు కాంపౌండ్‌లో కల్లుతాగుతున్నాడట. వాడి అంతుతేల్చుకోవాలి" అంటూ కత్తి బయటకు తీసి పక్కనే ఉన్నకల్లు కాంపౌండ్‌లోకి పరుగెత్తాడు.

"పద" అన్నాడు గోపాల్రావ్.

"ఎక్కడికి?" అడిగాను.

"కరాటే స్కూలుకి"

"మరి పిల్లలో..."

"వాళ్ళను కూడా తీసుకెళదాం... మనకి సహాయంగా ఉంటారు."

"అయితే ఓపని చేద్దాం. నువ్వుకరాటే స్కూలుకెళ్ళు. నేను డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ ఆఫీసుకెళతాను. ఇలాంటి చెత్త స్కూల్సు అన్నిటికీ గవర్నమెంటు రికగ్నిషన్‌యిస్తున్న ఆ ఆఫీసరు అంతుతేల్చుకొస్తాను..."వాడు పిల్లల్ని తీసుకుని కరాటే స్కూలువేపు బయల్దేరాడు.

నేను డి.పి.ఐ. ఆఫీసుచేరుకున్నాను.

రిసెప్షనిస్టు చుట్టూ జనం గుమిగూడి ఉన్నారు.

అందరికీ సమాధానాలు చిరాకుగా చెప్తోందామె.

చివరకు నావంతువచ్చింది.

"ఏంకావాలి?"

"అర్థమైన స్కూల్సుకీ రికగ్నిషన్ యిస్తున్న మీ డైరెక్టర్ని కత్తితో పొడవాలి! ఎక్కడాయన?"

"ఆయనని కత్తితో పొడవాలనుకుంటున్న పేరెంట్సు క్యూ ఆఫీస్ వెనుకవేపు వుంది. అటువేపువెళ్ళి 'క్యూ' లో నిలబడండి" అందామె చిరాకుగా. ✷



# వరుడు కావలెను లేక కట్నంతో పాటు కిరసనాయిలు ఉచితం



పెళ్ళి పందిరంతా చాలా హడావుడిగా వుంది

ఆడా, మగా, పిల్లా,పీచు-ఓ పక్కబాండ్ మేళం, మరోపక్క పెళ్ళిపెద్దల కేకలతో హోరెక్కిపోతోంది.

నేనూ, శాయిరామ్, రంగారెడ్డి, జనార్ధన్, మొదలయిన కాలనీవాళ్ళందరం కలసి, కుర్చీల్లో గుంపుగాకూర్చొని బాతాఖాని కొడుతున్నాం- శాయిరామ్ ఆతరువాత జరగబోయే కాలనీ మీటింగుతాలూకూ ఎజెండాగురించి ఎడా పెడా చర్చిస్తున్నాడు.

అది మా కాలనీ ప్రెసిడెంట్ గోపాల్రావ్‌గారి అమ్మాయి పెళ్ళి అవడంవల్ల కాలనీ వాళ్ళందరూ గుమికూడారక్కడ.

ముహూర్తం దగ్గర పడిపోంది. పెళ్ళికొడుకు తాళి పట్టుకుని రెడీ అయిపోయాడు. బాజాలవాళ్ళు వేగం విపరీతంగా పెంచేశారు-ఏదో కొంపమునుగబోతుందన్నట్లు.

"మన తెలుగు సినిమాల్లో అయితే సరిగ్గా ఇలాంటి సీన్‌లోనే"ఆగండి!"అంటూ కేక వినబడుతుంది! కదూ" అన్నాడు రంగారెడ్డి.

"అవును! ఇలాంటి 'ఆగండి' సీన్లమీదే కొన్ని వందల సినిమాలొచ్చాయ్" అన్నాడు శాయీరామ్. "అయినాగాని మన ప్రేక్షకులకు ఇంకా ఆసీన్‌లంటేనే యిష్టం"

సరిగ్గా అప్పుడే "ఆగండి!" అన్నకేక వినిపించి అందరం ఉలిక్కిపడ్డాం. మాతోపాటు పెళ్ళి పందిరంతా కూడా నిశ్శబ్దం అయిపోయింది.

"ఎవరో భలేజోకు వేశాడు" అన్నాడు శాయీరామ్ పగలబడి నవ్వుతూ. మేమంతా కూడా నవ్వబోయాంగాని ఆగొంతు మళ్ళీ కర్కశంగా. "జోకుకాదు-గాడిదగుడ్డూకాదు" అని అరచింది.

ఈసారి ఆగొంతుతాలూకూ ఓనర్‌ని అందరం జాగ్రత్తగా చూశాం. ఆగొంతు ఓనర్ మరెవరో కాదు. పెళ్ళికొడుకు తండ్రి. శాయీరామ్‌ని కోపంగా చూస్తున్నాడతను.

"జోక్‌కాదాండి!" కొంచెం తగ్గి అడిగాడు శాయీరామ్.

"గాడిదగుడ్డు జోకు! జోకేమిటయ్యా! ఇది జోకులేసుకునే టైమా?"

ఇంకా మండిపడుతూ శాయీరామ్ మీద కొచ్చాడతను. శాయీరామ్ మరో నాలుగడుగులు వెనక్కు వేశాడు.

"నేను జోకనుకున్నానులెండి."

"బుద్ధుండాలి అలా అనుకోవడానికి."

ఇక లాభంలేదని నేనూ, రెడ్డీ జోక్యం చేసుకున్నాం.

"వాడికి కొంచెం బుద్ధి సరిగ్గా ఉండటంలేదులెండి. అదీ ఈమధ్య...టి.విలో డ్రామా లేయడం మొదలెట్టినప్పటినుంచేలెండి! అంతకుముందు బాగానే ఉండేది-" అని సర్దిచెప్పాడు రెడ్డి.

ఇంతలో గోపాల్రావ్ పరుగుతో వచ్చాడు మా దగ్గరికి.

"ఏమిటి వియ్యంకుడుగారూ! ఏంజరిగింది" అన్నాడుగాభరాగా.

"గాడిదగుడ్డు జరిగింది" అన్నాడు బట్టతలాయన బట్టతల సవరిసుకుంటూ.

"గాడిదగుడ్డా?"

"అవును!"

"గాడిదగుడ్డు జరగడమేమిటి?" మరింత గాభరాగా అడిగాడు.

"కాకపోతే ఏమిటయ్యా! తాళికట్టే టైము దగ్గరపడింది! ఇంతవరకూ వప్పుకున్నకట్న కానుకలన్నీ ఇవ్వరేం."

"అదేమిటి? కట్నంముందే ఇచ్చాంగా?"

"కట్నంసంగతి సరేనయ్యా. కిర్సనాయలుసంగతేమిటి?"

"కిర్సనాయిలా?"

"అవును"

"కిర్సనాయిలు ఇప్పుడెందుకు?"

"ఇప్పుడుకాకపోతే ఎప్పుడిస్తారయ్యా? మాకోడలిని తగలేసుకోవద్దా?"

"వీల్లేదు. మా వంశాచారం ప్రకారం పదకొండో నెలవరకూ ఇంటికోడలిని తగలెట్టడానికి వీల్లేదు" అరచాడు గోపాల్రావ్

"మీబోడి వంశచారం-మీ కోడలికి పాటించండి. మా కోడలిని ఎప్పుడు కిర్సనాయిలుతో తగలెయ్యాలో అది మా ఇష్టం"

"కాదు.మా ఇష్టం" అన్నాడు గోపాల్రావ్.

"అలా ఒకరికొకరు రెచ్చిపోతే ఎలా గోపాల్రావ్‌గారూ ! ఇలాంటి విషయాల్లో పట్టు విడుపులంటూ లేకపోతే కష్టం. మన అమ్మాయిని వాళ్ళచేతుల్లో పెట్టాక వాళ్ళు ఎప్పుడయినా తగలేసుకోనీండి. మనం అడ్డు చెప్పడం బావుండదు" అన్నాడు రంగారెడ్డి ఇద్దరినీ శాంతపరుస్తూ...

"సరే, అలాగే! ఎనిమిదోనెలే తగలేసుకోనీండి." తగ్గి, అన్నాడు గోపాల్రావ్.

"మరి కిర్సనాయిలు మాటేమిటి?" మళ్ళీ అడిగాడు బట్టతలాయన.

"ఏం కిర్సనాయిలు?"

"మీ అమ్మాయిని తగలెయ్యడానికి పాతికలీటర్ల కిర్సనాయిలు ఇస్తానని ఒప్పుకున్నారుగా, అదేది అనడుగుతున్నాను."

"కిర్సనాయిలు సప్లయిచేస్తానని నేనువప్పుకోలేదే."

"వప్పుకున్నారని మధ్యవర్తి చెపితేనే గదయ్యా-ఈ సంబంధం చేసుకోడానికి వప్పుకుంది."

"ఏడీ మధ్యవర్తిని పిలవండి."

"పిలవండి!"

అందరం మధ్యవర్తికోసం వెదికాంగానీ మామూలుగానే ఆయనెక్కడా కనిపించలేదు.

"అయ్యా, ముహూర్తం మించిపోతోంది. తాళి కట్టించేస్తే బావుంటుంది-" అన్నాడు పురోహితుడు.

"బోడి ముహూర్తం పోతేపోనీ, కిర్సనాయిలు సంగతి తేలందే తాళి కట్టడానికి వీల్లేదు! అబ్బాయ్ పీటలమీదనుంచిలేచి ఇక్కడికొచ్చేయి" అన్నాడాయన. రెడ్డి మళ్ళీ ఆయనను శాంతపరచడానికి ప్రయత్నించాడు.

"ఇదిగో చూడండి బట్టతలగారూ"

ఆయన కోపంతో ఎగిరిపడ్డాడు.

"ఏమిటీ! నాపేరు బట్టతలా?"

రెడ్డి ఖంగారుపడి నావేపు చూశాడు! "ఈయన పేరేమిటని ఇందాక నిన్ను అడిగితే 'బట్టతల' అని చెప్పావుకదా?" అన్నాడుగాభరాగా.

నేను ఎందుకయినా మంచిదని అక్కడ చేరిన గుంపువెనక్కు నడిచి, "ఊరికే అన్నాలేసరదాకి!" అన్నాను పరిగెత్తుకుంటూ పారిపోవడానికి రెడీగా నిలబడి.

"సారీ సార్! ఏదో పొరపాటు జరిగింది! ఇంతకూ మీ పేరేమిటన్నారు?"

"గాడిదగుడ్డు" ఇంకా మండిపడుతూ అన్నాడు.

"చూడండీ గాడిదగుడ్డు...సారీ! మీరుకోపంగా ఉన్నట్లున్నారు. అలాంటి పేరెక్కడయినా ఉంటుందా ఏమిటి? సరేకానీండి! పేరొదిలేద్దాం!చూడండి, ఎవరికోడలిని వాళ్ళే కిర్సనాయిలు కొనుక్కుని తగలెయ్యడం మన సంఘ ఆచారం! మీరిప్పుడు కొత్తగా పుట్టింటివాళ్ళే కిర్సనాయిలుకూడా సప్లయిచేయాలంటే ఎవరికయినా ఇబ్బందే కదా..."

"గాడిదగుడ్డు! అలా సప్లయి చేసేవాళ్ళ అమ్మాయినే చేసుకుంటామని మధ్యవర్తికి క్లియర్‌గా చెప్పాను."

"అయినా అలా కిర్సనాయిలు అడగడమే చాలా తప్పండి!" అన్నాడు మా కాలనీతాలూకు ఆంజనేయశాస్త్రి జనంలోంచి ముందుకొచ్చి,

"ఏమిటి? తప్పా?" బట్టతలాయన మళ్ళీరెచ్చిపోతూ అడిగాడు.

"అవును."

"ఏమిటి తప్పు?"

"తప్పుకాకపోతే ఏమిటయ్యా! ఇవాళ మీరు కిర్సనాయిలు ఉచితంగా ఇమ్మంటున్నారు రేపు ఇంకొకాయన అంటించడానికి అగ్గిపెట్టికూడా కావాలంటాడు. అసలే పెళ్ళి ఖర్చులూ, కట్నాలూ ఇవ్వలేక ఛస్తూంటే-పాతిక లీటర్లకిర్సనాయిలు బ్లాకులో కొనియివ్వాలంటే మాటలా ఏమిటి?"

"అదంతా నాకనవసరమయ్యా! మా అబ్బాయికి కనీసం మూడు పెళ్ళిళ్ళయినా చెయ్యాలికదా! ముగ్గురిదగ్గర కట్నం, లాంఛనాలు వసూలు చేస్తేగానివాడికి నాలుగు డబ్బులు మిగలవని మీరూ వప్పుకుంటారు! అవునా! మరి మిగిలే ఆ నాలుగు డబ్బుల్లో ముగ్గురు భార్యలను ఒకరి తర్వాత ఒకరిని విడివిడిగా కిర్సనాయిలు పోసి తగలబెట్టాలంటే ఎంత ఖర్చోమీరే ఆలోచించండి!" కొంచెంశాంతంగా అన్నాడు బట్టతలాయన.

"పోనీలేవయ్యా గోపాల్రావ్, కిర్సనాయిలు ఇచ్చేసేయ్, అయిన ఖర్చుఎలాగూ అయింది. ఇంక ఇప్పుడు వెనక్కు తగ్గడందేనికి?" ఎవరో గోపాల్రావ్‌కి సలహా ఇచ్చారు.

"ఇమ్మంటారా?" సందేహంగా అడిగాడు గోపాల్రావ్.

"ఇచ్చేసేయ్! ఈ సంబంధం తప్పిందంటే మళ్ళీ ఎప్పటికి ఇంకో సంబంధం కుదురు తుందో ఏమో! ఈలోగా మీ అమ్మాయికి భర్త చేతిలో తగలబడేవయసు దాటిపోవటంలేదూ? ఏ వయసు ముచ్చట ఆ వయసులో జరిగితేనే 'ముద్దు' అన్నారు అంటే, నాఉద్దేశ్యం మీ అమ్మాయి కలకాలం ఇలాగే కిర్సనాయిలు చావుతప్పించుకునీ భ్రష్టత్వం పొందుతుందని కాదు. ఏదొక సంబంధం చూసి ఎలాగూపెళ్ళిచేస్తావ్? ఆ అత్తమామలు, భర్తాకలసి ఎలాగూ కిర్సనాయిలు పోసి తగలెయ్యకా మానరు. ఎటొచ్చీ నీకు టైము ప్రకారం అమ్మాయిని తగలబెట్టించలేక పోయానే అన్న దిగులుండిపోతుంది ఆఖరివరకూను" నెమ్మదిగా నచ్చజెప్పాడు జనార్ధన్.

"సరే" అన్నాడతను.

అంతలోనే గోపాల్రావ్‌గారి భార్య సావిత్రమ్మ కస్సున లేచింది.

"ఏమిటి, కిర్సనాయిలు ఇస్తారా? అమ్మాయి వయసు దాటిపోతోందికదాని ఇలాంటి కొత్త పద్ధతులన్నీ మొదలెడితే ఇంక అయినట్లే. ఇవాళ కిర్సనాయిలు వప్పుకుంటే రేపు అగ్గి పెట్టికూడా ఇమ్మంటారు. ఆ తర్వాత మీ అమ్మాయి అంత్యక్రియల ఖర్చుకూడా పెట్టు కోమంటారు. ఇలా దీనికి అంతం ఎక్కడుంది. వీల్లేదు, కిర్సనాయిలు ఇవ్వడానికి చస్తేవప్పు కోను" అందామె మొండిగా.

మరుక్షణం మా కాలనీ తాలూకూ ఆడవాళ్ళందరూ అలవాటు చొప్పున చప్పట్లు కొట్టారు ఉత్సాహంగా.

"అవును! ఇలా అడ్డమైన సౌకర్యాలు పెంచడానికి వీలులేదు" అంటూ అరిచారు కొంతమంది.

ఇక లాభంలేదని రెడ్డిగారు కల్పించుకున్నాడు.

"చూడండమ్మా! పద్ధతులనేవి కాలాన్నిబట్టి మారుతుంటాయి మనం అడ్డుపడ గూడదు. ఆరోజుల్లో పద్ధతులేవేరు! మా తాతయ్య ఇప్పటికీ చెప్తుంటాడు. వాళ్ళకాలంలో మొగాళ్ళు ఒక్కటే పెళ్ళి చేసుకుని, ఒకే భార్యతో జీవితాంతం కాపురం చేసేవారట. అలాగే ఒకో వంశానికీ ఒక్కోరకమైన ఆచారాలు ఉంటాయి. మా వంశం ఆచారం ఏమిటంటే మగాళ్ళు వరుసగా ముగ్గురు భార్యలవరకూ కాల్చిచంపాలి. నాలుగోభార్యమాత్రం జీవితాంతం సంసారంచేయాలి. ఏపరిస్థితుల్లోనూ ఆమెను కిర్సనాయిలు పోసి కాల్చి చంపకూడదు. ఒకవేళ తనంతట తానుగా ఆమె ఆత్మహత్యచేసుకోవడం-లేదా చనిపోవడం జరిగితే అప్పుడుగాని ఇంకో పెళ్ళి చేసుకోడానికి వీలులేదు!

అలాగే ఆంజనేయశాస్త్రిగారి వంశసంప్రదాయం ప్రకారం పెళ్ళయిన సంవత్సరంలోగా వరుసగా నలుగురు కోడళ్ళను అత్తామామలు మాత్రమే కిర్సనాయిలు పోసి నిప్పంటించాలి. వాళ్ళకొడుకు కేవలంవారికి సహాయం చేయాలిగాని స్వయంగా నిప్పంటించకూడదు.

ఇక జనార్ధన్‌గారి సంప్రదాయం మరో రకంగా వుంటుంది. ఇంటి కోడల్ని భర్తగానీ, అత్తమామలుగానీ చంపడానికి వీలులేదు. ఆమె ఆడపడుచులే స్వయంగా మంచిరోజు చూసి కిర్సనాయిలుపోసి నిప్పంటించాలి" అంటూ ముగించాడు రెడ్డి.

సీతారామయ్యగారు చేతికర్రతో వణుకుతూ ఉత్సాహంగా కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు. ఆయనకూడా ఏదో చెప్పడానికి నరదావడుతున్నాడని అందరికీ అర్థమయిపోయింది.

"మాది బాగా వెనుకబడ్డ ప్రాంతంకదర్రా! అక్కడ యింకో సంప్రదాయం ఉంది. అదేంటంటే భర్త భార్యను తగలబెట్టే రోజునే- అత్తగారినీ, తల్లినీ కూడా చంపేయాలి. ఆ తర్వాత ఆ భర్తా అతని తండ్రి మామగారూ- ముగ్గురూ ఒకే పందిట్లో మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకోవాలి!"

హేమలత ఠక్కున అందుకుంది.

"అవున్లెండి, ఎవరి సంప్రదాయం వాళ్ళది. మాలో పద్ధతి ఇంకో రకం. పెళ్ళయాక ఆమెను ఎవరూచంపరు. తనంతటతనే ఓగదిలో కిర్సనాయిలు పోసుకుని నిప్పంటించుకుని చచ్చిపోవాలి. అప్పుడు భర్త ఆమె స్వహస్తాలతో "తన చావుకి ఎవరూ బాధ్యులుకారనీ, అత్త మామలూ, భర్తా ఆడపడుచులు అంతా దేవతలూ-లేక దేవుళ్ళనీ, కేవలం తనకే సరాదా పుట్టి ఛస్తోందని" రాసిన ఉత్తరం లగ్నంనాడు అతని ఉత్తరీయంలో కట్టిన మూటనుంచి

తీసి పోలీసుల కిస్తారన్నమాట! అయితే ఆ ఉత్తరం అందుకునే పోలీస్ ఇన్స్పెక్టరికీ ఒక కానిస్టేబుల్‌కీ మనం బట్టలు పెట్టాల్సివుంటుంది! పవిత్రకార్యంగదా మరి."

శితారామయ్యగారికి పాతరోజులన్నీ కళ్ళముందు మెదలినట్లున్నాయ్.

"ఇదేకాదర్రా! ఆరోజుల్లో భార్యలను ఇప్పటిలాగా డైరెక్ట్‌గా కాల్చేవాళ్ళుకాదు. ముందు కట్నాలగురించో, మరోవస్తువు గురించో వియ్యాలవారితో వివాదం పెట్టుకునేవాళ్ళు. అవన్నీ తెమ్మని భార్యను బాగా వేధించాక అప్పుడు కిర్సనాయిలుపోసి నిప్పంటించేవారు.ఒకవేళ వియ్యాలవారు అడిగినవన్నీ ఇస్తే ఆమెను చివరికంటా అస్సలు చంపేవారేకాదు! అలాగే కాపురం చేయనిచ్చే వాళ్ళు! అంత అజ్ఞానం ఉండేదారోజుల్లో."

ఈ గొడవంతా వింటున్న పెళ్ళికొడుక్కి చిరాకు పుట్టుకొచ్చింది. చేతిలోనిమంగళ సూత్రం నేలకేసి కొట్టాడు. "నేనేం హరికథలు వినడానికిరాలేదయ్యా! ముందు కిర్సనాయిలు ఇస్తారా ఇవ్వరా తేల్చండి?" అన్నాడు మొండిగా. శాయిరామ్ మంగళసూత్రం అతని చేతికిచ్చి సమాధానపర్చాడు.

"అలా తొందరపడితే ఎలాగయ్యా! ఓపక్కన మీ మామగారు ఇస్తానని ఒప్పు కున్నారుగదా! మీ అత్తగారికి యెలాగోలా నచ్చజెప్తాంలే! అల్లరిపడకు?"

"మీరెంతసేపూ అంతఖర్చు అని గొడవేగాని మా పెళ్ళికొడుకులసైడ్ కొంచెంకూడా ఆలోచించరండీ! పెళ్ళయిన తర్వాత షుమారు సంవత్సరంపాటు భార్యను మేపి ఆ పెట్టుబడికి దమ్మిడీ రాబడి రాకుండానే అంతేసి కిర్సనాయిలు పోసికాల్చిచంపాలంటే ఎవరికయినా ఎంత కష్టం? పోనీ అలా అని జీవితాంతం దానిని కాల్చకుండా బయటకు తోలేద్దామా అంటే లేనిపోని కాంప్లికేషన్స్ వస్తాయి! అదీగాకుండా మొదటిభార్య కిర్సనాయిలు పోసుకుని తగలెట్టుకున్నదని ఋజువయితేగాని మరోపిల్ల నివ్వడానిఎవరూ ముందుకి రారు. అయినా భార్యలతో కట్నం వస్తోందన్నమాటేగాని పెద్దగా మాకు మిగిలిచచ్చేదెక్కడ? సంవత్సరంపాటు తిండి, ఆ తరువాత కాల్చిచంపడానికి కిర్సనాయిలు, అగ్గిపెట్టెలు, దహనక్రియలు ఖర్చులు, దినవారాల ఖర్చులూ, అస్తికలు గంగలో కలపడాలు, ఇంట్లో పెద్దఫోటోలు ఫ్రేములుకట్టించి తగిలించడాలు-ఎంతఖర్చో మీరేలెక్కవేసుకోండి. గోపాల్రావ్‌గారు ఈ విషయంలో ఎంతో అభ్యుదయ భావాలున్నవారు కాబట్టి అడగ్గానే ఠక్కున వప్పుకున్నారు" అన్నాడు పెళ్ళికొడుకు.

మళ్ళీ శితారామయ్యగారు అందుకున్నారు.

"నన్నడిగితే భార్యలను కిర్సనాయిలుతో చంపడం మానేయడం మంచిదంటాను! ఎందుకంటే రాన్రాను కిర్సనాయిలుధర తెగపెరిగిపోతోంది. వేరేఇంకేమయినా చౌకరకం

ఆయిల్ ప్రభుత్వం సప్లయ్ చేయాలి. లేదా అసలు ఆడదాన్ని చంపకుండా బానిసలుగా అమ్మిపారేసే పద్ధతయినా బాగానే ఉంటుంది. ఇటువంటి పద్ధతివల్ల అటు ఖర్చుతప్పుతుంది. ఇటు కొంతరాబడీ వుంటుంది. మరోపక్క కొన్నవాడికి గొడ్లకు బదులుగా స్త్రీలను ఉపయోగించుకుని లాభపడే అవకాశమూ ఉంటుంది. ఈ పద్ధతి ఇప్పటికే కొన్ని దేశాల్లో అమలులో ఉంది-"

ఆమాట పూర్తికాకుండానే ఆడాళ్ళంతా ఏకమయి శీతారామయ్య మీద విరుచుకు పడ్డారు "అలా జరగడానికి వీల్లేదు. ఆడాళ్ళు పశువులుకాదు, అలా బానిసలుగా అమ్మి పారేయడానికి. భర్త చేతిలో కిర్సనాయిలు చావు చావడం మా జన్మహక్కు. ఇది మా భారతదేశ సాంప్రదాయం. మా నాగరికత. ప్రపంచంలోకెల్లా గొప్పవయిన మన ఆచారాలు తొలగించడానికి మేము ససేమిరా వప్పుకోము" అంటూ ఆవేశంగా అరిచారు. పరిస్థితి విషమించేలా ఉందని శాయీరామ్ చిరునవ్వుతో మధ్యలోకొచ్చాడు.

"సోదరులారా, సోదరీమణులారా, మనలో మనకి గొడవెందుకు? మనం అటు గోపాల్రావ్‌గారి భార్యవాదననూ కొట్టేయడానికి వీల్లేదు. ఇటు పెళ్ళికొడుకూ, అతని తండ్రి అండ్ కంపెనీవాళ్ళు అడిగేదానికి కాదనలేము. ఎందుకంటే మనందరికీ కూతుళ్ళతోపాటు కొడుకులూ వున్నారు మన కూతురు ఒకింటికి కోడలైనట్లే, ఒకింటి కూతురూ మనింటికి కోడలుగా రాక తప్పదు. మరి మనింటి కోడళ్ళను మనమే స్వయంగా కిర్సనాయిలు పోసి నిప్పంటించడమూ సహజమే. అంటే మరి మనకూ ఖర్చుపెరుగుతుంది కదా! కనుక మనమందరం ఓ కొత్త పద్ధతి అవలంబిస్తే బావుంటుంది. అదేమిటంటే పెళ్ళికొడుక్కి ఒకేసారి ముగ్గురమ్మాయిలతో పెళ్ళిచేసిపారేస్తే అటు ముగ్గురికట్నం ఒకేసారి వస్తుంది. ఇటు వాళ్ళందరినీ ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో చంపే పద్ధతిబదులు ఒకేసారి కట్టకట్టి కిర్సనాయిలు పోసి అంటిస్తే ఖర్చు పూర్తిగా తగ్గిపోతుంది. ఎందుకని? అందరికీ కామన్‌గా దహనక్రియలు, కామన్‌గా దినవారాలు, అందరి అస్థికలూ, ఒకటేసారి గంగలో కలపడం,ఆతరువాత ఆ ఫోటోలకు జీవితాంతం జరిపే పూజల ఖర్చు కామన్- ఇలా ఎంత లాభమో చూడండి..."

ఓక్షణం అంతా నిశ్శబ్దం అలుముకుంది. ఆ తరువాత ఎవరికి వాళ్ళు పక్కవాళ్ళతో తర్కించుకోవడం ప్రారంభమయింది.

"మీరు చెప్పింది చాలా బావుంది అన్నయ్యగారు!" అంది రాజేశ్వరి ఆడాళ్ళతరపున.

"అవును-" అన్నారు మిగతావారు.

"మీరేమంటారండి" అంటూ బట్టతలనడిగాడు శాయీరామ్

"గాడిదగుడ్డంటాను." మండిపడుతూ అన్నరాయన.

"అదేమిటి?"

"లేకపోతే ఏమిటయ్యా, నాక్కావలసింది మీ బోడి సంఘసంస్కరణలు కాదు. కిర్సనాయిలు ఇప్పుడు ఇస్తారా, ఇవ్వరా, అంతే, ఒక్కటే జవాబు కావాలి."

"ఇవ్వకపోతే ఏం జేస్తావ్? అన్నాడు మా కాలనీ యువజన నాయకుడు సంగీతరావు.

"ఏంజేస్తానా?" 'ధూ' అని ఊసి పెళ్ళి చేసుకోకుండా ఇక్కడ నుంచి వెళ్ళిపోతాం."

"వెళ్ళడానికి మీకు కాళ్ళులేవుగా."

"కాళ్ళు లేక పోవడమేమిటి? ఇవి కాళ్ళుకాదూ.?"

"ఇప్పుడున్నాయండీ! 'ధూ' అని ఊసి బయల్దేరాక ఇంక అవెందుకుంచుతాం మేము? అన్నీ విరగ్గొట్టి ఇక్కడే ఓమూల కుప్పపడేస్తాం."

"ఏంట్రా? నా కాళ్ళు విరగ్గొడతావా?" అంటూ అతని మీదకు దూకాడు బట్టతల అంతే, ఆతరువాత ఏం జరిగిందో తెలీదు. కుర్చీలు, బల్లలూ, స్టీలుచెంబులూ, గ్లాసులూ, అన్నీ తుఫాను గాలి కెగిరినట్లు గాలిలోకి ఎగిరిపడేవరకే నాకు గుర్తుంది. అందులో ఒకటి ఏదో ఎగిరివచ్చి బలంగా నా నెత్తికి కొట్టుకోవడంకూడా కొంచెం గుర్తుంది. తిరిగి కళ్ళు విప్పేపటికి మా ఇంట్లో నా గదిలో మంచం కింద పడివున్నాను.

మా ఇంటి సభ్యులందరూ నా చుట్టూ మూగి విచిత్రంగా చూస్తున్నారు. పక్కనే పడివున్న ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పేపర్లో మొదటి పేజీలో "ఇంకో పెళ్ళి కూతురిని తగలేసిన కేసు" అన్న హెడ్డింగ్ ఇంగ్లీషులో కనబడుతోంది. లోపల్నుంచి రేడియోలో- 'కాదుసుమా కలకాదుసుమా' అన్న పాట వినబడుతోంది.

★ ★ ★

ఈ కథ మీకు హాస్యం అందిస్తే అందించవచ్చు!

కానీ ఈ కథ మనదేశంలోని పరిస్థితి చూసి నవ్వాలో ఏడవాలో తెలీక రాసినకథ!

సినిమాల్లో చూద్దామా తాగి తనను చితకతంతున్నా భర్త కాళ్ళు పట్టుకుని వదలని స్త్రీ పాత్రలు- భర్తను మరో స్త్రీకి మనం చూస్తుండగానే త్యాగంచేసి పారేసే పాత్రలు-

బయట చూద్దామా, కట్నలాంఛనాలకోసం- అత్తమామలు, భర్తా పెట్టే బాధలు భరించలేక ఆత్మహత్యలు చేసుకోవడం-లేదా హత్యగావింపబడడం-

ఇవన్నీ అలా వుంచి ఈ పరిస్థితిని ర్రాన్రాను అందరూ చాలా మామూలు విషయాల్లా- కాజువల్‌గా ట్రీట్ చేయడం-ఇది మరీ ప్రమాదకరమయిన పరిస్థితి.

ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే- ఈ కథ త్వరలోనే నిజమైపోవడం ఖాయం! అప్పుడింక కన్నీళ్ళుమిగలవ్! నవ్వూమిగలదు! ✱

# ఎ ట్రెయిన్ ఫ్రమ్ మసులా !




**నాకు** హైదరాబాదు నుంచి బెజవాడకు ట్రాన్స్‌ఫర్ అయింది. బెజవాడ ఆఫీసులో నా పాత మిత్రుడు భగవాన్ కనిపించాడు.

"ఇల్లెక్కడ తీసుకున్నావ్?" అడిగాడు భగవాన్.

"ఎక్కడా తక్కువ అద్దెలో దొరకటంలేదు!" అన్నాను దిగులుగా.

"అన్నట్లు నీకు బందర్లో ఓ ఇల్లుంది ఇదూ?"

"అవును! ఉంటే ఏం లాభం?"

"అక్కడే వుండి రోజూ బెజవాడ ట్రెయిన్‌లోవచ్చి సాయంత్రం వెళ్ళిపోవడం బెస్టు! చాలామంది అదేపని చేస్తుంటారు."

నాకూ ఆ అయిడియా నచ్చింది. వెంటనే బందర్లో సెటిలయిపోయి రైల్వేస్టేషన్ కెళ్ళి సీజన్ టికెట్ తీసుకున్నాను.

మొదటిరోజు పొద్దున్నే స్టేషన్ చేరుకుని రైలెక్కి కూర్చున్నాను. తొమ్మిదిన్నరకల్లా బెజవాడ వెళ్ళిపోవచ్చు. మళ్ళీ సాయంత్రం ఎనిమిదింటికల్లా బందరుచేరుకోవచ్చు. రైల్వే ఇంత అభివృద్ధి చెందటం నాకెంతో ఆనందం కలిగించింది. నా చిన్నప్పుడు బందరు బెజవాడ రైలు విజయవాడ చేరటానికి ఆరుగంటలుపట్టేది. ఇప్పుడు కేవలం మూడేగంటలట! భగవాన్ చెప్పాడు. రైలు కదిలేవేళయేసరికి కారేజ్‌లో సగంవరకు జనం నిండిపోయారు. నిజంగా బస్ ప్రయాణం కంటే రైలు ప్రయాణం ఎంతో సరదాగావుంటుంది. అనేక ఊళ్ళవాళ్ళు కలుసుకోవడం మాట్లాడు కోవడం-

రైలు బందరు స్టేషన్ వదలగానే ప్రయాణీకులు అర్జంటుగా రాజకీయాలు మాట్లాడేసు కోసాగారు.

"ఎన్టీఆర్ మనకు చేసిందేమిటీ? అని నేను కొశ్చెన్ చేస్తున్నాను! తెలుగు ప్రజల ఆత్మగౌరవం తగలబడిపోతోందహోఅని కన్నీరుకార్చాడు- మరి మద్రాస్ నుంచి ఓ తమిళుడిని తీసుకొచ్చి తనకు కార్యదర్శిగా నియమించుకున్నప్పుడు తెలుగువాళ్ళ ఆ ఆత్మగౌరవంఏమయింది? అన్నేనుకొశ్చెన్ చేస్తున్నా! అంతేకాదు, కిలోరెండు రూపాయల బియ్యంఏవి? ఎవరిస్తున్నారు అని కూడా నేను కొశ్చెన్ చేస్తున్నాను."

ఆ గురుడి ఉపన్యాసం ఎంతవరకూ కొనసాగేదోగాని ఈలోగా ఆ కారేజిలోకి ఓ వర్తక శిఖామణి వచ్చివేలంపాట ప్రారంభిచేసరికి అతను చప్పబడిపోయాడు.

"ఈ అద్భుతమైన సూపర్ డీలక్స్ స్టీలుగిన్నె, ఈ దంతపు దువ్వెనా కలసికేవలం అర్థరూపాయి మాత్రమేనండీ. ఒకటోసారి రెండోసారి- డెబ్బయిఆరురూపాయల స్టీలు గిన్నె, పధ్నాలుగు రూపాయల దువ్వెన కలసి కేవలం అర్ధరూపాయి మాత్రమేనండీ."

అంతకుముందే కారేజిలోకి వచ్చి కూర్చున్న అతని అసిస్టెంటే కాబోలు, వాటిని బాగా పరీక్షించి 'అయిదు రూపాయలు' అన్నాడు.

సరే ఈతతంగం తెలిసిందే కాబట్టి నవల తెరిచి చదువుకోనసాగాను.

కాసేపటి తర్వాత చూస్తే రైలు ఏదో స్టేషన్‌లో ఆగిపోయివుంది.క్రాసింగట. అరగంట తర్వాత బయల్దేరింది మళ్ళీ. రెండో స్టేషన్‌లో మళ్ళీ ఆగిపోయి కదల్లేదు.

"ఎందుకిక్కడ ఆగిపోయింది మన బండి" పక్కనున్నతన్ని అడిగాను.

"స్టేషన్‌లో పాలవాళ్ళు పాలు తక్కువ పోశారట. గొడవ జరుగుతోంది" అన్నాడు తాపీగా.

అదేమిటో చూద్దామని రైలుదిగి గొడవ జరుగుతున్నచోట కెళ్ళాను.

టికెట్ కలెక్టర్ కాబోలు పాలకాన్ల దగ్గర నిలబడ్డాడు.

"అదికాదండీ. మొన్న తక్కువపోశారు. సరేనన్లేప్పి, పట్టించుకోలేదు. చూడండి! ఇవాళకూడా ఈ గిన్నెలో సగానికి పోశారు. ఇది కావాలని చేయటం కాదంటారా?"

కోపంగా అన్నాడతను మరో పాలు అమ్మే పెద్దమనిషితో.

పెద్దమనిషి పక్క తిరిగి తక్కువపాలు పోసిన ఇద్దరినీ తగులుకున్నాడు.

"ఎందుకొచ్చిన గొడవరావుడూ! లెక్క ప్రకారం స్టేషనోళ్ళకి పోసేయకూడదూ?"

రావుడు తిరగబడ్డాడు.

"గొడ్లు రెండు ఎండిపోయినయ్! అందుకని తగ్గించాను. అయినా గాని ఊరికే బేవర్సుగా వచ్చేపాలు- కొంచెం తగ్గితేనేం?" పౌరుషంగా అన్నాడురావుడు.

"ఏటి? బేవార్సుగా పోస్తున్నావా?" కోపంగా అడిగాడు టి. సి.

"అవును! మేమందరం బేవర్సుగా పోయకపోతే మీ రైలోళ్ళు ఏ రోజయినా డబ్బెట్టికొన్నారా?"

"ఎవడికోసం పోస్తారయ్యా? మీరు వదిరూపాయలు పాలు ఊరికేపోసి వందరూపాయలు లాభం మాదగ్గర్నుంచీ దొబ్బుతున్నారు.'

"మీలాటోళ్ళుంటే లాభాలు గాడిదగుడ్డొస్తాయ్."

గుంపుని నెట్టుకుంటూ స్టేషన్‌మాస్టర్‌లోపలకు జొరబడ్డాడు.

"ఏమిటయ్యా గొడవ! బండికి ఆలస్యం అయిపోతుంది" అన్నాడాయన మందలింపుగా

"ఆ టికెట్ కలెక్టర్ని పాలడబ్బాలు వదలమనండి-వెళ్ళిపోతాం! మాదేం ఆలస్యంవుంది?" అన్నాడు రావుడు.

"వదిలేయవయ్యా ఎందుకొచ్చిన గొడవ?" విసుకున్నాడు స్టేషన్ మాస్టర్.

"మీ కోటా పాలు మీకువచ్చేశాయి గనుక మీరు వదలమంటారండీ! అనకేంజేస్తారు?" కోపంగా అన్నాడు టి. సి.

ఆ మాటతో స్టేషన్‌మాస్టార్ కింకేమనాలో తెలీలేదు.

"సరే-ఈరోజుకి పోనీ! రేపు సంగతి చుద్దాం" అన్నాడు రాజీధోరణిలో

"ఎలా పోనిస్తా నండి! మా చంటిదానికి పాలు పట్టించాలా? మా పెద్దాడికి పాలివ్వాలా, పెరుగు తోడెయ్యాలా-మా ఆవిడా, నేనూ తాగాలా? ఎట్టాసరిపోతాయి ఇంతమందికీ పాలు? మీకు తెలుసో తెలీదో-రెండ్రోజుల్నుంచీ జేబులో డబ్బెట్టి పావులీటరుపాలు కొంటున్నాను.

నా సర్వీసులో ఎప్పుడూకొన్లేదు. ఈ స్టేషన్లో మొట్టమొదటిసారి కొన్నానండీ! కాష్ పెట్టి పాలుకొన్నాను. ఛూ వెధవ స్టేషన్!" కన్నీళ్ళ పర్యంతం అయిందా టి. సి. కి, డబ్బు సంగతి తల్చుకోగానే.

ఈలోగా గార్డూ, డ్రయివరూ కూడా వచ్చి చేరారక్కడ.

"ఏమయింది?" అడిగాడు గార్డు.

స్టేషన్‌మాస్టరు కథంతా చెప్పాడుగార్డుకి.

"అయితే వీళ్ళ గొడవమూలాన బండి ఎంతసేపు ఆపుతాం? స్టార్ట్‌చేసేస్తాను" అన్నాడు గార్డు.

"ఎట్టా స్టార్ట్‌చేస్తావయ్యా!" నీ జగ్గులోపాలు పోయించుకోలేదా?" అడిగాడు పాలతను కోపంగా.

"పోయించుకుంటే గంటసేపు ఆపమంటే ఎలా? ఏదో ఓ అరగంటంటే ఫర్లేదుగానీ! అవతల మా ఆఫీసర్లుకూడా మమ్మల్ని అడుగుతారు కదా?" అన్నాడు డ్రైవరు గార్డుని సపోర్టు చేస్తూ.

దాంతో పాలతను మరీరెచ్చిపోయాడు.

"ఏటీ? మీ ఆఫీసరా? ఏం? మొన్న మీ ఆఫీసరుగారమ్మాయి పెళ్ళికి మా పాల వాళ్ళందరం కలసి ఫ్రీగా పాలుపోయలేదూ? బెజవాడలో ఏ ఆఫీసరింట్లో ఏం జరిగినా మాకేగానష్టం? మరింకా ఏ మొఖం పెట్టుకుని బెదిరిస్తావయ్యా మమ్మల్ని?"

ఆ జవాబుతో గార్డు డ్రైవరూ వెళ్ళిపోయారు-

నేను టైమ్ చూసుకున్నాను. అరగంటైపోయింది, అప్పటికి! ఇక లాభం లేదని నేనే కలుగజేసుకున్నాను.

"ఇదిగో చూడండి టి.సిగారూ! అయిందేదో అయింది! ఇక రైలుని వదిలేస్తే మేము బెజవాడలో ఆఫీసుకెళ్ళాలి!" అన్నాను బ్రతిమాలుతో

"ముందు మీ టికెట్ చూపించండి!" అన్నాడు టి.సి కోపంగా.

నేను సీజన్ టికెట్ తీసి చూపించాను.

ఫోటోవంక- నావంక రెండు నిమిషాలు పరీక్షగా చూసి టికెట్ నాకిచ్చేశాడు మళ్ళీ.

మొత్తంరైల్లోని జనంఅంతా వచ్చిచేరారప్పటికి!

"ఇదిగో చూడు బాబూ! నువ్వన్నా ఆయనక్కొంచెం పాలుపోయవయ్యా! మాకు టైమవుతోంది! అన్నాడు మరో ప్రయాణీకుడు పాలతనిని బ్రతిమాల్తూ.

"ఎందుకు పోయాలండీ? అతని గేదెలు రెండు ఎండిపోయ్యాయట? ఎలా పోస్తాడు?"ఇంకో పాలతను రావుడిని సమర్థిస్తూ మాట్లాడాడు.

ప్రయాణికులు అందరూ కలిసి పాలతనినీ, టి.సి.నీ బ్రతిమాలి రైలు స్టార్ట్ చేయడానికి వప్పించారు.

అందరం 'హమ్మయ్య' అనుకుని రైలెక్కాం. బిచ్చగాడు, ఓచిన్నపిల్లా పాట అందుకున్నారు. ప్రయాణీకులు "శ్రోతలు కోరిన రికార్డులు" పాడిస్తున్నారు, వరుసగా! రైలు మళ్ళీ బయలుదేరింది.

పాతకోటు, భుజానపెట్టెతగిలించుకున్న వ్యక్తి మా కారేజ్‌లో కొచ్చాడు.

"పట్నంలో పళ్ళడాక్టర్లకి ఇరవైలు, ముప్పయ్‌లు ఖర్చుపెడతారుసార్! అంత డబ్బు వృధాచేయకండి.కేవలం రెండురూపాయలు అరవైపైసలకే మీ పళ్ళుపీకించుకోండి! నాలుగు పళ్ళుపీకించుకున్న వారికి కన్సెషన్! గొప్ప దీపావళి బంపర్‌ఆఫర్! నాలుగు పళ్ళూ కేవలం ఏడు రూపాయలే! ఆరు పళ్ళు పీకించుకున్నవారికి దువ్వెన ఉచితం! గొప్ప దీపావళి బంపర్ ఆఫర్ సార్. ఎవరికండీ పన్నుపీకాలి? మాష్టారూ! ఈ అద్భుతమైన అవకాశం జారవిడుచుకోకండి! నేను మళ్ళీనెలరోజులవరకూ ఈ లైన్ మీదకు రానండీ! వైజాగ్‌లైన్ కెళ్ళిపోతున్నాను" కారేజంతా నాలుగురౌండ్లుకొట్టాక మా పక్క కంపార్టుమెంటులోనే ఓ కేస్‌బుక్‌చేశాడతను.

"ఏ పన్నండీ బాబూ?"

"ఇదిగో ఇది...."

"ఆహహా! పూర్తిగా చెడిపోయిందండీ!పాపం మీరు ఎంత బాధపడుతున్నారో."

"అవును తెగ బాధగా ఉందనుకో!"

"మరిదాని పక్కదాని మాటేమిటి? అదీ పాడయిపోయిందికదా?"

"అబ్బే! దాని బాదేంలేదు."

"లేకపోయినా ఇప్పుడే లాగేయటం మంచిదండీ! నేను మళ్ళీ నెలరోజుల దాకారానిటు. రేటుకూడా కొంచెం తగ్గిస్తాను."

"వద్దయ్యా దాన్నేంచేయకు"

"సరే! ఆ, మాష్టారూ! మీ నలుగురూ ఇతనిని గట్టిగా కదలకుండా పట్టుకోండి సార్! ఈ రోగిని కదలకుండా పట్టుకుని, మాధవసేవ చేయండి బాబూ! ఎంతసేపో అక్కరలేదు. అయిదు నిమిషాలుచాలు ఆపరేషన్ చేసేస్తాను."

ఆచుట్టు పక్కలున్నాళ్ళందరూ కలిసి ఆ వ్యక్తిని గట్టిగా పట్టుకున్నారు. మరోక్షణంలో ఆపరేషన్ ప్రారంభమయింది.

"అబ్బా-బాబోయ్-నాయనోయ్-నన్నువదలండ్రో-వ్వవ్వవ్వవ్వవ్వవ్వ-"ప్రాణం పోతున్నట్లుకేకలు వేస్తున్నాడా రోగి.

"ఇంకో నలుగురు పుణ్యాత్ములు వచ్చి ఇంకా గట్టిగా పట్టుకోండి సార్! మానవసేవే మాధవసేవ సార్ ! కేవలం రెండూ అరవైకే  పన్ను ఎందుకు పీకుతున్నాను? మానవసేవే మాధవసేవ సార్!"

నా పక్కనున్న మరో నలుగురయిదుగురు కూడా వెళ్ళి ఆ వ్యక్తిమీదపడి శరీరం,నోరు, తలా కదలకుండానొక్కిపట్టారు.!

మళ్ళీ ఆపరేషన్ రెండో ఘట్టం ప్రారంభమయింది.

మళ్ళీ కేకలు.

"వావోయ్ వావోయ్- వ్వా-వ్వా-వ్వా- అవ్వా- అవ్వా."

"అబ్బ! రక్తం చిమ్ముతోంది" అందో గొంతు.

"ఏవయ్యా-ఏమిటది, రక్తం పిచికారీ కొట్టినట్లు కొడుతోంది?"

"పన్నులో చేవ ఎక్కువుందన్నమాటండీ! అంటే వీళ్ళు వంశమంతా బాగా చేవవున్న మనుషులన్న మాటండీ!! మా గట్టి దంతవరుస! సర్వీసులో ఇంతజబర్దస్తు దంతం పీకటంఇది మూడోసారిమాత్రమే." రైలు ఆగిందోస్టేషన్లో.

"నా పన్ను  పీకద్దు బాబోయి-నన్నిలా వదిలేయ్ దేవుడోయ్." అంటూ అరుపులు.

"మధ్యలో ఎలా వదుల్తానయ్యా- నన్ను  పన్ను పీకటం చేతకాని వాడనుకుంటారందరు-"

"నేనీ స్టేషన్లో దిగాలయ్యా బాబూ! నన్నొదిలేయండి" తనను పట్టుకుని మీదెక్కి కూర్చున్నవారిని బ్రతిమాలసాగాడతను.

"ఏం ఫర్వాలేదయ్యా! గొడవచేయకు. ఇంకొక్కజర్కు ఇచ్చానంటే  ఠకీమని వూడిపోతుంది."

"రైలు బయల్దేరుతుందయ్యా బాబూ! దిగిపోతాను."

పళ్ళుపీకే వ్యక్తి ఓక్షణం ఆలోచించాడు.

"సరే-నేనిప్పుడే వెళ్ళి ఓ పావుగంటబండి ఆపమని గార్డుగారితో చెప్పివస్తానుండు."

నేనూ నా పక్కనున్న వాళ్ళు అదిరిపడ్డాం.

"ఏమిటి? గార్డుగారితో బండి ఆపమని చెప్తావా?"

"అవునండీ! ఏం ఫరవాలేదు! నేను చెప్తే ఆపేస్తారులెండి! ఒకసారి ఆయన కుక్కకి నేనే పన్ను పీకేశాను! ఒక్క పైసాకూడా తీసుకోలేదు"

"కుక్కకా?" ఒకాయన ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును సాధారణంగా కుక్క పళ్ళు పీకనులే! అయితే ఏదయినా పెద్ద రికమండేషనుంటే పీకేస్తాను! జంతుసేవే మాధవసేవ..."

అతనుగార్డు దగ్గరకెళ్ళి వెంటనే తిరిగొచ్చాడు.

రైలు ఆగిపోయింది.

మళ్ళీ ఆపరేషన్ మూడో ఘట్టం (అంతిమ ఘట్టం) ప్రారంభమయింది.

"ఈసారి ఇంకాకొంచెం గట్టిగా పట్టుకోండి! సార్! మనం కోడి మెడెలా పట్టుకుంటాం? అలా నొక్కి పట్టుకోండి! ఒకే ఒక జర్క్‌తో ఊడిపడాల్సిందే."

అందరూ అతనిని బలవంతంగా పట్టుకుని నొక్కిపట్టారు.

ఒక్కసారిగా అతను పిచ్చికేక వేశాడు.

అతనిని పట్టుకున్నవాళ్ళిద్దరు ఎగిరిపడ్డారు దూరంగా.

"హమ్మయ్య! వచ్చేసింది!" అన్నాడు పళ్ళుపీకే అతను, తన చేతిలో కటింగ్ ప్లేరు మధ్యనున్న పంటిని అందరికీ ఉచితప్రదర్శన ఇస్తూ! కిందపడున్న వ్యక్తి మూలుగుతూ లేచి తనసంచీ తీసుకుని కిందకుదిగాడు. పళ్ళుపీకేవ్యక్తి కూడా ప్లాట్‌ఫారం మీదదిగి గార్డుకి చేయి ఊపగానే బండి మళ్ళీస్టార్టయింది.

అయితే మళ్ళీ పక్క స్టేషన్‌లో ఆగిపోయింది.

"మళ్ళీఏమిటి?" అన్నాడు ఒకతను బయటకు చూస్తూ

"మళ్ళీ ఇంకోరైలు క్రాసింగ్!" అరగంట తర్వాత మళ్ళీబయల్దేరిందిగానీ, కొద్దిదూరం వెళ్ళి మళ్ళీ ఆగిపోయింది.

మరుక్షణంలో అన్ని పెట్టెల్లోకి బిలబిల మంటూ అర్.పి.ఎఫ్.వాళ్ళు, టి.టి.ఇ.లు ఎక్కేశారు.

"టికెట్, టికెట్-" అంటూ నాలుగువేపులున్న తలుపుల దగ్గర అడ్డం నిలబడి అందరి టికెట్లూ చెకింగ్ చేయసాగారు.

"ఇక్కడ చెక్కింగేమిటి?" అడిగాను పక్కనున్నతనిని.

"స్క్వాడోళ్ళు వచ్చారండీ! స్పెషల్ చెక్ అన్నమాట!"

మాకారేజ్‌లోనే సగంమందికి పైగా టికెట్‌లు లేకపోవడం చూసేసరికి నాకు ఆశ్చర్యం కలిగింది.

అందరినీ పక్కస్టేషన్‌లో దింపారు.

పావుగంట గడిచినా రైలు మళ్ళీ కదలకపోయేసరికి నేనూ మిగతావాళ్ళూ కిందకు దిగాము.

స్టేషన్‌మాస్టర్ ఆఫీసు బయట టికెట్ లేనివాళ్ళ గుంపునిలబడి ఉన్నారు. వాళ్ళకెదురుగా టి. టి. ఇ.లు, ఆర్.పి.యఫ్. వాళ్ళు నిలబడ్డారు.

"అవునండీ! మీది స్పెషల్ చెకింగ్ స్క్వాడే! వప్పుకుంటాం. కానీ ముందు పాసింజర్లకు చెప్పకుండా ఇలా హఠాత్తుగా చెకింగ్ కొస్తే ఎలా? ఇప్పుడు చూడండి! ఇంతమందిమి టికెట్లు కొనలేదు." అన్నాడు గుంపులో నుంచి ఒక ప్రయాణీకుడు.

"మమ్మల్నేం చేయమంటారండీ? మా ఆఫీసరుగారు 'ఎటాక్' చేయమన్నారు." అన్నాడు ఒక టి.టి.ఇ.

"ఆయనచ్చెప్తారులేవయ్యా? చెప్తే చేసేయటమేనా? మాకు రెండు స్టేషన్లముందే ఇలా మధ్యలో స్పెషల్ చెకింగ్ జరుగుతుందని తెలియజేస్తే మేము టికెట్ కొనుక్కుంటాం అని ఎన్నిసార్లు చెప్పాలి మీకు?" ఇంకో మీసాలాయన దబాయిచాడు.

"మా ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడండయ్యా! మాకేంతెలుసు. అక్కడికీ మేంచెప్తూనే వున్నాం! ముందు చెప్పకుండా ఇలా సడెన్ చెకింగ్ చేస్తే పాసింజెర్స్‌వప్పుకోరు సార్ అని! ఆయన వింటేనా? డి.సి.యస్. ప్రోగ్రాం ఆఖరిక్షణంలో ఇచ్చారు గనుక మనమేం చేయలేము. అన్నారు-" అన్నాడు ఒక టి.టి.ఇ.

"ఏడి మీ ఇన్‌స్పెక్టర్‌ని పిలు. మేము మాట్లాడతాం." అన్నాడు మీసాలరావు.

స్టేషన్‌మాస్టర్ ఆఫీసులో ఇనస్పెక్టర్ నిలబడ్డాడు.

"ఇదిగో చూడండి బాబూ. ఈ ఒక్కసారికి పొరపాటు జరిగింది. మీకు మా స్పెషల్‌చెక్ గురించి ముందే తెలియజేసేంత టైముకూడా లేకపోయింది." అన్నాడు ఇన్‌స్పెక్టర్ వినయంగా.

"అదేంకుదరదండీ, మీ చెకింగ్‌కాన్సిల్ చేసేసుకోండి. కావాలంటే రేపుచెక్ చేసుకోండి వప్పుకుంటాం" అన్నాడు ఇంకోలావుపాటి వ్యక్తి.

"సర్‌ప్రైజ్-చెకింగ్ ఎలా కాన్సిలవుంది? కుదరదుకదా" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఏం ఎందుక్కుదరదు? పెద్ద పెద్ద విజిలెన్స్ చెక్‌లే కాన్సిల్ చేయించాం. మీ చెకింగో పెద్ద లెఖ్ఖేమిటి?" ఇంకెవరో అరచారు.

"అవును! కాన్సిలుచేసి మీరు వెళ్ళిపోవలసిందే." అన్నాడు ఇంకో కుర్రాడు. ఇన్స్పెక్టరూ, టి.టి. ఇ.లూ మొఖమొఖాలు చూసుకున్నారు.

"మేము ముందే చెప్పాంకద్సార్. తెల్లారిలేస్తే మొఖమొఖాలు చూసుకోవాలి. చెప్పకుండా చెకింగ్ చేయడం బాగుండదని" గొణిగాడు ఒక టి.టి. ఇ.

"సరే! పదండి! రేపు చేద్దాం చెకింగ్ ఇక్కడ" అన్నాడు ఇనస్పెక్టర్. ప్రయాణికులంతా ఆనందంగా మళ్ళీ రైలెక్కేశారు.

ఇక టి.టి.ఇ. అందరి దగ్గరకొచ్చి గట్టిగా చెప్పసాగాడు.

"ఇదిగో, రేపు ఇదే బండికి స్పెషల్ చెక్చేస్తున్నారు. ఇక్కడే ఈ స్టేషన్దగ్గరే. కనుక మళ్ళీ చెప్పలేదనకండి."

రైలు కదిలింది. కాని మళ్ళీ ప్లాట్ఫారందాటగానే మళ్ళీ ఆగిపోయింది. బటానీలవాడు బండి ఎక్కడం మిస్ అయాడట.

"అబ్బా, ఇప్పటికే రెండు గంటలులేటయిపోయింది బండి." అన్నాన్నేను. దిగులుగా. నా పక్కనున్నవాళ్ళు నావంక ఆశ్చర్యంగా చూశారు.

"లేటేమిటి?"

"అదే-ఆలస్యం-"అన్నాను.

"ఈ బందరు-బెజవాడ లైనులో అలాంటివేమీ ఎవ్వరూ అడగరు." అన్నాడు ఒకతను. "బండి ఎప్పుడెళ్ళినా రైట్ టైమ్ అనే రాసేసుకుంటారు!"

ఈసారి రైలు బయలుదేరి స్టేషన్రాకుండానే ఆగిపోయింది.

"మళ్ళీ ఏమయింది?" అడిగాను చిరాగ్గా.

అందరూ కిటికీలోనుంచి చూశారు.

కొద్దినిమిషాల తర్వాత డ్రైవర్ నడుస్తూ గార్డుపెట్టివేపు వెళ్ళసాగాడు.

"ఏమయిందిగురూ?" ఎవరో పాసింజర్ అడిగాడుడ్రైవర్ని.

"ఎవరో గొలుసులాగారు-" అంటూ వెళ్ళిమళ్ళీ పది నిమిషాల తర్వాత తిరిగి వచ్చాడు.

"ఎవరులాగారు?" అడిగాడు పాసిజంరు మళ్ళీ.

"గార్డు వాక్యూమ్ వేశాడు" అంటూనే వెళ్ళిపోసాగాడతను.

"ఎందుకు?"

డ్రైవరు జవాబు చెప్పలేదు.

మరో రెండు నిమిషాల్లో బండి స్టార్టయింది. గానీ మళ్ళీవెంటనే ఆగిపోయింది

"మళ్ళీ ఏమయింది?" అడిగాడు ఇంకోపాసింజెరు వళ్ళు మండిపోతుంటే. అందరూ కిందకుదిగి డ్రైవరుతోపాటు చివరివరకూ నడిచివెళ్ళారు.

పదినిమిషాల తర్వాత తిరిగి వచ్చారు.

"ఏంజరిగింది?" అడిగాను

"గార్డుమందుకొట్టేశాడు. అందుకని మాట్లాడితే వాక్యూమ్ వేస్తున్నాడు" అన్నాడు ఒకతను.

"అదేమిటి! ఎందుకలా బండిఆపటం?"

"ఆగార్డంతే సార్! మందుకొడితే చాలు- వాక్యూమ్ వేసేస్తుంటాడు."

"అసలు డ్యూటీలో మందుకొట్టటమేమిటి?" ఆశ్చర్యంగా అడిగాను.

"ఛ ఛ! ఆయన మంచాడుసార్! ఎప్పుడూ కొట్టడు. ఇవాళ వాళ్ళ పండగట! అందుకని కొట్టేస్తున్నాడు."

రైలు మళ్ళీ బయలుదేరి పక్క స్టేషన్‌లో ఆగిపోయింది.

ఓ ముసలాడు కోతితోసహా మా కారేజ్ ఎదురుగా ప్లాట్‌ఫారం మీద దుకాణం పెట్టాడు.

"అయ్యగార్లకు దణ్ణంపెట్టు" అన్నాడు. కోతి స్టేషన్‌మాస్టరుకీ, బఠానీలవాడికీ నమస్కారం పెట్టింది.

అదిచూసి ప్రయాణికులు చాలామంది రైలుదిగి దాని చుట్టూ మూగారు.

"డ్రైవర్‌సాబ్‌కి సలాంపెట్టు!"

కోతి డ్రైవరుకి సలాం చేసింది.

"ఆఫీసర్లు లంచం ఎలా తీసుకుంటారు?"

కోతి వీపువెనుకచేయి చాచింది.

అందరూ ఘెల్లుమన్నారు.

"జయమాలిని డాన్స్ చేస్తుంటే ఎలా చూస్తావ్?

కోతి నాలుక బయటపెట్టి గుడ్లు మిటకరించింది. ఎగురుతూ యాక్షన్‌చేసింది.

"హఠాత్తుగా మీ ఆవిడవస్తే ఎలా చూస్తావ్?"

కోతి కళ్ళు మూసుకుని నీరసంగా కూలబడింది.

గార్డుతూలుతూ వచ్చాడక్కడికి.

"గార్డుసాబ్‌కి సలాం పెట్టు!"

కోతిగార్డుకి సలాం చేసింది.

"భార్యకు తెలీకుండా సెకండ్ షో కెళ్ళి ఇల్లు ఎలా చేరుకుంటావ్?

కోతి దొంగలా నక్కి నక్కి నడిచింది.

నేను స్టేషన్ మాస్టరు దగ్గరకెళ్ళాను.

"ఆ కోతి ఆట అయ్యేవరకూ రైలు కదలదాసార్?"

"ఏమోమరి! వాడు కోతిని చాలా రోజుల్తర్వాత తీసుకొచ్చాడు సెక్షన్‌లోకి" అన్నాడాయన కోతిని ఆనందంగా చూస్తూ.

"నేనడిగేది రైలు సంగతి!"

"నేననేది కోతి సంగతి! వండర్‌ఫుల్ ఫీట్స్‌చేస్తోంది చూశారా?"

"ఈ రైలు ఇంక బయలుదేరదా?" కోపంగా అరిచాను.

"ఎందుకు బయలుదేరదు?"

"బయలుదేరుతుందని తెలుసండీ! ఏతారీఖు?" ఆయన కాలెండర్ చూశాడు.

"ఇవాళ్ళే-ఇప్పుడే"

"మరి కదలదేం?"

"గార్డూ, డ్రైవరూ టీ తాగి ఇప్పుడేగా వెళ్తోంది?"

నేను గార్డు, డ్రైవర్లకోసం చూశాను.

అప్పుడే బయలుదేరివెళ్తున్నారు వాళ్ళు.

మరో అయిదు నిమిషాల తర్వాత రైలు కదలింది.

అయితే ప్లాట్ఫారం దాటకుండానే మళ్ళీ ఆగిపోయింది. నేను, నా పక్కనున్నవారూ దిగి కారణమేమిటా అని చూశాము.

డ్రైవరుదిగి వస్తూ కనిపించాడు.

"ఏమయింది!" అడిగాను

"ఇంకేముంది! గార్డుమళ్ళీ వాక్యూమ్ వేశాడు."

అందరం కలసిగార్డు దగ్గరకెళ్ళాం.

"అరె!వద్దంటే వాక్యూమ్ వేస్తావెందుకయ్యా?" అడిగాడు డ్రైవర్ కోపంగా.

"షారీ! అయామ్ షారీ"

"ఇదిగో గార్డుగారూ! ఇప్పటికే బోలెడాలీశెం అయిపోయిందయ్యా! ఇంక బండి ఆపకు. పాలు పాడయిపోతాయి" అన్నారు పాలవాళ్ళు.

"నేనాపను. ఆపమన్నాఆపణు. కావాలంటే షూడండి- ఆపణు" అందరం మళ్ళీ రైలెక్కాం.

రైలుకదిలింది.

"ఇంకెన్ని స్టేషన్లున్నాయ్" దిగులుగా అడిగాను.

"ఇంకెన్నండీ, రెండే."

'హమ్మయ్యా' అనుకున్నాను. కనీసం ఆఫీసుకి మధ్యాహ్నం నుంచయినా వెళ్ళవచ్చు.

కారేజ్‌లో మరో గిరజాల జుట్టు ఎక్కింది.

"ఎవరికండీ మాష్టారూ-చెవిలో గుబులులాగేస్తాం? కేవలం రెండుచెవుల్లో గుబులుకి అర్ధరూపాయ్ మాత్రమే చార్జీఅండీ! గుబుల్ గుబుల్‌గా గుండెలు దడగా- ఎవరకండీ మాష్టారూ గుబులూ -నలుగురుకలసి గుబులుతీయించుకుంటే కీచైన్ ఉచితంసార్."

అప్పటికప్పుడే రెండు కేసులుదొరికాయి అతనికి. వాళ్ళిద్దరిచుట్టూ జనం మూగిపోయారు.

తీరా రైలు రెండు ఫర్లాంగులు వెళ్ళిందోలేదో మళ్ళీ ఆగిపోయింది.

"సందేహంలేదు-గార్డు పనే మళ్ళీ" అన్నారు మా బోగీలో ఉన్నవాళ్ళు. అందరం కలసి గార్డు దగ్గరకెళాం.

"ఏమిటయ్యా గార్డుగారూ ఇది? అవతల పదకొండయిపోతోంది. మా పాలు పాడయి పోతాయి అని చెప్తుంటే వినకుండాబండి ఆపేస్తావేమిటి?"

గార్డు నవ్వాడు.

"శేపోతే ఆవెంకట్రావ్ నాకేం ఫవర్‌లేదంటాడా?? రాస్కెల్! నా ఫవరేంటో ఇవాళ షూపిస్తా! అడుగడుక్కీబండి ఆపేష్తా"

"బాబోయ్! వద్దయ్యా స్వామీ, నీకు దణ్ణంపెడతాం! బండి ఆపకు."

"అయితే మరి వెంకట్రావ్ ఆకూత ఎందుక్కూషాడు-"

"ఆ వెంకట్రావ్ పని మేము చెప్తాం కదా! తమరు బండి ఆపకండి"

"షరే!"

రైలు మళ్ళీకదిలి మరికాస్త దూరంనాడిచి ఆగిపోయింది.

అందరం మళ్ళాగార్డు దగ్గరకెళ్ళాం.

"మళ్ళీ ఏమొచ్చిందయ్యా మగడా!"

"అవెంకట్రావుగాడు లేడూ? ఆడు నన్ను 'బూష్' అని తిట్నాడు" రెండుచేతుల్తో తలపట్టుకుని దిగాలుగా అన్నాడు గార్డు.

"ఆడిపని మేము చూస్తాంలేవయ్యా! బండి ఆపకు."

"నిజంగా ఆడి భరతం పడతారా?"

"పడతాం సార్!"

"మరి వాడినికూడా బూష్ అని తిడతారా?"

"తప్పకుండా తిడతాం!"

"ఏమని తిడతారు?"

"బూష్ అనే తిడతాం!"

"బూష్ కాదు? బూష్ అని తిట్టాలి"

"బూష్ అనే తిడతాం లేవయ్యా బండి పోనీ! జండా చూపించు!"

"బూష్‌కాదని షెప్తుంటే వినరేం?"

"మరేమని తిట్టాలి?"

"బూష్!"

"సరే! అలాగే తిడతాంలే నాయనా!"

"ఏమని తిడతారు?"

"అదే బూష్ అని చెప్పావుగా?"

"బూష్ కాదు."

"మరి"

"బూష్-బూష్-"

"బూష్ బూష్" అన్నాడు పాలవాడు.

"బూష్ కాదహో!"

నేను కల్పించుకున్నాను.

"బ్రూట్ అని తిట్టాలి! అంతేగదా?"

"ఆ! అది! బూష్!"

"సరే తిడతాంలెండి! జెండా చూపించండి!"

"నేను షూపించను-"

"అదేవిటి? వెంకట్రావ్‌ని మేము తిడతామన్నాంగా?"

"వాడిని నేనే తిట్టాలి."

ఈలోగా మీసాలాయన దిగివచ్చాడు "ఒరేయ్ ఇక లాభంలేదు గానీ బఠానీల వాడిని పిలవండి" అన్నాడు పరిస్థితి ఆకళింపు చేసుకుని.

"బఠానీల వాడెందుకు?" అడిగాను ఆశ్చర్యంగా.

"వాడొక్కడికే గార్డు ఉద్యోగం, ఇంజన్ డ్రైవ్‌చేయటం తెలుసు. ఇంకెవ్వరికీ తెలీదు!"

కొంతమందివెళ్ళి బఠానీలవాడిని పట్టుకొచ్చారు.

"ఒరేయ్‌సోమిగా! ఈ గార్డుని మేము పక్కపెట్లోకి తీసుకుళ్తాంగానీ,కొంచెంగార్డు ఉద్యోగం చేయ్, బండిలేటయిపోతోంది." అన్నాడు మీసాలాయన.

అందరూ కలసి గార్డుని బళవంతంగా పక్కపెట్లోకి లాక్కెళ్ళిపోయారు. బఠానీలవాడు గార్డు పెట్టెక్కి, బ్రేక్‌వీల్ వెనక్కు తిప్పి, వాక్యూమ్ ఎగ్జాస్ట్ చేసి "కయ్" న విజిల్ కొట్టి పచ్చజెండా చూపించాడు.

రైలు ఈసారి హాయిగా రామవరప్పాడువరకూ శుభ్రంగా నడిచింది.

టైము చూచుకున్నాను.

ఒంటిగంట! బండి పావుగంటయినా కదలకపోయేసరికి మళ్ళీ అందరం బఠానీలవాడి దగ్గరకెళ్ళాం.

ఇంక మధ్యాహ్నం ఆఫీస్ కెళ్ళాలంటే సరిగ్గా అరగంట టైముంది.

"ఏమయింది?" అడిగారువాడిని.

"ఇంజన్లో ఎవరో సేఫ్టీ ఆఫీసరొచ్చారంట సార్! నేను జెండా చూపించకూడదని పట్టుబడు తున్నారు." అందరూ మళ్ళీ ఇంజన్ దగ్గరకెళ్ళి సేఫ్టీ ఆఫీసర్ని- డ్రైవర్ని బ్రతిమాలారు. "మీ ఇన్‌స్పెక్షన్ రిపోర్ట్‌లో గార్డు పనిచేస్తున్నట్లే రాసుకొండిసార్! మాకిప్పటికే ఆలస్యం అయిపోయింది"

మళ్ళీ కదిలింది రైలు.

స్టేషన్ వచ్చేసింది.

అయిదు నిమిషాలు గడిచింది. ఆ తరువాత పదినిమిషాలు, పావుగంటకూడా అయిపోయింది. బండికదలటంలేదు.

మళ్ళీ అందరం దిగి స్టేషన్ దగ్గరకు వెళ్ళాం.

టికెట్ కలెక్టరూ, బుకింగ్ క్లర్కూ కలిసి ఓగుంపుతో పోట్లాడుతున్నారు.

"వీల్లేదయ్యా! బస్తాకి రెండ్రూపాయలు ఇవ్వాల్సిందే. లేకపోతే మిమ్మల్ని వదిలేది లేదు-"

"బియ్యం మేమిక్కడదింపటంలేదు సార్. బెజవాడ తీసుకెళ్తున్నాం ఇంక మీకెందుకు మామూలివ్వాలి?"

"ఇంతకాలం ఇక్కడ దింపి- ఇవాల్టినుంచి బెజవాడ తీసుకెళతారా? వీల్లేదు. ఇక్కడ దింపాల్సిందే." పట్టుపట్టారు బుకింగ్ క్లర్క్, టి.సి.లు.

"మీరు బస్తాకి రెండురూపాయలు అడుగుతోంటే ఇక్కడెందుకు దించాలండీ."

"బెజవాడలో ఎంత ఇస్తున్నారు?"

"రైల్వే పోలీస్‌కి రూపాయ్ మిగతా స్టాఫ్‌కి అర్ధరూపాయి."

"ఓహో! అర్ధరూపాయి లాభం కొడుతున్నారన్నమాట. అందుకని మా నోట్లో మొత్తానికే మన్నుకొడతారా?"

"మీరు మరి రూపాయిన్నారకు వప్పుకోకపోతే మేమేం చేయంసార్?"

మీసాలాయన మళ్ళీ కల్పించుకున్నాడు.

"ఇదిగో బాబూ! బండి ఆపేసి లావాదేవీలేమిటయ్యా? మాకు అవతల లేటవుతోంది."

"లేకపోతే చూడండి సార్! బియ్యం బస్తాలన్నీ బెజవాడ తీసుకెళతామంటున్నారు. రోజూ వచ్చే మామూలు మాకిదొక్కటే గద్సార్. ఇదికూడా లేకపోతే మేమేం తినాలి?"

మీసాలయన బియ్యంవాళ్ళను కోపడ్డాడు.

"ఇదిగో రంగనాయకులూ! నువ్వుకూడా తొందరపడితే ఎట్టా? ఆ టి.సి.గారు, బుకింగ్ క్లర్క్‌గారు పరాయివాళ్ళేంకాదుగదా? ఏదో రెండు డబ్బులు అటూఇటయినా ఇక్కడే దించుకోండి." ఈలోగా స్టేషన్ పోర్టర్ ఓముసలాడినీ రెండు మేకల్ని పట్టుకొచ్చాడు.

"సార్! ఈ మేకల్ని పాసింజర్ కంపార్ట్‌మెంట్‌లో తీసుకెళ్తున్నాడుసార్."

"ఏరా! వాటిని బుక్ చేసి గార్డుపెట్టెలో తీసుకెళ్ళాలి కదా?" అన్నాడు బుకింగ్ క్లర్క్.

"పొరపాటయిపోయిందండీ."

నేను ఇంక లాభంలేదని అక్కడేదిగిపోయి రిక్షాలో ఆఫీస్ చేరుకున్నాను.

"ఏమిట్రా! ఇప్పుడొచ్చావ్?" భగవాన్ అడిగాడు.

"చాలా మంది బందరువాళ్ళు రోజూపొద్దున్న బెజవాడకు రైల్లో వచ్చి ఉద్యోగంచేసి మళ్ళీ సాయంత్రం బందరు వెళ్ళిపోతారని చెప్పావ్ గదా! ఆరైలు ఇప్పటికి చేర్చిందిక్కడికి." అన్నాను కోపంగా.

"కొత్తలో ఇలాగే ఉంటుందిలే. రాన్రాను అలవాటయిపోతుంది" అన్నాడు భగవాన్.

"కాని బస్‌లో గంటన్నర ప్రయాణం రైల్లో ఇన్ని గంటలా?"

"తప్పదు మరి. పైసా ఖర్చులేకుండా బెజవాడ రావాలంటే అదొక్కటే మార్గం."

"పైసా ఖర్చులేకుండానా అదేమిటి? సీజన్ టికెట్ ఉందికదా!"

"అద్గదీ! అందుకే నీకింత చిరాకనిపించింది" నవ్వుతూ అన్నాడు భగవాన్ "ఈ రైల్లో ఎవడూ టికెట్ కొనడు-"



# క్రికెట్ ! క్రికెట్ !



"సార్! ఆఫీసరు గారు పిలుస్తున్నారు" ప్యూన్ తాపీగావచ్చి చెప్పాడు. వెంటనే ఆయనరూమ్‌లోకి పరిగెత్తాను. ఆయన న్యూస్ పేపర్లో స్పోర్ట్సుకాలమ్ చదువుతున్నాడు.

"రాక్షస్ అండ్ రాక్షస్ కంపెనీ ఫైలు రెడీ అయిందా?"

"ఇంకా లేదండీ. నోట్ రాస్తున్నాను."

"త్వరగాకానీ అరె! వెస్టిండీస్ వస్తున్నారే" హుషారుగా అన్నాడతను.

నేను వెనక్కు తిరిగి చూచాను- ఎవరొస్తున్నారా అని.

"ఎవరూలేరు కదండి."

ఆయన చిరాకుగా నావైపు చూశాడు.

"ఏమిటెవరూ లేరు?"

"అదే! ఎవరో వస్తున్నారని అంటున్నారుకదా"

"నేననేది వెస్టిండీస్ సంగతయ్యా!ఇదే! వచ్చేవారం నుంచే టెస్ట్ మొదలవుతుంది."

నాకింకా అయోమయం అయిపోయింది. ఆయనమాటలేమాత్రం అర్ధంకావడంలేదు. అయినా నాకు ఇంకా తెలీనట్లు మాట్లాడితే బావుండదని.

"ఓహో! మీరనేది వెస్టిండీస్ సంగతా! అవునండీ! అవును." అన్నాను తడబడుతూ

"లాయిడ్ స్టేట్‌మెంట్ చూశావా?"

నాకు మళ్ళీ అర్ధంకాలేదు. మా ఆఫీస్‌కి సంబంధించిన యాన్యువల్‌స్టేట్‌మెంట్ మాత్రం నేను తయారుచేస్తుంటాను. కానీమరి ఈ లాయిడ్ స్టేట్‌మెంటేమిటో... "స్టేట్‌మెంట్ మొన్నేహెడ్డాఫీసుకి పంపించాంకదండీ?"

"నేననేది లాయిడ్ స్టేట్‌మెంటయ్యా! లాయిడ్ స్టేట్‌మెంటిచ్చాడు."

"ఏమోసార్! నాకు మాత్రం ఇవ్వలేదు. ఒకవేళ హెడ్‌క్లర్క్ గారికిచ్చాడేమో కనుక్కుంటాను." ఆయన నన్నోపురుగుని చూసినట్లు చూశాడు-

"యూకెన్‌గో! నీకు క్రికెట్ గురించి ఏమీ తెలిసినట్లు లేదు!" అన్నాడాయన-చూపుమార్చి నన్నో వింత జంతువుని చూసినట్లు చూస్తూ. నాగుండెల్లోరాయిపడింది! ఎందుకంటేనాకు క్రికెట్ ఆట గురించి అస్సలుతెలీదు. నేను స్కూలు ఫైనల్‌వరకూ చదివిన మా కైకలూర్లో ఎవ్వరూ క్రికెట్ ఆడేవారుకాదు. దాన్నిగురించి మాట్లాడేవారుకాదు. క్రికెట్ అంటే అటూఇటూ మూడుకర్రలు పాతటం, ఒకడు రాయిలాంటి బంతితోదాన్ని పడగొట్ట బోతుంటే ఇంకొకడు బ్యాటు తీసుకుని, ఆకర్రల్ని రక్షించడం-అని నా ఉద్దేశ్యం! ఇటీవల పాకిస్తాన్‌తో మనవాళ్ళు క్రికెట్ ఆడినప్పుడుమాత్రం నేను నిజంగా నరకం అనుభవించాను. ఆఫీసులోనూ, బయటా, ఇంటి చుట్టూ ఎక్కడ చూసినా క్రికెట్ గురించి మాటలే! వాళ్ళందరి మధ్యానేను "సహారా" ఎడారిలో ఉన్నట్లు ఫీలవుతూండేవాడిని!

అంచేత టెస్ట్‌మాచ్ జరిగినన్నిరోజులూ శెలవుపెట్టేసేవాడిని.

"అబ్బ! ఆరుమాచీలు భలే అద్భుతంగా ఎంజాయ్ చేయవచ్చు." అన్నాడు రెడ్డి లంచ్ టైమ్‌లో నావంకచూస్తూ.

"అవునవును! ఒండర్‌ఫుల్‌గా ఉంటుంది!" అన్నాను.

ఆరోజంతా క్రికెట్‌మాచీల గురించిన చర్చలతోనే గడిచిపోయింది ఈదారుణ మయిన వాతావరణంలో నేను వట్టివాజమ్మలా కనిపించకుండా ఉండాలంటే క్రికెట్ గురించి

వీలయినంత త్వరగా తెలుసుకుని ఫాలో అయిపోవాలని నిర్ణయించుకున్నాను. వెంటనే రంగంలోకిదూకి న్యూస్‌పేపర్లలో క్రికెట్ వార్తలుచదవడం మొదలెట్టాను. క్రికెట్ కామెంటరీ వినడానికని ఓపాకెట్ ట్రాన్సిస్టరు కూడాకొన్నాను.

"మార్షల్, హోల్డింగ్స్ తుక్కురేపేస్తారీసారి!" అన్నాడెవరోకుర్రాడు బస్‌స్టాండ్‌లో.

ఆమాట జాగ్రత్తగాగుర్తు పెట్టుకున్నాను.

ఆతరువాత వారం టెస్ట్‌మాచ్‌స్టార్టయింది. ట్రాన్సిస్టర్‌చెవి దగ్గర పెట్టుకుని ఆఫీసుకి బయల్దేరాను. ఎంతసేపు విన్నాహోరున జనంగొడవ తప్పితే ఇంకేమీ వినిపించలేదు.

ఒకతను పరుగుతో నాదగ్గరకొచ్చాడు.

"టాస్ ఎవరుగెల్చారు?" అడిగాడు ఆత్రుతగా.

"టాసా?" ఆశ్చర్యంగా అడిగాను.

"అవును!"

ఏదొకటి చెప్పాలి కనుక "వెస్టిండీస్" అన్నాను.

"బాటింగెవరు చేస్తున్నారు?"

నాకుతెలీదు అని చెప్పటం నామోషీఅనిపించి అతన్ని వదిలించుకోవటానికి "వెస్టిండీస్" అన్నాను.

"ఇప్పుడు ఎవరాడుతున్నారు.?"

నాకు వెస్టిండీస్ తాలూకూపేరు ఒక్కటే ఒక్కటి గుర్తుంది. ఆరోజు బస్‌స్టాండ్ దగ్గర విని గుర్తుపెట్టుకున్నాను.

"మార్షల్, హోల్టింగ్స్! తుక్కురేగ్గొటేస్తున్నారు!" అన్నాను.

"అప్పుడే వాళ్ళవరకూ అవుటయిపోయారా?" నమ్మలేనట్లుగా అడిగాడతను.

ఎక్కడో ఏదో తప్పు చెప్పి ఉంటానని అనుమానం కలిగింది గానీ, ఇప్పుడిక చేయగలిగిందేమీ లేదు. ముందుకు దూసుకుపోవడమే.

"అవును?" అన్నాను.

"స్కోరెంత?"

"ముప్పైఆరు!" అతను అదిరిపడ్డాడు.

"ఎన్ని వికెట్లుపడినయ్?"

"పద్నాలుగు!"

అతను ఉలిక్కిపడి నెమ్మదిగా కాసేపు వెనక్కునడిచి, అక్కడి నుంచి హఠాత్తుగా రాకెట్‌లా దూసుకుపోయాడు.

ఆఫీసులోకూర్చుని ట్రాన్సిస్టర్ టేబుల్‌మీదే ఉంచి వాల్యూమ్ తగ్గించాను. విమల ఆశ్చర్యంగా నావేపు చూస్తోంది.

అతకుముందు పాకిస్తాన్‌తో మనవాళ్ళు ఆడేప్పుడు ఒకటి రెండుసార్లు క్రికెట్ గురించినాతో మాట్లాడి-నాకేమీ తెలీదని తెల్చుకుని-నన్ను అడవిమనిషిలా ట్రీట్‌చేయడం మొదలుపెట్టింది.

హఠాత్తుగా ట్రాన్సిస్టరులో పెద్దఎత్తునకేకలు,గొడవెక్కువయిపోయినయ్.

"ఏమిటి, వికెట్‌పడిందా?" ఆదుర్దాగా నా దగ్గరకొచ్చి అడిగిందామె.

"అవును" అన్నాను ఇంకేమనాలో తెలీక.

"ఎవరవుటయ్యారు?"

ఇండియన్ ఆటగాళ్ళలో నాకు మూడే పేర్లు తేలుసు.

గవాస్కర్, కపిల్దేవ్, కిర్మానీ!

"గవాస్కర్!" అని చెప్పానామెకి.

చుట్టుపక్కలున్నవాళ్ళందరూ ఘొల్లుమన్నారు."బౌలింగ్ చేసేది ఇండియాయేకదా! గవాస్కర్ అవుటయ్యాడంటారేమిటి-" అడిగిందామె నవ్వాపుకుంటూ.

"సారీ! సరిగ్గావినలేదు! కపిల్‌దేవ్ అవుటయాడు."

ఆమెమాట్లాడకుండా తన సీటుకెళ్ళికూర్చుంది.

ఆఫీసర్ దగ్గర్నుంచీ కబురొచ్చింది. లోపల అప్పటికే రామకృష్ణ ఉన్నాడు.

"దేనికిప్పుడేలీవ్? టి.వి.లో క్రికెట్‌మాచ్ చూట్టానికి కదూ!" కోపంగా అడిగాడు ఆఫీసరతనిని.

"అబ్బేకాదండీ మా అమ్మమ్మచనిపోయింది!"

"వ్వాట్? మీ అమ్మమ్మ చనిపోయిందా?"

"అవునండి?"

"మరి పాకిస్తాన్ టెస్ట్‌మాచ్ జరిగినప్పుడు కూడా మీఅమ్మమ్మ అప్పుడే చనిపోయిందని లీవ్ తీసుకున్నావుగా?"

"అదా! అదే...అది...నిజమేనండీ! మాఅమ్మమ్మ అప్పుడే చనిపోయింది. ఆకారణంగా మాతాత ఇప్పుడు మళ్ళీ పెళ్ళిచేసుకుంటున్నాడండీ! అందుకని సెలవుకావాల్సార్! సొంత తాతయ్య పెళ్ళికి నేను వెళ్ళకపోతే ఏం బావుంటుంది."

ఆఫీసర్ చిరాకుగా చూసి "అల్రైట్-గో" అన్నాడు ఈసడింపుగా.

రామకృష్ణ ఆనందంగా వెళ్ళిపోయాడు.

"ఫైలురడీ అయిందా?" అడిగాడు ఆఫీసర్.

"ఇంకో అరగంటపడుతుందండీ"

"కపిల్ఎన్ని ఓవర్స్‌చేశాడు?" అడిగారాయన.

"పదకొండండీ!" ఠక్కున నోటికొచ్చింది చెప్పేశాను.

"మెయిడెన్స్-ఎన్ని?"

"ఇరవైమూడండి!"

"యూకెన్-గో-"మండిపడుతూ అన్నాడాయన. ఆయనకంతకోపం ఎందుకొచ్చిందో అర్థంకాలేదు.

ఆ తరువాత రెండురోజులు శెలవుపెట్టి ఇల్లు కదలకుండా కూర్చుని కా మెంటరీవిన్నాక నాకుచాలా విషయాలు తెల్సినయ్. తీరా ఆ మర్నాడు ట్రాన్సిస్టర్ ఆన్‌చేస్తే ఎక్కడా కామెంటరీ రావటంలేదు. వెంటనే అది నాకు అమ్మినవాడి షాపుకు పరుగెత్తాను.

"వారంక్రితం మీ దగ్గర కొన్న ట్రాన్సిస్టర్ చెడిపోయిందయ్యా." అన్నాను దబాయింపుగా.

అతను పరీక్షించి "బాగానే వుంది కదండీ! అన్నాడు ఆశ్చర్యంగా.

"బాగుంటే మరి క్రికెట్ కామెంటరీ ఎక్కడారాదేం?"

అతనునవ్వాడు, "ఇవాళ రెస్టుకదండీ! మర్చిపోయినట్లున్నారు."

నేనో వాజమ్మనని అతను అనుకోగల ప్రమాదం ఉంది గనుక క్రికెట్ గురించి నాకు ఎంతో తెలుసునని కొంచెం ఓవరాక్షన్‌చేస్తేగాని లాభం లేదనిపించింది.

"ఓ అయామ్ సారీ! పూర్తిగా మర్చిపోయాను. ఇవాళ వెస్టిండీస్‌కి రెస్టేడే కదూ?"

అతను ఈసారి జాలిగా నవ్వాడు

"క్రికెట్ ఈజ్‌గేమ్ అని పుస్తకం ఉందండి. చాలా చక్కగా రాశారాపుస్తకంలో! అది చదివితే మొత్తం క్రికెట్టంతా తెల్సిపోతుంది" అన్నాడు.

నేనింక అక్కడ వుండటంవల్ల నాపరువుకి ఎక్కవహాని జరిగే అవకాశం ఉందని ఇంటికొచ్చేశాను.

మర్నాడు పొద్దున్నే మా అమ్మమ్మ హడావుడిగావచ్చి నన్ను నిద్రనుండి లేవగొట్టేసింది.

"ఏమిటి? ఏంజరిగింది" అన్నాను ఖంగారుగా.

"కొంప మునిగిందిరా నాయనా! వద్దురా అంటే మన నూకలపాలెం బంధువులతో పోట్లాడావ్. ఇప్పుడుచూడు వాళ్ళేం చేశారో! మనకి చేతబడి చేశారు."

నేను అదిరిపడిలేచి నిలబడ్డాను.

"చే...చే...చేతబడా?"

"అవును,రా! బయట చూడు మన తలుపుకి-"

పరుగుతో బయటకెళ్ళి చూశాను.

తలుపుమీద ఎర్రరంగుతో మూడుగీతలుగీసి ఉన్నాయ్.

"అలా చూస్తావేంరా! వెళ్ళి మంత్రాలేసే వాడినెవర్నయినా తీసుకురా త్వరగా, లేకపోతే ప్రాణాలు పోతాయి."

మా గొడవకి చుట్టుపక్కల పిల్లలుపోగయ్యారు.

"అది చేతబడి కాదంకుల్! వికెట్స్. మీ తలుపుమీదగీశాం మేమే! నిన్నశెలవుకదా! క్రికెట్ ఆడాం ఇక్కడ." నాకు పోయిన ప్రాణం తిరిగి వచ్చింది

ఆరోజు మా ఆఫీసర్ చాలా సరదా మూడ్‌లోవున్నాడు. నేనుఫైలు తీసుకెళ్ళగానే నోట్‌చదవకుండా సంతకం పెట్టేశాడు

"చూశావా మనాళ్ళు బ్రహ్మాండంగా ఆడేస్తున్నారు." అన్నాడు ఆనందంగా.

"అవునండీ దుమ్ముదులిపేస్తున్నారు." అన్నాను రెడ్డి మాటలు గుర్తుకుతెచ్చుకుని.

అప్పుడే ఆయన టేబుల్ మీదున్న ట్రాన్సిస్టర్‌లో హోరు పెరిగిపోయింది.

ఆఫీసర్ అదిరిపడి నాకుషేక్‌హాండిచ్చాడు.

"సిక్సర్-కపిల్-సిక్సర్‌కొట్టాడు. బ్రిలియంట్ షాట్! సూపర్బ్!" హి ఈజ్ నేచురల్ ప్లేయర్! ఒండర్‌ఫుల్ బాట్స్‌మెన్"

"అవున్సార్ ! నేచురల్ ప్లేయర్."

"అన్నట్లు నీ ఇంక్రిమెంట్ ఆగిపోయిందన్నావ్ కదూ?"

"అవునండీ!"

"వెంటనే ఒకఅప్పీల్‌రాసి పుటప్‌చెయ్ నేను రికమెండ్ చేసిహెడ్డాఫీస్‌కి పంపిస్తాను. నాలుగురోజుల్లో నీ ఇంక్రిమెంట్ వచ్చేస్తుంది-"

నేను సంతోషంతో పొంగిపోయాను. ఇంక్రిమెంటంటే షుమారు అన్నీ కలసి రెండు వందలరూపాయలు జీతం పెరుగుతుంది.

"అలాగేసార్ ఇప్పుడే తెస్తాను" అంటూ పరుగెత్తుకెళ్ళి త్వరత్వరగా టైప్‌చేసి తీసుకెళ్ళి కాగితం అయనముందుంచాను. ఆయన సంతకం పెట్టబోతుండగామళ్ళీ ట్రాన్సిస్టర్‌గట్టిగా మోతిక్కిపోయింది.

ఆఫీసర్‌చెవి దానిదగ్గర పెట్టివిన్నాడు ఠక్కున ట్రాన్సిస్టరు ఆఫ్‌అయిపోయింది.

"అవుట్!" అన్నాడు మొఖం కోపంగాపెట్టి.

"ఏమయిందిసార్!"

"కపిల్‌దేవ్ అవుట్!" ఇంకా కోపంగా అన్నాడాయన

"అలాగా! పాపం! ఒండర్‌ఫుల్ ప్లేయర్‌సార్! నేచురల్ ప్లేయర్‌సార్!" ఆయనను సముదాయించాలని అన్నాను.

"డోంటాక్!" అరిచాడాయన. "కపిల్‌దేవ్ ఆట చేతగాని వాజమ్మ! ఫ్లాక్‌ప్లేయర్! హోప్‌లెస్‌ప్లేర్! ఇర్రెస్పాన్సిబుల్‌క్రీచర్!"

అర్జంటుగానేనూ ప్లేట్ మార్చకపోతే ప్రమాదం తప్పదనిపించింది నాకు.'అవున్సార్! కపిల్‌దేవ్‌ని అసలు ఎవరుసెలక్ట్ చేశారోనాకు తెలీటంలేదు! అస్సలు ఆటరాదు. బాటింగ్ వీక్-బౌలింగ్ మరీవీక్-ఫీల్డింగ్ హారిబుల్-"

"ఎప్పట్నుంచో చూస్తున్నాను!హి ఈజ్ అన్‌ఫిట్!" అన్నాడాయన.

"నేనూ చిన్నప్పట్నుంచీ కనిపెడుతున్నాను. ఇలాగే హోప్‌లెస్‌గా ఆడుతున్నాడు సార్."

సరిగ్గా అప్పుడే ట్రాన్సిస్టరు మళ్ళీగోల.

"గెటౌట్!" అన్నాడాయనకోపంగా నావేపుతిరిగి! "ఆ కాయితంమీద సంతకం" ----అడిగాను భయంగా. కాగితంచింపి చెత్తబుట్టలోపారేశాడు.

ఇంకలాభంలేదని బయటికొచ్చేశాను...

సీటుదగ్గర కూర్చుని ట్రాన్సిస్టరు చెవి దగ్గర పెట్టుకున్నాను. ఈ క్రికెట్ అంతుతేల్చుకోవలసిందే! లేకపోతే జీవితమే సర్వనాశనం అయిపోతుంది.

సన్‌దీప్‌పాటిల్ మళ్ళీ ఓబౌండరీ కొట్టాడు. అంతాగొడవ.

"వాడ్డూయూసే ఎబౌట్‌దిస్ షాట్"కామెంటేటర్ స్పెషలిస్ట్ నడిగాడు.

"మాగ్నిఫిసెంటు షాట్! ఇలాంటి బ్యాటింగ్ ఇంతకుముందు డచ్చింగ్స్ ఒక్కడే చేయగా నేను 1948లో ఇంగ్లాండు వెళ్ళినప్పుడుచూశాను. సన్‌దీప్‌పాటిల్‌పొద్దుట్నుంచీ కూడా ఎంతో ఆత్మవిశ్వాసంతో అద్భుతంగా ఆడుతున్నాడు. పూర్తిగా సెటిలయ్యాడు. అతనువెస్టిండీస్ బౌలింగ్‌కి ఒకఛాలెంజ్! "అంటూ హిందీలో చెప్పాడతను.

సరిగ్గా ఆతర్వాత బాలుకే సన్‌దీప్‌పాటిల్ అవుటయిపోయాడు.

ట్రాన్సిస్టర్‌లో కొద్దిక్షణాలు పెద్దకోలాహలం.

"సూపర్‌కాచ్ అండ్ హిఈజ్ అవుట్. వాడ్యూయోసే ఎబౌట్ దిస్‌షాట్" మళ్ళీ స్పెషలిస్టునడిగాడు కామెంటేటర్.

"ఇటీజెఫూలిష్‌షాట్! ఇంత చచ్చుదరిద్రపు బాటింగ్ నేను 1953 లో మూసర్‌మూర్ ఆస్ట్రేలియాలో ఆడగాచూశాను. అంతే! ఆతర్వాతెవరూ ఇంతచెత్తగా ఆడలేదు. అసలు ప్రొద్దు నుంచీ సన్‌దీప్‌పాటిల్ చాలా వరస్ట్‌గా ఆడుతున్నాడు. ఆబౌలింగ్‌ని ఎదుర్కోవటమే చేతకావటంలేదు. ప్రతిబాల్‌కీషేక్ అయిపోతున్నాడు. ఇన్నిగంటలు ఆడినాఇంకా సెటిలవలేదు. ఇర్రెస్పాన్సిబుల్ ప్లేయింగ్!" అన్నాడతను హిందీలో.

నాకు అయోమయంగా ఉన్నాయతని మాటలు.

సాయంత్రం రెడ్డీ, నేనూ కలిసేవెళ్ళాం ఇంటికి.

"మనాళ్ళందరూ ఎందుకంతత్వరగా అవుటయిపోయారు?" అడిగాను రెడ్డిని.

"కామెంటరీ వినలేదా నువ్వు?"

"విన్నాను-"

"మరి ఆస్పెషలిస్ట్ అన్నీ వివరంగా చెప్పాడుకదా! పిచ్‌చాలా డేంజరస్‌గా ఉందిట! ఎంత మొనగాళ్ళయినా సరే ఈ పిచ్‌మీద బులెట్ తగిలిన పిట్టల్లా రాలిపోవాల్సిందేనట!"

"అంటే ఈఆటచాలా ఫాక్టర్స్‌మీద ఆధారపడి ఉందన్నమాట!"

"అవును!పిచ్, వికెట్‌టర్న్‌తీసుకోవడం, స్పిన్నయిపోవడం, లైటుఎక్కువవడం, షేడ్‌రావడం,లైటుతక్కువవడం, వర్షంకురవడం, కొత్తబంతి తీసుకోవడం,ఇలా లక్షాతొంభయ్ విషయాలమీద ఆధారపడి ఉంటుంది-"

మర్నాడు ఆఫీసులోనే విమలముందు నా పరిజ్ఞానం ప్రదర్శించాలని నిర్ణయించుకున్నాను.

"మనాళ్ళు హోప్‌లెస్‌లీపూర్ ప్లేర్స్" అందామె టైప్‌చేసిన కాగితం నాకిస్తూ.

"అదేంకాదు!పిచ్‌డేంజరస్‌గా ఉంది! అదీగాక కొత్తబంతి! ఈపిచ్‌మీద ఎంత మొనగాళ్ళయినా సరే బులెట్ తగిలిన పిట్టలా రాలిపోవలసిందే" అన్నాను తడుముకోకుండా.

ఆమెపగలబడి నవ్వింది.

"అలాగా?" అంది నవ్వాపుకున్నాక.

"అవును! ఏం"

"మరి వెస్టిండీస్ ఇవాళ అలా సెంచరీలు కొడుతున్నారేమిటి?"

నేను అదిరిపడ్డాను.

"సెంచరీలా?"

"అవును!"

నాకేం చెప్పాలో తెలీలేదు. ఆసమయంలో రెడ్డి పక్కన ఉంటే ఏంచెప్పేవాడో అనిపించిందిగానీ రెడ్డి లేడుమరి!

"ఎలా కొడుతున్నారబ్బా?" అన్నాను ఆశ్చర్యంనటిస్తూ. నిజానికి ఆపాయింటునాకేం అర్ధంకావటంలేదు

"అందుకే చెప్పేది!పిచ్చిలేదు కాకరకాయలేదు! అవన్నీసాకులు!" అంటూవెళ్ళిపోయిందామె. మళ్ళీ విమల దగ్గర పరువుపోయింది.

"ఇప్పుడెవరు బ్యాట్ చేస్తున్నారు?" అడిగిందామె.

"పొద్దున్నుంచీ వాళ్ళు ఇద్దరేగా ఆడుతున్నారు?" అన్నాను అంతకుముందు వరకూ ట్రాన్సిస్టర్‌లో విన్నపేర్లు గుర్తుకి తెచ్చుకుంటూ.

"ఎవరు?"

"అదే సిలిమాడాన్, ఇంకోకతను డీప్‌స్క్వేర్‌లెగ్! సిలిమాడాన్ మాత్రంఅద్భుతంగా ఆడుతున్నాడు."

ఆమె మళ్ళీ కిలకిలనవ్వేస్తూ అక్కడినుంచి వెళ్ళి అందరితోనూ చెప్పినవ్వసాగింది. నాకు తల కొట్టేసినట్లయిపోయింది. ఈ పరిస్థితిలో ఆమె నన్ను ప్రేమించడంకల్ల!

ఎలాగయినా సరే-మరో మాచ్ పూర్తయేనరికల్లా మొత్తంనేర్చుకోవాలని ప్రతిజ్ఞచేసేసుకుని రెండోమాచ్ టైమ్‌కి మాఆఫీస్ ఎగ్గొట్టి లక్ష్మణరావ్ గాడింట్లో టి.వి. చూస్తూ రోజులు గడిపేయసాగాను.

రాన్రాను నాకూ క్రికెట్ మీద ఆసక్తి పెరిగిపోయింది. ఆ తరువాత మాచీలన్నీ కూడా ఆఫీస్ ఎగ్గొట్టి చూశాను. చివరికెలా అయిందటే నాకు తెలీని విషయం అంటూ ఏమీ మిగిలినట్లు నాకనిపించలేదు. ఆతరువాత మాచ్‌జరిగే సమయంలో వీరుడిలా ఆఫీసులో అడుగుపెట్టాను. అందరూ క్రికెట్‌మాచ్ గురించి మాట్లాడుకుంటుంటే మధ్యలో దూరి స్పీచ్ మొదలెట్టేశాను.

"ఇది  బ్యాట్స్‌మన్ పిచ్! అంచేత బ్యాటింగ్ మొదలెడితే వాళ్ళకు ఎడ్వాంటేజ్! ఇండియా టాస్ గెలిచి బ్యాటింగ్ తీసుకుంటే గాని గెలిచే అవకాశాలు  లేవు" అన్నాను పెద్దఫోజిచ్చి.

అందరూ తెల్లబోయి నావంక చూడసాగారు.

ఆట మొదలయింది. ఇండియన్ వికెట్లన్నీ టపీటపీమని పడిపోతున్నాయ్. అప్పుడే ఆఫీసరు కారు దిగి లోపలికి వస్తూ నా దగ్గర ఆగి "ఎన్ని  వికెట్లు  పడిపోయాయ్?" అనడిగాడు.

"ఫార్టీఫర్‌ఫైవ్!"

ఆయననీరసంగా నా కెదురుగ్గా ఉన్న కుర్చీలో కూలబడిపోయాడు.

"ఏమిటింతఘోరం? బౌలింగ్ మరీసివియర్‌గా ఉందేమో!" అన్నాడు.

దొరికిందే అవకాశమని అందుకున్నాను.

"నో సార్! యూ అర్‌మిస్టేకన్! మన బ్యాట్స్‌మన్ కొంచెం కేర్‌లెస్‌గా  ఆడారు! అంతే! ప్రతి బ్యాట్స్‌మన్ కనీసం యాభయ్‌పరుగులు చేయాల్సిన  పిచ్‌ఇది!  కిందటిసారి అంటే  పదేళ్ళక్రితం వెస్టిండీస్  అక్కడ ఆడినప్పుడు కూడా అద్భుతంగా పరుగులు సాధించారు మనవాళ్ళు! అంతకుముందు ఆస్ట్రేలియాటీమ్... "

"అంటే ఇవ్వుడొచ్చిన బ్యాట్స్‌మన్ అయినా కనీనం ఇండియావరువు నిలబెడతారంటావా?" దిగులుగా అడిగాడాయన.

"ఓ, యస్! చూస్తుండండి! మన అసలయిన బ్యాట్స్‌మన్ ఇంకా ఆడలేదుకదా! వాళ్ళుదంచేస్తారు." అన్నానుధీమాగా.

"ఎవరువాళ్ళు?"

"రోజర్ బిన్ని, మదన్‌లాల్, కిర్మానీ"

"వాళ్ళు బ్యాట్స్‌మన్ ఏమిటి నామొఖం? బౌలర్స్‌కదా! కిర్మానీ వికెట్‌కీపర్!"

"నోనోనో! అయాంసారీ! రియల్ బ్యాట్స్‌మన్ వాళ్ళుముగ్గురే! కావాలంటే హిస్టరీ చూడండి! వన్‌డే క్రికెట్‌లోనూ, త్రీడే క్రికెట్‌లోనూ, సిక్స్‌డేమాచ్‌లోనూ సూపర్బ్‌పెర్ఫరమెన్స్!టేక్ ది స్టాటిస్టిక్స్! రోజర్‌బిన్నీ యావరేజ్ 36.6 రన్స్! మదన్‌లాల్ 38.9 రన్స్! కిర్మానీ! 30 రన్స్! బౌలింగ్‌అనాలిసిస్ రోజర్‌బిన్నీ- 26 ఓవర్స్-6 మెయిడిన్స్ 68 రన్స్-త్రీ వికెట్స్-మదన్‌లాల్-" ఆఫీసరుగారు కుర్చీలో నుంచిలేచి నిలబడ్డారు.

"ఓకే మిస్టర్! తర్వాత మాట్లాడదాం!" అనేసి తనరూమ్‌లో కెళ్ళిపోయారాయన. అందరూ నావంకే ఈర్ష్యగా చూచారు. ఆ సాయంత్రం ఆయనే నన్నుగదిలోకి పిల్చాడు.

"నువ్ చెప్పింది ఎగ్జాక్ట్‌లీ కరెక్ట్! బిన్నీ, మదన్‌లాల్, కిర్మానీ అద్భుతంగా ఆడబట్టే మనస్కోర్ బాగా పెరిగింది!" అన్నారాయన ఆనందంగా.

"ఇలాలాస్ట్ వికెట్స్ బాటింగ్ వెరీరేర్ సర్! 1927 లో ఇంగ్లీష్ టీంలో కూడా సర్‌గారీకో బన్,విర్‌మీర్ చేతన్ కూడా ఇలాగే మాక్సిమమ్ స్కోరింగ్‌చేసి రికార్డ్‌నెలకొల్పారు ఆతరువాత ఆస్ట్రేలియాలో...."

"ఓకే-ఓకే"అన్నారాయన నన్నాపేఉద్దేశ్యంతో.

కానీ నేనెంత ప్రయత్నించినా బ్రేకులు పడడంకష్టంగా ఉంది.

"ఎనీవే-ఇంక్రిమెంటు ఆగిపోయిందన్నావు కదూ! అప్పీలు తీనుకురా! నేనురికమండ్‌చేసి హెడ్డాఫీస్‌కి పంపిస్తాను! నాల్రోజుల్లో వచ్చేస్తుంది!" నాకు ఆనందం ఆగలేదు.

క్రికెట్‌పుణ్యమా అని ఇంక్రిమెంటు వచ్చేస్తోంది.

త్వరత్వరగా అప్పీల్‌రాసేసి పరిగెత్తుకెళ్ళి ఆయన ముందుపెట్టాను.

"వచ్చేవన్‌డే మ్యాచ్ గురించి ఏమంటావ్! మనకేమయినా ప్రాస్పెక్టస్‌ఉంటుందా?" అడిగారాయన.

"టు టెల్ యూది ఫాక్ట్-నో ఛాన్స్ సర్! గవాస్కర్ ఈపిచ్‌మీద బాగా ఆడలేడు! అలాగే గయక్‌వాడ్! ఎట్‌దిమోస్ట్ పద్దెనిమిది పరుగులకంటే ఎక్కువ తీయలేడు. ఆతరువాత వెంగ్‌నర్కార్ మంచి ఫామ్‌లోనే ఉన్నాడుగానీ-మార్షల్ కూడా మంచి ఫామ్‌లో ఉండటంవల్ల..."

"ఓకే-ఓకే!" అంటూ.నన్నాపబోయాడాయన.

ట్రాన్సిస్టర్‌లో ఎక్స్‌పర్ట్ కామెంటేటర్‌ని కామెంటేటర్ అడుగుతున్నాడు హిందీలో.

"కపిల్‌దేవ్ ఈ మధ్యసరిగ్గా బ్యాటింగ్ చేయలేకపోతున్నాడు. బహుశా అందుక్కారణం ఈ కెప్టెన్సీవల్ల మీదబడిన అదనపుబాధ్యత అని నేననుకుంటున్నాను. మీరేమంటారు?"

ఎక్స్‌పర్ట్ కామెంటేటర్ దగ్గాడు.

"యస్! ఆఫ్‌కోర్స్! యూ ఆర్ సెంట్‌పర్సెంట్ కరెక్ట్! దిసీజ్ రియల్లీ ట్రెమండస్ రెస్పాన్సిబులిటీ! ఇంత బాధ్యతమీద ఉన్నప్పుడు అది తప్పక అతని ఫెర్ఫారమెన్స్ మీద ఎఫెక్ట్ ఇస్తుంది! దిసీజ్ టూమచాఫ్ రెస్పాన్స్‌బులిటీ! ఇంతబాధ్యత, బరువు మీదపడితే సరిగ్గా కాన్‌సంట్రేషన్ ఉండటంకష్టం." ఆఫీసర్ ట్రాన్సిస్టర్ కట్టేశాడు. నేను ఇంక నిగ్రహించుకోలేకపోయాను.

"ఆ ఎక్స్‌పర్ట్ కామెంటేటర్ చెప్పేదంతా బోగస్! మీరునమ్మకండి! బాధ్యతలేదూ గాడిదగుడ్డూలేదు.అదే నిజమైతే ఆబాధ్యత వెస్టిండీస్‌కెప్టెన్ లాయిడ్ పెర్ఫార్మెన్స్‌కి ఎందుకు ఎఫెక్ట్ఇవ్వలేదు?" ఆస్ట్రేలియా కెప్టెన్ కిమ్ హ్యూగ్స్ ఇంగ్లీష్‌కెప్టెన్ బాబ్‌విల్లీస్ మాటేమిటి? పాకిస్తాన్‌కాప్టెన్ ఇమ్రాన్‌ఖాన్ మాటేమిటి? శ్రీలంక కాప్టెన్-----"

"దట్సాల్‌రైట్ అయిదవుతోంది" అన్నాడాయన.

"అసలు క్రికెట్ ఈజ్ గేమాఫ్‌లక్ అని చాలామంది అంటారు! మీ అభిప్రాయం ఏమిటి?"

"నాదీ అదే అభిప్రాయంగాని ఇంక మనంరేపు మాట్లాడుకుంటే---"

"ట్రాష్!" అరిచాను. ఆయన అదిరిపడ్డాడు.

"ఏమిటి?"

"మీ అభిప్రాయం ట్రాష్! క్రికెట్ ఈజ్‌లైక్ ఎనీ అదర్‌గేమ్! ప్రొఫిషియెన్సీ, ఎఫిషియెషిన్సీ అండ్ టాలెంట్! అందుకే వెస్టిండీస్ మనని తుక్కు రేగ్గొట్టేశారు. అంతేకాదు ఫర్ ఇన్‌స్టెన్స్ టేక్‌వరల్డ్‌కప్---"

"ఇంకచాల్లే! వెళ్ళు!" అన్నాడాయన. కానీ ఆపటంనావల్లకాలేదు.

"వరల్డ్‌కప్‌లో ఇంగ్లండ్ మీద మనాళ్ళు అడిగినప్పుడు అందరూ ఏమనుకున్నారు?"

"ప్లీజ్ గెటవుట్ " కోపంగాలేచి నిలబడ్డాడాయన.

నేను ఏమాత్రంబెదర్లేదు. ఏదో శక్తి ఆవహించినట్లయింది.

"ఇంగ్లీష్ టీమ్ ఎలా ఓడిపోయింది?" ఆటరాకకాదు? ఎఫిషియెన్సీలేకా? కాదు! ఒక్కసారి ఇండివిడ్యుయల్ ఎనాలిసిస్ చూడండి.

బాబ్ విల్లీస్ 1982 లో లార్డ్స్‌లో ఆడినప్పుడు ఒక మాచ్‌లో 46 ఓవర్స్‌లో 20 మేడిన్స్-83 రన్స్-సిక్స్‌వికెట్స్-అలాగే ఇయాన్‌బౌతుమ్----"

ఆఫీసర్‌చేతిలో నా ఇంక్రిమెంటుకాగితం చిత్తయిపోయి చెత్తబుట్టలోపడిపోయింది.

"బయటికెళ్తావాలేదా?" మీదకొస్తూ అడిగాడాయన.

"56 ఓవర్స్-13 మైడెన్స్" బాగా దగ్గరకొచ్చేశాదతను.

"33 రన్స్ త్రీవికెట్స్" ఆతరువాత మాట్లాడటంకుదరలేదు. ఏదో బలంగా నామొఖం మీదతగిలి కింద పడ్డాను. ✱

# దట్ వుమన్ ఫ్రమ్ రష్యా



**చాలా** రోజుల తరువాత మా కాలనీలో మళ్ళీ సంచలనం కనిపించింది. శాయిరామ్, రెడ్డి, గోపాల్రావు, జనార్ధన్ హడావుడిగా మా ఇంటికొచ్చేరు పొద్దున్నే..

"ఏమిటి సంగతి?" భయంగా అడిగాను.

అప్పటికప్పుడు కాలనీ మీటింగ్ అంటారేమో, బంగారంలాంటి ఆదివారం సర్వనాశనం అయిపోతుందేమో అన్న అనుమానం కలిగింది మరి.

"త్వరగా రెడీ అవ్! మనందరం ఏరోడ్రోమ్‌కెళ్ళి ఎల్వీరా ఒజోలీనాని రిసీవ్ చేసుకోవాలి" అన్నాడు జనార్ధన్.

"ఎల్వీరా ఒజోలీనా నా?"

"అవును"

"అంటే ఏమిటిది?"

"గ్రామర్‌మిస్టేక్! ఎవరు అనడగాలి"

"సరే! ఎవరు?"

"రష్యన్ యూనివర్సిటీ ప్రొఫెసర్."

"అతన్ని మనం రిసీవ్ చేసుకోవటమెందుకు?" అయోమయంగా అడిగాను.

"మళ్ళీగ్రామరు-ఆమె అనాలి అతనుకాదు"

"సరే-ఆమెను మనం ఎందుకురిసీవ్‌చేసుకోవాలి?"

"ముందుఎయిర్‌పోర్టుకి బయల్దేరు! తర్వాత చెప్తాను" అన్నాడు రెడ్డి. ఇంకలాభంలేదని డ్రస్‌చేసుకుని వాళ్ళతో బయలుదేరాను. తోవలో వివరాలు అందించాడురెడ్డి.

ఎల్విరా ఒజోలీనా మనదేశంలోని తెలుగుజాతిగురించి రీసర్చిచేసి ఓ పుస్తకంరాయలని ఇండియా వచ్చిందట. ఢిల్లీలో జాబ్ చేస్తోన్న జనార్ధన్ అన్నయ్యకు స్నేహితుడయిన జక్కన్‌లాల్ మక్కన్‌లాల్ ఆమెను తెలుగుదేశం రాజధానిలో గడపమని పంపుతూ, ఆమెను మా కాలనీ అతిథిగాభావించాల్సిందిగా జనార్ధన్‌కు టెలిగ్రామిచ్చాడట! ఇదీ ఫ్లాష్‌బాక్‌కథ.

విమానం రెండుగంటలు ఆలస్యంగా చేరుకుంది. ఎల్విరా ఒజోలీనాను గుర్తుపట్టడం తేలిగ్గా జరిగింది. తననుతాను పరిచయంచేసుకున్నాక మా అందరినీకూడా పరిచయంచేశాడు జనార్ధన్.

"శాయిరామ్" అన్నాడు శాయిరాంని పరిచయంచేస్తూ.

ఓ! శాయిరామోవ్!" అందామె ఆప్యాయంగా కరచాలనంచేస్తూ.

శాయిరాం ఖంగారుపడి అటూ ఇటూ చూశాడు

"మావో గీవో అనకండి, పోలీసులు నన్ను కాల్చిపారేస్తారు" అన్నాడుగొంతు తగ్గించి రహస్యంగా.

"వ్వాట్? పోలీసులు కాల్చివేయుదురా! ఎందులకు?" అడిగిందామె తనునేర్చుకున్న ప్యూర్ తెలుగు ప్రయోగిస్తూ

"ఏమోనండీ! ఎందుకో ఎవ్వరికీ తెలీదుగాని అలాంటి పేర్లు వినబడినా, పుస్తకాలమీద కనబడినా కాల్చిపారెయ్యడం మాత్రం ఖాయం!"

"వెరీబాడ్!" అందామె.

"అలావాళ్ళను 'వెరీబాడ్' అని ఇంకో రెండుసార్లన్నారంటే మిమ్మల్ని కూడా కాల్చి పారేస్తారు" అన్నాడు రెడ్డి.

ఆమె కొంచెం భయపడినట్లుంది. ఎందుకంటే ఆతరువాత గోపాల్రావ్‌పేరు పలికేప్పుడు 'గోపాల్' అని ఊరుకుంది.

జనార్థన్ టాక్సీపిలిచాడు.

"మీటర్‌మీద ట్వంటీఫైవ్ రుపీస్ ఎక్స్‌ట్రా!" అన్నాడు టాక్సీవాడు, టాక్సీ మాదగ్గరకు లాక్కొచ్చి.

"వ్వాట్, మీటర్‌మీద ట్వంటీఫైవ్‌రూపీస్ ఎక్స్‌ట్రా? ఎందుకు? ఇక్కడ టాక్సీలకు కరువా?" అడిగింది ఎల్వీరా డ్రైవర్‌ని.

"టాక్సీలకు కరువుకాదుగానీ ఫారిన్ టూరిస్టులకు కరువు మేడం!" అన్నాడువాడు.

"వాటీజ్‌దిస్ నాన్సెన్స్! వీళ్ళ ఇష్టమొచ్చినట్లుచార్జ్ చేస్తుంటే మీ గవర్నమెంట్ ఏమిచేయుచున్నాది?" అంది ఆశ్చర్యంగా.

"గవర్నమెంటా? వాట్ గవర్నమెంట్?" తనూ ఆశ్యర్యపోతూ అడిగాడు రెడ్డి. ఆప్రశ్నకు ఎల్వీరా ఉలిక్కిపడింది.

"అంటే-ఇక్కడ గవర్నమెంటు అనేదే లేదా?" అంది అందరివంకా చూస్తూ! రెడ్డి ప్రశ్నార్థకంగా శాయీరామ్‌వేపు చూశాడు. శాయీరామ్ గోపాల్రావు వంకచూశాడు. గోపాల్రావ్ నావంకచూశాడు. నిజానికి గవర్నమెంట్ అనేది ఉందో లేదో నాకూ తెలీదు. ఎందుకంటే ధరలు పెరిగాయని నేనీమధ్య న్యూస్‌పేపర్‌కొనటం మానేశాను

"ప్రస్తుతం ఉందో, లేదో తెలీదు మేడమ్! మా ఆఫీసులో కొలీగ్స్‌ని అడిగిరేపు ఇన్‌ఫర్మేషన్ ఇస్తాను" అన్నాను బిడియంగా.

ఎల్వీరా నిర్ఘాంతపోయింది.

"వ్వాటేపీపుల్ యూ ఆర్! గవర్నమెంటు ఉందో లేదో కూడా తెలీదామీకు? మీరు ఎలక్షన్‌లో ఓటు చేయటంలేదా"

"ఇంతవరకూ ఓటెలా ఉంటుందో మాకెవ్వరికీ తెలీదండీ! మమ్మల్నెవ్వరూఎప్పుడూ ఓటు వేయమని అడగరు."

"మరి ఇంకెవర్ని అడుగుతారు?"

"బలహీనవర్గాల కాలనీవాళ్ళనూ, గూడెంలోవాళ్ళనూ, ఇంకా ఇతర బీదా బిక్కీలనూ, చదువురానివాళ్ళనూ అడుగుతారండీ!"

ఎల్వీరా వెంటనే తనపుస్తకంతీసి 'తెలుగు ప్రజలలో బడుగువర్గాలప్రజలే ఎలక్షన్‌లలో పాల్గొంటారు మిగతా ప్రజలకు అసలు ప్రభుత్వం ఉందోలేదో కూడా తెలీదు' అని రాసుకుంది. అదిచదివిమేము మొఖమొఖాలుచూసుకున్నాం.

టాక్సీలో బయలుదేరాం అందరం.

అబిడ్స్‌కి చేరుకున్నాక "ఈ టాక్సీ మెయిన్ రోడ్ మీదనుంచి నడపకుండా ఇలా సందుల్లోంచి నడుపుతున్నాడేమిటి?" అనడిగింది ఎల్వీరా.

"ఇది సందుకాదండీ! మెయిన్‌రోడ్డే!" అన్నాడు రెడ్డి.

"వ్వాట్! ఇది మెయిన్‌రోడ్డా?"

"అవునండీ!"

"మరి వెహికల్స్ ఇలా ఇష్టమొచ్చినట్లు నడుపుతున్నారేమిటి?"

"ఇక్కడింతేనండీ! ఇలాగే మా కలవాటు!" అన్నాడు శాయీరామ్.

ఆమెవెంటనే తన పుస్తకం తీసి,

"తెలుగు ప్రజలు రోడ్లమీదనడవడం నడపటంచేతకానివాళ్ళు"

అనిరాసుకుంది.

మేమావాక్యం చదవనట్టునటించాం. టాక్సీకొంతదూరంవెళ్ళి ఠక్కున ఆగిపోయింది. రోడ్డుకడ్డంగా కట్టిన షామియానాలో వివాహం జరుగుతోంది.

"ఏమి జరిగింది?" అడిగింది ఎల్వీరా.

"రోడ్డు బ్లాక్‌చేసి పెళ్ళిజరిపిస్తున్నారెవరో..."

"పబ్లిక్‌రోడ్ బ్లాక్‌చేసి మారేజ్ చేస్తూంటే ట్రాఫిక్కంతా ఏమవుతుంది?" ఆశ్చర్యంగా అందామె.

"మా తెలుగు రాష్ట్రంలో ఇలాంటి వెవరూ పట్టించుకోరు! ఎవరు ఏ రోడ్‌కావాలంటే ఆ రోడ్‌ని మూసేసి వాడుకోవచ్చు."

"మరి మీ మునిసిపల్ కార్పొరేషన్ ఏం చేస్తుంది?"

శాయీరామ్ పక పకానవ్వాడు.

"భలేవారే మీరు! అసలు కార్పొరేషన్‌వాళ్ళే రోడ్లుతవ్వేసి మధ్యలో పెద్ద ఆర్చీలు కట్టి ఫలానా ఎంకిగాడికి స్వాగతం అని రాస్తుంటారు, అన్ని రోడ్లమీదా. అలా రోడ్లుఅన్నీ సగం బ్లాక్ అయ్యే ఉంటాయ్ ఎప్పుడూను!"

ఎల్వీరా తక్కున తన పుస్తకం తీసి "తెలుగుప్రజలు మెయిన్ రోడ్లు బ్లాక్‌చేసి పెళ్ళిళ్ళు జరుపుట, "ఎంకిగాడికి స్వాగతం" బోర్డులుకట్టుట చేయుదురు."

అని రాసుకుంది. అంత చిన్న విషయంకూడా ఎందుకు రాసుకుంటోందా అని మేము సైగలు చేసుకుని ఆమె తెలివితక్కువతనానికి నవ్వుకున్నాము.

టాక్సీ వెనక్కు నడిచి అయిదు కిలోమీటర్లు ఎక్కువదూరం తిరిగి మాకాలనీకి చేరుకుంది.

కాలనీ చివరి ఇంటిదగ్గర బోలెడుమంది గుమికూడి ఉండటం చూచింది ఎల్వీరా.

"అక్కడెందుకు అంతమంది గుమిగూడారు?" అడిగిందామె.

"న్యూస్‌పేపరు కోసం! మా కాలనీలో ఆ చివరింటాయన ఒక్కడే న్యూస్‌పేపరు తెప్పిస్తాడు. మిగతా అందరూ ఆయన దగ్గర తీసుకుని చదువుతారు" చెప్పాడు జనార్ధన్.

"అదేమిటి? ఎవరి పేపర్ వాళ్ళు కొనుక్కోవచ్చు గదా!"

"కొనుక్కోవచ్చనుకోండి! కానీ అలవాటు లేదు."

ఆమె వెంటనే తన పుస్తకంతీసి- తెలుగువాళ్ళు అందరూ పక్కింటి వాళ్ళపేపర్లూ, మాగజైన్లు చదువుతారు.

అనిరాసుకుంది.

"భలేగుందే! ఇంత మైన్యూట్ డిటైల్స్ కూడా రాసుకుంటున్నారు" అన్నాడు గోపాల్రావ్ ఆశ్చర్యంగా.

ఆమె చిరాగ్గా చూసింది.

అందరం జనార్ధన్ ఇంటికి చేరున్నాం.

"ముందు నేను స్నానం చేయాలి! బాత్‌రూమ్ ఎక్కడ?" అడిగిందామె.

అందరం ఫెల్లున నవ్వాము.

ఎల్వీరా మమ్మల్ని పిచ్చివాళ్ళను చూసినట్లు చూసింది.

"ఏమిటలా నవ్వుతున్నారు?" అంది టవల్ భుజాన వేసుకుంటూ

"ఇవాళ ఆదివారం కదా! మరి స్నానం చేస్తానంటారేమిటి? ఇక్కడవారానికి నాలుగు రోజులేనీళ్ళు వస్తాయి. అంచేత నాలుగురోజులే స్నానంచేయాలి."

వాట్? వారానికి నాలుగురోజులేనా?

"వాటే హోప్‌లెస్ పీపుల్ యూ ఆర్!" అందామె చిరాకుగా. అని పుస్తకం తీసి తెలుగు ప్రజలు వారానికి నాలుగు రోజులే స్నానంచేయుదురు అని రాయబోయింది గాని శాయీరామ్ అడ్డుపడ్డాడు.

"దయచేసి అదంతా రాయకండి! ఎందుకంటే నేను చెప్పేది వేసవిలో సంగతి. అదీగాక తెలుగు ప్రజలు ఇంకా నయమండి! తమిళప్రజలు వారానికి మూడుసార్లే చేస్తారు" అన్నాడు రెడ్డి

అందరం తలోకొంచెం నీళ్ళు దానం చేశాము ఆమె స్నానానికి.

మా అందరికీ గోపాల్రావ్ వాళ్ళింట్లోనే భోజనం ఏర్పాటుచేశాడు.

"కేవలం తెలుగుభోజనమే తింటాను" అని ముందే ఎల్వీరా చెప్పటంచేత తెలుగు వంటకాలే చేయించారు.

ఎల్వీరా అన్నం మొదటిముద్దనోట్లో పెట్టుకోగానే పటపటమన్న శబ్దాలు వినిపించాయ్.

"స్టోన్స్" అంటూ అరచి బయటకు పరిగెత్తి అన్నం ఊసివేసిందామె

"ఈవిడ వ్యవహారం మరీ విడ్డూరంగా ఉందే! రాళ్ళు ఉండకుండా ఎలా ఉంటాయ్?" అన్నాడు గోపాల్రావ్ రాళ్ళుమింగేస్తూ.

"అన్నంలో రాళ్ళు మామూలు విషయమేనండీ! ఖంగారుపడవద్దు!" చెప్పాడురెడ్డి.

"నోనో! నావల్లకాదు. నాకు బ్రెడ్ తెప్పించండి!" అందామె.

"బ్రెడ్‌లో కూడా రాళ్ళుంటాయ్!" అన్నాడు జనార్ధన్.

"ఇలా అన్నిట్లోరాళ్ళు కలుపుతుంటే మీ గవర్నమెంట్ ఏంచేస్తోంది?"

"గవర్నమెంట్ ఏమిటి?" మళ్ళీ ఆశ్చర్యంగా అడిగాడు రెడ్డి.

ఆమె రెండుచేతులతో తల పట్టుకూర్చుంది.

"రుక్మిణీ!" అంటూ భార్యనుపిలిచాడు గోపాల్రావ్.

"ఏమిటండీ!" చేతులు తుడుచుకుంటూ వంటింట్లోనుంచి వచ్చిందామె. "నువ్వు నిన్న పక్కింట్లోనుంచి పేపర్‌తెచ్చి చదివినట్లున్నావ్ కదా! గవర్నమెంట్ ఉందీలేందీ ఏమయినారాశారా అందులో?"

"భలేవారే! గవర్నమెంట్ లేకపోవటం ఏమిటి? ఉందని జనార్ధన్ అన్నయ్యగారి భార్యకూడా అందినిన్న."

"ఏది-ఆవిడనోసారి పిల్చుకురండి! సరిగ్గా కనుక్కుందాం!" అన్నాడు జనార్ధన్.

జనార్ధన్ భార్య రెండునిమిషాల్లో వచ్చింది.

"ఏమే? రుక్మిణమ్మగారితో నువ్వు గవర్నమెంట్ ఉందన్నావా?"

"అవునూ!ఏం?"

"నీకెలాతెలుసే ఆవిషయం?"

"బాగుందండీ! రోజు రోజుకీ ధరలు ఎరిగిపోతూంటే తెలియటంలేదూ? గవర్నమెంట్ లేకపోతే ధరలెలాపెరుగుతాయ్?"

"నిజమే!" ఒప్పుకున్నాడు శాయిరామ్.

"ఓ! అయితే గవర్నమెంట్ ఖచ్చితంగా ఉందన్నమాట!" అంది ఎల్విరా. ఆమెరెండు అరటిపళ్ళుతిని చేయి కడుక్కుంది. మధ్యాహ్నంవరకూ తెలుగు ప్రజలగురించి ఎన్నో ప్రశ్నలువేసి వివరాలు సేకరించిందామె.

(1) భర్తలను పశువులసంతలోవలె కొనుక్కొనుట వీరిఆచారము. (2) మతాన్ని అడ్డుపెట్టుకుని ఎన్నియో పిల్లలను కనుట వీరి ఆచారము.(3)......

ఇలా చాలా విషయాలు ఆమెరాసుకుంటూటే నేను దొంగతనంగాచదివాను. (అవన్నీ మరోసారి మనవి చేసుకుంటాను.) మధ్యాహ్నం మా ఇంట్లో టీ పార్టీ.

టీ తాగుతుండగా కాలనీ మధ్యవరుసలోని ఇంట్లో పెద్ద కేకలు వినిపించినయ్. మరుక్షణం కాలనీలో చాలామంది అక్కడకు పరుగెత్తారు.

మేమూ, ఎల్విరాకూడా అక్కడకు చేరుకున్నాం. సంగతేమిటో మాకు ముందుగానే తెలిసిపోయింది.

కిరాతకరావు తన భార్యను రోజూచావగొట్టడం కాలనీలో అందరికీ తెలిసిన విషయమే! ఆమెను పుట్టింటినుంచి ఏవేవో ఖరీదయిన వస్తువులు తెమ్మని అతనూ,వాళ్ళమ్మా నానాహింసలు పెడుతుంటారు.

మేము వెళ్ళేసరికి పూర్తిగా కాలిపోయిన కిరాతకరావు భార్యశరీరాన్ని గది తలుపులు పగులగొట్టి బయటకు తీసుకొచ్చారు కొంతమంది.

మరికాసేపట్లో టాక్సీమీద చావుబ్రతుకుల మధ్య ఊగిసలాడుతున్న ఆమెని హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు.

"వాట్ హాపెన్డ్?" ఆందోళనపడుతూ అడిగింది ఎల్విరా.

"ఆ! మామూలే! కొత్తగా పెళ్ళయింది. భార్యనుచంపేస్తే, మళ్ళీ బోలెడు కట్నంతీసుకుని పెళ్ళిచేసుకోవాలని-అలా చేస్తున్నాడు" చెప్పాడు జనార్ధన్.

"మైగాడ్! మీ వాళ్ళు మనుషులా జంతువులా?" అందామె కోపంగా.

ఇంటికి చేరుకోగానే పుస్తకంతీసి "తెలుగు ప్రజలలో చాలామందికి భార్యలను కిరసనాయిలుపోసి తగలబెట్టుట ఆచారము." అని రాసుకుంది. మరి కాసేపుమిగతా ఆచారాలగురించి తనకు తెలియని విషయాలు వివరంగాచెప్పాడు శాయిరామ్.

"మీ తెలుగు సినిమా ఒకటిచూడాలి ఇవాళ!" అందామెకాసేపాగి.

"ఓ యస్! మేమూ సినిమాచూసి చాలారోజులయింది పదండి!" అన్నాడు గోపాల్రావ్.

అందరం రోడ్డుమీదకొచ్చాం. టాక్సీఖాళీగా కనిపించింది శాయిరాం డ్రైవరుతోమాట్లాడాడు.

"చాలీస్ రూపయాదేదో! అన్నాడు టాక్సీవాడు.

"నలభైఎందుకు? పదిహేనిస్తా!"

"పంద్రా?పంద్రా రుపయా ? హమ్ భీక్మాంగ్‌నేవాలోంకో దేతే-"

"అతను మాట్లాడేది ఏభాష?" అనడిగింది ఎల్వీరా.

"ఉర్దూ!"

"ఓ!ఐసీ!"

అందరం బస్‌స్టాపులో నిలబడ్డాం

బస్సువచ్చి ఆగింది.

ఫుట్‌బోర్డుమీద యాభయ్‌మంది వేలాడుతున్నారు.

బస్సు లోపలమాత్రం అన్నిసీట్లూ ఖాళీగా ఉన్నాయి.

మేము ఆఫుట్‌బోర్డుమీద జనాన్ని తోసుకుంటూ లోపలికెక్కడానికి ప్రయత్నించాం గానీ మావల్లకాలేదు. బస్సువెళ్ళిపోయింది.

"వాటీజ్‌దిస్? లోపలఖాళీ ఉండగా వీళ్ళంతా ఫుట్‌బోర్డ్ మీదే ఎందుకు నిలబడ్డారు?" ఆశ్చర్యంగా అడిగిందామె.

"ఫుట్‌బోర్డ్‌ట్రావెలింగ్ మా కాపిటల్ ప్రజలహాబీ! అందుకే త్వరలో కేవలం ఫుట్‌బోర్డులతోనే కొత్తరకంబస్సు తయారుచేస్తున్నారు" చెప్పాడురెడ్డి.

ఆమెవెంటనే తనపుస్తకంతీసి "ఫుట్‌బోర్డుమీద ప్రయాణించుట తెలుగు ప్రజలహాబీలలో ఒకటి" అనిరాసుకుంది.

మరో రెండుబస్‌లు ఆగకుండా పోతూనే ఉన్నాయ్ చివరకు ఓబస్‌ఆపాడు.

"కిదర్‌జానా?" అడిగాడు కండక్టరు.

"నారాయణ్‌గూడా."

"కిత్నేటికెట్?"

"ఛేటికెట్-" అంటూ అయిదురూపాయలనోటు ఇచ్చాను. కండక్టర్‌నోటువంకచూసి చిరునవ్వునవ్వి నా చేతికి నాలుగురూపాయలు ఇచ్చి వెళ్ళిపోయాడు.

"వాటెబౌట్ టికెట్స్?" అంది ఎల్వీరా ఆశ్చర్యంగా.

"సాధారణంగా ఇక్కడ టికెట్లివ్వరులెండి! దిసీజ్ నార్మల్" ఫ్రాంక్‌గా చెప్పేశాను.

"ఓమైగుడ్‌నెస్!"

అందామె ఆశ్చర్యంగా. ఆతరువాత ఆరష్‌లోనే పుస్తకంతీసి ఏదోరాసుకుంది.

"తెలుగువాళ్ళు అవినీతిపరులు అనిరాసుకుందేమో!" అన్నాడు శాయిరామ్ నా చెవిలో. సినిమాహాలుకి చేరుకున్నాం.

"ఈహీరో పేరేమిటి?" హాల్ బయటవున్న పెద్దకటౌట్‌ని చూస్తూ అడిగిందామె.

"రాజేష్‌కుమార్! తెలుగులో సూపర్‌స్టార్! అతను నటించిన సినిమాలకు ఎన్నో అవార్డులు వచ్చాయ్" చెప్పాడురెడ్డి.

"ఓ ఐసీ! ఏం సినిమాలవి?" కుతూహలంగా అడిందామె.

"అల్లుడేమేనత్తమొగుడు! సింహంరక్కింది! దగుల్బాజీ వెధవ...."

"ఆగండాగండి!" అరిచిందామె.

"ఏమిటి?" అడిగాడు జనార్ధన్ ఆగి.

"అల్లుడే మేనత్తమొగుడు అంటే ఏమిటి?"

"అంటే... అంటే సన్ ఇన్లా ఓన్లీ ఈజ్ ఆంట్స్ హజ్‌బెండ్."

"అంటే?" మళ్ళీ అడిగిందామె.

"అంటే...అంటే.... అదే!"

"కానీ అదెట్లాకుదురుతుంది? మీ తెలుగులో ఆ వరసలు ఉండవుగా?"

"అబ్బే-అలాంటివేమీ చూడరండీ మావాళ్ళు! టైటిల్ కొత్తగా ఉండాలి-ప్రాస కుదరాలి! అంతే."

"మిగతా అవార్డుఫిలిమ్స్ ఏమిటి?"

"సింహంరక్కింది-దగుల్బాజీ వెధవ- తీటగాడు."

"దగుల్బాజీ! వాటీజ్ దగుల్బాజీ-"

"అంటే వట్టిరోగ్ అన్నమాటండీ!"

"వెధవ అంటే?"

"అంటే వట్టివెధవ అని అర్థం."

గోపాల్రావ్ టికెట్లు తీసుకొచ్చాడు.

"తీటగాడు అంటే ఏమిటి?" అడిగింది ఎల్వీరా.

"అంటే-అంటే తీటగాడేనండీ" ఆలోచించి చెప్పాడు జనార్థన్.

అందరం హాల్లోకెళ్ళి కూర్చున్నాం.

సినిమా టైటిల్స్ వస్తున్నాయి.

వక్రవీర ప్రొడక్షన్స్ సమర్పించు- 'తెడ్డిపాలెం గిడ్డిగాడు' అన్న అక్షరాలను అతి కష్టం మీద చదివింది ఎల్వీరా.

"తెడ్డిపాలెం గిడ్డిగాడు అంటే ఏమిటి?" అడిగిందామె రెడ్డిని.

రెడ్డి ఓ క్షణం ఆలోచించి "ఆపేరుకి అర్థం ఏమిట్రా?" అంటూ శాయిరామ్‌ని అడిగాడు. శాయిరామ్ రహస్యంగా నన్నడిగాడు.

నేను రెండు నిమిషాలు ఆలోచించి "తెడ్డిపాలెం అంటే ఓ ఊరన్నమాట! అందులో గిడ్డిగాడు! అదీ సంగతి" అనిచెప్పాను.

"ఓ! కాని, గిడ్డిగాడు అంటే ఏమిటి" మళ్ళీ అడిగిందామె.

నాకేం చెప్పాలో తెలీలేదు. "గిడ్డిగాడూ... మీన్స్....మీన్స్...." అని గోపాల్రావ్‌వేపు చూశాను.

"గిడ్డిగాడంటే.... ఇది" అన్నాడు గోపాల్రావ్ సరయినపదం కోసం వెతుకుతూ

"ఇదంటే?"

"ఇదంటే అదే-ఇది! నిజం చెప్పాలంటే నాకూ సరిగ్గాతెలీదు" అనేశాడుచివరకు.

"అయ్ టూ డోన్ట్‌నో!" అన్నాడు జనార్థన్.

"వ్వాట్! గిడ్డిగాడు-తెలుగుపదమే కదా!" అడిగింది ఎల్వీరా.

"అఫ్‌కోర్స్ అఫ్‌కోర్స్" అన్నాం అందరం!

"మరి మీ మదర్‌టంగ్ తెలుగయిఉండి ఓ తెలుగు పదానికి అర్థం తెలీదా? వెరీబాడ్!" అందామె పుస్తకంతీస్తూ.

"ఆగండాగండి! నిజానికిది తెలుగుకాదండీ?"

"మరే భాష?"

"అసలే భాషాకాదండీ! అర్థంలేని మాట."

"మరి ఈ సినిమాకు అవార్డు కూడా వచ్చిందన్నారు. సిల్వర్ జూబ్లీఫిలిం అన్నారు-ఇలాంటి సినిమాకు అర్థంలేనిపిచ్చిపేరు ఎలా పెట్టారు?

"మా తెలుగు సినిమాలు అంతేనండీ! సాధారణంగా టైటిల్‌కి అర్థం ఉండదు" ఆమె వెంటనే పుస్తకంలో ఏదేదోరాసుకుంది.

"ఇందాక 'సింహంరక్కింది' అనేది మరో అవార్డ్ పిక్చరన్నారుకదా! దానర్థం ఏమిటి?"

"అంటే హీరో సింహం అన్నమాటండీ! అతను అందరినీ రక్కేస్తూంటాడు?"

"అంటే అడవిమనిషా?"

"కాదనుకోండి! నాగరికుడేగానీ రక్కేస్తుండటం వాడికిష్టం!"

"కానీ చేతుల్తో మామూలుగా ఫైట్‌చేయవచ్చు కదా! రక్కటం ఎందుకు?"

"టైటిల్ ఎలా వుంటే అలా చేస్తారండీ మా తెలుగు హీరోలు!చెయ్యకపోతే జనం చూడరు!"

"అవునండీ! వేటకుక్క అనేపిక్చర్లో మొదట్నుంచీ చివరివరకూ హీరోవిలన్ల అందరినీ కుక్కలా కరుస్తూనే ఉన్నాడు 'రాబందు రాక్షసి' సినిమాలో హీరోనోటితో అందరినీ చీల్చితినేశాడు. 'భల్లూక భస్మం' సినిమాలో హీరో భల్లూకంలా నడిచి గోళ్ళతో పొడుస్తుంటాడు."

"వెరీ స్ట్రేంజ్" అందామె తన పుస్తకంతెరుస్తూ.

"తప్పదండీ! అడవిమృగాల పేర్లకే ఎక్కువగిరాకి! వాటికోసమే జనం ఎగబడతారుగానీ మా హీరోలకోసంకాదు" సిగ్గుపడుతూ చెప్పాడు గోపాల్రావ్. ఆమె పుస్తకంలో ఏదోరాసేసింది.

సినిమా మొదలయింది.

హీరో విలన్ల ఫైటింగ్ మొదలు పెట్టారు.

"ఏమిటి వాళ్ళెందుకలా కొట్టుకుంటున్నారు?" ఆత్రుతగా అడిగింది ఎల్వీరా.

"సాధారణంగా ఫలానాకారణం అంటూ ఏమీ ఉండదు. ప్రతిపావుగంటకూ ఓ ఫైటింగు ఉండటం మామూలే!"

ఆసీనయిపోయింది.

హఠాత్తుగా హీరో హీరోయిన్ వెనుకపడి పాట మొదలెట్టాడు.

"వంగతోటలో వంగమాకు-దొండతోటలో పడబోకు రెండూ జాగ్రత్త పిల్లా..."

జనం కుర్చీల్లోనుంచి తప్పట్లు కొట్టారు.

"వాటీజ్‌దట్ ?" ఆశ్చర్యంగా అడిగింది ఎల్వీరా.

"ఆపాట సాహిత్యం వాళ్ళకు నచ్చిందికాబోలు..." అన్నాడు శాయిరామ్.

"దానర్థం ఏమిటో?"

మాకేం చెప్పాలో తెలీదు.

"అది డబుల్ మీనింగు సాహిత్యం"

"అంటే?"

"అంటే రెండర్థాలసాహిత్యం అన్నమాట ఒకటి మంచింది రెండోది బూతు"

"మైగుడ్ నెస్! అలాంటి సాహిత్యం మీ తెలుగు ప్రేక్షకులు విని ఆనందిస్తారా?"

"అందరూ కాదండీ! చాలామంది..." ఆమెను సరిచేశాడు జనార్థన్.

"మరి అలాంటి చెత్తసాహిత్యం మీ గవర్నమెంట్ బాన్‌చేయదా?"

"గవర్నమెంట్ ఉందోలేదో ఖచ్చితంగా తెలీదుకదండి-రేపు మా ఆఫీసులో అడిగిచెప్తా"

"అయినా అది సెన్సార్ వాళ్ళుచేయాల్సినపనికాదా" అన్నాడు రెడ్డి.

"మరి చేయరే" అడిగింది ఎల్వీరా.

"వాళ్ళకి పాపం సాహిత్యం తెలియదండీ! అసలు చాలామంది సెన్సార్‌మెంబర్లకి తెలుగుకూడా రాదు! వచ్చినకొద్దిమందీ కూడా బూతుయాక్షనే అభ్యంతరకరమయిన సాహిత్యం అనుకుంటారు."

"అదేమిటి? అంత తెలివితక్కువ వాళ్ళను సెన్సార్‌మెంబర్లుగా ఎలావేస్తారు?"

"అదిసరిగ్గా తెలీదుగానండీ, మొత్తానికి అలాగే మానేజ్ చేస్తారు."

మరికొంతసినిమా అయింది.

హఠాత్తుగా జనం పెద్దఎత్తున హర్షధ్వానాలుచేశారు.

"వాటిజ్‌దట్! వాట్‌హేపెన్డ్?" ఆశ్చర్యంగా అడిగింది ఎల్వీరా."మరేంలేదు!కెమెరా హీరోయిన్ బొడ్డుమీద ఫోకస్ అయింది అందుకని."

వాటే పోర్నోట్రైబ్ యూఆర్..." అసహ్యంగా మొఖంపెట్టి అందామె. మరుక్షణంలో హీరో గ్రూప్ డాన్స్.

"జఙ్ఝనకా జన్! జింగినక..," మళ్ళీ ప్రేక్షకులు తప్పట్లూ ఈలలు.

"ఏమిటి ఈచరణానికి అర్థం?" అడిగింది ఎల్వీరా.

"దీనిక్కూడా అర్థం ఏమీలేదండీ!

""మరివాళ్ళలా తప్పట్లూ, ఈలలు ఎందుకు వేస్తున్నట్లు?"

"ఏమో తెలీదుగానీ ఎప్పుడూ ఇలాంటి పాటలకు వేస్తుంటారు.-"

"అంటే మీ తెలుగు పాటలు సాహిత్యమంతా బూతుగానీ, అర్ధంలేని మాటలతో గానీ ఉంటుందన్నమాట! మరి నేను చదివిన పుస్తకాల్లో తెలుగు కవిత్వాన్ని గురించి అంతగొప్పగా రాశారేమిటి?" అంటూ పుస్తకం తెరచి "తెలుగు ప్రజల సాహిత్యమంతా అర్ధంలేనిది. ఒకవేళ అర్ధం ఉంటే అది బూతుది." అనిరాసుకుంది.

పాట అయిపోయింది.

కామెడీజంట వచ్చారు.

హీరో ఆమె దగ్గరకెళ్ళి "నాకు అదిస్తావా?" అన్నాడు

జనమంతా ఘెల్లున నవ్వారు.

"ఏమిటి మళ్ళీ నవ్వుతున్నారు?"

"బూతు డైలాగండీ!" సర్దిచెప్తూ అన్నాడు శాయీరామ్.

రెండునిమిషాలపాటు బూతుమాటలు మాట్లాడాక పాట మొదలయింది.

"మన తనువులు కలిసేదెక్కడ?" పాటలోనే ప్రశ్నించింది హాస్యనటి.

"ఇక్కడా?" అంటూ పెదాలు చూపించాడు కమెడియన్.

"కాదు!" అందామె.

"ఇక్కడా?" అంటూ ఆమె గుండెలు చూపించాడతను. ప్రేక్షకులు మళ్ళీ అరుపులు ఈలలు.

"ఇక్కడా?"

"ఉహు! ఇక్కడ!"

అతను చూపించిన శరీరభాగం చూసి మొత్తం హర్షంతో కేకలువేసి డాన్స్ చేసినంతపనిచేశారు. తరువాత సీన్‌లో హీరోయిన్ తాలూకూ చిన్న పాపాయిని చంపటానికి విలన్ అర్ధరాత్రి కత్తితీసుకుని గదిలోకొచ్చాడు. ఈ సంగతితెలిసి ఊరిబయటపుట్టలో ఉన్న పాముగంటకు ఎనభై కిలోమీటర్ల వేగంతో పరిగెత్తుకొచ్చి, కిటికీలోనుంచిదూరి, ఉయ్యాల మీదకెగిరి కత్తితో పొడవబోతున్న విలన్ చేతిని కసుక్కున కాటేసింది.

విలన్ పెద్దగా అరుస్తూ కిందపడ్డాడు. హీరోయిన్ పరుగుతో వచ్చి, ఆదృశ్యం చూసి పాముతల ఆప్యాయంగా నిమిరి ముద్దు పెట్టుకుంది.

"వాటీజ్‌దిస్ నాన్సెన్స్?" అసహనంగా అడిగింది ఎల్వీరా.

"ఈ సినిమా ఇంకా నయమండీ! గొర్రెపొటేళ్ళు ఎద్దులు, ఆవులు గాడిదలు పిల్లులు, బొద్దింకలు, ఎలుకలు ఇవన్నీ కూడా మా సినిమాల్లో హోరున యాక్షన్ చేస్తాయండీ! హీరోయిన్‌కిగానీ, హీరోకిగాని సహాయం చేసి విలన్లను చంపిపారేస్తాయ్" చెప్పాడు గోపాల్రావ్.

"మీకు తెలీదనుకుంటాను. ఈమధ్యనో తెలుగుపిక్చర్లో హీరోయిన్ రెండుతూనీగల్ని పెంచుతుంది. బాత్‌రూమ్ కెళ్ళినా-కాలేజీకెళ్ళినా ఎప్పుడూ ఆమెనే అంటిపెట్టుకుని ఉంటాయన్నమాట అవి! ఓవిలన్ సినిమా అంతా ఆమెని నానాబాధలు పెడుతూ చివర్లో రేప్ చేయబోతుంటే ఆరెండుతూనీగలు ఆవిషయం తెలుసుకుని కోపంగా ఎగిరి విమానాల్లా వాడిని ఛేజ్‌చేసి చివరకి వాడి మీదపడి రెండు కళ్ళూ పీకేస్తాయ్-కేవలం ఆసీనుకోసమే నూట ఇరవై ఆర్రోజులు ఆడింది ఆసినిమా!" చెప్పాడు శాయిరామ్.

"ఇంక వెళ్దామా?" అడిగింది ఎల్వీరా వాంతి ఆపుకుంటున్నట్లు మొఖంపెట్టి.- హఠాత్తుగా హాల్లో వున్న ఆడాళ్ళందరూ వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టారు.

"ఏమయింది? వాళ్ళెందుకు ఏడుస్తున్నారు?" ఖంగారుగా అడిగింది ఎల్వీరా.

"ఆడాళ్ళు ఏడవటానికి ఆఖరులో సెంటిమెంట్ సీన్లుపెడతారండీ! భర్తకాళ్ళు కళ్ళకద్దుకుంటూ ఏడ్చేసీన్లు, భర్తామెను చావగొట్టి పీక పిసుకుతున్నా "పతియే ప్రత్యక్షదైవం-ఆదైవం కాదంటే ఉరియే అత్యంత ప్రియం" అని పాడటం, తననొదిలేసి ఇంకో స్త్రీతో సంసారం చేస్తున్న భర్తకోసం, జీవితాంతం పాటలు పాడుతూ ఎదుర్చూడటం, భర్త ఇంకెవర్నయినా ప్రేమిస్తే-తనే వాళ్ళిద్దరికి పెళ్ళిచేయడం ఇలా చాలా బావుంటాయ్ సీన్లు-"

"చాలు! చాలు" అంది ఎల్వీరా వికారంగా మొఖం పెట్టి.

"అయినా మగాడిని ఇక్కడి స్త్రీలు దేవుడు అంటారేమిటి? ఇది నేనెక్కడా చూళ్ళేదు-" అందామె.

"నేను చూశాను" అన్నాడు రెడ్డి తెలుగువాళ్ళను ఆమె అలా ఇన్సల్టుచేయటం భరించలేక.

"ఎక్కడ?

"ఏమో గుర్తులేదు ! పాకిస్తాన్‌లో అనుకుంటాను!" అంటూ తప్పించుకున్నాడు. అందరం హాలు బయటకొచ్చేశాం రోడ్డుమీద ట్రాఫిక్ అంతా ఆగిపోయివుంది.

"మళ్ళీ ఏమిటి? రోడ్డుమీద పెళ్ళా?" చిరాకుగా అడిగిందామె.

గోపాల్రావ్ జనంలోంచి ముందుకు చొచ్చుకెళ్ళి సంగతి కనుక్కొచ్చాడు. ఏదో నబ్బుల కంపెనీవాళ్ళు-కొత్తగా తయారుచేసిన నబ్బు పబ్లిసిటీ కోసం వంద తాబేళ్ళను అలంకరించి రోడ్లమీద బాండ్‌మేళంతో ఊరేగింపుగా నడిపిస్తున్నారు. పాపం తాబేళ్ళు కొంచెం స్లోకదా! అందుకని ట్రాఫిక్ నిలచిపోయింది. గంటసేపటితర్వాత తాబేళ్ళు పదిగజాలదూరంలో వున్న సెంటర్ దాటాయి.

ఆతాబేళ్ళ వెనకే వెడుతున్న బస్ ఎక్కాం అందరం.

"ఇలా ఆ నబ్బుల కంపెనీవాళ్ళు ట్రాఫిక్కంతా జామ్‌చేశేస్తుంటే మీ పోలీసులేం చేస్తున్నారు?" అడిగింది ఎల్విరా.

"పోలీసులా? అవును! నిజమే! పోలీసులేం చేస్తున్నారు?" అన్నాడు రెడ్డికూడా ఆలోచిస్తూ.

"పాపం! పోలీసుల్నేం అనకండి! వాళ్ళకి తీరికేది? మినిష్టర్ల ఇళ్ళకికాపలా వుండాలి కాబరేడాన్సులు రోజూ చూసి, ఎప్పుడయినా ఓసారి కేసులు పెట్టాలి. దగ్గరుండి వీడియోపార్లర్లలో బ్లూ ఫిలిమ్స్‌వేయించాలి. ఎవరయినా 'వేయం' అని ఎదురుతిరిగితే దొంగకేసులు పెట్టాలి. వాళ్ళ అభిప్రాయాలతో ఏకీభవించని వాళ్ళను 'నక్సలైట్లు' అని అరిచి కాల్చి పారెయ్యాలి.మా బస్ రాత్రి పన్నెండింటికి తాబేళ్ళ ఊరేగింపు ముగిశాక, స్పీడ్‌గా పరుగెత్తి మమ్మల్ని కాలనీకి చేర్చింది.

అందరంరాళ్ళు తక్కువగా వుండేగోధుమ రొట్టెలు తిన్నాం.

"అబ్బ! నిదరొస్తోంది! గుడ్‌నైట్" అంది ఎల్విరా.

"అప్పుడే గుడ్‌నైట్ చెప్తున్నారేమిటి?" రెండింటివరకూ మేలుకోవాలి కదా!" అన్నాడు గోపాల్రావ్.

"ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగిందామె.

"రెండింటికి దొంగలొస్తారు ఊరి బయటకాలనీలకు! వాళ్ళొచ్చేటైముకి తలుపులు తెరిచి ఆహ్వానించకపోతే కాల్చిచంపేస్తారు."

"దొంగలకోసం తలుపులు తెరిచి ఆహ్వానించాలా? ఎంతఘోరం?"

"ఒకప్పుడు చాలా ఘోరమేననుకోండి! కానీ ఇప్పుడు అలవాటుపోయింది"

"మరి పోలీసులేం జేస్తు...సారీ! ఇందాకే చెప్పారుకదా!" రెండింటికి కాలనీలో ఓ ఇంటికి దొంగలొచ్చి వెళ్ళాక- అందరం గుడ్‌నైట్ చెప్పుకుని లేవబోతూంటే బయటినుంచి కేక వినిపించింది.

"పేపరు ఎవరి దగ్గరుంది మాష్టారూ?"

"ఎవరది?" అడిగింది ఎల్వీరా. ఆకేక ఎవరువేస్తారో మా అందరికీ తెలుసు. చివరింటి రామచంద్రం తాలూకు రోజువారి కార్యక్రమం అది. మా కాలనీలో అతనొక్కడే న్యూస్‌పేపర్ కొంటాడు. పేపరు రాగానే పక్కింటి అతను తీసుకుంటాడు. ఆతరువాత ఆపక్కింటి అతను. అలా తిరిగి తిరిగి ఎక్కడో వుండిపోతుంది. రాత్రి ఎనిమిదింటికి ఆఫీసునుంచి వచ్చాక ఆపేపర్‌కోసంగాలింపు మొదలుపెడతాడు, రామచంద్రం. ఇంటింటిముందు అరుస్తూ తిరుగుతాడు. కానీ ఇప్పుడా విషయంచెప్తే ఎల్వీరా తన పుస్తకంలో తెలుగు వాళ్ళు పక్కింటివాళ్ళ పేపరు చదవటమే కాకుండా, మళ్ళీ తిరిగి ఇవ్వరు." అని రాసుకుంటుంది. అందుకే మేము నిజం చెప్పలేదు.

"అతనెవరో పిచ్చాడులెండి! రోజూ అలాగే అరుస్తూంటాడు" అని చెప్పాను.

అప్పుడే పోలీస్‌వ్యాన్ ప్రకటనలు చేస్తూ కాలనీలోకొచ్చింది.

"జంట నగరాల్లో కల్లోలాలు జరగటంవల్ల రేపు ఉదయం ఆరుగంటలనుంచీ నిరవధికంగా కర్ఫ్యూ విధిండమైనది. ప్రజలందరూ గమనించప్రార్థన."

"కర్ఫ్యూనా" ఆందోళనగా అడిగింది. "అది మామూలేలెండి. మేము తరచూ కర్ఫ్యూలోనేవుంటాం" అన్నాడు శాయీరామ్.

ఆమె వెంటనే తన పుస్తకంలో,"తెలుగుప్రజలు ఎక్కువకాలం కర్ఫ్యూలోనే గడుపుదురు." అని రాసుకుంది. "ఇంక నిద్రపోండి" అన్నాడురెడ్డి.

"నోనో!నేను ఇప్పుడే ఎయిర్‌పోర్టుకెళ్ళిపోతాను" అందామె.

"అదేమిటి?"

"నా స్టడీ అయిపోయింది ఇంకిక్కడ ఒక క్షణం కూడా ఉండలేను!" అంది

అందరం ఆమెతోపాటు ఎయిర్‌పోర్టుకు బయల్దేరాం.టాక్సీవాడు "సౌరుపయా దేనా" అన్నాడు. "అస్సీరుపయా" అన్నాడు గోపాల్రావ్. చివరకు బేరంకుదిరింది.

"తెలుగు ప్రజలు ఉర్దూమాట్లాడుదురు." అని రాసుకుంది ఎల్వీరా మేము చూసికూడా చూడనట్లు వూరుకున్నాం. ✱

# నిరాహారదీక్ష లేక బగారా బైగన్



**మా నిర్భయ్** నగర్ కాలనీ ఎప్పుడూ ఏదొక సందడిగా ఉండటం మామూలేకదా! అందులోనూ అలా వారానికొకసారయినా సందడిగా ఉండేట్లు చేయడం మాకాలనీ ఆర్గనైజింగ్ సెక్రటరీ శాయిరాంకి మరీ సరదా!

వీధి కుక్కల్నిపట్టి బండిలోపడేస్తూ వేటాడే మున్సిపల్ బండిలాంటి ఆర్టీసిబస్సులో పడి అప్పుడే ఆఫీసునుంచి ఇంటికి చేరుకున్నాను.

స్నానం వగైరాలుముగించి ఇలా 'టీ' తాగి అలా న్యూస్‌పేపరు పక్కింటాయనను అడిగి తెప్పించుకున్నానో లేదో శాయిరామ్ హడావుడిగావచ్చేశాడు.

"త్వరగా పదగురూ! మీటింగుంది!" అన్నాడు గడపలో నిలబడి.

"మళ్ళీ ఏంమీటింగు?" చిరాకుగా అడిగాను.

"మన కాలనీరోడ్డు అధ్వాన్నపుస్థితిని గురించి మనం తీసుకోవాల్సిన చర్యలకోసం మీటింగు ఏర్పాటుచేశాంకదా! త్వరగా పద! అందరూ వచ్చేశారు." ఇంక తప్పదని లేచి బయల్దేరాను.

అప్పటికే జనార్ధన్ మైక్ ముందు నిలబడి మాట్లాడుతున్నాడు.

"కాలనీవాసులందరికీ నమస్కారం! సోదరులారా! మన కాలనీరోడ్డువేసి ఎంత కాలమయిందో ఎవరికీ తెలీదు. పాతనైజాంస్టేట్ వాళ్ళు వేసిననాటిరోడ్లని కొంతమందీ, కాదు, శ్రీకృష్ణదేవరాయలు వేయించిన రోడ్లని మరి కొంతమందీ, కాదు, అశోక చక్రవర్తి బాటకిరువైపులా చెట్లు నాటించే పథకంకింద ముందీబాటవేయించాడని ఇంకొంతమందీ ఇలా అనేకమంది అనేకరకాల అభిప్రాయాలు వెలిబుచ్చారు. కానీ ఇటీవల మనకాలనీ డిటెక్టివ్‌సాహిత్యం రచయిత్రి రాజేశ్వరి గారు పరిశోధించి ఈ రోడ్డుని హైద్రాబాద్ మునిసిపాల్ కార్పోరేషన్ వాళ్ళే వేశారనీ, అయితే అందుకు వాళ్ళు కంట్రాక్టర్లకిచ్చిన బిల్లులే ఆధారమనీ తేల్చారు. ఎందుకంటే ప్రస్తుతం ఆరోడ్డు ఉండేచోట దిగుడుబావుల్లాంటి గుంటలు తప్పితే ఇంకేమీ కనిపించటంలేదు. ఈ దారుణమయిన రోడ్డుకి కనీసం రిపేర్లయినా చేయించమని మనంపెట్టుకున్న అర్జీలగురించి పట్టించుకునేవారే లేరు. అంచేత మనం ఏంచేయాలో నిర్ణయించడానిగ్గాను ఇక్కడ సమావేశమయ్యాం!

ఈ విషయంలో అందరూ తమ తమ అమూల్యమయిన సూచనలు అందించవలసిందిగా కోరుతున్నాము-జైహింద్!" అంటూ ఉపన్యాసం ఆపాడతను. ఎవరూతప్పట్లు కొట్టలేదు.

"అమధ్య రామంతపూర్ కాలనీవాళ్ళు ఇలాగే వాళ్ళ రోడ్డు రిపేరుకోసం నిరాహార దీక్షచేసి, సాధించారుకదా! మనమూ అదే చేద్దాం!" అన్నాడు గోపాల్రావ్.

"అవును! ఈరోజుల్లో అదొక్కటే ఎఫెక్టివ్ మెథడ్" అన్నాడు రెడ్డి.

"అవునవును! అదే బెస్ట్" అంటూ అరిచారు ఇంకొంతమంది.

అప్పటికప్పుడే గోపాల్రావ్ సూచన ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

"ఇప్పుడు మనలో నిరాహారదీక్ష ఎవరు చేయాలోకూడా మన నిర్ణయం తీసుకుంటే రేపే నిరాహారదీక్ష ప్రారంభించవచ్చు!" అన్నాడు శాయీరామ్ మైక్ ముందుకొచ్చి.

అందరూ మొఖమొఖాలు చూసుకున్నారు. పరిస్థితి గమనించి జనార్ధన్ మైక్ దగ్గర కొచ్చాడు. "మనలో ఎవరయినా వాలంటీర్లు నిరాహారదీక్షకోసం తమ పేర్లు ఇవ్వవలసిందిగా కోరుతున్నాం!" అన్నాడు చిరునవ్వుతో.

అందరూ ఎవరయినా పేర్లు ఇస్తున్నారేమోనని వెనక్కు తిరిగి చూశారు కాని ఒక్కడూ నోరు మెదపలేదు.

"కేవలం మగాళ్ళే నిరాహారదీక్ష చేయాలనేంలేదు, స్త్రీలుకూడా పాల్గొంటే బావుంటుంది!" అన్నాడు రెడ్డి. అయినా ఎవరూ ముందుకి రాలేదు.

"ఎవరో ఎందుకు? మన కాలనీ కమిటీ కార్యనిర్వాహకవర్గం వారందరూ చేస్తే సరిపోతుంది!" అనరిచాడు రంగారావ్ వెనకనుంచి.

నా గుండెలు ఝల్లుమన్నాయ్. గోపాల్రావ్, జనార్ధన్, శాయీరామ్‌ల మొఖాలు కూడా పాలిపోయినయ్ గానీ అది కనిపించకుండా నానా తంటాలూ పడుతున్నారు.

"అవ్! జర కాలనీల పేరుగిట్ట ఉన్నోళ్ళుచేస్తేనే ఖదరుంటది!" అన్నాడుయాదగిరి.

అందరిలోకీ ముందు జనార్ధనే కోలుకున్నాడు.

"సోదరులారా! మేము నిరాహారదీక్షచేయటానికి మాకేం అభ్యంతరంలేదు! కానీ ఇక్కడో టెక్నికల్ డిఫికల్టీ ఉంది. అదేంటంటే వేరేవాళ్ళు ఎవరయినా నిరాహారదీక్ష ప్రారంభించినట్లయితే- మేము అధికారుల దగ్గరకూ, ఇతర రాజకీయ నాయకుల దగ్గరకూ, వెళ్ళి వత్తిడి తెచ్చి త్వరగా రోడ్ రిపేరు చేయించేందుకు వీలుంటుంది. కనుక మీలోనే ఎవరొకరు-" మళ్ళీ నిశ్శబ్దం.

రంగారెడ్డి మైకు ముందు కొచ్చాడు.

"ఇంతకాలం ఎన్నో ధైర్యసాహసాలకు పేరుపొందిన మన కాలనీలో నిరాహారదీక్ష జరిపేందుకు ఒక్క వ్యక్తి కూడా ముందుకు రావటం లేదంటే మనకాలనీకే అవమానం! నిజానికి నిరాహారదీక్షకు నేనంటే నేనని జనం ముందుకురావాలి!"

హఠాత్తుగా జనంలో తోపులాట కనిపించింది.

రెడ్డి ఆనందపడ్డాడు "ఆ! అదేమనక్కావలసింది అదీస్పిరిట్ అంటే"

"అళ్ళు నేనంటే నేననికాదు దకలాయిస్తున్నది. నువ్వంటేకాదు నువ్వని నూకుతున్రు" అన్నాడు యాదగిరి.

అరగంట గడిచిపోయింది. ఒక్కరుకూడా వేదికవేపు రావడంలేదు.

గోపాల్రావ్ మైకు ముందు కొచ్చాడు.

"సోదరులారా! మన కాలనీ యాక్టివ్ మెంబరయిన శ్యామల్రావ్‌గారిని నిరాహారదీక్ష చేయవలసిందిగా మీ అందరితరుపున కోరుతున్నాను. ఎందుకంటే ఆయనకు రాజకీయల్లో కూడా అనుభవం ఉంది గనుక!" అక్కడున్నవారి కరతాళధ్వనులు ఆకాశాన్నంటినయ్.

శ్యామల్రావ్ గాబరాగా నుంచున్న చోట నుంచే అరచాడు.

"నాకు ఆనందమే కానీ- నేను ఇవాళ అర్జంటుగా ఖమ్మం వెళ్ళాలి"

"ఎందుకు?"

"అక్కడ మా తమ్ముడి పెళ్ళివుంది" అన్నాడతను.

"అదేమిటి? మీకెవరూ తమ్ముళ్ళు లేరని చెప్పారుగా?"

"అది కేవలం ఈపాడు మతిమరుపువల్ల చెప్పి ఉంటాను! క్షమించండి! వస్తా! బస్సు టైమయింది" అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు

"పోనీ రెడ్డిగారినే చేయమనండి" ఎవ్వరో అరచారు జనంలోనుంచి. రెడ్డి అదిరిపడ్డాడు.

"అయ్యో నాపేరు ఒకరుచెప్పేంతవరకూ కూడా నేను ఆగేవాడినికాదు అంత యిష్టంనాకు నిరాహారదీక్షలంటే! కానీ ఈమధ్య మా డాక్టరుగారు నేను ప్రతిరెండుగంటలకు ఓసారి ఫలహారమో, భోజనమో చేయాలనీ లేకపోతే దారుణమయిన కడుపునొప్పి వస్తుందనీ చెప్పారు. అంచేత ఇలాంటి అద్భుతమయిన అవకాశం పోగొట్టుకుంటున్నందుకు నాకెంతో ఇదిగా ఉంది" అంటూ నెమ్మదిగా స్టేజిదిగి ఓపక్కగా నిలబడ్డాడు.

జనార్ధన్ మైక్ ముందు కొచ్చాడు మళ్ళీ.

"సోదరులారా! ప్రస్తుతపరిస్థితిలో ఒకే ఒక మార్గం కనబడుతోంది. అదేంటంటే అందరి ఇళ్ళనంబర్లూ చీటీమీదరాసి అందులో నుంచి ఓచీటితీసి ఆ ఇంటినెంబరున్నవాళ్ళతో నిరాహారదీక్ష చేయంచడం! ఎలా వుంది మన ప్లాను?"

అంతా "అద్భుతం" అంటూ తప్పట్లు కొట్టారు.

మరుక్షణంలో అందరి ఇంటినంబర్లూ చీట్లమీద వరుసగారాసి ఓ కుప్పగా పోశారు. ఓ ఆరేళ్ళకుర్రాడిని పిలిపించి ఆ పోగులోనుంచి చీటి తీయమన్నారు. అంతా నిశ్శబ్దం అలుముకు పోయింది. కుర్రాడు చీటీ తీసి జనార్ధన్‌కిచ్చాడు. జనమంతా ఊపిరి బిగపట్టి చూస్తున్నారు. శాయిరామ్ ఆచీటీ చూసి మైక్‌లో ఆఇంటినంబరు చదివాడు.

చదివిన మరుక్షణం జనం మధ్యనుంచీ దబ్బుమన్నశబ్దం వినిపించింది. అందరూ కోలాహలంగా అటువైపు పరుగెత్తారు. నేనూ పరుగెత్తి "ఏం జరిగింది?" అనడిగాను.

"ఎవరో పడిపోయారు!" అన్నాడు రెడ్డి. పడిపోయిన అతని ముఖంమీద నీళ్ళు కొట్టాక నీరసంగా లేచినిలబడ్డాడు. అతనిని చుస్తూనే గుర్తుపట్టాను, వెంకట్రావ్. "ఇంటి నంబరు ఇంకోసారి చెప్పండి" అన్నాడతను నీరసంగా.

శాయిరామ్ ఇంటి నంబరు మళ్ళీచదివాడు.

"ఎవరిదీ ఇంటినెంబరు?" అడిగాడు జనార్ధన్.

"మాదే!" అన్నాడు వెంకట్రావ్ నీరసంగానే.

"ఓహో అదాసంగతి! మరింకేం ఇలాంటి అవకాశం దొరికినందుకు ఆనందించక అలా కంగారు పడతావేమయ్యా. పద పద" అంటూ అప్పటికప్పుడే వెంకట్రావ్‌ని స్టేజీమీదకుతీసుకెళ్ళి అందరికీ పరిచయం చేశాడు గోపాల్రావ్.

"సోదరులారా! పువ్వు పుట్టగానే పరిమళించినట్లు, వెంకట్రావుగారికి చిన్నప్పటి నుంచీ కూడా నిరాహారదీక్షలంటే ఇష్టం అట. అలాంటి మహానుభావుడికే మళ్ళీ అలాంటి అవకాశం రావడం నిజంగా చాలా గొప్ప విషయం! చాలా అద్భుతమయిన విషయం! చాలా..."అనిఇంకేమీ పదాలుదొరకక "అంతే!" అన్నాడు. మీటింగ్ ముగిసిపోయింది.

వెంకట్రావ్ పైకి ధైర్యంగా ఉన్నట్లే కనబడుతున్నా, లోలోపల తెగ భయపడుతున్నట్లు కనిపించాడు. "ఘుమారుగా ఎన్నిరోజులు నిరాహారదీక్షచేయాలంటారు?" అన్నాడు దిగులుగా.

"ఆ-ఎంత? నాలుగయిదు రోజులు- ఈలోగా మేము ఊరేగింపులు,ధర్నాలు, జరిపి కనీనం వెంటనే మొదలుపెడతామన్న 'హామీ' అయినాతీసుకుని నిరాహారదీక్ష విరమింపజేసేస్తాం!"

నాలుగురోజులనేసరికి వెంకట్రావుకి ధైర్యం వచ్చేసింది.

"ఓశ్! ఇంతేనా! నాలుగయిదు రోజులు ఓలెఖ్ఖా ఏమిటి? ఎనిమిదేళ్ళక్రితంనాకు జ్వరం వచ్చినప్పుడు పదిరోజులు తిండిలేకుండా గడపలేదాఏమిటి?" అన్నాడు ఉత్సాహం తెచ్చుకుంటూ.

"అంతేకాదు! ఇంకో సంగతికూడా ఆలోచించు! నువ్వెలాగూ ఎలక్షన్లో నిలబడాలను కుంటున్నావు కదా! దానికి ఇంతకంటే మంచి ఛాన్స్‌దొరకదు ఈ నిరాహారదీక్షతో నువ్వు పెద్ద పాపులర్ ఫిగరయిపోతావు ఈఏరియాలో! మన నాయకులు చాలామంది ఇలాగే కదా ఎన్నికయింది" అన్నాడు రెడ్డి ప్రోత్సాహంఇస్తూ.

ఆమాట వెంకట్రావు మీద షార్ట్ సర్క్యూటింగ్‌లాగా పనిచేసింది.

"అవును! ఎలక్షన్లు కూడా దగ్గరకొస్తున్నాయ్ కదా. నాలుగయిదురోజులేకాదు! ఇంకో గంట ఎక్కువయినా ఫరవాలేదు నేను బ్రహ్మాండంగా నిరాహారదీక్ష చేస్తాను" అన్నాడు వెంకట్రావ్.

వెంకట్రావ్ వెళ్ళిపోయాక మా కార్యవర్గం మళ్ళీ అత్యవసరసమావేశం జరిపాము.

"వెంకట్రావ్ నిరాహారదీక్షచేయటం ఖాయమేగానీ, అతనికి మంచి వంటకాలంటే కొంచెం వీక్‌నెస్ ఉన్న విషయం మీకు గుర్తుందికదా?" అన్నాన్నేను పాత విషయాలు గుర్తుకితెస్తూ

"అవునవును! ఈడెన్‌గార్డెన్‌లో వాడు చేసిన పని ఎలా మరచిపోతాం!" అన్నాడు శాయిరామ్. ఈడెన్ గార్డెన్ అనేది ఒకమారేజ్‌హాల్. ఓ రోజు మేమందరం మాట్నీసినిమాకెళ్ళి ఆ రోడ్ వెంబడివస్తోంటే ఆ పెళ్ళి ఆవరణలోనుంచి నోరూరించే వంటకాల వాసనలువచ్చి ఎటాక్ చేసినాయ్.

"ఆహా! బగారాబైగాన్" అన్నాడు వెంకట్రావ్ .వంటకాల్లో బగారా బైగన్ (గుత్తి వంకాయకూర) ఒకటన్న విషయం మా అందరికీ తెలుసు.

"అయితే ఏమంటావు?" అడిగాడు గోపాల్రావ్.

"నేను వెళ్ళి భోజనంచేసి వస్తాను-మీరు పదండి!"

"అదేమిటి? ఇది ముస్లిమ్స్ పెళ్ళికదా? వాళ్ళు పిలవందే ఎలా వెళ్తావు?" ఆశ్చర్యంగా అడిగాడు జనార్ధన్.

"అయితేనేం హిందూముస్లిం భాయ్! భాయ్! ఖుదా హాఫిజ్!" అనేసి పెళ్ళిలోకి జొరబడిపోయాడు. మేము మా దారినకాలనీ కొచ్చేశాము.

గంటసేపటి తర్వాత అతను కాలనీలో మా ఇంటి ముందు నుంచి టిఫిన్ కారియర్ పట్టుకెళ్తూంటే భోజనంచేశాడో లేదో కనుక్కుందామని పిలిచాను.

"భలేవాడివే గురూ! భోజనంచేయకపోవడం ఏమిటి? తీరాచూస్తే ఆ పెళ్ళి ఎవరిదో కాదు! మనాఫీసులో హాకీప్లేయరు నిసార్‌గాడు లేడూ? వాడికిచాలా దూరపు బంధువులదట! నేను నిసార్‌గాడి ఫ్రెండ్‌నని పరిచయం చేసుకుని దూసుకెళ్ళిపోయాను. నాకు బగారా బైగన్ ఇష్టమన్జెప్పి- కారియర్‌లోకొంచెం కూర ఇమ్మనిరిక్వెస్ట్ చేస్తే పాపం ఆపెద్ద మనిషి పేరేంటంటే... ఆ! అబ్దుల్ ఖాదర్-అదే పిల్లతండ్రి-వెంటనే ఈ టిఫిన్లో బగారా బైగన్ బోలెడు పెట్టి ఇచ్చాడు. టిఫిన్ రేపొద్దున్న వాళ్ళింట్లో ఇచ్చేస్తానని చెప్పాను"

ఇది ఒక్కటేకాదు! ఇలాంటి కథలు కాలనీలో ఎన్నెన్నో జరిగినాయి. యాదగిరి వాళ్ళింట్లో బంగాళాదుంపల బజ్జీలు చేస్తున్నారని తెలిసి అమాంతం వంటింట్లోకెళ్ళి ప్లేటుతీసుకుని కూర్చోవటం, జనార్ధన్‌వాళ్ళింట్లో పెసరట్లు వేస్తున్నట్లు వాసననుబట్టి పసిగట్టి లోపలకుదూరి జనార్ధన్ భార్యనుఅడిగి డజనుపెసరట్లు వేయించుకుని తినేయడం- ఇది రాన్రాను చాలామామూలు విషయమైపోయింది మా అందరికి.

"క్యాకీభాయ్! మనోడు మంచిగా నిరాహారదీక్ష చేస్తాడని నాకు నమ్మకంలేదు!" అన్నాడు యాదగిరి.

ఏదేమయితేనేం వెంకట్రావ్ నిరాహారదీక్షలో ఉన్నన్నిరోజులూ మాకాలనీలో ఎవరూ వాడికిష్టమయిన వంటకాలు చేయకూడదన్న తీర్మానం ఒకటిపాస్ చేశాము. మర్నాడు పొద్దున్న

గోపాల్రావ్ అన్ని పేపర్లలోనూ వెంకట్రావ్ ఫోటో వేసి నిరాహారదీక్ష ప్రారంభించబోతున్న న్యూస్ రాయించేశాడు.

దాంతో మా ఏరియాలో పెద్ద సంచలనం చెలరేగింది.

మా కాలనీ అవతల దూరంగా ఉన్న వీకర్ సెక్షన్‌కాలనీ వాళ్ళంతా పదిగంటల కల్లా ఆనందంగా మాకాలనీ కొచ్చేశారు- నిరాహారదీక్ష తంతుచూడ్డానికి.

మేళ తాళాలతో రోడ్డుపక్కనే ఉన్న పెద్దషామియానాలోకి వెంకట్రావ్‌ని తీసుకెళ్ళాం. వెంకట్రావ్‌కి ఎక్కడిదో రాజకీయనాయకుడి డ్రస్ తగిలించారు మావాళ్ళు.

నిజంచెప్పొద్దూ! ఆవేషం వాడికిసూటయింది! ఇక గుణగణాలంటారా! అవీ రాజకీయ నాయకుడి గుణాలకు దగ్గరగానే ఉన్నాయ్. ఆఫీసులో లంచాలు పడుతుంటాడు! మందు కొడుతుంటాడు! ఇలా మరిన్ని చిల్లర దురలవాట్లు ఉండనే ఉన్నాయ్! అంచేత రాజకీయాల్లోకి దిగాలనేవాడి కోరికలో అసమంజసం ఏముంది? షామియానాలోకి రాగానే మా కాలనీవాళ్ళు రెండు దండలువేశారు మెడలో. ఆతరువాత వీకర్ సెక్షన్ కాలనీ వాళ్ళందరూ కలసి ఓదండవేసి మొఖానికి బొట్టుపెట్టారు. ఎందుకంటే ఆరోడ్‌పాడవటంమూలాన ఆర్టీసీ బస్‌లు ఆరోడ్డుమీద తిరగడం మానేసినయ్. ఆటోరిక్షాలవాళ్ళు, రిక్షావాళ్ళూ ఆ రోడ్డుమీద ససేమిరా నడవడానికి వప్పుకోవటంలేదు. ఇందువల్ల మాతోపాటు ఆకాలనీవాళ్ళుకూడా నరకయాతన అనుభవిస్తున్నారు.

వెంటనే మేమంతా నినాదాలు ప్రారంభించాం.

"వెంకట్రావ్" అన్నాడు యాదగిరి. "జిందాబాద్" అన్నాం మేము.

"ప్రజలకోసం ప్రాణాలర్పించడానికి సిద్ధపడి నిరాహాదీక్ష చేస్తున్న వెంకట్రావ్- "వర్ధిల్లాలి."

"దేశ్ కీ నేతా-"

"వెంకట్రావ్ బన్‌తా!"

"దేశ్‌కీ నేతా కైసేహో!"

"వెంకట్రావ్ జైసేహో!"

"వెంకట్రావ్ వెంట్రావ్!"

"జిందాబాద్- జిందాబాద్!"

వెంకట్రావ్ షామియానాలో ఏర్పాటు చేసిన పరుపుమీద కూర్చున్నాడు. ఆరోజు ఆదివారం కాబట్టి అందరం షామియానాలోనే గడిపాము.

సాయంత్రంమయేసరికి వెంకట్రావ్‌కి భోజనంమీదకు మనసు మళ్ళినట్లుంది.

"మీ ఇంట్లో ఏం కూర?" అని అందరినీ అడగడం ప్రారంభించాడు.

మేము ముందే ఏం చెప్పాలో నిర్ణయించుకుని ఉండడంవల్ల "అబ్బే! కూరేంలేదు. పచ్చడీ, చారునూ! అసలే ఎండలుకదా కూరగాయలు దొరకటంలేదు!" అంటూ చెప్పేశాము. కొద్దిసేపు సైలంటుగా ఉన్నాక-

"పోనీ రాత్రి పొద్దుపోయాక కొంచెం పచ్చడన్నం లాగిస్తాను ఏమంటారు." అన్నాడు హఠాత్తుగా.

అందరం అదిరిపడ్డాం.

"అదేమిటి? నిరాహారదీక్ష ప్రారంభించాక పచ్చడన్నం అంటావేమిటి?"

"ఆ! ఎవరు చూస్తారులెద్దూ! అంతా మన కాలనీ వాళ్ళేగా"

"అయినాగాని అట్లాతినొద్దు తమ్మీ! గట్లచేస్తేగలత్ అవుతది! నేనే నిన్ను అరెస్ట్‌జేయాల మళ్ళా!" అన్నాడు ఓ మీసాలతను. అందరం ఆ మీసాలతనివంక ఆశ్చర్యంగా చూశాం! అవి మాకాలనీ తాలూకూ మీసాలుకావు. మా కాలనీలో మీసాల్రావ్‌లెవరూలేరు.

"మీరెవరు?" మర్యాదగా అడిగాము.

"పోలీస్‌డిపార్ట్‌మెంట్! ఈ నిరాహారదీక్షలు చేసేటోళ్ళు గిసంటి దందాలుచేయకుండా మఫ్తీలో పహరాకొచ్చినా" అన్నాడతను. వెంకట్రావ్ మొఖం మాడిపోయింది.

"అబ్బే మా వాడు 'జోక్' కోసం అంటున్నాడంతే!" అన్నాం మేముసర్దేస్తూ.

"అవున్సార్! ప్యూర్ 'జోక్' అంతే!" అన్నాడు వెంకట్రావ్ కూడా అతి కష్టంమీద నవ్వుతూ.

"ఆయనెప్పుడూ అంతే నన్నా! భోజనంచేస్తా, చేస్తానని దిల్లగీ చేస్తుంటాడు!" అన్నాడు యాదగిరి! మీసాలకానిస్టేబుల్ మా మాట నమ్మాడు.

ఆ రాత్రి గడిచిపోయింది.

మేమంతా ఆ సాయంత్రం పెద్ద ఊరేగింపుతో మున్సిపాల్ కార్పొరేషన్‌కెళ్ళి స్పెషల్ ఆఫీసర్‌కి ఓ మెమొరాండం అందజేయాలని నిర్ణయించుకున్నాం.

తీరా ఆఫీస్‌నుంచి వచ్చేసరికి అక్కడి దృశ్యం భయంకలిగించింది. షామియానా కెదురుగా ప్రభుత్వమొబైల్ కాంటీన్‌వాన్ ఆగివుంది. అందులో వివిధ రకాలఫలహారాలు వాసనలు ఘుమఘుమలాడుతూ బయటికొస్తున్నాయ్.

వెంకట్రావ్ ఆ కాంటీన్ వేపే గుడ్లప్పగించి చూస్తున్నాడు. మా కాలనీపిల్లలు కొంతమంది అప్పటికే వాన్ చుట్టుచేరి మిరపకాయబజ్జీలు తినేస్తున్నారు. నేనూ, యాదగిరి హడావిడిగా వాన్ దగ్గరికెళ్ళాం.

"ఈ వాన్ ఈడకెళ్ళి తీసేయాలి జల్ది" అన్నాడు యాదగిరి డ్రైవరుతో.డ్రైవర్ చిరునవ్వు నవ్వాడు.

"ఎందుకు తీయాలిసార్! ఇది మీసొంతభూమా?"

"కాకపోయినాగానీ మా కాలనీవాళ్ళ అనుమతి లేనిదే లోపలకురావద్దు."

"మాకు పోలీస్ కమీషనర్‌గారు పర్మిషనిచ్చారు!"

ఇద్దరం ఉలిక్కిపడ్డాం.

"పోలీస్ కమీషనర్‌గారా?"

"అవును!"

"ఆయనెందుకిచ్చారు పర్మిషన్?"

"ఇయ్యాళ రేపు ఈ నిరాహారదీక్షలు బంద్ చేయడానికి కొత్త అయిడియాచేసిన్రు. గిట్లా కాంటిన్లు పెట్టి నిరాహారదీక్ష చేసేటోళ్ళకు ఫలహారాలుసూపిస్తే అళ్ళు అదీక్షబంద్ చేసి తినెడిది షురూచేస్తరు."

మా కందరికీ కాళ్ళుచేతులూ వణకసాగినాయ్.

మిగతా వంటకాలు చేసినన్ని రోజులూ వెంకట్రావ్‌ని ఎలాగోలా ఆపవచ్చుగానీ, ఆలూ బజ్జీలూ, పెసరట్లు, బగారా బైగన్ తయారుచేస్తే మాత్రం వెంకట్రావ్‌ని భగవంతుడు కూడా ఆపలేడు.

ఈలోగా వీకర్ సెక్షన్ కాలనీవాళ్ళు ఊరేగింపుగా వచ్చేశారు మా కాలనీకి. "పదండ్రి జల్దీ!" అన్నారు వాళ్ళ లీడర్లు. అప్పటికప్పుడే మా కాలనీవాళ్ళు ఆడా మగా అంతా ఊరేగింపులో కలిసిపోయాం. వెంకట్రావు మొబైల్ కాంటీన్‌కెళ్ళకుండా యాదగిరిని కాపలా పెట్టాం. ఆడవాళ్ళజట్టుకి రాజేశ్వరి నాయకత్వంవహించింది.

"మనిషికి కూడూ బట్టే కాదోయ్, రోడ్డుకూడా ఉండాలోయ్" అంటూ పాటలు పాడుతు న్నారు కొంతమంది.

మెమొరాండం సమర్పించాక తిరిగివచ్చేటప్పుడు, ఆర్టీసి బస్సులమీద రాళ్ళురువ్వారు మాలో కొంతమంది! ఏమిటంటే శాస్త్రంకోసం రువ్వారట-ఆనవాయితీ చెడగొట్టకూడదని! మేము వెంటనే అడ్డుపడి ఆపివేశాము.

మర్నాడు పేపర్లో వార్త మాకందరికీ ఆశ్చర్యం కలిగించింది.

"మంత్రిగారు స్వయంగా మాకాలనీ రోడ్డు స్థితి సమీక్షించేందుకు మరో రెండురోజుల్లో వస్తున్నారట! అయితే వారొచ్చేలోగా నిరాహారదీక్షలు ఆపేయాలట!"

అప్పటికప్పుడు ఎమర్జెన్సీ మీటింగ్ జరిపాము.

"ఇదంతా మోసం! మనవాడు నిరాహారదీక్ష ఆపేశాడంటే-మళ్ళీ రోడ్డుగతి ఎవరూ పట్టించుకోరు!" అన్నాడు గోపాల్రావ్.

"అవును! రామగిరి కాలనీలో అలాగే జరిగింది కదా!" అన్నాడు రెడ్డి.

ఆ సాయంత్రం పోలీస్ కమీషనర్ స్వయంగా మా కాలనీకొచ్చారు, వ్యాన్ వేసుకుని. ఆయనతోపాటు మరికొంతమంది అధికారులు-

అందరూ షామియానా కెదురుగ్గానే కుర్చీలు వేసుకుని రకరకాల ఫలహారాలు ప్లేట్లో తీసుకుని వేడివేడిగా తినసాగారు మా అందరికీ కూడా నోరూరిపోతోంది. వెంకట్రావ్‌కి ఆ దృశ్యాలు కనబడకుండా కొంతమంది అడ్డునిలబడ్డాం. అక్కడ మూగిన కాలనీ పిల్లలని పిలిచి ఉచితంగా బజ్జీలు, సమోసాలు ఇచ్చారు పోలీసులు.

మేము పిల్లలను చావగొట్టి ఫలహారాలు వాపస్ చేసేశాము. లేపోతే వెంకట్రావ్ లేచివెళ్ళి ఆ ఫ్రీసరుకు తినేస్తాడేమోనని అనుమానం.

ఈలోగా మఫ్టీలో కొంతమంది కానిస్టేబుల్స్ కాలనీఅంతా తిరిగి వెంకట్రావ్‌కిష్టమయిన వంటకమేదో తెలుసుకోడానికి ప్రయత్నించసాగారు. ఈసంగతి తెలియగానే మేము పిల్లలందరినీ అన్ని ఇళ్ళకూ పరిగెత్తించి వెంకట్రావ్ కిష్టమైనది 'బగారా బైగాన్' అన్న సంగతి పోలీసులకు తెలియనీయవద్దని హెచ్చరికలు చేశాము.

తమప్లాను పారకపోయేసరికి పోలీసుకమీషనర్‌గారు కొత్త పథకం ఆలోచించారు. పూటకు ఆయిదారురకాల వంటకాలచొప్పున తయారుచేసి వెంకట్రావ్‌కి కనిపించేలా తినాలని ప్లాను! అందులో వెంకట్రావ్ కిష్టమయిన వంటకం ఉంటే అతగాడు ఇక ఎగిరిదూకి వచ్చేస్తాడని అయిడియా.

అదృష్టవశాత్తూ వాళ్ళు ఆరోజు వండిన వంటకాలలో బగారాబైగన్ రాలేదు. ఓ పక్క వెంకట్రావు పరిస్థితి విషమించిపోతోంది. "ఇంక చాల్లెండి! నాకాకలేస్తోంది. నేనుండలేను కావాలంటే మరోసారి ఇంకో రెండురోజులుచేస్తాను నిరాహారదీక్ష!" అనడిగాడు అసహనంగా ఆకలి చూపులు చూస్తూ-

"పిచ్చివాడా! అంత తొందరెందుకు? ఓపక్క అసెంబ్లీలో నీ నిరాహారదీక్ష గురించి గొడవచేయిస్తున్నాం! ఇంకొక్కరోజు ఓపిక పట్టుచాలు! ఈలోగా ఎవరోకరి హామీ అయినా తీసుకుందాం కనీసం" అంటూ నచ్చజెప్పాము.

సరిగ్గా అప్పుడే కమీషనరుగారు ఓ ప్లేట్లో వేడివేడి బజ్జీలు వేసుకొచ్చి ఎదురుగ్గా నిలబడి మా అందరికీ ఆఫర్ చేసేసరికి వెంకట్రావు స్ప్రింగులా ఎగిరినిలబడ్డాడు అందుకోటానికి. అతనిచేయి ప్లేట్లోకి వెళ్తూండగా మేమంతా ఒక్క దూకుదూకి వాడి చేయి వెనక్కు విరిచేసి వాడిని కిందపడేసి లేవకుండా నొక్కి పట్టాము.

పోలీస్ కమీషనర్ చిరునవ్వునవ్వాడు. "మీ అందరినీ అరెస్ట్ చేస్తున్నాను" అన్నాడు నాదగ్గరకొచ్చి.

"ఎందుకు?"

"ఒక వ్యక్తిని నిర్బంధించి తిండి పెట్టకుండా హత్యచేయడానికి ప్రయత్నిస్తున్నందుకు."

"అతను నిరాహారదీక్ష చేస్తున్నాడండీ! మేమెక్కడ నిర్బంధించాం"

"మరి అదేమిటి? పాపం అతనికిష్టమయిన ఆలూబజ్జీలు తినకుండా అతనిమీద కూర్చున్నారు! ఇది నిర్భంధంకాదూ!"

"కాదు"

"మర్యాదగా అతనిని స్వేచ్ఛగా వదులుతారా, లేక మిమ్మల్ని వాన్‌లో స్టేషన్‌కి తీసుకెళ్ళ మంటారా?" అందరం చేసేదిలేక దూరంగా జరిగాము.

వెంకట్రావ్ నెమ్మదిగా లేచాడు. అతని దృష్టి అంతా కమీషనర్ చేతిలో ఉన్నబజ్జీలప్లేట్ మీదే వుంది. హఠాత్తుగా యాదగిరికో అయిడియా వచ్చింది.

కెవ్వున నినాదాలుప్రారంభించేశాడు.

"వెంకట్రావ్- వెంకట్రావ్"

"జిందాబాద్- జిందాబాద్" అంటూ అరచారు ఆడా, మగా అందరూ,

"రేపు ఎలక్షన్‌లో నిలబడబోయే వెంకట్రావ్!"

"వర్ధిల్లాలి!"

"ఆలూబజ్జీలు"

"రేపు తినొచ్చు-"

"ఉల్లిపాయ పెసరట్లూ."

"రేపు తినొచ్చు!"

"బగారా..."మూడో స్లొగన్ ఇవ్వబోతుంటే నేను తక్కున యాదగిరినోరు మూసేశాను.

"అది పోలీసులకు తెలియకూడదురా పక్షీ! తెలుస్తే అది వండి వాడికి చూపించారంటే వాడ్నింక ఎవరూ ఆపలేరు."

"అవ్ అన్నా" అనేసి నినాదం మార్చేశాడు యాదగిరి.

"ఆలూ బజ్జీ-పెసరట్టు"

"రేపు తినొచ్చు బోలెడు తినొచ్చు"

"ఇవాళ్ళ మాత్రం"

"ఛీ ఛీ! వద్దు-వద్దు-"

"పోలీస్ కమీషనర్ బజ్జీలూ-"

"డౌన్ డౌన్-"

"పోలీస్ కమీషనర్ కాంటీనూ"

"గో బాక్ ! గో బాక్-"

మా కేకలు వెంకట్రావ్‌లో కొంచెం సంచలనం కలిగించినట్లుంది, వెనక్కు తగ్గి పరుపు మీద కూలబడ్డాడు మళ్ళీ . ఎప్పటికప్పుడే వెంకట్రావు పేరుతో జై జై నినాదాలుతో మోతెక్కించేశాడు యాదగిరి.

పోలీస్ కమీషనర్ ముఖం చిన్నబోయింది. కసిగా బజ్జీలన్నీ తనే తినేశాడు. ఇక్కడీ గొడవ జరుగుతుండగా, మాకు తెలీకుండా ఇంకో వ్యవహారం చాటున జరిగిపోయింది.

ఈలోగా కాలనీ పిల్లలందరినీ వాన్‌లో సరదాగా షికార్లు తిప్పుతామని తీసుకెళ్ళి వాళ్ళందరికి చాక్‌లెట్లు, బిస్కెట్లు ఇచ్చి పోలీస్ ఇన్‌స్పెక్టర్లు- వెంకట్రావు కిష్టమయిన వంటకం గురించి తెలుసుకోడానికి ప్రయత్నించారట!

మొదట్లో మా కాలనీ పిల్లలు చెప్పటానికి నిరాకరించారటగానీ, చివరకువాళ్ళు మన ఇండియా క్రికెట్ టీమ్ ఫోటోస్ ఉన్న ఆల్బమ్ అందరికీ తలోటీ ఇస్తామనేసరికీ రహస్యం కాస్తాచెప్పేశారు. అయితే మేము చావగొడతామని ఈ విషయం మాకు చెప్పనేలేదు.

మర్నాడు మొబైల్ కాంటిన్ వాళ్ళు గుత్తివంకాయలు తెచ్చి మసాలా నూరడం కనిపించేసరికి మా పై ప్రాణాలు పైనేపోయాయి. ఆ దృశ్యం వెంకట్రావుకి కనపడకుండా యాదగిరి బోలెడుమంది కాలనీ వాళ్ళను కూడగట్టుకొని గోడలాగ అడ్డునిలబడ్డాడు.

ఆ కూర రెడీ అయ్యేలోపల ఎవరొకముఖ్యఅధికారినో,లేక ఏఛోటారాజకీయ నాయకుడినో తీసుకొచ్చి తను ఈ విషయంలో జోక్యం కలుగజేసుకుంటున్నట్లూ అంచేత రోడ్డు రిపేరు విషయం తనకొదిలేయమని హామీ ఇచ్చి, వెంకట్రావుని నిరాహారదీక్ష

విరమించమనికోరి నిమ్మకాయనీళ్ళు ఇచ్చేసే ఏర్పాట్లు చేయడానికని శాయీరామ్, గోపాల్రావులు టాక్సీలో తిరగసాగారు.

ఈలోగా యాదగిరి పాలిపోయిన మొహంతో మా దగ్గరకొచ్చి రహస్యంగా ఓవిషయం చెప్పాడు.

అదేంటంటే జంటనగరాల్లోకంతటికీ బగారాబైగన్ అద్భుతంగా వండగల పురానాపూల్ జాఫర్ అనే గజవంటగాడిని పిలిపించారట కమీషనర్‌గాయి! అవార్తవిన్నాక ఎవరి మొఖాల్లోనూ రక్తంలేదు. ఇంక మా పరువుని రక్షించడం ఎవరివల్లాకాదు. కేవలం హైద్రాబాద్ నిజాంనవాబుతాలూకూ కుటుంబసభ్యుల వివాహాలకే జాఫర్ బగారా బైగాన్ వండుతాడని మిగతావారినెవ్వరిని లెక్కచేయడనీ- అతని వంటకం రుచి చూడడానికి ఢిల్లీనుంచి కూడా గొప్పగొప్పోళ్ళు ప్రత్యేకంగా భోజనానికొస్తారనీ మేమందరం కథలువిన్నాం! మరి కాసేపట్లో బగారాబైగన్ ఘుమ ఘుమలు మా కాలనీ అంతా వ్యాపించినయ్. పోలీస్‌కమీషనర్‌గారు వాళ్ళ షామియానాలో ఠీవిగా, సంతోషంగా, మమ్మల్ని దెబ్బకొట్ట బోతున్న ఆనందంతో చిరునవ్వులు చిందిస్తూ కూర్చున్నారు.

పురానాపూల్ జాఫర్ బగారాబైగాన్ వండుతున్నాడన్న విషయం తెలిసి కాలనీలోని ఆడాళ్ళందరూ అతనెలా వండుతున్నాడో చూసి నేర్చుకోవాలని అక్కడగుమికూడిపోయారు.

"మీరందరుకూడా ఈపూట ఇక్కడే భోజనంచేయండమ్మా! ఏం ఫరవాలేదు. కన్సెషన్ రేటు!" అంటున్నాడు కమీషనర్!

"అలాగే ఈ కూరచేసే పద్ధతికూడా ఓ కాగితం మీద రాయించి ఇవ్వండి అన్నయ్య గారూ?" అని ఆయన్నడుగుతున్నారు మా వాళ్ళు.

మా అందరికీ మా ఆడాళ్ళమీదే వళ్ళు మండిపోతోందిగానీ ఏం చేయగలం! మరికా సేపట్లో బగారాబైగన్ వాసనలు మరింత విజృభించినయ్. నిజం చెప్పొద్దూ? మాకేనోరూరుతోంది! ఆవాసన షామియానావేపురాకుండా ఫాన్‌లు పెట్టాం మేము-అయినా "హా" అంటూ గాలి బాగా పీల్చాడు వెంకట్రావ్. "అది బగారా బైగాన్! పురానాపూల్‌జాఫర్ వండుతున్నాడు" అన్నాడు తన్మయత్వంపొందుతున్నట్లు కళ్ళుమూసుకుని.

'నీకెలాతెలును?' ఆశ్చర్యంగా అడిగాము. "లక్షమంది ఒకేసారి బగారాబైగాన్ వండుతున్నా సరే! అందులో పురానాపూల్ జాఫర్ వంటకం ఒక్కసారివాసన చూస్తే చాలు గుర్తు పట్టేస్తాను. ఆహా! అబ్బ చూశారా! ఇంతమంచివాసనలు ఇంకెవరివల్లాకాదు. ఆహా! ఆహా! బగారా బైగాన్-"

మేము శాయిరామ్ వాళ్ళటాక్సీకోసం అతృతగా ఎదురుచూడసాగాం! ఈ వెధవ ఇంక కొద్దిక్షణాలకంటే ఎక్కువ మాచేతుల్లో ఉండడని తెలిసిపోతోంది.

"ఆ? భోజనంరెడీ!" అంటూ అరిచారు కమీషనర్‌గారు.

మరుక్షణం, సబిన్‌స్పెక్టర్లు, కానిస్టేబుల్స్ అందరూ బఫెడిన్నర్ ప్రారంభించేశారు. "ఎవరయినా సరే భోజనం చేయవచ్చు! కన్సెషన్‌రేట్‌లో ఇస్తున్నాం! ఈ కన్సెషన్ కేవలం ఈకాలనీ వాళ్ళకు మాత్రమే!" స్పీకర్‌లో పోలీస్‌వాన్‌లోనుంచి వినబడింది, ఎనౌన్స్‌మెంట్.

"కొంచెం అడ్డంలేవండి! బగారా బైగాన్ ఎలావుందో వూరికే చూస్తాను-" అన్నాడు వెంకట్రావ్ స్పృహలోలేనట్లు ఆవాసనల్లోమునిగిపోయి-

"అక్కర్లేదులే! అలా కూర్చో! రేపు జావర్‌కి ఎంత డబ్బయినా ఇచ్చి నీకు వడించిపెడతాం!" అన్నాడు రెడ్డి.

"ఒక్కసారి లేవండి! చాలు!" బ్రతిమాలసాగాడు వెంకట్రావ్. ఈలోగా కమీషనర్‌గారు స్వయంగా ఓపెద్ద ప్లేటునిండా బగారాబైగన్‌కూర పొగలుకక్కేవేడిది వడ్డించుకుని మరోప్లేటులోచపాతీలు తీసుకొచ్చి వెంకట్రావ్‌కి కనిపించేట్లు ఓ కుర్చీలోకూర్చునితినడం ప్రారంభించాడు. వెంకట్రావ్ నోరు వెళ్ళబెట్టేశాడు. గుడ్లు మిటకరించేశాడు. ఆశగా రొప్పటం ప్రాంభించాడు నోట్లోనుంచీ లాలాజలం చుక్కలుగా రాలుతోంది. నెమ్మదిగా ఆప్లేటువంకే చూస్తూకూర్చున్నచోటు నుంచిలేచాడు. పరిస్థితి విషమించిపోతుందని గమనించి యాదగిరి నినాదాలు ప్రారంభించాడు

"వెంకట్రావ్-వెంకట్రావ్"

"జిందాబాద్-జిందాబాద్"

"పోలీసుల నక్కజిత్తులకు-"

"వెంకట్రావ్ లొంగడు-లొంగడు-"

"పోలీసుల వంటకాలకు"

"వెంకట్రావ్‌లొంగడు, తలవొంచడు-"

"పోలీస్ కమీషనర్"

"డౌన్ డౌన్"

"వర్ధిల్లాలి !వర్ధిల్లాలి- వెంకట్రావ్ మనోనిబ్బరం వర్ధిల్లాలి-"

పోలీస్ కమీషనర్ వెంకట్రావ్ వేపు చిరునవ్వుతో చూశాడు. ఆయన చేతిలో నూనె కారుతున్నవంకాయ చూసేసరికి వెంకట్రావ్‌కి ఏదో పూనకం వచ్చినట్లయింది. మా అందరిచేతులూ ఎక్కడలేని బలంతో విదిలించుకొని పోలీస్ షామియానావేపు పరిగెత్తాడు.

యాదగిరి ఇంకా ప్రయత్నాలు మానలేదు.

"వెంకట్రావ్ వెంకట్రావ్"

"జిందాబాద్ జిందాబాద్"

"పోలీస్ వాళ్ల బగారా బైగాన్‌కి"

"మహాత్మా వెంకట్రావ్‌లాంగదు"

"వెంకట్రావ్ నిగ్రహం"

"వర్ధిల్లాలి- వర్ధిల్లాలి"

"పోలీస్ కమీషనర్ బగారా బైగాన్"

"డౌన్ డౌన్" వెంకట్రావ్‌కి ఏమీవినిపించటంలేదు. పిచ్చివాడిలా బఫేటేబుల్ దగ్గరకు నడిచాడు.

ఆతరువాత అంతా క్షణాల్లో జరిగిపోయింది. వెంకట్రావ్ పెద్ద ప్లేట్లో బగారాబైగాన్ వేడిగా వడ్డించుకొని అవురావురుమనితినేస్తున్నాడు.

మరుక్షణం నినాదాలు మారిపోయాయి.

"వెంకట్రావ్"

"డౌన్ డౌన్"

"వెంకట్రావ్ బగారాబైగాన్"

"నశించాలి"

అప్పుడే శాయిరామ్ వాళ్ళు ఎమ్మెల్యేలతో సహా కార్లో వచ్చేశారు.

"నిమ్మకాయ నీళ్ళు సిద్ధంగా ఉంచారా?" అడిగారాయన షామియానదగ్గరకొచ్చి. ఈలోగా పోలీస్‌కమీషనర్‌గారు ఆయన క్కూడా బగారాబైగన్‌కూర-చపాతీలు ప్లేట్లుతీసుకొచ్చి అందించేసరికి ఆయనకూడా మాట్లాకుండా తినేసారు. మరి కాసేపటికి కాలనీలో పిల్లా పెద్దా అందరూ కన్సెషన్ టికెట్లు కొనుక్కుని నిలబడి భోజనంచేయటం కనిపించింది.

కేవలం మా కార్యనిర్వాహక వర్గం వాళ్ళుదూరంగా నిలబడ్డాం "నిరాహారదీక్షలు మొదలు పెట్టడం ఆతరువాత రోజులు గడిచినకొద్దీ అది అల్లరికి, దౌర్జన్యానికి అస్తినష్టానికి దారితీయటం-ఇలా జరగకుండా మేము ఈ కొత్త పద్ధతి ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టాం! విజయవంతంగానే జరిగింది గనుక త్వరలో ఇది దేశమంతా ప్రవేశపెట్టాలని సిఫార్సుచేస్తాం!" అన్నారు కమీషనరుగారు

మేము 'ఇహిహి' అంటూ చిరునవ్వు నవ్వాము వెంకట్రావ్ వేపు కోపంగాచూస్తూ. *

# పబ్లిసిటీ ప్రహసనం




**గుప్తులనాటి** కాలాన్ని స్వర్ణయుగమన్నారు చరిత్ర రాసిన రచయితలు. అలాగే ప్రస్తుత కాలాన్ని "ప్రకటనలు లేక పబ్లిసిటీ యుగం"గా మనం మొఖవాటం లేకుండా చెప్పు కోవచ్చు. రచయితలు రాసేయవచ్చు. మరికొంతకాలంపోతే ఈ వ్యాపారప్రకటనలు ఏ పద్ధతి కొస్తాయో ఎవరయినా తేలిగ్గా ఊహించుకోవచ్చు.

ఆనాడు మన నిర్భయ్‌నగర్ కాలనీ లైఫ్ ఇదిగో ఇలా వుంటుంది! ఇక చదవండి!

*　　　　*　　　　*

నేనూ, శాయిరామ్, రంగారెడ్డి, జనార్ధన్ కలిసి ఆఫీస్ కెళ్ళడానికి బయల్దేరి బస్‌స్టాప్ దగ్గరకొచ్చాము. అక్కడ రష్ చాలా ఎక్కువగా ఉంది.

"అబ్బ! రష్ బాగా ఉందే?" అన్నాడు శాయిరామ్.

అనటమే ఆలస్యం ఓ వ్యక్తి మా వెనుక నుంచి సర్రున ముందుకి దూసుకొచ్చాడు. "అవున్సార్! ఎక్కడ చూచినా రష్! ఎటు చూచినా రష్! రైళ్ళల్లో బస్సుల్లో, షిప్పుల్లో, విమానాల్లో, రోడ్లమీద, ఆఫీసుల్లోనూ, అంతా రష్! అన్నీరష్! అంచేత మీరూ నేడే వాడండి రష్! కమ్మని కమనీయమయిన కూల్‌డ్రింక్ పౌడర్ రష్! రొటీన్లకూ, ప్రొటీన్లకూ తెగ తాగండి రష్! పౌడర్‌తో చేసిన పానీయం! ఒక పాకెట్ రష్ పౌడర్-ఎనిమిది బిందెల నీళ్ళను కమ్మని రసమయ రసంగా మార్చేస్తుంది. ఆరొందల మందికి సరిపోతుంది. ఎవరికి సార్ కూల్‌డ్రింక్ పౌడర్" అంటూ తన బాగ్‌లో నుంచి రష్ పాకెట్లు తీసి మాకివ్వబోయాడతను.

"మాకొద్దు నాయనా!" అన్నాడు రంగారెడ్డి షాక్ నుంచి తేరుకుని.

"అదేమిటి సార్! రష్ బాగా ఉందే అని మీరనుకోవటం నేను వినలేదనుకున్నారా?"

అతనిని వదిలించుకునేసరికి పావుగంట పట్టింది- ఇంతలో మా మధ్యకు ఏదో జంతువు దూరినట్లనిపించింది.

ఆ జంతువుని చూసి రంగారెడ్డి కెవ్వున కేకవేసి అవతలివేపుకి ఒక్కగెంతు గెంతాడు. ఆ గెంతుకి అక్కడ నిలబడ్డ ఓముసలాయన అటువేపు నిలబడ్డ ఇద్దరు స్త్రీలమీద పడ్డాడు. వాళ్ళు కింద చతికిల బడుతూ ఇంకొకాయన కాళ్ళుతొక్కారు. ఆ కాళ్ళ ఓనరు"నాయనోయ్! నా కాళ్ళు పచ్చడి అయిపోయాయ్ దేవుడో" అంటూ ఆ లావుపాటావిడను బూతులు తిట్టసాగాడు.

ఈ చైన్ రియాక్షన్ ఓవక్క జరుగుతూండగానే నేనూ, శాయిరామ్ కలసి మా మధ్యకొచ్చిన ఆ జంతువేమిటా అని పరీక్షగా చూశాము.

రంగురంగుల బొచ్చులో నుంచి తెలుగు అక్షరాలు స్పష్టంగా కనబడుతున్నాయ్. "అత్త మొగుడే నా మొగుడు! నేడే చూడండి! అద్భుతమైన సెంటిమెంటల్ చిత్రం! పద్నాలుగు థియేటర్లలో నేడే విడుదల!" అని రాసి ఉంది.

ఆ జంతువు తోకమీద తారాగణం పేర్లున్నాయి.

ఆ జంతువు నెమ్మదిగా మా దగ్గరకొచ్చి తోకాడించాకగానీ మాకు తెలీలేదు అది కుక్క అని! అయితే అది కుక్క అని ఓ పట్టానతెలీటంలేదు. మనిషి మొఖంలా ఉంది దాని మొఖానికి కూడా రంగులు పూసి ఆ రంగులతో ఆ సినిమాలోని హీరో మొఖం కనిపించేటట్లు చేశారు. అంచేత మేము కొంచెం కన్ఫ్యూజ్ అయ్యాము.

"ఇది కుక్కరా!" అన్నాడు జనార్ధన్ రంగారెడ్డికి ధైర్యం చెప్తూ.

"అవునవును! ఇది కుక్కే! ఊరకుక్క. ఈ మధ్య సినిమా కంపెనీవాళ్ళు కుక్కలూ, పందుల మీదే రంగులేసి కొత్త పిక్చర్ల పబ్లిసిటీ ఇస్తున్నారు" అంటూ చెప్పాడో స్టూడెంట్!

ఇంతలో ఓ సిగరెట్ కంపెనీ వాన్ వచ్చి ఆ బస్‌స్టాప్ దగ్గర ఆగింది.

"మినిష్టర్ సిగరెట్లనే వాడండి! అయిదు సంవత్సరాల పాటుకాలుతూండే ఏకైక సిగరెట్లు-మినిష్టర్ సిగరెట్లు! ధారాళమయిన పొగకి నేడే వాడండి! మినిష్టర్ సిగరెట్లు!" ఇలా ఆ వాన్ అంతా బొమ్మలతో పాటు రాసి ఉంది.

ఆ వాన్‌లోని వాళ్ళు దిగి మమ్మల్ని సిగరెట్లు ఎక్కడ కొనమంటారోనని మేము బాగా వెనక్కి జరిగి నిలబడ్డాము. అదృష్టవశాత్తు ఆ "వాన్" వెళ్ళి పోయింది.

అది వెళ్ళిపోగానే  అప్పడాల వాన్ వచ్చింది. మేము ఇంకొంచెం దూరం పరుగెత్తు కెళ్ళి నిలబడ్డాము "ముద్ద ముద్దకీ మధ్య అప్పడం! మనిషి మనిషికీ మధ్య అప్పడం! నేడే వాడండి జుబేగా వారి అప్పడాలు! మనిషి శరీరం పెరుగుదలకూ-ఆరోగ్యానికీ అవసరమైన ఇరవై ఎనిమిది రకాల ఖనిజాలతో తయారు చేయబడినాయ్ జుబేగా కంపెనీ వారి అప్పడాలూ!'' ఆ వాన్ కూడా వెళ్ళి పోయింది గానీ- ఇంకా మా సెక్రటరియట్ బస్‌రాకపోయేసరికి  చిరాకుపుట్టుకొచ్చింది ఆ విషయం గట్టిగా అందామంటే మళ్ళీ ఆ "టైమ్ సెట్టర్" కంపెనీ తాలూకు పార్ట్‌టైమ్ పెద్దమనిషి ఎక్కడ చుట్టుముడతాడోనని భయం!

కాని ఆ విషయం మర్చిపోయిన శాయీరామ్ మాత్రం "ఇవాళ ఒక్క సెక్రటేరియట్ బస్‌కూడా రావటంలేదేమిటి?" అన్నాడు చిరాకుగా.

మా పక్కనున్న చెమ్కీటోపీ సాయిబుగారు నవ్వారు.

"ఇప్పుడే గదండీ -సెక్రటేరియట్ బస్‌లు రెండు వెళ్ళాయ్!" అన్నాడతను. మేము ఉలిక్కిపడ్డాము.

"సెక్రటేరియట్ బస్‌లు వెళ్ళాయా?"

"అవునూ!"

"మేము ఇక్కడ నిలబడి అరగంటవుతోంది! మాకే బస్సూ కనిపించలేదే!"

"ఇప్పుడే మీ కళ్ళముందే రెండు బస్సులు వెళ్ళాయి కదండీ!"

"ఇప్పుడు వెళ్ళిన రెండు అప్పడాల కంపెనీ వాన్‌లు! వాటినే చూసి నువ్వు బస్ అనుకున్నావేమో!" అంటూ తిరగబడ్డాడు.

సాయిబుగారు రంగారెడ్డిని చాలా జాలిగా చూశారు.

"అవి అప్పడాల కంపెనీ వాన్లు కాదు నాయనా! ఆర్టీసీవారి సిటీబస్లు!"

మాతో పాటు అక్కడున్న చాలామంది ఉలిక్కిపడ్డారు.

"అప్పడాలవాన్లు ఆర్టీసీ బస్లా"

"అవును! నిన్న పేపర్లో వేశారుకదా చూళ్ళేదా?"

"ఏమని?"

"ఇవాళ్టి నుంచీ బస్లకు నంబర్లు-డెస్టినేషన్ పేర్లూ ఉండవ్! కేవలం వ్యాపారప్రకటల్ని బట్టే గుర్తుపట్టాలి!"

"అవును! నేను బ్లేడ్స్ కంపెనీ బస్ ఎక్కాలి!" అన్నాడు ఓ వ్యక్తి తన చేతిలోని డయిరీ తీసి తను వెళ్ళాల్సిన చోటకెదురుగ్గా ఉన్న ప్రకటన చూస్తూ. మేము సెక్రటేరియట్ కెళ్ళాలంటే ఏ బస్ ఎక్కాలండీ? నేను ఆపెద్దమనిషిని వినయంగా అడిగాను.

అతను మళ్ళీ డయిరీ చూశాడు.

సెక్రటేరియట్ అని ఉన్నచోట అప్పడాల కంపెనీ అని ఉంది.

"అందుకేనయ్యా! నేను చెప్పింది! అప్పడాలకంపెనీవి మరి రెండు బస్లు వెళ్ళాయికదా?" నవ్వుతూ అన్నాడు సాయిబుగారు.

జనార్ధన్ ఆపెద్దమనిషి నడిగి ఏ వ్యాపార ప్రకటన బస్ ఎక్కడి కెళ్ళుతుందో తన డయిరీలో రాసుకోసాగాడు.

ఈసారి బ్రాందీ బస్ వచ్చింది

"బ్రాందీ-బ్రాందీ" అని అరచాడు కండక్టర్ లోపల్నుంచీ!

"అంటే! పంజాగుట్ట మీదనుంచీ వెళ్ళుతుందా?" ఒకావిడ అనుమానంగా అడిగింది.

"లేదమ్మా? విస్కీబస్ పంజాగుట్ట మీదనుంచి వెళ్తుంది! బ్రాందీ బస్ కూడా అంటే వెళ్తుంది గానీ సందుల్లో నుంచి తిరిగి వెళ్ళుతుంది!"

"మరి బీరు బస్సో?"

"బీరుబస్ అంతదూరం వెళ్ళదు మాస్టారూ! ఖైరతాబాద్ దగ్గరే ఆగిపోతుంది!" అంటూ గంట కొట్టాడతను. బస్ వెళ్ళిపోయింది. మరో పదినిముషాల తర్వాత ఒడియాల బస్ వచ్చింది.

"అప్పడాలూ, వడియాలూ ఒకటే జాతికదా! ఇది సెక్రటేరిట్ దగ్గర కెళ్ళుతుందేమో" అన్నాడు జనార్ధన్ అనుమానంగా.

శాయిరామ్ కండక్టర్ దగ్గరకెళ్ళి వివరం అడిగాడు.

"అప్పడాలు వేరు, ఒడియాలు వేరు సార్! బస్ లకడీకపూల్ నుంచి మెహిదీపట్నం పోతుంది-"

"లకడీకాపూల్‌లో దిగినడిచి వెళ్దాంలే పదండి- ఇందులో వెళ్దాం!"అన్నాడు రంగారెడ్డి.

లోపల ఎక్కడ చూసినా ఒడియాల బొమ్మలే కనబడుతున్నాయి కండక్టర్ మాత్రం చేగోడీల డిజైన్ ఉన్న యూనిఫారం వేసుకున్నాడు.

"మరేంలేదు సార్! ఒడియాల బస్ కండక్టరు రాలేదని నన్ను బుక్ చేశారు" అన్నాడతను మా ఆశ్చర్యంచూసి చిరునవ్వునవ్వి!

మా ముందు నిలబడ్డ ఓ కళ్ళజోడు పెద్దమనిషి ఒక్కసారి భీకరంగా అరిచాడు. బస్‌లోని వాళ్ళంతా అదిరిపడి లేచి నిలబడ్డారు. ఫుట్‌బోర్డుమీద నిలబడ్డ కొంతమంది యాక్సిడెంట్ అయిందేమోనని కిందకు దూకేశారు.

"భయపడకండి సార్! మేడమ్! అశేషాంధ్రలోకాన్ని అద్భుతమైనసస్పెన్స్‌తో, సరికొత్త కథలతో ఈ బస్‌లాగా ఒళ్ళు గగుర్పొడిపించే మలుపులతో ఉర్రూతలూగిస్తున్న ఆంధ్రుల అభిమాన ప్రఖ్యాత రచయిత యండమూరివీరేంద్రనాథ్‌గారి నవలలు ఎవరికి కావాలో ఇప్పుడే ఆర్డర్ బుక్‌చేయండిసార్! ప్రతి నాలుగు నవలలు కొన్నవారికి ఓ నవల ఉచితంగా ఇవ్వబడుతుంది. అంతే కాదు. దానిమీద రచయిత ఆటోగ్రాఫ్ కూడా ఉంటుంది.

అంతేకాదు! ఆ నవలలో ఓతప్పు ఉంది. ఆ తప్పేమిటో కనుక్కొన్న మొదటి వెయ్యిమంది పాఠకులకు ఇంకో తప్పు కనుక్కునేందుకు "క్లూ" ఇవ్వబడుతుంది" అని మళ్ళీ భీకరంగా కేకశాడతను. ఈసారి అతని పక్కనే కూర్చున్న ఓ గర్భిణీ స్త్రీ మూర్ఛపోయింది.

బస్ ట్రాఫిక్  జంక్షన్ దగ్గర ఆగింది. పోలీస్ చేతిలో కనబడుతున్న స్టాప్‌బోర్డ్ మీద "దోమ మార్కుగల పళ్ళపొడినే వాడండి!" అని రాసి ఉంది పెద్ద అక్షరాలతో. అడుగున చిన్న అక్షరాలతో "స్టాప్" అని ఉంది.

బస్ దిగి సెక్రటేరియట్‌కి పరుగెత్తాం. గేట్లమీద ఓ బిస్కెట్ కంపెనీ వారి పెద్ద పెద్ద హోర్డింగ్స్ కనబడుతున్నాయి. అదేమిటి- ఇక్కడ బిస్కెట్ కంపెనీ ఎప్పుడు పెట్టారు? సెక్యూరిటీ గార్డు నడిగాము ఆశ్చర్యంగా.

"ఇవాళ్టినుంచేనండీ!"

"మరి సెక్రటేరియట్ ఏమయింది?"

"వెనుక రాత్రి కొత్తగా వేసిన పాకల్లోపెట్టారండీ!"

"ఎందుకలా?

"బిస్కెట్ కంపెనీ వారికి-గవర్నమెంట్ వారికి కుదిరిన ఓ ఒప్పందం ప్రకారం ఈ ఏర్పాట్లు జరిగాయండీ! దీనివల్ల గవర్నమెంట్‌కి ఏటా తొంభయ్ లక్షల రూపాయలు లాభం వస్తుంది!" మేము వెనుకవేపు నడిచి కొత్తగా పాకల్లో ఏర్పాట్లు చేసిన మా ఆఫీస్‌లో కూర్చున్నాము.

"ఇవాళ్టి నుంచీ ఆఫీస డ్రాఫ్టులకు ఈ కాగితాలే వాడండి!" అంటూ ఓ తెల్లకాగితాల కట్ట అందించాడు ప్యూను.

కాగితం ఒకవేపు తెల్లగా ఉంది. రెండోవేపు వ్యాపార ప్రకటనలతో నిండి ఉంది.

"భూతమ్ వారి ఎలక్ట్రిక్ ఫాన్లు ఇప్పుడు దేశంలో 90 శాతం ఉపయోగిస్తున్నారు కనుక మీరు ఈ ఫాన్ కొని శాతాన్ని పెంచండి!"

మిగతా కాగితమంతా రకరకాల ఫాన్లబొమ్మలు-

లంచ్ టైమ్‌లో జనార్ధన్ వచ్చాడు.

"సాయంత్రం రామ్‌కోటిలో మన సుదర్శనంగాడి సిస్టర్ మారేజ్ ఉందట.

మనల్నందర్ని రమ్మని మరీ మరీ చెప్పాడు..." అన్నాడు

ఆఫీసవగానే అందరం కలసే పెళ్ళికి బయల్దేరాం. నాలుగడుగులు వేశామో లేదో మాముందు నడుస్తున్న వ్యక్తి హఠాత్తుగా ఆగిపోయి వెనక్కు తిరిగి మా వేపు చూసి చిరునవ్వునవ్వాడు.

"ఆహా! ఏం తెలుపు? మొఖం పగిలిపోయే తెలుపు!" అన్నాడు.

మేమంతా భయంగా వెనక్కు తగ్గాం! "వాటీజ్‌దట్?" ధైర్యం తెచ్చుకుని అడిగాడు జనార్ధన్.

"అదేనండీ! అద్భుతమయిన తెలుపు. ఇంత తెల్లగా ఎలా వచ్చిందో తెలుసా?" ఇదేదో పిచ్చి ఆసుపత్రి నుంచి తప్పించుకొచ్చిన కేసు-తెలుస్తూనే ఉంది.

ఎందుకయినా మంచిదని రోడ్డుకి మరో పక్కకు పరుగెత్తాం! కానీ అతను మా కంటేముందు అక్కడికి చేరుకున్నాడు "మిమ్మల్నే! ఎంత తెలుపు-మొఖం పగిలే తెలుపు!" అన్నాడు మళ్ళీ చిరునవ్వుతో.

ఇంక చేసేదిలేక "అవును!" అన్నాడు శాయిరామ్.

"చాలా మరీ ఎక్కువ తెలుపు" అన్నాడు రెడ్డి.

"ఇంత తెలుపు ఎలా వచ్చిందో చెప్పండి?" అన్నాడతను మళ్ళీ నవ్వుతూ.

"ఇంకేముంది! మురికిపట్టిన పాతబట్టల్ని మీ కంపెనీవారి వాషింగ్ పౌడర్ వాడినందువల్ల-"అన్నాడు శాయిరామ్ సినిమాల్లో ఓ వాషింగ్ పౌడర్ పబ్లిసిటీ గుర్తుతెచ్చుకుని.

"ఛీ! మాది వాషింగ్‌పౌడర్ కాదు!"

"మరి!"

"చక్రివారి రెడీమేడ్ దుస్తులు! ఇంత తెల్లగా ఎలా వచ్చాయో తెలుసా? మురికిపట్టిన పాతబట్టలు పారేసి చక్రివారి రెడీమేడ్ దుస్తులు కొన్నందువల్ల! మీరూనేడే చక్రివారి దుస్తులు కొనండి! మొఖం పగిలే తెలుపుతో తిరగండి!"

"సరే తిరుగుతాం-మీరింక మమ్మల్ని వదుల్తే...."

అతను చిరునవ్వుతో మా చొక్కాలమీద చక్రివారి స్టిక్కర్‌లు అంటించి "థ్యాంక్యూ" అంటూ వెళ్ళిపోయాడు.

ఆ స్టికర్లు తీసేయడానికి మేము ఆరోడ్ పక్కనే గంటసేపు కూర్చుని తన్నుకున్నా రాలేదు.

చేసేదిలేక అలాగే బస్‌స్టాప్ కెళ్ళి నిలబడ్డాం. బస్‌స్టాప్‌లో అంతవరకూ జెంటిల్మన్‌లాగా నిలబడ్డ ఓ వ్యక్తి గట్టిగా విరగబడి నవ్వాడు.

అందరం ఇదేదో హిస్టీరియా బాపతేమో అనుకున్నాంగానీ కాదంట!

"నేను మామూలు మనిషిననుకుంటున్నారు కదా! కాదండీ! ప్రఖ్యాత రచయిత రామజోగ్‌ని 'భావన' వారపత్రికలో రాసే సీరియల్ నాదే! ఆ సీరియల్‌మీద మీరు రాసే ఓ మాంచి ఉత్తరానికి నేను 196 ఫోజులతో కనిపించే వీడియోకాసెట్ ఉచితం" అన్నాడు. ఆ రచయితని వదిలించుకుని పెళ్ళికి వెళ్ళాం.

పెళ్ళిపందిరంతా సెంటుకంపెనీ వాళ్ళ పోస్టర్లతో నిండివుంది.

పెళ్ళికూతురిని వేదికమీద చూసి ఉలిక్కిపడ్డాం! ఆమె పక్కనే ఓ బోర్డు తగిలించి ఉంది.

"ఈమె అంబికావారి పెళ్ళికూతురు. ఈమె ధరించిన దుస్తులన్నీ అంబికాసిల్క్ ఎంపోరియంలో లభిస్తాయ్. నేడే మీ పెళ్ళికీ ఇతర రకాల పండుగలకూ మా అంబికా సిల్క్ ఎంపోరియంనే సందర్శించండి- ఇట్లు-అంబికా సిల్క్ ఎంపోరియం-బాలక్‌స్ట్రీట్-కోఠి-" వెంటనే మేము సుదర్శన్‌ని పక్కకుపిలిచాం.

"ఇదేమిటి ఆబోర్డు..."

"ఇవాళ్రేపు అందరూ ఇట్లాగే చేస్తున్నార్లే! అబోర్న పెళ్ళి రోజంతా అలా ఉన్నందుకు గాను ఆ సిల్క్ ఎంపోరియంవాళ్ళు ఓ పట్టుచీర ఫ్రీగా ఇస్తున్నారు. కరువు రోజుల్లో అదీ ఓ లాభమే కదా?" మరి కాసేపట్లో పెళ్ళికొడుకుని తీసుకొచ్చారు. అతని నోట్లో రెండుగజాల పొడుగున్న చుట్ట ఉంది. గుప్పు గుప్పున పొగ వదులుతున్నాడతను. నెత్తిమీద మెరుస్తోన్న కిరీటం ఒకటి! దానిమీద రంగు రంగులతో మెరుస్తోన్న అక్షరాలు!

"రాబందు మార్కుచుట్టల పెళ్ళికొడుకు! పెళ్ళినాటిరాత్రి ప్రతి పెళ్ళికొడుక్కి ఆనందం కలిగించేవి రెండే రెండు. అందమైన పెళ్ళికూతురు, రాబందుమార్కువారి పొడుగాటి కింగ్‌సైజ్ చుట్ట!"

"మరి పెళ్ళికొడుక్కి అది తగిలించుకున్నందుకు ఆచుట్టలకంపెనీ వాళ్ళు ఏమిస్తారు?" అడిగాడు రెడ్డి అనుమానంగా

."ఓ సూట్ బహూకరిస్తారు! ఈ కరువు రోజుల్లో మరి అది కొనాలంటే కష్టమే కదా"అన్నాడు సుదర్శనం

అక్కడినుంచీ మా కాలనీ కెళ్ళడానికి ఏ బస్ ఎక్కాలా అని డయిరీ చూశాడు శాయిరామ్. టెలివిజన్ కంపెనీల బస్ ఎక్కాలని రాసి ఉందందులో.

అరగంటసేపు ఎదుర్చూసినా టెలివిజన్ కాదుగదా రేడియో బస్ కూడా రాలేదు. ఇక లాభంలేదని ఆటోఎక్కాం నలుగురం- కొంత ఎక్స్ట్రా ఛార్జ్ ఇచ్చేట్లు మాట్లాడి.

కొంతదూరం వెళ్ళాక ఆటోడ్రైవర్ వెనక్కు తిరిగి "సుఖమైన బసకూ సొంత ఇంటి వసతులకూ- హోటల్ ఛత్రపతిలోనే దిగండి! అనురాగంతో మిమ్మల్ని సేవిస్తుంది హోటల్ ఛత్రపతి" అన్నాడు చిరునవ్వుతో.

మాకేం అర్థం కాలేదు. ఏదో చెప్పబోయి ఏదో చెప్పాడేమోలే అని సరి పెట్టుకున్నాం.

ఇంకాస్త దూరం వెళ్ళాక మళ్ళీ వెనక్కు తిరిగి మళ్ళీ అదే మాట్లాడాడు.

"వీడెవడో పిచ్చాడులాగున్నాడు! మనం ఆటోదూకి పారిపోవడం మంచిది" అన్నాడు రంగారెడ్డి అనుమానంగా.

ఎలాగోలా ప్రాణాలు బిగపట్టుకుని కూర్చున్నాం కాలనీ చేరేవరకూ! కాలనీలో దిగి ఛార్జి చెల్లించగానే మళ్ళీ మొదలు పెట్టాడువాడు. "సుఖమైన బసకూ సొంత ఇంటి వసతులకూ- హోటల్ ఛత్రపతిలోనే దిగండి! అనురాగంతో మిమ్మల్ని సేవిస్తుంది హోటల్ ఛత్రపతి" అన్నాడు మళ్ళీ!

"ఆ హోటల్ పేరెందుకు చెప్తున్నావ్?" అన్నాడు రెడ్డి అనుమానంగా.

"అలా చెప్తే వాళ్ళు నాకు డబ్బు ఇస్తారండీ! ప్రతి పాసింజర్‌కి పబ్లిసిటీ చేస్తూండాలి నేను. మర్చిపోకండి! అనురాగంతో మిమ్మల్ని సేవిస్తుంది హోటల్ ఛత్రపతి" అంటూ కాలనీ దగ్గర ఆపి మీటర్ ఛార్జిమీద ఎక్స్ట్రా తీసుకుని వెళ్ళి పోయాడతను.

మేము ఎవరింటికి వాళ్ళు చేరుకున్నాం. మా ఇంటి ముందు తలుపులకు అడ్డంగా పెద్దబోర్డులు కనిపించినయి. వాటిమీద పెద్ద తాటికాయంత అక్షరాలు. అక్షరాల మధ్యలో నుంచి ఇంట్లో కెళ్ళడానికి చిన్నతలుపులు రెండు కనబడుతున్నాయి.

"సువేగా గాస్ స్టవ్‌లు-కూరగాయలను కసిగా తరిగే ఏకైక గాస్‌స్టవ్ సువేగా! 'గా' అనే అక్షరాలు మధ్య నుంచి దూరి వెళ్ళిలోపలకు వెళ్ళేసరికి మా ఆవిడ ఆనందంగా గులాబ్‌జామ్ తింటోంది. "బయట అడ్డంగా ఆబోర్డు ఎవరు పెట్టారు?" చిరాకుగా అడిగాను" అయ్యో! అదేంటండీ! వాళ్ళ బోర్డులు మన కాలనీలో అందరిళ్ళకు ముందు తగిలించారుగా!"

"అదేనేనడిగేది! ఎందుకు పెట్టారు అని"

"అవి అలా పెట్టనిచ్చినందుకు మనకు పెద్ద గులాబ్‌జామ్ పాకెట్ ఉచితంగా ఇచ్చారండీ! అలా నెలకొకటి ఇస్తారట! పిల్లలు ఆనందంగా గులాబ్‌జామ్ తింటుంటే చూసి ఏమీ మాట్లాడలేక పోయాను. ఆబోర్డులో నుంచి 'గా' అనే అక్షరం మధ్య నుంచే వెళ్ళటం, రెండు మూడుసార్లు ప్రాక్టీస్ చేశాను!

రాత్రి పది గంటలకు కాలనీ బయట ఎవరో అరుస్తూండటం వినిపించి కిటికీ తెరిచి చూశాను! శ్యామ్రావ్‌గారు, వాళ్ళబ్బాయితో సహా కాలనీ అంతా తిరుగుతూ "రాత్రిళ్ళు పడుకునేముందు-మీరందరూ "వేపిక్స్" సేవించండి. అలసటను పోగొట్టి, ఆతృతను లేవగొడుతుంది మర్చిపోకండి "వేపిక్స్- వేపిక్స్-" అని అరుస్తున్నారు.

నాకు అర్థమయింది. ఆ కంపెనీవారు శ్యామ్రావ్ ద్వారా చేయిస్తున్న మరో పబ్లిసిటీ వ్యవహారం ఇది. నిద్రపోవడానికి ఉపక్రమించి లైటార్పబోయేసరికి ఎదురుగ్గా గోడమీద పెద్దవెల్తురు కనిపించి అదిరిపడి లేచి కూర్చున్నాను.

"నిరోధ్ వాడండి! సర్వకాల సర్వావస్థలయందు ఉపయోగపడుతుంది నిరోధ్!" అని చెప్తోంది అమ్మాయి గోడమీద నిలబడి. ఆ తర్వాత ఠక్కున మాయమయిపోయింది.

ఆ తరువాత నేను నిద్ర కుపక్రమించాను అర్ధరాత్రి మా ఆవిడ నన్ను భయం భయంగా లేపింది. లేచి "ఏమిటి సంగతి" అని అడిగాను.

"చదవండి! వెంటనే చదవండి! హ్యూమరాలజీ! మీ జీర్ణశక్తి అభివృద్ధికి హ్యూమరాలజీ" అంటున్నారండీ ఎవరో అంది కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ. *

# స్మగ్లర్స్‌గాంగ్



"కార్ల్‌మార్క్స్ జిందాబాద్! కామ్రేడ్ శాయీరామ్ జిందాబాద్!"

కేకలు దగ్గరయాక చూస్తే-వాళ్ళంతా మా కాలనీ కుర్రాళ్ళే!

వాళ్ళందరూ మార్క్సిస్ట్ (ఎక్స్ట్రీమ్, లెనినిస్ట్ మీడియమ్ గ్రూప్) ఇది మా కాలనీలో కొత్తగా ప్రారంభించిన కమ్యూనిస్ట్ పార్టీ! ఎవరికిష్ట మొచ్చిన పార్టీవాళ్ళు స్థాపించుకునే సాంప్రదాయం మనకెలాగూ ఉండనేఉంది కదా! ఇప్పుడు సంగతేమిటంటే మా కాలనీవాళ్ళు తీయబోయే సినిమా కేవలం మార్క్సిస్ట్ భావాలతో విప్లవాత్మకంగా తీయాలని వాళ్ళు డిమాండ్ చేస్తూ ఊరేగింపు జరిపారన్నమాట.

సంగతేమిటో కనుక్కుందామని శాయీరామ్ ఇంటికెళ్ళేసరికి అందరూ అక్కడే సమావేశమయి కనిపించారు.

"మరేంలేదు. మార్క్సిస్ట్ భావాలతో సినిమా తీయాలని వప్పుకునేసరికి "నాకే" జైకొట్టేస్తున్నారు" చిరునవ్వుతో చెప్తున్నాడు శాయిరామ్.

"అదేమిటి మనం మొదటి సినిమా పూర్తికమర్షియల్ మషాలతో వ్యాపార చిత్రం తీయాలనుకున్నాం గదా?" అడిగాడు జనార్ధన్

"అందుకేనయ్యా బాబూ.... మార్క్సిస్ట్ వ్యవహారంతో సినిమా తీయటం! ఈ రోజుల్లో అవే వ్యాపార చిత్రాలు! ఆ మషాలా పెట్టి, మిగతా మషాలాలు కొంచెం తగిలిస్తే చాలు!" అన్నాడు శాయిరామ్.

"అవునవును!" అంది పార్వతీదేవి.

"కానీ మార్క్సిస్ట్ సినిమా ఎలా తీయాలో మనకెలా తెలుస్తుంది?" అనుమానంగా అడిగాడు రంగారెడ్డి.

"నాకు తెలుసు నేను చెప్తానులే!" అన్నాడు జనార్ధన్.

జనార్ధన్ వాళ్ళ అన్నయ్యకు ఆమధ్య వ్యాపారంలో లక్షలు లక్షలు లాభం వచ్చేసరికి ఆకుటుంబమంతా మార్క్సిస్ట్‌లతో చేరిపోయారు.

మార్క్సిస్ట్ నాయకులవాలంటే లక్షలకు లక్షల ఆస్తి ఉండాలంట! కాదని మేమెంత చెప్పినా వినిపించుకోలేదు. కావాలంటే మన రాష్ట్రంలోని కమ్యూనిస్టు మార్క్సిస్టుపార్టీల నాయకుల ఆస్తి వివరాలు కనుక్కోమంటాడు.

"మార్క్సిస్టు సినిమా అంటే ఇలా ఉండాలన్న రూలేంలేదు. మనిష్ట మొచ్చిన సినిమాయే తీసి పబ్లిసిటీ మాత్రం మార్క్సిస్టు సినిమా అని ఇస్తే చాలు" అన్నాడు జనార్ధన్.

"మరి దీనికి కథెవరు తయారు చేస్తారు?" అడిగాను నేను.

"ఇంకెవరు? నేనే! ఎలాంటి కథయినా రాయగలను నేను" అన్నాడు చంద్రకాంత్ ఛటోపాధ్యాయ్ ఉరఫ్ రామసుబ్బయ్య.

"నువ్వా! నీకసలు మార్క్సిజం అంటేనే తెలీదుకదయ్యా?" అడిగాను చిరాకుగా

"భలేవారే సార్! మార్క్సిజం సినిమా తీయడానికి మార్క్సిజం అంటే ఏమిటో తెలియాలా? భలేవారే సార్! విమానం ఎక్కడానికి విమానం డ్రైవింగ్ తెలుసుండాలా? భలేవారే సార్ మీరు." అందరూ నన్ను చూసి నవ్వారు.

"అయితే ఓ వారంలో కథ తయారుచెయ్! లాగించేద్దాం!" అన్నాడు శాయిరామ్.

చంద్రకాంత్ ఛటోపాధ్యాయ్ ఆనందంగా కాగితాలు కలం తీసుకుని వెళ్ళిపోయాడు. ఆ వారమంతా సినిమా వ్యవహారంలో బిజీ అయిపోయే వాళ్ళేమో గానీ ఈలోగా, మా

కాలనీ పిల్లలందరూ చదువుతోన్న స్కూల్ తాలూకూ ప్రిన్సిపాల్‌గారి దగ్గర్నుంచీ మా అందరకూ ఉత్తరాలు వచ్చాయ్. అన్నిట్లోనూ మేటర్ ఒక్కటే.

"మీ పిల్ల, పిల్లగాడు.... కి టి.సి. ఇచ్చి స్కూలునుంచి గెంటేయాలని ఆలోచిస్తున్నాము. ఆ విషయంలో మీ సహకారం కోసం అర్థిస్తూ-

ప్రిన్సిపాల్"

పిడుగుపడ్డట్టు అందరం స్కూలుకి పరుగెత్తాం పిల్లకాయలను వెంట బెట్టుకుని. అప్పటికే అక్కడ ఓ జాతరలాగుంది తల్లిదండ్రులూ, పిల్లలతో! ప్రిన్సిపాల్‌రూమ్‌బయట అప్పుడప్పుడూ పిల్లల్ని మింగేసేలా చూస్తూ తల్లిదండ్రులు నిలబడి ఉన్నారు.

రంగారెడ్డి చాలామందితో ఇంటర్వ్యూచేసి వచ్చాడు.

"అందరికీ అవే ఉత్తరాలు వచ్చాయట. ఇప్పటికిప్పుడే ఇద్దరు పిల్లలకి టి. సి. ఇచ్చి పంపిచేసిందట కూడాను" వివరాలు చెప్పాడు మాకు. ఈలోగా ప్రిన్సిపాల్ రూమ్‌లో నుంచి ఓ తండ్రి గొంతు గట్టిగా బ్రతిమాలుతూ వినిపించింది.

"అలా అనకండి మేడమ్! ప్లీజ్ మేడమ్! ఇప్పుడు టి.సి. ఇస్తే సీటెక్కడ దొరుకుతుంది మేడమ్."

"లేకపోతే ఏమిటది? ఏమిటి చదువు? ఏమిటీ మార్కులు? మాత్స్-ట్వంటీ పర్సెంట్,సైన్స్ ఫిఫ్టీన్ పర్సెంట్! నో !నో ! టి.సి. తీసుకెళ్ళిపొండి! పిల్లలచదువు మీద శ్రద్ధలేని తల్లిదండ్రులు మాకక్కర్లేదు-మా స్కూల్లో "సీటు" కు ఎంత డిమాండ్ ఉందో తెలుసా మీకు?"

"తెలుసండీ!"

"సీటు" ఇస్తాను అంటే చాలు! వేలకువేలు డొనేషన్లు కట్టే పేరెంట్స్ వేలకు వేలున్నార్న సంగతి తెలుసా మీకు?"

"తెలుసండీ!"

"తెలిసే ఇంత నిర్లక్ష్యం అన్నమాట! తీసుకుపొండి!"

"క్షమించండి మేడమ్- ఈసారికి క్షమించండి! వచ్చే పరీక్షలకు ముందు నేనే సెలవుపెట్టి బాగా చదివి మా పిల్లలక్కూడా చెప్పి మంచి మార్కులు వచ్చేలాచేస్తా!"

"ఇప్పటి పరీక్షల సంగతి మాట్లాడు! ఇప్పుడెందుకు మంచిమార్కులు రాలేదు?"

"నాదే బుద్ధి తక్కువండీ! చాలా పొరపాటు చేశాను."

"అందుకే టి.సి తీసుకెళ్ళమంటున్నాను."

"బాబోయ్ అంతమాట అనకండి మేడమ్-టెక్ట్స్ పుస్తకాలు లేకపోవటంవల్ల ఆ రెండింటిలో తప్పారండి..."

"టెక్స్ట పుస్తకాలెందుకు లేవు?"

"ఏమో మేడమ్! అర్థమయిన షాపులూ తిరిగాను. ఇంతవరకూ ఎక్కడా రాలేదంటున్నారు-"

"పిచ్చివాగుడు వాగకూడదు! క్లాస్‌టీచర్ దగ్గర ఒక టెక్ట్స్‌పుస్తకం నేను చూశాను. ఇంతవరకూ రాకపోతే క్లాస్‌టీచర్ దగ్గరకెలావచ్చాయ్?"

"ఆవిడ భర్త సౌదీఅరేబియాలో పని చేస్తున్నాడు మేడమ్! అక్కడనుంచి తెప్పించుకుందేమో మరి...."

"సీ- మిస్టర్! మీరు టెక్ట్స్‌పుస్తకాలెలా తెచ్చుకుంటారో, ఎక్కడ తెచ్చుకుంటారో నాకనవసరం! టి.సి తీసుకుపొండి...."

"ఈసారికి క్షమించండి మేడమ్! మేడమ్, మేడమ్? మేడమ్ ప్లీజ్ మేడమ్!"

"నో-నో-నో- యూ ఆర్ టూ ఎడొమెంట్-టి.సి. తీసుకుపోవాల్సిందే"

అందరం ఊపిరి బిగబట్టి వింటున్నాము. అతనిగొంతువిపించలేదీ సారి. హఠాత్తుగా "ధన్ "మన్న శబ్దం వినిపించింది.

దానివెనుకే ఆవిడ కీచుగొంతు 'కయ్' మంది

"ఛీ! వాటీజ్ దిస్, వాటీజ్‌దిస్ నాన్సెన్స్! మేరీ-మేరీ- రిమూవ్ హిమ్ ఫ్రమ్‌దిస్ ప్లేస్..."

మాకు అర్థమయిపోయింది, అతను రాజకీయనాయకులువాడే ఆఖరి అస్త్రం ప్రయోగించాడు. ఆమె కాళ్ళమీద పడిపోయాడు.

"అలా అనకండి మేడమ్! ఇప్పుడు ఇంకో స్కూల్లో చేర్చాలంటే మళ్ళీ కొత్తరకం యూనిఫారం, రెండువేలు డొనేషనూ- బాబోయ్-నా వల్లకాదు మేడమ్ మీరు వప్పుకునేవరకూ మీ కాళ్ళువదలను."

"ముందు కాళ్ళువదులు-"

"నేను వదలను మేడమ్-"

"ఆల్‌రైట్! వచ్చే యూనిట్ టెస్ట్‌లో అయినా అన్ని సబ్జెక్ట్సులో పాస్ మార్కులు రాకపోతే టి.సి. ఇవ్వడం ఖాయం!"

"అలాగే మేడమ్!"

"అయితే ఇంక కాళ్ళువదులు!"

"థ్యాంక్యూ మేడమ్!"

"మేరీ!" ప్రిన్సిపాల్ గొంతు వినిపించింది.

"యస్ మేడమ్!"

"అక్కడ విక్సడబ్బా ఉంటుంది-కొంచెం తెచ్చి నాకాళ్ళకు రాయ్-మరీ నొప్పి పుట్టేలా పట్టుకున్నాడు...."

"అలాగే మేడమ్!"

మా అందరిగుండెలూ ఝల్లుమన్నాయ్.

"అవిడ కాళ్ళు పట్టుకోవడం మరీ టూ మచ్!" అన్నాడు రంగారెడ్డి.

"ఒకళ్ళ సంగతేమో గానీ, గిసంటిపనులు నాతోని కాదు భయ్" చెప్పేశాడు యాదగిరి అయితే మేము కాళ్ళు పట్టుకోకపోయినా ఇంచు మించుగా అంత ఘోరంగానూ జరిగింది మా ఇంటర్వ్యూ!

అందరం వాచిపోయిన మొఖాలతో బయటకొచ్చాం.

హఠాత్తుగా యాదగిరి తన చైన్‌లోని చాకు తెరచి తన పన్నెండేళ్ళ కొడుకుని పొడిచేయడానికి వెంబడి పడ్డాడు. వాడు "అమ్మో, అమ్మో" అంటూ మా అందరి చుట్టూ తిరిగసాగాడు.

మేమంతా నానా హడావుడిపడి యాదగిరిని బలవంతంగా పట్టుకుని కత్తిలాక్కున్నాం

"ఏమిట్రా! నీకేమయినా మతిపోయిందా కన్నపిల్లాడిని చంపుతానంటావేమిటి?"

"లేకుంటే ఏం కిరికిరి గురూ ఇది? ఇస్కీ మాకీ-వీడు పుట్టిన దగ్గర కెళ్ళి ఒకటే పరిషాన్, పరిషాన్-ఈడికి పాలడబ్బాలు కొననికి కిరికిరి! దేశమంతా తిరిగినంగానీ పాలడబ్బా మనగ్గావల్సినది దొరకదు! బ్లాకులో కొనెడిదే! ఆడికెళ్ళి స్కూల్లో ఎడ్మిషన్ గురించి కిరికిరి! వెయ్యిరూపాయలు నగలు గిర్వికిపెట్టి తెచ్చి డొనేషను గట్టి లోయర్ కేజీల జేర్పించిన! ఈడు స్కూలుకి పోనికి రిక్ష! నీయవ్వ! ఈడి ఫీజు నలభై! రిక్ష నలభై! ఈడి యూనిఫారం బట్టగురించి వంద దుకాణాలు తిరిగినా ఆడకెళ్ళి ఈడి బూట్లు, టై నిజం జెప్తున్న భయ్! ఈ ఇద్దరు పిల్లగాండ్రిని సదివియ్యనికి పైసల్జాలక నేనూ, నా భార్య ఒక్క పొద్దే భోజనం చేస్తున్నం-గీపరిషాన్ల నేనుంటే గిప్పుడీ ప్రిన్సిపాల్ టి.సి ఇస్తననబట్టే! ఏరా ఎందుకుర మార్కులు గన్ని తక్కువొచ్చినయ్యనడిగితే టెక్ట్స్ పుస్తకాలు తీస్కరమ్మంటడు! నీయవ్వ ఇంకేదయినా అంటే

తెస్తంగానీ గీ టెక్ట్స్‌పుస్తకాలు ఏడకెళ్ళి తేవాల? అదేం బంగారమా, వెండా-తేలిగ్గా దొరకనికి? ఛూ! నీయవ్వ-గిసంటి దేశంలో పిల్లల్నెవడువయ్యా కనమని చెప్పెడిది?"

"మేమంత నీతోపాటే బాధలు పడటం లేదేమిటి? అంతమాత్రన కత్తితీసుకుని పిల్లలను పొడిచేస్తున్నామా?" అన్నాడు రంగారెడ్డి. అందరం కాలనీకి చేరుకున్నాం.

"ఇలాక్కాదు గురూ! అందరం తలోవేపూ వెళ్ళి మొత్తం హైద్రాబాద్ అంతా వెతికి వద్దాం టెక్ట్స్ పుస్తకాలెక్కడయినా దొరుకుతాయేమో!" అన్నాడు గోపాల్రావ్.

ఆ ఆలోచనతో అందరూ ఏకీభవించారు.మర్నాడు శెలవుపెట్టి అందరం టెక్ట్స్‌పుస్తకాలకోసం తలోదిక్కూ వెళ్ళాం! మధ్యాహ్నం తిరిగి వచ్చేసరికి శాయిరామ్ ఉత్సాహంగా ఓ విషయం చెప్పాడు.

"చార్మినార్ దగ్గర ఓ చిన్న షాపువాడు ముందే డబ్బిస్తే రెండు రోజుల్లో పుస్తకాలు తెప్పించి ఇస్తానంటున్నాడు."

"నాకూ ఓ ఫ్రెండ్ కనబడ్డాడు. వాడికి డబ్బిస్తే ప్రింటింగ్ ప్రెస్‌లో వాళ్ళ ఫ్రెండ్‌ద్వారా తెప్పిస్తాట్ట" అన్నాడు రంగారెడ్డి.

వెంటనే అందరం ఆలోచించి ఇద్దరికీ కట్టేద్దామని నిర్ణయించుకున్నాం! "ఇద్దరిలో ఏ ఒక్కరు పుస్తకాలు తెచ్చినా రెండోవారి దగ్గర ఆర్డర్ కాన్సిల్ చేసేయవచ్చు-" అన్నాడు జనార్ధన్.

వారంరోజులు గడిచిపోయినయ్. అయినా ఏ ఒక్కరూ టెక్ట్స్ పుస్తకాలుతేలేదు. ఆ రోజు అర్ధరాత్రి తలుపు తట్టారెవరో. నిద్రకళ్ళతో తలుపు తెరచాను.

ఎదురుగ్గా శాయిరామ్, రంగారెడ్డి, గోపాల్రావ్, యాదగిరి కనిపించారు.

"ఏమిటింత రాత్రిలో వచ్చారు?" అన్నాను నిద్రమత్తుతో.

"టెక్ట్స్ పుస్తకాలు! టెక్ట్స్ పుస్తకాలుదొరుకుతున్నాయట! త్వరగా పద!" అన్నాడు శాయిరామ్ రహస్యంగా. నా నిద్రమత్తంతా వదిలిపోయింది.

"ఎక్కడికి?"

"ష్! అదంతా సీక్రెట్! ఆజమ్‌భాయ్ ఇప్పిస్తానంటున్నాడు-"

అప్పటివరకూ నేను ఆజమ్‌భాయ్‌ని చూళ్ళేదు. వీళ్ళందరి వెనుకా నిలబడిఉన్నాడు ఆజమ్‌భాయ్ కూడా మా కాలనీ నివాసే! అతనికి ఆల్ఫాహోటల్ పక్కన చిన్నపుస్తకాల షాపుంది. మాంచి ఇంగ్లీషు మసాలా నవలలు అద్దెకిస్తుంటాడు.

నేను వెంటనే బట్టలుమార్చుకుని వాళ్ళతో బయలుదేరాను. అందరం అబిడ్స్ చేరుకున్నాం సైకిళ్ళమీద. అబిడ్స్ సెంటర్‌కి దగ్గర్లోనే ఉన్న ఇరుకుసందులు ఓ అరడజను తిప్పాడు ఆజమ్. చివరకు ఓ పాడుబడినట్లున్న మేడముందు నిలబడ్డాం

"ఇగో, దేఖోభయ్! పోలీసులు గిట్టవచ్చి ఈడ ఎందుకు నిలబడి(న్రు అంటే టెక్స్ట్‌పుస్తకమ్ కరేకే బోల్‌నానై సమ్‌జెకినై?"

"సముజే-సముజే!" అన్నాడు రంగారెడ్డి.

"మళ్ళా ఈడ ఎందుకు నుంచున్నావు అంటే ఏం జెప్తావ్?"

"ఏం జెప్పమంటావ్?" అతనినే అడిగాడు శాయిరామ్.

"సెకండ్ షో సినిమాదేక్‌కే ఆరెహే కర్కేబోల్‌నా! సముజేకినై!"

"సముజే! అన్నాడు రెడ్డి"

అయిదు నిమిషాలయిపోయింది. అందరం నిశ్శబ్దంగా దొంగల్లా నిలబడ్డాం.

"టెక్స్ట్ పుస్తకాలేకదా మనం కొనేది? దానికింత రహస్యం ఎందుకు?" నెమ్మదిగా అజమ్ భాయ్ పక్కన చేరి చెవిలో గుసగుసలాడాను.

"అరె బేవకూఫ్! ఇవి స్మగుల్డు టెక్స్ట్‌పుస్తకాలు! మద్రాస్‌కెళ్ళి ప్రింటయి వచ్చింది. సముజే?" "నహీసముజే!" అన్నాను మొఖవాటం లేకుండా

"అరె! క్యాదమాక్ హైజీ తుమారా? మన రాష్ట్రంలో టెక్స్ట్ పుస్తకాలు దొరకటంలేదని స్మగుల్డు వస్తువుల వ్యాపారం చేసేటోళ్ళు- టేప్‌రికార్డర్లు, వాచీలు, బట్టలు కాసెట్లు స్మగ్లింగ్ బంద్‌చేసి మన ఆంధ్రప్రదేశ్ టెక్స్ట్‌పుస్తకమ్‌లు మద్రాసులో ప్రింట్ చేయించి బ్లాకులో అయిదు రూపాయలకు ఎక్కువ రేటుతో అమ్ముతున్నయ్. కొన్ని పుస్తకమ్‌లు హాంకాంగ్, జపాన్ నుంచి భీ స్మగ్లింగ్ హోరైబోల్‌కే సునామై?"

మరో అయిదునిమిషాలు గడిచినయ్.

లాల్చీపైజామా తొడుక్కున్న ఓ వ్యక్తి ఆ పాడుబడ్డ భవనంలోనుంచి టార్చిలైట్‌తో రోడ్డుమీద కొచ్చి అటూ ఇటూ రెండుసార్లు పచార్లు చేశాడు.

రంగారెడ్డి అతని దగ్గరకెళ్ళి "ఆకాశంలో పగలే నక్షత్రాలలొచ్చాయ్!" అన్నాడు అతను ఓ క్షణం ఆగి "నిన్నరాత్రి సూర్యుడు కూడా వచ్చాడు! "అన్నాడు, సిగరెట్ వెలిగించుకుంటూ! ఆ తరువాత ఏం చెప్పాలో రంగారడ్డి మర్చిపోయినట్లుంది. తన డయిరీ తీసి అగ్గిపుల్ల వెలుగులో చూసి అగిపుల్లకు ముళ్ళున్నాయ్" అన్నాడు. ఆ వ్యక్తి ముఖంలో సంతృప్తి కనిపించింది.

"ఎవరు పంపించారు మిమ్మల్ని?" అనడిగాడు.

అజయ్‌భాయ్ ముందుకొచ్చాడు "నిసార్‌మియా!"

"ఎంతమందిక్కావాలి టెక్ట్స్ పుస్తకాలు."

"పద్దెనిమిది సెట్లు!" చెప్పాడు శాయిరామ్.

"మద్రాసు ఎడిషన్ లేదు! అవి లేకపోతే మా పిల్లలకు సంవత్సరం గోవిందా అవుతుంది!" అన్నాడు గోపాల్రావ్.

"అసలురేటుమీద అర్రూపాయలెక్కువవుతుంది!"

"వప్పుకుంటున్నాంగదా!"

"అయితే డబ్బివ్వండి!"

అందరం లెక్కచూసి డబ్బు అతనిచేతికిచ్చాం

అతను ఆ భవనంలోకెళ్ళిపోయి పావుగంట తర్వాత పెద్ద "బండిల్ "తో తిరిగి వచ్చాడు.

"ఇదిగో పద్దెనిమిది సెట్లు! తెలుగు టెక్ట్స్‌లో అక్కడక్కడ ఒకటి రెండు చైనీస్ అక్షరాలు వస్తే రావచ్చు ఎడ్జస్ట్ చేసుకోండి! మళ్ళీ రిటర్న్ తీసుకోమంటే మాత్రం తీసుకునేది లేదు. వారం పదిరోజులు వీటిని స్కూలు కివ్వకండి! సరేనా?"

"సరే!"

అందరం అతనిని కౌగిలించుకుని ముస్లిమ్ పద్ధతిలో భుజాలు కలిపి, షేక్‌హాండిచ్చి కృతజ్ఞతలు తెలిపి కాలనీకి చేరుకున్నాం

తీరా మర్నాడు ఉదయానికి రంగారెడ్డి ఫ్రెండ్ మింట్‌కాంపౌండ్‌లో తనఫ్రెండ్‌ద్వారా సంపాదించిన పుస్తకాలపార్శిల్ రిక్షాలో పంపించాడు. చార్మినార్ దగ్గర షాపులో ఎడ్వాన్స్‌గా కట్టిన డబ్బు తీసుకొచ్చేద్దామని వెళ్ళిన శాయిరామ్ మరో పార్శిల్‌తో తిరిగివచ్చాడు.

"పుస్తకాలు వచ్చేసినయ్ కనుక డబ్బువాపస్ ఇవ్వనన్నాడు ఆ షాపువాడు!" అన్నాడు దిగాలుపడి

ఈ ఎక్స్‌ట్రా పుస్తకాల బెడద ఎలా వదిలించుకోవాలా అని అందరం చాలా భయంక రంగా ఆలోచిస్తూ కూర్చున్నాం. తీరా సాయంత్రం నాలుగయేసరికి మా కాలనీ పిల్లలంతా స్కూలు నుంచి వచ్చేశారు. అందరి చేతుల్లో టెక్ట్స్ పుస్తకాల పార్సెల్స్.

ఖంగారుపడి "ఈ పుస్తకాలెక్కడివి?" అడిగాం వాళ్ళను.

"మా ప్రిన్సిపాల్ ఎక్కడి నుంచో తెప్పించి మా అందరికీ ఇచ్చింది. రేపు డబ్బు పట్టుకొచ్చి కట్టమంది?" అన్నారు వాళ్ళు.

మూలిగేనక్కమీద కొన్ని వందలు తాటికాయలు వరునగా గంటసేపు పడినట్లనిపించింది.

చివరకు ఆ రాత్రి అందరూ కలసి ఓ తీర్పు ఇచ్చారు. నేనూ, శాయీరామ్ కలసి ఆఎక్స్ట్రా పుస్తకాలన్నీ ఓ రిక్షాలో ఓ పెద్ద స్కూలు బయట నిలబడి కావలసిన విద్యార్థులకు అమ్మివేయాలన్నదే ఆ తీర్పు సారాంశం. ఇష్టం లేకపోయినా, ఆపని ఎవరొకరు చేయక తప్పదు కనుక వప్పుకున్నాం- మర్నాడు పొద్దున్నే అనుకున్న ప్రకారం రిక్షా మాట్లాడి పుస్తకాలన్ని వేసుకుని మా కాలనీకి కొంచెం దూరంలో ఉన్న ఓ పెద్ద స్కూలుదగ్గరకెళ్ళి నిలబడ్డాం. మావంక ఎవరూ చూడకపోయేసరికి శాయీరామ్కి గట్టిగా అరవకతప్పలేదు. "ఎవరికి మాస్టారూ టెక్స్ట్ పుస్తకాలు! టెక్స్ట్ పుస్తకాలెవరికండి! తాజా టెక్స్ట్ పుస్త-సారీ-కొత్త- టెక్స్ట్ పుస్తకాలు- గవర్నమెంట్ టెక్స్ట్ పుస్తకాలెవరికండీ బాబూ....."

నాలుగుసార్లలా అరిచేసరికి కొంతమంది కుర్రాళ్ళు వాళ్ళ తండ్రులూ మా రిక్షా చుట్టూ పోగయ్యారు. నాకు అలా ఫుట్పాత్ వ్యాపారం చేయడం చిన్నతనంగా ఉంది కాని తప్పదు కదా మరి!

అయితే శాయీరామ్ ఎందుకనో ఆవేషానికి భలే సూటయ్యాడనిపించింది. కొంతమంది టెక్స్ట్ పుస్తకాలు తిరగేసి చూశారు.

"జపాన్ ఎడిషన్ లేవా?" అడిగాడొకతను.

"లేవుసార్! ఇవే వున్నయ్!"

"అందులో పేపరు మంచిది వాడతారు! అందుకని అడుగుతున్నాను. కావాలంటే ఇంకో రెండ్రూపాయ లెక్కువ తీసుకుని జపాన్వి తెచ్చిస్తారా?"

"అయ్యా మేము ఈ వ్యాపారం చేసేవాళ్ళం కాద్సార్! మా పిల్లలకు అనుకోకుండా మూడుసెట్లు కొనడంవల్ల అమ్మేస్తున్నాము.

"హలో ఉదయార్కర్" అని ఎవరో పిలవడంతో నాప్రైప్రాణం పైనేపోయింది. అతను మా ఆఫీసులోనే వర్క్ చేస్తుంటాడు.

"ఏమిటి ఉద్యోగం మానేశావా?" ఆశ్చర్యంగా అడిగాడతను.

"అబ్బేకాదు" అంటూ ఖంగారుగా చెప్పబోయానుగానీ అతను వినిపించు కోలేదు

"ఓహో పార్ట్టైమ్ అన్నమాట! అవున్లే! స్మగ్లింగ్ బెస్ట్ బిజినెస్! ఎంత మంది ఇట్టే లక్షాధి కారులయిపోలేదు? హాజీమస్తాన్ చూడు! మొదట్లో తిండిక్కూడా గడిచేదికాదుట-"

పావుగంటసేపు హాజీమస్తాన్ కథంతా చెప్పివెళ్ళిపోయాడతను.

"శాయీరామ్!" నీరసంగా పిలిచాను.

"ఏమిటి?"

"ఇలా లాభంలేదు గురూ! పిల్లల్ని స్కూల్‌దగ్గర డ్రాప్‌చేయడానికి తల్లిదండ్రులొస్తారు చూడు! వాళ్ళని అడిగితే బావుంటుంది గానీ ఇలా అసహ్యంగా కేకలు పెడుతూ అమ్మటం నాకు బావుండలేదు" అన్నాను.

"నీ అయిడియా బాగానే ఉంది!" అన్నాడు శాయిరామ్. సరిగ్గా అప్పుడే ఓ పెద్దమనిషి స్కూటర్ మీద వచ్చి వాళ్ళ పాపను డ్రాప్ చేసి తిరిగి వెళ్ళబోతుంటే నేను పరుగుతో వెళ్ళి అడ్డం నిలబడ్డాను.

"మీ పిల్లలకు టెక్ట్స్ పుస్తకాలు కావాలా సార్?" అతను స్కూటర్ ఆపాడు "కావాలి!"

"రండిసార్! తీసుకోండి! రిక్షాలో ఉన్నాయ్! మేము కొన్నధరకే ఇచ్చేస్తున్నాం!"

"ఐసీ" అన్నాడతను స్కూటర్‌కి స్టాండ్‌వేసి రిక్షా దగ్గరకొస్తూ. పుస్తకాలన్నీ చూశాక "ఇవ్వన్నీ కొంటాను ఇస్తారా?" అనడిగాడు. శాయిరామ్, నేనూ ఆనందంగా మొఖాలు చూచుకున్నాం

"ఇస్తాం సార్! అంతకంటె కావల్సిందేముందీ?"

"అయితే నా వెంబడే రానీండి రిక్షా" అంటూ స్కూటర్ స్టార్ట్ చేశాడతను. రిక్షా స్కూటర్ వెనకేపోతోంది. మేముసైకిల్ మీద బయల్దేరాము. "వీడెవరో స్మగ్లర్‌లాగున్నాడు! ఈ పుస్తకాలన్నీ మామూలు రేటుకి కొనేసి-బ్లాకులో అమ్ముకుంటాడు కాబోలు!" అన్నాను శాయిరామ్‌తో

"ఇంకా అనుమానమెందుకూ? బ్లాక్ మార్కెట్ బిజినెస్ చేయబట్టే ఆ స్కూటర్ కొనగలిగాడు!" అన్నాడు శాయిరామ్. "ఇక్కడ ఆపు!" అన్నాడతను రిక్షావాడితో. రిక్షా ఆగింది.

"ఫోర్ నాట్ త్రీ- ఆ రిక్షానీ, వాళ్ళిద్దరినీ లోపలకు తీసుకు పద!" అంటూ అరిచాడు. ఉలిక్కిపడి చూచాము. ఎదురుగ్గా పోలీస్‌స్టేషన్! ఓ కానిస్టేబుల్ బయటకొచ్చి "లోపలకు పదండి" అన్నాడు కర్కశంగా. ఆ షాక్‌నుంచి తేరుకోకముందే మమ్మల్ని లోపలకు తీసుకెళ్ళి లాకప్‌లో పడేశాడు. ఫోన్‌లో మమ్మల్ని తీసుకొచ్చిన స్కూటర్‌వాలా గొంతు భయంకరంగా వినబడుతోంది.

"హలో సార్! యెస్పీగారా సార్! గుడ్ మాణింగ్ సార్! నేను సి. అయ్. డీ ఇన్‌స్పెక్టర్ నర్సింగరావ్‌ని మాట్లాడుతున్నాను. టెక్ట్స్ పుస్తకాల స్మగ్లింగ్‌కేసు పట్టేశాను సార్! చాలా పెద్ద రాకెట్ సార్ అది! ఇద్దరు వ్యక్తుల్నీ, రిక్షాడుపుస్తకాల్నీ కాన్ఫిస్కేట్ చేసేశానండీ!.. మన రాష్ట్రంలో జరుగుతున్న ఈ స్మగ్లింగ్ వ్యవహారంలో ఇదే పెద్ద ముఠా సార్..."

మాకు క్రమంగా స్పృహ తప్పసాగింది. ✷

# మోపెడ్ రేస్ అను
# జి.వి.యస్-50 కథ



ప్రతి ఆదివారం ఏదో గొడవమీద మాకెవరికీ విశ్రాంతి లేకుండా కాలనీ మీటింగ్స్‌లోకి ఈడ్వటం శాయీరామ్‌కి చాలా మామూలు విషయమని మీకూ తెలుసు కదా!

కానీ తమాషా ఏమిటంటే ఆ ఆదివారం అలాంటి గొడవ లేమీ లేకుండా రోజంతా ప్రశాంతంగా గడిచిపోయింది. కానీ మర్నాడు ఉదయం తెల్లారక ముందే తలుపుకొట్టారెవరో. లేచివెళ్ళి నిద్రకళ్ళతో తలుపు తెరిచాను.

"గురూ! ఇవాళ మనకి జి.వి. యస్-50 మోపెడ్ వస్తోంది. అంచేత ఆఫీస్‌కి శెలవు పెట్టు-" అన్నాడు ఆనందంగా.

నాకు శాయీరామ్ మీద ఈర్ష్య కలిగింది. మా కాలనీలో మా బాచ్ వాళ్ళెవ్వరికీ మోపెడ్ లేదు. గవర్నమెంట్ ఉద్యోగుల జీవితాల్లో మోపెడ్ కాదుకదా- దాన్ని ఫ్రీగా ఇచ్చినా పెట్రోల్ పోయించే కెపాసిటీ ఉండదు.

"త్వరగా రడీ అవ్! నేను వెళ్ళి రంగారెడ్డికీ, జనార్ధన్‌కీ యాదగిరికీ గోపాల్రావుకీ కూడా చెప్పేసి వస్తాను." అంటూ వెళ్ళిపోయాడతను.

అందరం కలసి పదింటికల్లా జి.వి. యస్-50 షోరూమ్ కెళ్ళాం

"ఏ కలర్‌కావాలో చూసుకోండి!" అన్నాడు మేనేజరు.

"బ్లూరంగు కొందాం!" అన్నాడు యాదగిరి. కాసేపు రంగుల గురించి మాలో మాకు వాగ్వివాదాలు జరిగాక చివరకు నల్లరంగు అయితే పది కాలాలపాటు బావుంటుందని సెలెక్ట్ చేసుకున్నాం. ఆ మోపెడ్ గురించి మేనేజర్ పావుగంట పొగిడాడు.

"లీటరు పెట్రోల్‌కి 70 కి. మీ! అంటే ఎంత? కిలోమీటరుకి ఇరవైపైసలుఖర్చు! అదే సిటీబస్‌కయితే కి.మీ. 50 పైసలు!" షాప్ సూపర్‌వైజర్ వచ్చాడు "ఫస్ట్ రెండు సర్వీసింగ్‌లూ ఫ్రీ! ఆ తరువాత ఏ రిపేరు వచ్చినా మేమే మా స్పెషల్ మెకానిక్స్‌తో చేయించి-నామినల్‌గా ఛార్జ్ చేస్తాం! కస్టమర్స్ సర్వీస్ ఈజవర్‌మోటో...." అన్నాడతను ప్రేమగా.

అందరం కలసి బండి నడిపించుకెళ్ళి ఆ పక్కనే ఉన్న పెట్రోల్ బంకులో పెట్రోల్ పోయించాం.

అందరికీ ఆ పక్కనే ఉన్న హోటల్లో స్వీట్లు ఇప్పించాడు శాయీరామ్.

"మీరుకూడా కొనెయ్యండ్రా! ఎన్ని రోజులిలా మన దరిద్రపు సిటీ బస్సుల్లో ఫుట్ బోర్డు మీద వేలాడుతూ ప్రయాణం చేస్తారు?" అన్నాడు శాయీరామ్ మా అందరివంకా జాలిగా చూస్తూ. వాడంత జాలిపడుతుంటే నిజంగానే మా బ్రతుకు చూసి మాకు ఏడుపొచ్చింది. అందరం బయటి కొచ్చాము.

"మీరు బస్‌లో ఇంటికొచ్చేయండి. నేను డ్రైవ్ చేసుకొచ్చేస్తాను-" అన్నాడు శాయీరామ్.

అప్పుడే బస్ వేలాడుతున్న జనంతో కదల్లేక కదులుతూ వచ్చింది.

"అబ్బబ్బ! నిజంగా బస్ ప్రయాణం హారిబుల్-రోడ్డుమీద చెత్తను వేసుకెళ్ళే మునిసిపల్ ఎద్దుబండిలో ప్రయాణం చేసినట్లే..." అన్నాడు శాయీరామ్.

మేమందరం మొఖాలు చూసుకుని మళ్ళీ మామీద మేమే జాలిపడ్డాం.

వాడు బండి స్టార్ట్ చేసికొని జనంలో నుంచి తూనీగలా దూసుకుపోయాడు.

మేము దిగులుగా బస్‌కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాం.

"ఈపాటికి మన కాలనీ చేరుకుని ఉంటాడు..."అన్నాడు రంగారెడ్డి దిగులుగా.

"అవ్!" అన్నాడు యాదగిరి ఇంకా దిగులుగా- ఆగకుండా వెళ్ళిపోయిన ఓ బస్సువంక చూస్తూ.

చివరకు అరగంట తర్వాత కాలనీ బస్ దొరికింది.

తీరా ఎక్కి రెండు స్టాప్‌లు దాటామో లేదో- అక్కడ రోడ్డు పక్కనే ట్రాఫిక్ పోలీస్‌తో ఏదో గొడవపడుతున్న శాయీరామ్ కనిపించాడందరికీ.

"ఏదో గొడవయినట్లుంది- పదండి! దిగి వెళ్దాం"అన్నాడు జనార్ధన్. అందరం బస్ దిగి వెళ్ళాం.

"బండి కొన్నది ఇప్పుడే అయితే లైసెన్స్ ఎక్కడి నుంచి వస్తుందడీ?" అంటూ అరచాడు శాయీరామ్ గట్టిగా.

"ముందే టెంపరరీ లైసెన్స్ తీసుకోవాల్నయ్యా!" అన్నాడు కానిస్టేబుల్ దబాయింపుగా, యాదగిరి జోక్యం చేసుకున్నాడు.

"టెంపరరీ లైసెన్స్ గురించే పోతున్నాడండీ! ఇంతలోనే మీరు రుకాయించబట్టి-"

"అదంతా మాకనవసరమయ్యా! రెండొందలు ఫైన్ కట్టాలె"

అందరం ఉలిక్కిపడ్డాం! అయిదూ పదీకాదు! రెండొందలు-

"ఇదిగో-బండికి 'L' బోర్డుకూడా పెట్టలే" అన్నాడు కానిస్టేబుల్ -ఇప్పుడు బండిలోని మొత్తం లోపాలన్నీ పరీక్షిస్తూ.

"ఇదిగో-హెడ్‌లైట్‌కి సగం నల్లరంగు వేయాల్సున్నది-వేయలే!"

రాన్రాను లిస్ట్ పెరిగిపోతుందని భయపడి యాదగిరి అతనిని పక్కకు తీసుకెళ్ళి రహస్యంగా మాట్లాడివచ్చాడు.

ఆ కేసులన్నీ వదిలించుకోవడానికి పాతిక రూపాయలు ఖర్చయింది!

ఆ తరువాత టెంపరరీ లైసెన్స్ కోసం వారంరోజులు తిరగాల్సి వచ్చింది. ఆ వారంరోజులూ శాయీరామ్ మాతోనే బస్‌లో ఫుట్‌బోర్డుమీద వేళ్ళాడుతూ ఆఫీస్‌కి రాక తప్పలేదు.

ఆ తరువాత రెండురోజులు మోపెడ్‌మీద ఆఫీస్‌కెళ్ళాడో లేదు మళ్ళీ వారం శెలవుపెట్టాడు.

"ఏమిటి? ఏమయింది?" ఆశ్చర్యంగా అడిగాను శాయీరామ్‌ని కలుసుకుని.

"షాపువాళ్ళు ఇచ్చింది టెంపరరీ రిజిస్ట్రేషన్ కదా! అందుకని రోడ్ టాక్స్ కట్టడానికి రోజూ ఆ ఆఫీసుకెడుతున్నాను-" అన్నాడు దీనంగా చివరకు తనకు సాధ్యంకాక బ్రోకర్‌కు రెండొందలిచ్చి పని పూర్తిచేశాడు.

వారంరోజుల తరువాత రోడ్‌టాక్స్ బుక్ తీసుకొని విజయగర్వంతో మళ్ళీ మోపెడ్ మీద ఆఫీస్‌కొచ్చాడు.

ఆ తరువాత ఆదివారం అమ్ముగూడాలో బోసువాళ్ళింటికెళ్ళి వస్తానన్జెప్పి మోపెడ్ మీద కాలనీలో హారన్ కొట్టుకుంటూ వెళ్ళాడు. మోపెడ్ పుణ్యమా అని కాలనీలో మీటింగ్‌ల బెడద తప్పిందిగదాని సంతోషించాం మేము! కానీ ఆ సంతోషం ఎంతో సేపు నిలువలేదు.

"మీరు కూడా జి.వి.యస్-50 కొనండి!" అంటూ మా కాలనీలో ఆడాళ్ళందరూ భర్తలను వేధించుకు తినడం మొదలుపెట్టారు. రంగారెడ్డి ఇక తప్పేదిలేదని జి.వి యస్-50 కోసం రెండువేలు డిపాజిట్ కూడా కట్టేశాడు.

ఈ విపత్కర పరిస్థితి నుంచి ఎలా తప్పించుకోవాలా అని నేను ఆలోచిస్తూండగా అసలు కథ ప్రారంభమయింది. మేము లకడీకపూల్ దగ్గర ఒక బస్ కోసం చూస్తూంటే తన మోపెడ్‌ని సైకిలురిక్షాలో వేసుకుని చెమటలు కారిపోతూ వెనుక నడుస్తూ కనిపించాడు శాయిరామ్.

అందరం పరుగుతో వెళ్ళి రిక్షాచుట్టూ మూగాము.

"ఏమిటీ? ఏం జరిగింది?" అనడిగాడు రంగారెడ్డి ఆశ్చర్యంగా.

"ఎందుకో వీల్ తిరగటంలేదు-" అన్నాడు శాయిరామ్ కర్చీఫ్‌తో చెమటలు తుడుచుకుంటూ.

"అప్పుడే ఈ ట్రబులేమిటి! పద-షోరూమ్‌కెళ్ళి ఆ మేనేజర్ని అడుగుదాం" అన్నాన్నేను.

అందరం ఆఫీస్ ఎగ్గొట్టి షోరూం కెళ్ళాం.

అప్పుడే మరో అరడజను మంది కూడా తమ తమ మోపెడ్‌లను రిక్షాల్లో వేసుకొచ్చారు.

మెకానిక్ మా మోపెడ్‌ని కాసేపు రిపేర్ చేసి 'వీల్' తిరిగేట్లు చేశాడు.

"క్లచ్‌ప్లేట్స్ కూడా పోయాయ్ కౌంటర్‌లో కొనుక్కురండి" అన్నాడు బండి స్టార్టవక పోయేసరికి.

జనార్ధన్‌కి కోపం పొడుచుకొచ్చింది.

"అదేమిటి? కొత్తబండే కదా, ఫ్రీగా వేయరా" అనడిగాడు చొక్కా చేతులు పైకి మడుస్తూ.

"అలా మాట్లాడకు గురూ! కిరికిరి ఎందుకూ?" అన్నాన్నేను అతని చొక్కాచేతులు క్రిందకు దించేస్తూ.

అందరం మేనేజర్ దగ్గరకు నడిచాం.

మేనేజర్ చిరునవ్వు నవ్వాడు "ఈ క్లచ్‌ప్లేట్స్ మీరు నిర్లక్ష్యంగా బండినడపడంవల్ల పోయాయ్-అంచేత కొనుక్కుని వేసుకోవాల్సిందే" అన్నాడు.

యాదగిరి మేనేజరు మీదకు నడిచాడు.

"ఇగో మేనేజర్ సాబ్! ఇది మంచిగలేదు, మేము బండి మంచిగ నడపలేదని నీకేం యెరుక?"

"రామచంద్రన్" షాపు సూపర్వైజర్ని పిలిచాడు మేనేజర్.

"యస్సార్!"

"వీళ్ళ బండి బయట పెట్టెయ్యండి! ఆర్గ్యుమెంట్కి టైమ్లేదు" అని మేనేజర్ మోపెడ్డెలివరీ కోసం వచ్చిన మరో కస్టమర్తో మాట్లాడడం మొదలు పెట్టాడు. చేసేదిలేక కౌంటర్ దగ్గరకెళ్ళి 'క్లచ్ప్లేట్స్' కోసం అడిగాము.

"అదిప్పుడు స్టాక్లేదు! ఓ వారం తరువాత కనుక్కోండి!" అన్నాడు సేల్స్మన్.

మాకు వళ్ళు మండిపోయింది.

"అంతవరకూ ఏం చేయాలి?" అడిగాడు రంగారెడ్డి.

"ఎదురుచూడాల్సార్!"

అందరం చేసేదిలేక బయటికొచ్చాము. హఠాత్తుగా యాదగిరికో అయిడియా వచ్చింది.

"అరేభయ్-ఈ పార్టుబయట షాపులోభీ ఉంటయ్ గద! పొయ్యి అరుసు కుందాం నడవండ్రి!" అందరం స్పేర్పార్ట్స్ షాపుకెళాం.

"క్యాహోనా?" అన్నాడు సర్దార్జీ.

"జి.వి.యస్-50 క్లచ్ప్లేట్స్-"

అతను వెంటనే క్లచ్ప్లేట్స్ పాకెట్ తీసిచ్చాడు మాకు ఆశ్చర్యం కలిగింది. ఆపార్ట్స్ మోపెడ్ కంపెనీ వాళ్ళ షోరూమ్లో తప్పితే మిగతా అన్ని చోట్లాలభిస్తాయన్న మాట!

"ఎంత?" అడిగాడు శాయీరామ్ భయంగా.

"దేడ్ సౌ రూపయా-" శాయీరామ్ హారర్ ఫిలిమ్ చూసినట్లు చూశాడు సర్దార్జీవంక.

"అదేమిటి? షోరూమ్లో వందరూపాయలేగా?"

"అయితే అక్కడే తీస్కో-" అన్నాడు సర్దార్జీ అచ్చతెలుగులో. అందరం షాపు బయటి కొచ్చేస్తుంటే సర్దార్జీ పిలిచాడు.

"ఏయ్... ఇధరావో"

అందరం వెనక్కు నడిచాం మళ్ళీ.

"డూప్లికేట్ క్లచ్ ప్లేట్ సెట్ చెలేగా క్యా? మంచిగుంటది!"

"ఎంత?"

"పచాస్! యాభై"

రంగారెడ్డి అనుమానంగా శాయిరామ్ వేపు చూశాడు. శాయిరామ్ ఆ పక్కనే ఉన్న దేవుడి కేలెండర్ వేపు చూశాడు.

"సరే-తీసుకో-కనీసం ఈ పదిరోజులూ ఉండి పనిచేస్తే చాలుగదా-" అన్నాడు జనార్ధన్.

ఆ డూప్లికేట్ సెట్ కొని మెకానిక్ దగ్గరకెళ్ళాం.

అరగంటలో అది ఫిట్‌చేసి ఇచ్చాడతను.

"నలభైరూపాయలివ్వండి!" అన్నాడు చిరునవ్వుతో చేయి చాపుతూ.

"అదేమిటి? ఈ కాస్త పనికి నలభైరూపాయలా?"

"డూప్లకేట్‌పార్ట్ అని తక్కువ అడిగినా సార్! లేకుంటే అరవై-"

నలభయ్ వాడి చేతిలో పెట్టి అందరం కదిలాం అక్కడ నుంచి.

" మీరు బస్‌లో వెళ్ళండ్రా! పాపం మీకు వెధవ బస్‌లు ఎప్పటికి దొరుకుతాయో ఏమో! నేనుబండిమీద వచ్చేస్తాను-" అన్నాడు శాయిరామ్.

"నేనూ నీ బండిమీద వచ్చేస్తాను-" అన్నాడు రంగారెడ్డి ముచ్చటపడిపోతూ. అతని వెనుక కూర్చోగానే శాయిరామ్ స్టార్ట్ చేశాడు.

మేమంతా బస్ కోసం ఎదుర్చూసి చూసి గంటన్నర తరువాత ఇంటికి చేరుకునేసరికి సాయంత్రం అయిపోయింది. అప్పటికీ వాళ్ళిద్దరూ కాలనీకి చేరుకోలేదు.

"ఏమయ్యారంటావ్?" అడిగాడు జనార్ధన్.

"అదే సమజ్ కావటంలేదు- ఏడయినా టక్కరిచ్చిన్రేమో-" అన్నాడు యాదగిరి అనుమానంగా. మేమంతా ఆ విషయం పెద్ద ఎత్తున డిస్కస్ చేస్తుండగానే శాయిరామ్ భార్య రంగారెడ్డిభార్యా ఏడుస్తూ పిల్లల్ని తీసుకొచ్చేశారక్కడికి.

"చెప్పండి అన్నయ్యగారూ! ఆయనెలా ఉన్నారు? దెబ్బలు బాగా తగిలాయా?" అంటూ అడిగేసరికి మాకు మతిపోయినట్లయింది.

"ఏమిటి? ఏం జరిగింది?" అనడిగాను ఆశ్చర్యంగా.

"అదే-ఆయన మోపెడ్‌కి యాక్సిడెంట్ అయిందని మీరు మాట్లాడుకుంటూంటే పిల్లలు విని చెప్పారు..." మాకు నవ్వాలో ఏడవాలో తెలీలేదు.

యాదగిరి జరిగిందంతా నచ్చజెప్తొంటే- దూరంగా రంగారెడ్డి, శాయిరామ్ మోపెడ్‌ని తోసుకురావడం కనిపించింది. పిల్లలంతా పరుగుతో వెళ్ళి దాని చుట్టూ మూగారు.

"అంకుల్, దానిమీద ఎక్కించుకుని ఓ రౌండ్ తిప్పవూ?" అడగసాగారందరూ.

"ష్! పొండ్రా! మేము ఓ రౌండ్ తిరుగుదామంటేనే కుదిరిచావడంలేదు. వెళ్ళండి- వెళ్ళండి-" విసుక్కున్నాడు రంగారెడ్డి.

"ఏం జరిగింది మళ్ళీ-" అడిగాము ఆత్రుతగా.

"ఓ ఫర్లాంగు నడిచి ఆగిపోయింది."

"ఎందుకని?"

"క్లచ్‌ప్లేట్స్ పోయాయట-"

"అదేమిటి ఇప్పుడేగా కొత్తది వేయించింది?"

"డూప్లికేట్ పార్ట్స్ అంతేనంట! మెకానిక్ చెప్పాడు" అన్నాడు శాయిరామ్ దిగులుగా.

"పోనీ ఆసర్దార్జీ దగ్గర ఒరిజినల్ పార్ట్ కొనేయడం మంచిదేమో"

"అవును-"

అందరం కలసి ఇలా కష్టమర్లను ఇన్ని తిప్పలు పెడుతూన్న జి.వి. యస్-50 కంపెనీని తిట్టుకున్నాం.

ఆ మర్నాడు అందరి దగ్గరా తలో ఇరవై రూపాయలూ అప్పుతీసుకుని ఒరిజినల్ క్లచ్‌ప్లేట్స్ కొనడానికి బయల్దేరాడు శాయిరామ్.

"నేను అది కొని మెకానిక్‌తో ఫిట్ చేయించే వరకూ బండి తోసుకుంటూ నడిచే తిరగాలి- మీరు హాయిగా ఇంటి దగ్గర బస్సెక్కి ఆఫీస్‌లో దిగుతారు." అన్నాడు మావంక ఈర్ష్యగా చూస్తూ.

"ఆ- మాకు మాత్రం సుఖం ఏముందిలే! నీ బండి కంటె కొంచెం తక్కువశ్రమ! అంతేకదా-" అన్నాడు రంగారెడ్డి.

తీరా మేము ఆఫీస్ చేరుకుని గంటన్నర అయినా శాయిరామ్ జాడకనిపించలేదు. సాయింత్రం కాలనీ చేరుకునే సరికి అతనింటి ముందు మోపెడ్ కనిపించింది.

అందరం లోపలికెళ్ళాం

"ఏమయింది? ఆఫీస్‌కి రాలేదు?" అడిగాం శాయిరామ్‌ని.

"క్లచ్‌ప్లేట్ వేయించి ఆఫీస్ కొస్తుంటే- క్లచ్‌వైర్ తెగిపోయింది. మళ్ళీ క్లచ్ వైర్‌కొనుక్కుని వేయించేసరికి పన్నెండయిపోయింది- అప్పుడింక ఆఫీస్‌కెలా రావటం? అందుకని ఇంటికొచ్చేశాను-" అన్నాడు దిగులుగా.

"పోనీలే- ఇంక రేపట్నుంచీ ప్రాబ్లెమ్స్ ఏమీ ఉండవు కదా-"

"ఏమీ ఉండవు!" అన్నాడతను ఉత్సాహంగా.

మర్నాడు పొద్దున్న ఎనిమిదింటి నుంచీ శాయిరామ్ మోపెడ్‌ని స్టార్ట్ చేయడానికి ప్రయత్నించడం మా కందరికీ తెలుస్తూనే ఉంది. తొమ్మిదయినా అది ఇంకా స్టార్టవలేదు.

మేము ఆఫీస్ కెళ్ళడానికని బయటికొచ్చేసరికి శాయిరామ్ చెమట్లుకక్కుకుంటూ పెడల్ కొడుతూనే ఉన్నాడు గానీ అది స్టార్ట్ కావటంలేదు. బోలెడుమంది పిల్లలు చుట్టూ మూగి ఉన్నారు.

శాయిరామ్ భార్య ఉండుండి టవల్‌తో అతని చెమటలు తుడుస్తోంది.

మేము అక్కడికి చేరుకున్నాం.

"మళ్ళీ ఏం జరిగింది?" అడిగాడు జనార్ధన్

"స్టార్ట్ కావటం లేదెందుకో!"

"మెకానిక్‌కి చూపించు! ఇలా రోజులతరబడి "కిక్" కొడితే ఏం లాభం?" అన్నాడు రంగారెడ్డి.

"ఓ వేళ ప్లగ్ గిట్ట క్లీన్ చెయ్యాల్నేమో-" అన్నాడు యాదగిరి.

"ఇందాకే క్లీన్ చేశాను-"

"చలో- అందరం కలసివెళ్ళి ఆ షోరూమ్ మేనేజర్ని పట్టుకుందాం! కొత్త బండికే ఇన్ని ట్రబుల్స్ వస్తే ఎలా?" అన్నాడు జనార్ధన్.

అందరం బండిని ఆటోలో వేసుకుని షోరూమ్ చేరుకున్నాం.

"ఏమయింది?" అడిగషాడు షాప్ సూపర్‌వైజర్.

"మాకేం తెలుసు? స్టార్టవటంలేదు-" అన్నాడు శాయిరామ్.

"ఒరేకిషన్-" మెకానిక్‌ని పిలాచాడతను.

ఓ పన్నెండేళ్ళ కుర్రాడు బయటకొచ్చాడు.

"బండి చూడోసారి!" అన్నాడతను.

కుర్రాడు పరీక్ష చేశాడు "కార్బొరేటర్ క్లీన్ చేయాల్సార్!" అన్నాడు సూపర్‌వైజర్‌తో.

"మరి చేసేయ్-" అన్నాడు రంగారెడ్డి.

"ఇప్పుడెక్కడ కుదురుతుంది సార్! ఎల్లుండి సాయంత్రానికిగానీ కుదరదు. ఎల్లుండి పొద్దున్న తెచ్చివ్వండి బండి-"

"అదేమిటి? మేము బండి కొంటున్నప్పుడు "కస్టమర్స్ సర్వీస్ ఈజ్ అవర్ మోటో" అన్నావుగా!"

"అవును! ఇప్పుడు మాత్రం లేదని ఎవరన్నారు?"

"అయితే ఇప్పుడే రిపేర్ చేయించాలి కదా-"

"కుదరదు! బోలెడు మోపెడ్స్‌కు ఎడ్వాన్స్‌గా చెప్పిఉంచాము. అంచేత అవన్నీ రిపేర్ చేయటం పూర్తయాకే మీ బండి-"

"ఇగో మాదీ బండి గిప్పుడు రిపేర్ చేస్తావా? చేయవా? ఒక్కమాట చెప్పు" అన్నాడు యాదగిరి మీద కెళ్తూ.

"ఏం బెదిరిస్తున్నావా!" అన్నాడు సూపర్‌వైజర్ కూడా ముందుకొస్తూ.

యాదగిరి అతని చొక్కా పట్టుకున్నాడు. అతను యాదగిరి చొక్కా పట్టుకున్నాడు.

మేనేజర్ పరుగుతోవచ్చి ఇద్దరినీ వెనక్కు లాగేశాడు.

"అలా కొట్టుకోవటం ఎందుకయ్యా! అందరంస్నేహంగా ప్రేమగా మాట్లాడు కోవాలి!" యాదగిరి చట్టుక్కున మేనేజర్ చొక్కా పట్టుకున్నాడు. అందరం కలసి వాళ్ళిద్దరినీ విడిపించాం. చివరకు చేసేదేమీలేక మళ్ళీ దానిని తోసుకుంటూ మెకానిక్ దగ్గరకెళ్ళాం. రెండు గంటల తరువాత బండి రిపేరయింది. పదిరూపాయలు మళ్ళీ సమర్పించుకుని ఇంటి మొఖం పట్టాము.

"ఒరేయ్-నేను బండిమీద ముందు వెళ్తాంటాను. మీరు ఆటోలో నావెనుకే వస్తూండండి" అన్నాడువాడు భయంగా. వాడు కోరినట్లే ముందు వాడి మోపెడ్ వెనుక మేము రెండు ఆటోల్లో బయల్దేరి ఇల్లు చేరుకున్నాం

మర్నాడు ఆఫీసులో ఆ మధ్య జీ.వి. యస్.ఫిఫ్టీ-కొన్న శేఖర్‌ని కలుసుకున్నాం

"ఏం గురూ? ఎలా వుంది నీ బండి!" అనడిగాం చాలా ఫార్మల్‌గా అడుగుతున్నట్లు.

"ఫర్లేదు బావుంది!" అన్నాడతను.

అందరం మొఖమొఖాలూ చూచుకున్నాం.

"రిపేర్లేమీ లేవా?"

"చాలా తక్కువ! కొత్తబండికదా! మహా అయితే నెలకి రెడొందలు రిపేర్ కవుతుంది! అంతే! రాన్రాను బాగా ట్రబులిస్తుందంటున్నారు గానీ ఇప్పుడు బాగుంది! రెండొందలే ఖర్చవుతోంది."

"అయినాగాని అంత ఖర్చవుతూంటే నీకు జీతం ఎలా సరిపోతోంది" ఆశ్చర్యంగా అడిగాను.

"ఏడ్చినట్లుంది! నా జీతం ఎందుకు ఖర్చుచేస్తాను దీనికి? ఇది మా మావగారు కొనిచ్చారు. అంచేత ఖర్చంతా ఆయనిదే! ఆయనదగ్గర చాలా బ్లాక్‌మనీ ఉందికదా! బ్లాక్‌మనీ వైట్ చేసుకోవాలనుకొనే వాళ్ళంతా జి.వి.యస్-50యే కొంటారట! ఒక్క సంవత్సరంలో నలభై లక్షలవరకూ బ్లాక్ మనీ వైట్ అయిపోతుందట-" చెప్పాడు వాడు. ఆసాయంత్రం మళ్ళీ ఎంత తన్నుకున్నా బండి స్టార్టవలేదు.

అందరం బండిని మెకానిక్ దగ్గరకు తీసుకెళ్ళాము-

"ప్లగ్ ఖరాబయింది సార్! కొత్తది తీసుకురాండ్రి!" అన్నాడు మెకానిక్.

"ఎంతవుతుంది?" ఏడుపుమొఖంతో అడిగాడు శాయిరామ్.

"కొత్త ప్లగ్ ఇరవై రూపాయలుంటుంది సార్"

"ప్లగ్ కెంతయినా ఫర్లేదు. నేనడిగేది నీ ఛార్జీ ఎంతవుతుందని?"

"ఎంత సార్ అయిదు రూపాయలు."

అక్కడి నుంచి ఇద్దరం రిక్షాలో ఆటో స్పేర్ పార్టు అమ్మేషాపుకెళ్ళి ప్లగ్ కొనుక్కొచ్చి వేయించాము. బండి బ్రహ్మాండంగా స్టార్టయింది. అందరం హాయిగా ఇంటికి చేరుకున్నాం.

శాయిరామ్ ఆ తర్వాత కాసేపు కాలనీ పిల్లల్ని వెనుక ఎక్కించుకుని రౌండ్స్ కొట్టాడు.

ఆ తరువాత మేమందరం చూస్తూండగానే వాళ్ళావిడను దర్జాగా ఎక్కించుకుని సినిమా కెళ్ళిపోయాడు. రాత్రి తొమ్మిదిన్నరవరకు నేను నవల చదువుకోవటం ఆపి పడుకుందా మనుకుంటే ఆటో వచ్చి శాయిరామ్ ఇంటి ముందాగింది అందులో నుంచి శాయిరామ్ ఫామిలీతో దిగాడు. లేచి అతని దగ్గర కెళ్ళాను.

"ఆటోలో వచ్చావేమిటి?" ఆశ్చర్యంగా అడిగాను.

"ఆ వెధవబండి స్టార్టయి ఛస్తేగా?" మండిపోతూ అన్నాడతను."ఎందుకని?"

"మధ్యలో గంటసేపు వర్షం కొట్టింది కదా! వర్షంలో తడుస్తే- కార్బొరేటర్ లోకి నీళ్ళు వెళ్ళి బండి స్టార్టు కాదంట- అందుకనే దాన్ని సినిమా హాల్లోనే వదిలేసి ఆటోలో వచ్చేశాము."

మర్నాడు ఆఫీసుకి శెలవుపెట్టి బండి రిపేర్ కోసం వెళ్ళాడతను.సాయంత్రం మేము ఇంటికొచ్చేసరికి మోపెడ్ మళ్ళీ తళ తళ మెరుస్తూ శాయిరామ్ ఇంటిముందు కనిపించింది. "శాయిరామ్ బండి బాగుపడిందా?" అడిగాడు రంగారెడ్డి ఆత్రుతగా.

"ఎందుకు?"

"అలా కోఠి వరకూ వెళ్ళివద్దామని- నా క్కొంచెం పని ఉంది-"

"కోఠి వరకా?"

"అవును! ఏం?"

"అదెక్కడ పనిచేస్తుంది? ఇంటి కొస్తుంటే-యాక్సిలేటర్ వైర్ పోయింది-"

"అదేమిట్రా! నీ బండికిలా ట్రబుల్స్ వస్తున్నాయ్? మరి వామన్రావ్‌గాడు హాయిగా నడుపుతున్నట్లు చెప్పాడుకదా!"

"ఏమో అదే నాకు అర్థం కావటంలేదు-ఇప్పటికిప్పుడే వెయ్యిరూపాయలు మెకానిక్‌కీ రిపేర్లకూ ఖర్చయింది..."అన్నాడు దిగులుగా.

"వామన్రావ్‌గాడింటికెళ్ళి కనుక్కొద్దాంపద-" అన్నాడు రంగారెడ్డి.

అందరం కలసి వామన్రావ్ ఇంటికి బస్సులో చేరుకున్నాం. అంతా వినివాడు చిరునవ్వు నవ్వాడు.

"ఈ మోపెడ్ కొన్నప్పుడు మనం టైంటేబుల్ వేసుకోవాలి బ్రదర్! అలా వేసుకుని దాన్ని ఫాలో అయితే ట్రబులుండదు-"

"ఏమిటా టైమ్ టేబుల్?"

"ప్రతి సోమవారం క్లచ్ ప్లేట్స్ కొత్తవి వేయించాలి! మంగళవారం కొత్త ప్లగ్, బుధవారం కొత్త క్లచ్ వైరూ, గురువారం యాక్సిలేటర్ వైరూ, శుక్రవారం కార్బొరేటర్ క్లీన్ చేయించాలి, శనివారం ఓవరాలింగ్, ఆదివారం బండికి రెస్టు-అంతే! చెక్కు చెదురదు బండి! ఎప్పుడూ మాంచి కండిషన్‌లో ఉంటుంది-"

"మరి ఇవ్వన్నీ చేయిస్తూ కూర్చుంటే ఆఫీస్‌కెలావెళ్తాను?" ఆశ్చర్యంగా అడిగాడు శాయిరామ్.

"బస్‌లో! "

"మరింకా బండి ఎందుకు?"

"ఎమర్జన్సీలో ఉపయోగించటానికి-అంటే రోజూ మెకానిక్ దగ్గరకు తీసుకెళ్ళడానికి, మళ్ళీ అక్కడి నుంచి ఇంటికి తేవడానికీ-స్పేర్ పార్ట్స్ కోసం షాపు చుట్టూ తిరగడానికి అది పని చేయ్యాలి కదా-"అందరం తిరిగి వచ్చేస్తూంటే లక్ష్మయ్య కొత్త జి.వి.యస్-50 మోపెడ్ మీద ఎదురయ్యాడు.

"ఏం గురూజీ! ఇది కొన్నారా?" గాబరాగా అడిగాడు రెడ్డి

లక్ష్మయ్య చిరునవ్వు నవ్వాడు.

"పిచ్చివాళ్ళల్లారా! మనం ఏ బండీ ఎప్పుడూ కొనకూడదు?"

"మరి?"

"కొన్నవాళ్ళనడిగి రెండురోజుల కోసం వాళ్ళ బండి అరువు తెచ్చుకుని మళ్ళీ ఇచ్చివేస్తుండాలి-"

"ఆ తర్వాత ఎలా మరి?"

"ఇంకో ఓనర్‌ని వెతుక్కోవాలి-"

"అలా ఎంతకాలం?"

"జీవితమంతా అలా గడిపేయడమే? నాకు చూస్తూ చూస్తూ ఈ పద్ధతిలోనే పదేళ్ళు గడిచిపోయింది కదా!"

"కానీ అలా ఎందుకు? మీరే ఓ బండి కొనుక్కోవచ్చుకదా?"

"కొనుక్కుంటే మనమే రిపేర్లు చేయించొద్దంటోయ్? అది పిచ్చిపని! తెలివితక్కువ వాళ్ళు చేసేపని-వస్తా ఈ బండి కొంచెం ట్రబులిస్తోంది! త్వరగా ఓనరుకిచ్చేయాలి- అన్నట్లు నీ బండి కండిషన్ బావుందా? ఉంటే నాకివ్వు! రెండ్రోజుల్లో ఇచ్చేస్తాను-"

మేము మాట్లాడకుండా ముందుకి నడిచాము.

"అరె మాట్లాడరేమయ్యా! ఓనర్లకు తెగ పొగరెక్కువయిపోయిందీ మధ్య! ఇస్తాను. .ఇవ్వను అని కూడా చెప్పటంలేదు-" అంటూ తన బండి స్టార్టు చేసుకెళ్ళిపోయాడు లక్ష్మయ్య కోపంగా. ఆ రాత్రి శాయిరామ్ ఇంట్లోనుంచి పెద్ద పోట్లాట వినిపించింది. మేమంతా అతనింటి కెళ్ళాం సంగతేమిటో కనుక్కుందామని.

"ఆ పాడుబండి కొనటమే నా కిష్టం లేదసలు. దానికోసం-గొలుసు బ్యాంక్‌లో పెట్టాలంటే పోనీలే కదాని ఇచ్చాను. ఇప్పుడు దాని రిపేర్లకి మంగళసూత్రం కావాలా! ఛస్తే ఇవ్వను-" అంటోంది వాళ్ళావిడ.

వాళ్ళ సంభాషణ విని మేమంతా బరువెక్కిన గుండెలతో వెనక్కు తిరిగి వచ్చాం! శాయిరామ్ కష్టాలు చూసి మా అందరికీ విపరీతమయిన జాలి వేసింది. మర్నాడు ఉదయం శాయిరామ్‌కి జ్వరం వచ్చిందని తెలిసింది. అందరం వెళ్ళి కాసేపు అతనితో మాట్లాడి జ్వరానికి టాబ్‌లెట్స్ తెప్పించాం.

అయితే అది జ్వరంకాదనీ, కేవలం ఆ మోపెడ్‌ని ఏమి చెయ్యాలో తెలీక వచ్చిన మనోవ్యథ అని తేల్చిందతని భార్య

అందరం మళ్ళీ శాయిరామ్ దగ్గరకెళ్ళి ధైర్యం చెప్పాము.

"ఆ మోపెడ్‌గురించి దిగులుపడుతున్నావా ఏమిటి?" అని అడిగాడు గోపాల్రావ్.

"ఏం ఫర్లేదు బ్రదర్! ఆ బండి విషయం మర్చిపో! దాని సంగతి మేము చూసుకుంటాం" అన్నాడు జనార్ధన్

"ఇప్పుడు దాన్నింక ఎవరుమాత్రం ఏం చెయ్యగలం?" విచారంగా అన్నాడు శాయిరామ్. రంగారెడ్డి గలగల నవ్వాడు.

"పిచ్చివాడా! ఈ మాత్రానికే బెంబేలు పడిపోతే ఎలా? ప్రతి సమస్యకూ ఓ పరిష్కారం ఉంటుంది అని ఎక్కడో చదివాం కదా! అంచేత మోపెడ్‌లు కొన్నవారికి కూడా ఏదో బయటపడే మార్గం ఉండే ఉంటుంది-" అన్నాడు ఆప్యాయంగా.

"ఈ బండి గురించి సోంచాయించెడి దేమున్నదివయ్యా! మా చిన్నమ్మ కొడుకు గిట్లనే మోపెడ్ కొన్నంక పరేషాన్ పరేషాన్ అయి-రెండునెలల్ల అమ్మేసిండు మళ్ళీ-" అన్నాడు యాదగిరి.

అందరూ యాదగిరి సలహాకు తప్పట్లు కొట్టారు.

"వండర్‌ఫుల్ అయిడియా! మన మోపెడ్‌ని కూడా అమ్మేస్తే-చాప్టర్ క్లోజ్! శాయిరామ్ ఇంట్లో మళ్ళీ సుఖశాంతులు" అన్నాడు జనార్ధన్.

శాయిరామ్ కూడా కొద్దిక్షణాలు ఆనందపడిపోయాడుగానీ వెంటనే అతనిమొఖంలో మళ్ళీ మబ్బులు కమ్ముకొచ్చేసినయ్.

"కానీ-ఫస్ట్‌హాండ్‌కే నమ్మకంలేదు ఈ సెకండ్‌హాండ్‌నెవరు కొంటారు? మన కాలనీ చుట్టుపక్కల వాళ్ళందరికీ దీని విషయం తెలిసిపోయిందికదా!"

"దానికి ఓ ఉపాయం ఉంది బ్రదర్! మన గోపాల్రావ్ న్యూస్‌పేపర్లో ఎడ్వర్టయిజ్‌మెంట్ చేస్తే జనం విరగబడిపోరూ?" అన్నాడు జనార్ధన్.

"ఒండర్‌ఫుల్ అయిడియా" అన్నాడు రంగారెడ్డి.

అప్పటికప్పుడే అందరం కూర్చుని ప్రకటన తయారుచేయటం మొదలు పెట్టాము.

"నెలరోజులు మాత్రమే ఉపయోగించిన అద్భుతమైన మోపెడ్ అమ్మకానికి కలదు" అన్నాడు జనార్ధన్ "అలా పొడిగా రాస్తే చాలదోయ్! మన బండిని బాగా పొగిడి ఎట్రాక్షన్ కలుగజేయాలి-" అన్నాడు రంగారెడ్డి ఆలోచిస్తూ. కొద్దిక్షణాల తర్వాతగట్టిగా అరచాడు.

"ఆ! దొరికింది! చూడండి చెప్తాను.

ఒక్కనెల మాత్రమే- ఒక్క ఓనర్ వాడిన-సరికొత్త మోపెడ్ (జి.వి.యస్...50) అమ్మకానికి సిద్ధంగా ఉంది. అద్భుతమైన పికప్! లీటర్ పెట్రోల్‌కి డెబ్భై కిలోమీటర్లదూరం (త్వరలో ఎనభై కూడా ఇస్తుందని కంపెనీ వారి గ్యారంటీ) కావల్సినవారు వెంటనే శాయిరామ్, (నిర్భయ్‌నగర్ కాలనీ) నికలుసుకోండి! ఇది సువర్ణావకాశం! ఆలసిస్తే ఆశాభంగం! నేడే మీ అభిమానమోపెడ్‌ని సందర్శించి సొంతం చేసుకోండి!"

యూసుఫుద్దీన్ నిసార్ కది అంతగా నచ్చలేదు.

"యే బస్! నహీహోతాయార్!" అన్నాడు తనూ ఆలోచిస్తూ.

"ఎందుకు? ఏం తక్కువయింది?" అడిగాడు జనార్ధన్.

"అది మంచిమోపెడ్ ఉంటె ఈ శాయిరామ్ ఎందుకు అమ్ముతుయ్? కొంచెం బ్రెయిన్ ఉంటే ఎవ్వరూ కొనయ్?" అన్నాడు వాడు.

"నీ తెలుగు తగలెయ్యా!" అన్నాడు గోపాల్రావ్.

నిసార్ నవ్వాడు"ఈ తెలుగుసాలు భాయ్ ఆంధ్రప్రదేశ్‌కో!"

నిసార్ చెప్పిన పాయింట్ మా కందరికీ అర్థమయింది. నిజమే ఆమోపెడ్ అంత అద్భుతమయినదయితే శాయిరామ్ ఎందుకమ్ముతున్నట్లు అని ఎవరికయినా అనుమానంవస్తుంది.

"అంచేత మనం అది ఎందుకమ్ముతున్నట్లు అనేవివరం కూడా తెలియజేయాలి!" అన్నాడు రంగారెడ్డి.

'కారు కొంటున్నందువల్ల ఈ మోపెడ్ అమ్ముతున్నాము అని రాస్తే? అని అడిగాను నేను. అందరూ నావంక పిచ్చివాడిని చూసినట్లు చూశారు. అందులో డిఫెక్ట్ ఏమిటో నాకేమాత్రం అర్థంకాలేదు

"డాక్టర్ సలహామీద (ఆరోగ్య కారణాలవల్ల) అమ్మాల్సి వస్తోంది. అనిరాస్తే" అడిగాడు రంగారెడ్డి.

"అంటే ఈ బండి వాడిన వాళ్ళందరికీ ఆరోగ్యం చెడిపోతుంది అన్న అర్థం వస్తుంది" అన్నాడు గోపాల్రావ్.

"అవునవును" అన్నాడు శాయిరామ్

"ఓ తమామ్ కైకుభాయ్! మై ఏక్ బాత్ బోలూం?" అడిగాడు నిసార్.

"బోలోభాయ్-బోలో!" అన్నాడు యాదగిరి.

"ఓనర్‌కో అండమాన్ ట్రాన్స్‌ఫర్ హోగయా బోల్‌కే లిఖో-"

అందరూ తప్పట్లు కొట్టారు.

"సూపర్బ్ అయిడియా?" అన్నాడు జనార్థన్.

అందరం కలసి కూడబలుక్కుని ఆ వాక్యంకూడా తయారుచేశాము.

"ఓనర్‌కి అండమాన్ ట్రాన్స్‌ఫర్ అయినందువల్ల అమ్మేయడం జరుగుతోంది... "అంటూ తగిలించాం ఆఖర్లో! అదంతా కాలనీ రచయిత చంద్రకాంత్ ఛటోపాధ్యాయ్ తన అద్భుత శైలితో రీరైట్ చేశాడు.

"కానీ మన రాష్ట్ర ప్రభుత్వం వాళ్ళకు అండమాన్ ఎందుకు బదిలీ అవుతుంది?" అని అడిగాడు శాయిరామ్ అనుమానంగా.

"అవన్నీ ఎవడడుగుతాడోయ్- వెధవ అనుమానాలు..." అన్నాడు జనార్థన్. దాంతో శాయిరామ్ సైలంటయిపోయాడు

అందరం కలసి తలోఅయిదు వేసుకుని పేపర్లో ఆ ప్రకటన ఇవ్వటానికి డబ్బు పోగుజేశాము.

"ఇప్పుడు మనం చెయ్యాల్సిన ముఖ్యమయినపనేమిటంటే- ఈ మోపెడ్‌ని మెకానిక్ దగ్గరకు తీసుకెళ్ళి కనిసం అయిదారు కిలోమీటర్లు దూరమయినా ఆగకుండా నడిచే విధంగా రిపేర్ చేయించాలి! ఎందుకంటే కొనేవాళ్ళు దీనిమీద ఓ రౌండ్‌కొట్టి పరీక్షిస్తారు కదా?" అన్నాడు రంగారెడ్డి.

వెంటనే నేనూ శాయిరామ్ కలసి దానిని మెకానిక్ దగ్గరకు తీసుకెళ్ళాము.

"చూడు రాములూ! దీనిని కనీసం ఏడెనిమిది కిలోమీటర్ల దూరం వరకూ ఎలాంటి ట్రబుల్ రాకుండా నడిచేటట్లు చేయాలి! ఎలా చేస్తావో నాకు తెలీదుగానీ ఈ సహాయంచెయ్-" అన్నాడు శాయిరామ్.

రాములు కెవ్వున కేకవేశాడు.

"అరేయ్! ఆ చిట్‌ఫడ్ కంపెనీ మనిషి వెళ్తున్నాడు- అర్జంటుగా పిలు..." అంటూ కుర్రాడిని పరిగెత్తించాడు.

"ఏమిటి ఏం జరిగింది?" అడిగాను ఆశ్చర్యంగా."ఈ బండిని నమ్ముకుని నేనిప్పుడే కొత్త చీటీ కట్టాను. ఈ బండి మీదనెలకొచ్చే రెండొందలూ ఆ చీటీకి కట్టొచ్చని ఆశపడ్డాను. కానీ ఇప్పుడు మీరు అయిదారు కిలోమీటర్లు నడిచేట్లు చూడమంటే అర్థం అమ్మేస్తున్నారనే కదా- ఇంక నాకు ఆ చీటీ కట్టడానికి డబ్బెక్కడనుంచి వస్తుంది?" అన్నాడు దిగులుగా.

చీటీ పెద్దమనిషిని తీసుకొచ్చాడు కుర్రాడు. '

'సారీ అన్నా! చీటీ కాన్సిల్ చేసెయ్! ఈ బండి అమ్మేస్తున్ను" అన్నాడు రాములు.

అతను గొణుక్కుంటో చీటీ కేన్సిల్ చేసేశాడు.

సాయంత్రంవరకూ తంటాలుపడి పాతికరూపాయలు తీసుకుని బండి తిరిగి ఇచ్చాడు మెకానిక్.

"ఎక్కి ఇంటికి వెల్లిపోదాం! రిపేరయిందిగా?" అన్నాన్నేను శాయిరామ్‌తో.

"వద్దు గురూ! ఎక్కితే మళ్ళీ ట్రబులిస్తుందేమో-కొనేవాళ్ళు టెస్టు చేసుకొనేటప్పుడు వాడితేనే మంచిది" అన్నాడు శాయిరామ్ భయంగా.

మళ్ళీ దానిని కాలనీకి తీసుకెళ్ళాము.

ఆ రాత్రంతా యాదగిరి, శాయిరామ్ కలసి దాన్ని తళతళలాడేలా తుడిచి తెల్లారేసరికల్లా శాయిరామ్ ఇంటిముందు నిలబెట్టారు.

నిజం చెప్పాలంటే దాన్ని చూస్తూంటే అమ్మడానికి మాకే ప్రాణం వప్పలేదు. అంత అందంగా ఉంది.

పేపర్లో మా ప్రకటన రానే వచ్చింది.

"నిజంగా-ఈ ప్రకటన ఎంత ఎట్రాక్టివ్‌గా ఉందంటే-నాకే కొనబుద్ధివేస్తుంది" అన్నాడు రంగారెడ్డి.

ఆ రోజు ఆదివారం కావటంవల్ల మా మోపెడ్ కొనుగోలుదార్లు వస్తారేమోనని అందరం కాలనీ ఎంట్రెన్స్ దగ్గరే కూర్చున్నాము.

టైము పన్నెండయింది. ఒంటిగంటా, రెండూ కూడా అయింది. అయినా ఎవరూ రాకపోయేసరికి అందరికీ నిరుత్సాహం పుట్టుకొచ్చింది.

"ఎవరూరారేమో" అన్నాడు శాయిరామ్ దిగులుగా.

అప్పుడే ఆటోరివ్వున వచ్చి మా కాలనీ ముందు ఆగింది. అందులో నుంచి చేతిలోబేగ్ పట్టుకున్న పెద్దమనిషి దిగాడు.

"ఇక్కడ శాయిరామ్ గారిల్లు...."

"ఇడుగో ఇతనేనండి శాయిరామ్. వండర్‌ఫుల్ మోపెడ్-సూపర్ పెర్ఫారమెన్స్- పాపం! అండమాన్ బదిలీ అవబట్టి అమ్మటమేగానీ అది అమ్మడం అస్సలిష్టంలేదు అతనికి!"

"అసలు మా కాలనీలోనే ఎవరొకరు కొనుక్కునేవాళ్ళం! బయటవాళ్ళకమ్మటం మాకెవరికీ ఇష్టంలేదు. కానీ పాపం అతనికి ట్రాన్స్‌ఫర్ ఖర్చులకు దానికిడబ్బు ఇప్పుడే అవసరం కదా! మా దగ్గర అంత డబ్బు లేదు..." అన్నాడు జనార్ధన్.

"బండి చూద్దామా" అడిగాడతను.

అందరం కలసి పెద్ద ఊరేగింపులా బండి దగ్గరకు నడిచాము.

"ఏమీట్రబుల్ లేదుకదా?" అడిగాడతను బండివంక అనుమానంగాచూస్తూ.

"ట్రబులా? అహహహ-" అని నవ్వాడు రంగారెడ్డి ఇంకేమీ చేయలేక. వెంటనే యాదగిరి అందుకున్నాడు.

"అవ్సార్! ట్రబులెందుకుంటుంది? ఫస్ట్‌క్లాస్ బండిసార్! అసలు ఈ బండీ కొత్తగా మార్కెట్లో రిలీజవగానే 14 మంది మెకానిక్‌లు ఆత్మహత్య చేసుకున్రు! మీకెరికేనా"

ఆ పెద్ద మనిషి ఆశ్యర్యపోయాడు.

"ఆత్మహత్యా? ఎందుకు?" అనడిగాడు నమ్మలేనట్లు

"ఎందుకేమి సార్! దీనికి రిపేర్స్‌గిట్టా ఏమీరావని ఆళ్ళకి తెల్సిపోయింది సార్! రిపేర్‌కి రాకుంటే మరి అళ్ళు బ్రతికెడిదెట్లా?"

"అవునవును-" అన్నాడతను.

"పాపం వాళ్ళనీ మోపెడ్ నిజంగా పొట్టమీద కొట్టినట్లే- "అన్నాడు జనార్ధన్.

అతను మరోసారి బండిని పరీక్షగా చూశాడు.

"రేటెంత?" అడిగాడతను

"నాలుగువేలు-వాడింది నెలరోజులే! అయినా ఎనిమిదొందలు నష్టానికమ్మేయాల్సివస్తోంది" అన్నాడు గోపాల్రావ్.

"అదీగాక మా వాడికి 'డబ్బు ముఖ్యం' కాదు అనే మనస్తత్వం! అందుకే ఎనిమిదొందలు పోతేపోనీమని వదిలేస్తున్నాడు-" అన్నాడు రంగారెడ్డి

"ఇదేకాదు. ఇతను ముందొకసారి కూడా వాషింగ్‌మిషన్‌కొని నెల్రోజులన్నా అవకముందే ఆరొందలులాస్‌కి అమ్మేశాడు" అన్నాడు జనార్ధన్

"నాలుగువేలు చాలా ఎక్కువ" అన్నాడతను మరోసారి బండివంకచూస్తూ.

"నో నో.....చాలా తక్కువ" అన్నాడు శాయిరామ్."అండమాన్ వెళ్ళిపోతున్నారంటే ఇంకా తక్కువ ధరకు దొరుకుందనుకున్నాను-" అన్నాడతను.

"సూపర్బ్ వెహికల్ సార్! ఒక్కలీటర్‌కి 70 కిలోమీటర్లు తక్కువదూరమా?" అడిగాడు యాదగిరి.

నాకు ఆ మోపెడ్ కంపెనీవాడు దానిని పొగిడినరోజు గుర్తుకొచ్చింది. వాడలా అబద్ధాలు చెప్పినందుకు ఆతర్వాత మాకు కోపం వచ్చిందిగానీ- వాడెందుకలా పొగిడాడో ఇప్పుడు తెలిసింది! బిజినెస్! అంతే!

ఓ వస్తువు పక్కాడికి అంటగట్టాలంటే అలా పొగడక తప్పదు.

"మూడువేల అయిదొందలకిస్తారా?" అడిగాడతను మళ్ళీ.

అందరం శాయిరామ్ మొఖం వేపుచూశాము. 'సరే' అనేసేట్లు కనిపించాడునాకు. అడగ్గానే 'సరే' అంటే అవతలి వ్యక్తికి బండిమీద అనుమానం కలుగుతుంది కదా!

అంచేత నేనే కల్పించుకుని "నో! ఒక్కపైసకూడా తగ్గదు" అన్నాను.

అతను శాయిరామ్‌వేపు చూశాడు "అంతేనంటారా?" అన్నాడు వెళ్ళిపోడానికి సిద్ధపడుతూ

అందరూ ఖంగారుపడ్డారు.

"అంతే అంటే ఖచ్చితంగా అంతే అని కాదనుకోండి! కొంచెం అటూ ఇటూ...." అన్నాడు శాయిరామ్ చప్పున.

"మరతనెవరో ఒక్కపైసకూడా తగ్గనంటాడేం?" నావంక కోపంగా చూపుతూ అడిగాడతను.

రంగారెడ్డి సర్దిచెప్పడానికి ప్రయత్నించాడు.

"అబ్బే అతనికేం సంబంధంలేదులెండి."

"లేకపోతేఇక్కడెందుకు నిలబడ్డాడు?"

"పాపం అతని వస్తువేదో అమ్మినప్పుడు బాగా నష్టపోయాట్ట! అప్పటినుంచీ ఎవరూ నష్టానికి అమ్మగూడదని మాట్లాడుతూంటాడు."

"సరే- అయితే చెప్పండి! మూడువేల అయిదొందలకిస్తారా?"

శాయిరామ్, రెడ్డీ పక్కకెళ్ళి మాట్లాడుకొచ్చారు.

"మూడువేల ఆరొందలకయితే ఇస్తాను" అన్నాడు శాయిరామ్.

"అక్కర్లేదు" అంటూ వెనక్కు తిరిగి బయల్దేరాడతను. గోపాల్రావ్ జనార్ధన్‌కి కన్ను గీటాడు. జనార్ధన్‌వొక్కదూకు దూకి అతనికి అడ్డంగా నిలబడ్డాడు.

"అరె! ఫ్రెండ్‌షిప్‌లో అంత కోపమయితే ఎలాగండీ! మావాడు కూడా వందరూపాయల కోసం ఫ్రెండ్‌షిప్ పాడుచేసుకుంటాడా ఏమిటి?" అన్నాడు చిరునవ్వుతో

"ఫ్రెండ్‌షిప్పా? ఫ్రెండ్‌షిప్పేమిటి? ఇక్కడ నాఫ్రెండెవరూ లేరే"! ఆశ్చర్యంగా అన్నాడతను.

"అదేమిటి నన్ను గుర్తుపట్టలేదా మీరు?" అన్నాడు జనార్ధన్ ఇంకేమనాలోతెలీక.

"మిమ్మల్నా? మిమ్మల్నెక్కడా చూసిన గుర్తు లేదే!"

"భలేవారే! మనం ది గ్రేట్ ఓరియంటల్ సర్కస్‌లో పక్కపక్కనే కూర్చోలేదూ?

"నేనప్పుడూ సర్కస్‌కెళ్ళలేదు" అన్నాడు చిరాకుగా.

"హార్నీ! అది కూడా మర్చిపోయారన్న మాట! ఆఫ్‌కోర్స్ మీకు మతిమరుపు ఎక్కువని చెప్పారప్పుడు"

"నాకేం మతిమరుపులేదు- మనం ఎప్పుడూ కలుసుకోలేదసలు."

"సరే పోనీండి! మీకు స్నేహభావం లేకపోయినా మావాడికుంది! అందుకే మీరు నా ఫ్రెండ్ అని నమ్మి ఆ వంద నష్టం కూడా భరించటానికి వప్పుకుంటున్నాడు- మూడువేల అయిదొందల కాష్ ఇచ్చి బండి తీసుకెళ్ళండి" అన్నాడు జనార్ధన్.

"స్నేహం కోసమని ఇంతింత నష్టాలు భరిస్తుంటే నువ్వు దెబ్బతింటావ్ గురూ! ఈసారి పోతేపోనీలే గానీ నీఫ్యూచర్ గురించి చెప్తున్నా..."అన్నాడు రంగారెడ్డి నిష్ఠూరం నటిస్తూ శాయీరామ్‌తో.

"ఏమో గురూ! మొదటినుంచీ స్నేహం అంటే ప్రాణం పెట్టటం అలవాటయిపోయి ఏడ్చింది" అన్నాడు శాయీరామ్ నొచ్చుకుంటూ.

"బండిమీద ఓ రౌండుకొట్టి చూస్తాను" అన్నాడతను.

"ఓ! హాయిగా చెక్ చేసుకోండి! ఎటొచ్చీ ఎక్కువదూరం వెళ్ళవద్దు..." అన్నాడు శాయీరామ్ భయంగా.

"ఇక్కడే మెయిన్‌రోడ్‌వరకూ వెళ్ళివస్తాను" అంటూ బండి స్టార్టు చేసుకుని నెమ్మదిగా నడవసాగాడతను.

అందరం గుండెలు బిగపట్టుకుని చూడసాగాం.

"భలేపడ్డాడ్లేవలలో- ఇంకేంఢోకాలేదు శాయీరామ్ అదృష్టవంతుడు!" అన్నాడు జనార్ధన్.

అతగాడు మెయిన్‌రోడ్ మీదకు వెళ్ళి తిరిగి వస్తుంటే గమనించాము అతని మొఖం ఆనందంతో వెలిగిపోతోంది.

"హమ్మయ్య! ఇంక భయం లేదు! వాడు కొనేసినట్లే..."అన్నాడు రంగారెడ్డి.

సరిగ్గా అప్పుడే అనుకోని ఘోరం జరిగింది. ఒక దుర్మార్గుడు, శాయీరామ్ సక్సెస్‌ని చూసి ఓర్వలేని వెధవ-తన చెడిపోయిన కొత్త జి.వి.యస్-50 మోపెడ్ రిక్షామీదవేసి రిక్షాని వెనుకనుంచీ తోసుకెళుతూ ఎదురయ్యాడు.

అంతే! అయిదు నిమిషాల్లో అతను మోపెడ్ తీసుకొచ్చి మా మధ్యలో స్టాండ్ వేయటం తన బాగ్‌తీసుకుని పరుగెట్టటం జరిగిపోయింది. అక్కడికీ జనార్ధన్, యాదగిరి అతని వెంటపడ్డారు. "కంట్రాక్ట్ అయింది గనుక బండి తీసుకుతీరాలని" అరుస్తూ. కానీ అతను కార్ల్ లూయిస్ గ్రాండ్‌ఫాదర్ లాగా పరుగెత్తాడు. పరుగెత్తి మెయిన్‌రోడ్‌మీద ఉన్న ఆటోలో కూర్చుని ఏం చెప్పాడో ఏమోగానీ-ఆటోగాల్లో తేలిపోతూ ఎగిరిపోయింది.

అందరం మళ్ళీదిగాలుపడి కూర్చున్నాం.

సాయంత్రం అయిదవుతుండగా ఇంకో ఆటోవచ్చి శాయీరామ్ ఇంటిముందు ఆగటం చూసి అందరం పరుగెత్తాము అక్కడికి.

తీరా చూస్తే ఆటోదిగింది మరెవరో కాదు లక్ష్మయ్య!

"పేపర్ చూశానివాళ! మన మోపెడ్ అమ్ముతామని వేశారు కదా! సరే అమ్మటానికి రెండు మూడు రోజులు పడుతుంది కదా! అంతవరకూ వాడుకోవచ్చని వచ్చాను-అమ్ముతున్నారు గనుక, బండి కండిషన్‌లో ఉండే ఉంటుందికదూ?" అన్నాడు లక్ష్మయ్య బండి బ్రేకులూ, అవీ చెక్ చేసుకుంటూ.

"మీ దగ్గరఎవరిదో బండి ఉండాలికదా?" పాలిపోయిన మొఖంతో అడిగాడు శాయీరామ్.

"నిన్నటివరకూ ఉందిగానీ దాని ఓనర్‌కి ఎంత కొవ్వెక్కిపోయిందంటే రోజూవచ్చి నాబండి నాకిమ్మని పేచీ పెట్టటం మొదలుపెట్టాడు. ఒకరోజూ రెండ్రోజులంటే ఊరుకుంటాం-పోనీలే ఓనర్‌గదాని వదిలేస్తాంగానీ రోజూ పేచీపెడితే వళ్ళుమండుతుందా, మండదా" అనడిగాడతను.

"అవును మరి! ఎంత ఓనరయితే మాత్రం-అలా చిరాకు పెట్టేస్తుంటే ఎవరికయినా మండిపోతుంది!" అన్నాన్నేను.

"అందుకే వాడిమీద పోలీస్ కంప్లెయింట్ ఇచ్చాను..."

అందరికీ ఆమాటతో ఆసక్తి కలిగిందా కేసమీద.

"తరువాతేం జరిగింది?" అడిగాడు రంగారెడ్డి."ఏముందీ పోలీసులు ఓనర్‌ని లాక్కొచ్చి లాకప్‌లో పడేశారు, గానీ తరువాత వాడు చెప్పిన విషయాలన్నీ విని జాలిపడి మా ఇద్దరికీ రాజీ కుదిర్చారు. దాని ప్రకారం ఇవాళ పొద్దున్న బండి ఓనర్ కిచ్చేయమన్నారు. నేను పెద్దమనిషిని కాబట్టి ఇంక బావుండదని ఇచ్చేశాను.

"అవును! అదే ఇంకొకరూ ఇంకొకరూ అయితే అలాంటి పేచీకోరుకీ అసలు బండి రిటర్న్ ఇవ్వరు" అన్నాడు గోపాల్రావ్.

"సరే-ఈ బండి మాత్రం ఎల్లుండి ఇచ్చేస్తాను- ఈలోగా ఇంకెవరయినా కొనడానికి వస్తే నా అడ్రస్ ఇవ్వండి-" అన్నాడు స్టార్టుచేసి బండిమీద కూర్చుంటూ!

అందరం అతనికి అడ్డం పడిపోయాం.

"బాబ్బాబు! ఈ బండి తీసుకెళ్ళకు-నానా అవస్థలూ పడి దీన్ని నడిచేట్లు చేశాం నిన్నే! ఇప్పుడు అమ్మలేకపోతే ఇంక జన్మలో దీనిని అమ్మటం సాధ్యంకాదు" అన్నాడు శాయీరామ్.

"పోనీ రిపేర్‌వస్తే ఫిఫ్టీ-ఫిఫ్టీ వేసుకుందాంలే! ఇదే ఇంకొకరయితే అసలు ఒక్కపైసకూడా నేను ఖర్చు చేయను..."

"గురూగారూ! అంత మాటనకండి! అందరం కలసి ఎలాగోలా నానా తిప్పలూ పడుతున్నాం దీన్ని అమ్మటానికి-దీన్ని వదిలేయండి! మీకు తల్చుకుంటే బళ్ళకేం కొదవ? ఎవరొక ఓనరు దొరక్కపోడు కదా-"

లక్ష్మయ్య చిరాగ్గా బండి దిగాడు.

"మరా సంగతి ముందే చెప్పరేమయ్యా! నా టైమ్ వేస్ట్ చేశారు! బండి ఓనర్ అన్నాక "డీసెన్సీ" నేర్చుకోవాలి బ్రదర్! ఇలా చిరాకు పెడితే రెండోసారి ఇంకెవరిదగ్గరా బండి తీసుకోబుద్ధికాదు నాకు... వస్తా అ పక్క కాలనీలో ఇంకొకతను కూడా ఇవాళ్టి పేపర్లోనే బండి అమ్ముతున్నట్లు వేశాడు. అతను నాకు బెస్ట్ ఫ్రెండ్‌లే! పైగా ఓసారి నేనతనికి చాలా సహాయం కూడా చేశాను-సిగరెట్ వెలిగించుకోవడానికి లైటర్ అడిగాతే ఇచ్చాను! ఇంత స్నేహం ఉన్నప్పుడు "బండి ఇవ్వను", అని అనలేడు కదా... వస్తా...." అంటూ వెళ్ళిపోయాడు.

అందరం "హమ్మయ్య" అంటూ తేలిగ్గా గాలి పీల్చుకున్నాం

వారంరోజులు గడిచిపోయాయి.

వారం రోజులు గడిచిపోయినా మోపెడ్ కొనడానికి ఎవరూ రాకపోయేసరికి మాకు భయంవేసింది. శాయీరామ్ దిగులు పెట్టుకున్నాడు.

"అదింక అమ్మడం మనవల్లకాదు-"అన్నాడు దిగులుగా.

హఠాత్తుగా ఆరోజు నిసార్‌గాడు వూడిపడ్డాడు."ఛలో-జల్దీ ఛలో-" అన్నాడు మా దగ్గరకొచ్చి."ఎక్కడికి?" అడిగాము మేము.

"అజమ్‌భాయ్-వాళ్ళఫ్రెండు మిల్‌కే ఏక్ మోపెడ్ అమ్మింది! కైసా బేచే పూఛ్‌లేంగే..."

అందరం కలసిఆటోలో అల్ఫాహోటల్ పక్కనున్న అజమ్‌భాయ్ బుక్ స్టాల్‌నిచేరుకున్నాం. బలవంతంగా ఆజమ్‌భాయ్‌ని ఆల్ఫాలోకి లాక్కెళ్ళి ఛాయ్ తాగించాము.

"ఇప్పుడు చెప్పుగురూ! నువ్వూ మీ ఫ్రెండూ కలసి మోపెడ్ ఒకటి అమ్మారట! ఎలా అమ్మారు?"

"ఎందుకు శాయిరామ్ కూడా అమ్మేస్తున్నాడా?" అడిగాడతను.

"అవును."

"అది అమ్మటం చాలా కష్టం!" అన్నాడు ఆజమ్ గంభీరంగా.

"కానీ నువ్వూ మీ ఫ్రెండ్ నిన్న అమ్మారని నిసార్‌మియా చెప్పాడుగా?"

"చాలా ఫ్లూక్‌బాయ్! అదృష్టం! అంతే!"

"మోపెడ్‌ని బ్రోకరు దగ్గరకు తీసుకెళ్ళాం! అతను అది చూసి ఇనుపకొట్లల్లో అయితే కిలోల్లెక్కకొనే అవకాశాలున్నాయని చెప్పాడు వెంటనే కొట్లకి తీసుకెళ్ళి కిలోలెక్క అమ్మేశాం. మూడొందల పాతిక రూపాయలు వచ్చింది- మా ఫ్రెండ్ చాలా సంతోషించాడు...."

హఠాత్తుగా జనార్ధన్‌కో ఉపాయం తట్టింది. "గుడ్ అయిడియా!" అన్నాడు ఉత్సాహంగా.

"అంటే?" అనుమానంగా అడిగాను

"అవును! మన మోపెడ్ కూడా బ్రోకర్స్‌కి అమ్ముందాం" అన్నాడతను.

"అవ్! బెస్ట్ ఆయిడియా-"

అప్పటికప్పుడే అందరంకలసి ఆటోలో ఇంటికెళ్ళి మోపెడ్‌ని తీసుకుని ఓ బ్రోకర్‌షాపుకెళ్ళాం. అతను మోపెడ్‌ని టెస్ట్‌చేశాడు. ఓ రౌండ్‌కొట్టాడు దానిమీద. తిరిగి వచ్చి "రెండువేలు ఇస్తాను" అన్నాడు.

శాయిరామ్‌కి ఏడుపు ముంచుకొచ్చింది "నెలకిందట అయిదువేలు-ఇప్పుడు రెండువేలకు సమానమా?" అన్నాడు దీనంగా.

అందరం ఇంకో బ్రోకర్‌షాప్‌కి బయల్దేరాం. అతను మా మోపెడ్‌ని చూస్తూనే "పదిహేను వందలు" అన్నాడు. మాకుమతి పోయినట్లుంది.

"అదేమిటి అవతల షాపతను రెండువేలిస్తానన్నాడుగా?" అడిగాడు రంగారెడ్డి. "వాడు మెంటల్ హాస్పిటల్ పేషెంట్ అయుంటాడు! లేకపోతే! రెండువేలు ఇవ్వటమేమిటి?" అన్నాడతను చిరునవ్వుతో.

మరోషాపుకి వెళ్ళాం పాలోమని.

అతను బండిమీద ఓరౌండ్ కొట్టివచ్చి 'నా కొద్దీ బండి!' అన్నాడు తెగేసినట్లు.

"ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగాడు జనార్ధన్.

"కిందటిసారి ఈ బండికొంటే దారుణంగా పదివేలు నష్టం వచ్చింది!" అన్నాడతను.

"దీని ఖరీదే అయిదువేలయితే పదివేలునష్టమెలా వచ్చింది?" కోపంగా అడిగాడు జనార్ధన్!

"అదే నాకిప్పటివరకూ తెలియటంలేదు-ఎలా వచ్చిందో-బహుశా ఒక్కొక్క పార్టు రెండు మూడుసార్లు వేయించి ఉంటాను-"

అక్కడినుంచి మరో రెండుషాపులకు కూడా తిరిగాక మాకు దాన్ని రెండువేలకంటే ఎక్కువకు అమ్మలేమని తెలిసింది.

అంచేత రెండువేలు ఇస్తానన్న బ్రోకర్ దగ్గరకే వెళ్ళాం మళ్ళీ.

"ఏంకావాలి?" అడిగాడతను."ఇందాక మోపెడ్ చూపించాం కదా-రెండువేలు ఇస్తానన్నారు మీరు...."

"అది ఇందాక సంగతి!" అన్నాడతను తాపీగా.

"అంటే?" ఆశ్చర్యంగా అడిగాడు జనార్ధన్.

"ఇప్పుడు పదిహేను వందలే ఇస్తాను-"

"అదేమిటి? ఇంతలోనే రేటెందుకు మారిపోయింది?"

"అమెరికాలో డాలర్ ధర పడిపోయింది"

"ఇంకో అరగంటాగితే ఇంకా పడిపోతుంది!" అన్నాడతను. ఇంక అతనితో లాభంలేదని మళ్ళీమోపెడ్‌ని తోసుకుంటూ బయల్దేరాం

కాస్తదూరం నడిచామో లేదో మా కెదురుగ్గా ఓ కొత్త "ఆటో మొబైల్ బ్రోకర్స్" అనే బోర్డ్ కనిపించింది. అది ప్రారంభించి రెండు మూడు రోజులే అయిందనటానికి నిదర్శనంగా పూలదండలు ఇంకా నగమే ఎండి కనిపించాయ్.

"ఇగో-ఈడు కొత్తాడులెక్క ఉన్నాడు భాయ్! మీరేమీ మాట్లాడకండి! నేనుసెటిల్‌జేస్తా!" అన్నాడు యాదగిరి.

అందరం యాదగిరి వెంబడి ఆ షాపులోకి నడిచాము.

సర్దార్జీ మమ్మల్ని చూస్తూనే చిరునవ్వుతో ఆహ్వానించాడు.

"క్యా హోనా?" అన్నాడు హిందీలో.

"ఏ మోపెడ్ బేచ్‌నే ఆయే..." అన్నాడు యాదగిరి.

"కిత్‌నేమే బేచ్‌ణాహై?" అనడిగాడతను బయటకొచ్చిమోపెడ్‌ని పరీక్షిస్తూ

"త్రీ అండ్ హాఫ్ తౌజెండ్స్" అన్నాడు శాయీరామ్, రెడ్డి ప్రాంప్టింగ్‌వింటూ.

"సాడేతీన్?" ఆశ్చర్యంగా అన్నాడు సర్దార్జీ.

అని మోపెడ్ స్టార్ట్ చేసుకుని ఓ రౌండ్ కొట్టి వచ్చాడు.

"తీన్ హజార్ దూంగా!" అన్నాడు మా వంకచూసి. అందరికీ గుండెలు ఆగిపోయినయ్ ఓ క్షణంపాటు! నిజంగా అతనన్నది 'మూడువేలు' అనేనా అనడిగాడు గోపాల్రావ్ రహస్యంగా.

"అవును" అన్నాడు రెడ్డి.

"సర్దార్జీకేమీ మతిభ్రమించలేదుకదా?" అన్నాడు జనార్ధన్ రహస్యంగా.

"మూడువేల రెండొందల్-" అన్నాడు యాదగిరి.

అందరికీ యాదగిరి మీద ఒళ్ళు మండిపోయింది. రాక రాక వచ్చిన అద్భుతమైన బేరాన్ని అతను చెడగొట్టేస్తున్నాడనిపించింది. అతని వీపుగోకాడు శాయీరామ్ వప్పు కోమన్నట్లు."ఒక్కపైసా కూడా ఎక్కువ ఇవ్వన్-" అన్నాడు సర్ధార్జీ.

"ఠీక్‌హై? పైసలు ఇవ్వు-" అన్నాడు యాదగిరి.

సర్దార్జీ ఓ క్షణం ఆలోచించాడు

"ఇప్పుడు కాదు! రేపు భాయ్ వస్తాడు అప్పుడు" అన్నాడు అనుమానంగా.

మా గుండెల్లో బోలెడు రాళ్ళుపడ్డాయ్. "అట్లా అంటే కాద్సార్! ఇతనిప్పుడు అర్జంటుగా ఈ బండి అమ్మటానికి కారణమేమిటనుకున్నారు? భార్య సీరియస్ సార్! ఆపరేషన్ చేయాలి! డాక్టర్కి రెండువేలు ఫీజు కట్టాలి-ఇంకా మందులకీ మాకులకీ కూడా డబ్బు కావాలి! లేకపోతే ఇంత మంచి బండి, ఇంత కొత్తబండి అమ్ముతారా ఎవరైనా?నో! నెవర్‌సార్! ఈ రేటుకి ఛస్తే అమ్మరు-"

సర్దార్జీ మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"ప్లీజ్ సర్దార్జీ ప్లీజ్!" అన్నాడు శాయీరామ్ ఇంకా ఆలోచింపజేస్తే ప్రమాదమని.

"అచ్ఛా ఠీక్ హై!" అంటూ కాగితాలమీద శాయీరామ్ సంతకాలు తీసుకుని రిజిస్ట్రేషన్ పుస్తకం వగైరాలు ఒకసారి చూచుకుని- మూడువేలూ లెక్కపెట్టి ఇచ్చాడు. ఇచ్చిందే ఆలస్యం వణుకుతున్న కాళ్ళతో అందరం రోడ్డు మీద కొచ్చాం.

"గురూ! వాడు ఏ క్షణంలోనయినా మనసు మార్చుకుని- నా డబ్బు నాకిచ్చేయమని వెంబడిపడవచ్చు. అంచేత అందరం విడిపోయి ఎవర్దారిన వాళ్ళు బస్సుల్లో ఇంటికి పోదాంపదండి!" అన్నాడు జనార్ధన్.

వాడి అలోచన అద్భుతమనిపించింది మాకు.

మరుక్షణంలో ఎవర్దారిన వాళ్ళు విడిపోయి బస్సుల్లో కాలనీ చేరుకున్నాం. ఆ రాత్రి యాదగిరి అందరినీ పిలిచాడు.

"చూడు గురూ! సర్దార్జీ కొత్తోడుగనుక మనబండి కొన్నాడు. రేపు ఆయన తమ్ముడు వచ్చిండంటే మన గురించి వచ్చి ఫైసల్ వాపస్ తీసుకోనికి కోషిష్‌జేస్తాడు. కనుక శాయిరామ్ అన్న గడ్డంగిట్ట తగిలించుకుంటే గుర్తుపట్టలేరు-" అన్నాడు.

"అవును. మనందరం కూడా కొన్నాళ్ళుపాటు ఆ సర్దార్జీ షాపుముందు నుంచీ నడవకూడదు-" అన్నాడు రంగారెడ్డి.

అప్పటికప్పుడే కాలనీ కుర్రాళ్ళందరికీ సర్దార్జీలెవరైనా వచ్చి శాయిరామ్ ఇల్లు అడిగితే ఎలా తెలీదని చెప్పాలో ప్రాక్టీస్ చేయించాము.

ఓ రోజు గడిచిపోయింది. శాయిరామ్ మా కాలనీ మేకప్‌మేన్ వేంకటేశ్వర్రావ్‌నడిగి ఓ గడ్డం తెచ్చుకుని తగిలించుకున్నాడు. మేమందరం క్రాఫ్ మార్చేసుకున్నాం. అనుకున్నంతా జరగనే జరిగింది.

ఆ రోజు సాయంత్రం ఇద్దరు సర్దార్జీలూ మోటార్ సైకిల్ మీద కాలనీ కొచ్చారు. పిల్లలు ఆడుకుంటున్న చోటకెళ్ళి శాయిరామ్‌కా ఘర్ కహా హై? అని అడగడం వినిపించింది మాకు."మాకు తెలీదు!" అని చెప్పేశారు పిల్లలు ముక్తకంఠంతో.

వాళ్ళు నెమ్మదిగా కాలనీ స్టేజీదగ్గరకొచ్చి సినిమా స్క్రిప్ట్‌రాస్తోన్న చంద్రకాంత్ ఛటోపాధ్యాయ్ దగ్గర కెళ్ళారు.

అతనేదో మాట్లాడి తెలీదని చేతులూపి పంపించివేశాడు. అయినా వాళ్ళు నిరాశ పడకుండా అన్ని ఇళ్ళనంబర్లూ వెతికి శాయిరామ్ ఇల్లుకనుక్కున్నారు. కిటికీలోనుచి ఆ వ్యవహారమంతా చూస్తోన్న మాకు టెన్షన్ పెరిగిపోతోంది.

పావుగంట తలుపుకొట్టాక శాయిరామ్ గడ్డం తగిలించుకుని బయటి కొచ్చాడు. వాడొక్కడే మాట్లాడితే ఖంగారుపడి ప్లానంతా ఎక్కడ పాడుజేస్తాడోనని నేను కూడా కళ్ళజోడు పెట్టుకొని వాడి దగ్గరకెళ్ళాను.

"హమ్‌కో మోపెడ్ బేచాహై శాయీరామ్ నామ్‌సే-అడ్రస్‌తో యహీహై" అంటున్నాడు సర్దార్జీ.

"మోపెడా? ఎవరమ్మారు? శాయీరామా? ఆ పేరుగలాళ్లెవ్వరూ లేరు-" అన్నాడు శాయీరామ్.

"ఏం కావాలిట?" అడిగాను నేను ఏమీ తెలియనట్లు శాయీరామ్‌ని.

"ఎవరో శాయీరామ్ అని మోపెడ్ అమ్మారట వీళ్ళకు-"

"మరి అడ్రస్..."గొణిగాడు సర్దార్జీ.

"నిర్భయ్‌నగర్ కాలనీ పేరుతో రెండు మూడు కాలనీలున్నాయ్- అక్కడెవరయినా ఉన్నారేమో-" అన్నాన్నేను.

"ఎక్కడ?" అడిగాడు సర్దార్జీ ఆత్రుతగా.

"నాకూ తెలీదు! ఒకటి బాంబేహైవేలో ఉన్నట్లు గుర్తు! ఇంకొకటి నిజామాబాద్ రోడ్ మీదెక్కడో ఉండాలి! మరోటి నాగార్జునసాగర్ రోడ్‌మీద..."

సర్దార్జీ ముఖం పాలిపోయింది.

"బహుత్ నుక్‌సాన్ హో గయాభయ్ హమారా!" అన్నాడు దీనంగా.

"ఎందుకు ఏం జరిగింది?" అడిగాడు శాయీరామ్.

"ఆ శాయీరామ్ అనే దొంగరాస్కెల్ మాకు మోపెడ్ అంటగట్టి మూడువేలు తీసుకుని పారిపోయాడు. తీరా చూస్తే అది పదిహేనువందల కంటే ఎక్కువ చేయదట! పైగా ఇప్పుడు అసలుదాన్ని కొనేవారే కనిపించటంలేదు..."

"అయ్యో పాపం" అన్నాడు శాయీరామ్.

"పాపం మీకు చాలా నష్టం అనుకుంటాను!" అన్నాను నేనూ సానుభూతి ఒలకబోస్తూ.

"నిజంగా నాకు మోపెడ్ అమ్మింది నువ్వు కాదా?" అనుమానంగా అడిగాడు సర్దార్జీ శాయీరామ్ గడ్డంవంక చూస్తూ.

శాయీరామ్ చిరునవ్వు నవ్వాడు.

"అరే భయ్యా! నాకసలు మోపెడ్ అనేదే లేదు. ఇంక అది అమ్మే ప్రసక్తి ఎక్కడిది?" అన్నాడు నా వంకచూస్తూ.

"అవును! మాకాలనీలో అసలెవరికీ మోపెడ్‌లేదు! ఎవరూ ఇంకకొనరు కూడా?" అన్నాన్నేను ఏదొకటి మాట్లాడాలని!

"అచ్చం మీలాగానే ఉన్నాడతనుకూడా! కానీ గడ్డం లేదప్పుడు" అన్నాడు సర్దార్జీ ఇంకా శాయిరామ్ వంకే అనుమానంగా చూస్తూ.

శాయిరామ్ ఈసారి గట్టిగా నవ్వాడు. నేనూ గట్టిగా నవ్వకతప్పలేదు.

"నేను చిన్నప్పటినుంచీ పెంచుతున్నానీ గడ్డం! కావాలంటే ఇతని నడగండి!" అన్నాడు నావంక చూపుతూ.

"అవునవును! అయిదో క్లాస్ చదివేటప్పటినుంచీ గడ్డం ఉంది ఇతనికి!" అన్నాన్నేను.

"అయిదో క్లాసులోనే గడ్డం వచ్చాయ్?" అన్నాడు సర్దార్జీ ఆశ్చర్యంగా.

"అఫ్‌కోర్స్-అఫ్‌కోర్స్-వీడు అయిదోక్లాస్ చదివేటప్పటికే వీడి వయసు పదిహేడు-అన్ని క్లాసులూ రెండేళ్ళు, మూడేళ్ళు చొప్పున చదవాల్సి వచ్చింది" అన్నాను తప్పు కప్పిపుచ్చుకోటానికి.

సర్దార్జీ మొఖం హఠాత్తుగా కోపంగా మారిపోయింది. కళ్ళు ఎర్రబడిపోయినయ్.

"ఆ శాయిరామ్ ఎక్కడకు పోతాయ్ నేను చూస్తా! ఎక్కడయినా కనబడితే ఖతమ్‌చేస్తా" అన్నాడు కత్తిమీద చేయివేస్తూ.

శాయిరామ్ వణికిపోతున్నట్లు తెలుస్తూనే వుంది నాకు.

"అవును! అలాంటి వాళ్ళను మర్డర్ చేయాల్సిందే!" అన్నాన్నేను కూడా సపోర్ట్ చేస్తూ. సర్దార్జీ లిద్దరూ వెళ్ళిపోయారు.

శాయిరామ్, యాదగిరి ఆ తరువాత నెలరోజుల వరకూ ఆఫీస్ కెళ్ళలేదు.

శెలవుపెట్టి ఇంట్లో కూర్చుండిపోయారు.

తరువాత ఓరోజు మేమందరం కలసి ఎగ్జిబిషన్‌కివెళ్ళి వస్తుంటే ఎవరో ఒకతను శాయిరామ్ మోపెడ్‌ని రిక్షామీద తీసుకెళుతూ చెమటలు తుడుచుకుంటూ కనిపించాడు.

"హమ్మయ్య! ఇంక మనకి భయంలేదు! సర్దార్జీ మోపెడ్‌ని వీడికెవడికో అమ్మేశాడు. ఇంక మనకోసం వెతకడు" అన్నాడు శాయిరామ్ ఆనందంగా.

అందరం స్వేఛ్ఛగా ఊపిరిపీల్చుకున్నాం. ✷

# పాదరక్షల ప్రహసనం



పెళ్ళిళ్ళలకూ పాదరక్షలకూ చాలా దగ్గర సంబంధం ఉందని అందరూ ఒప్పుకుంటారు. ఒప్పుకోవడమేకాదు, వళ్ళు మండిందంటే "ఎవడన్నా లేదన్నాడంటే వాడిని చీరేస్తాం" అనికూడా అంటారు.పెళ్ళివారికి కట్నాల గురించిగానీ మరే ఇతర లాంఛనాల గురించిగానీ పేచీ వచ్చిందనుకోండి. అప్పుడువారు చెప్పులు యధేచ్ఛగా ఉపయోగించుకుంటారు. లేదా ఇద్దరూ కలసి మధ్యవర్తిమీద ప్రయోగిస్తారు. కొంతమందికి పెళ్ళిళ్ళల్లో వియ్యంకులతరపువారి చెప్పులుదొంగలించటం సంప్రదాయంకూడా.

అయితే నేను రాయదల్చుకుంది ఈ విధమైన సంబంధం గురించి కాదు. మనందరం అనుభవించే మరో సంబంధం గురించి.

అదేమిటంటే పాదరక్షలు పోగొట్టుకోవటం.

అంటే నా ఉద్దేశ్యం పెళ్ళిళ్ళలో ఇంకేమీ పోవని కాదు. ఆ మాటకొస్తే పెళ్ళిళ్ళల్లోపోని వస్తువంటూ ఉండదు. గరిటెలు, స్పూనులూ, బట్టలూ, పాత్రలూ, నగలూ, చిన్నపిల్లలూ, మిఠాయిలూ-ఇలా ఆయా పెళ్ళిళ్ళకొచ్చిన అతిథుల అభిరుచులను బట్టి అన్నీపోతూ ఉంటాయి. కానీ వీటన్నింటి కంటే కూడా సిస్టమేటిగ్గా,అదో నిబంధనగా చాలామంది చెప్పులు పోగొట్టుకోవటంవల్ల పెళ్ళిళ్ళలో పాదరక్షలకన్న ప్రాముఖ్యత మరి దేనికీ ఉండదు. ఇక ముందు ఉండబోదు.

నేను రెండేళ్ళపాటు జీతంలో ప్రతినెలా కొంత డబ్బువాయిదా పద్ధతిలో ఒక చెప్పుల షాపువాడికి కట్టి, ఇష్టమైన చెప్పుల జత ఆమధ్యే కొన్నాను. అంటే ఆ బాకీ తీరిపోయిందని కాదు. మరో ఎనిమిది నెలలపాటు వాడికీ వాయిదాలు చెల్లిస్తూనే ఉండాలి. అప్పుడు పూర్తిగా అవి నా సొంతం అవుతాయన్నమాట! అంతవరకూ అవి ఆ షాపు యాజమాన్యం పేరే ఉంటాయి. మధ్యలో నేను చనిపోవడంవల్ల గానీ, లేదా మరే కారణం వల్ల గానీ మిగతా వాయిదాలు కట్టడం మానేస్తే వాటి యజమానులు వాటిని స్వాధీనం చేసుకుంటారు.

అంచేత ఆ ఎనిమిది నెలలూ అయాకే వాటిని వాడటం ప్రారంభించాలని నిర్ణయం తీసుకుని వాటిని ఆ షాపు యాజమాన్యం వారిచ్చిన అట్టపెట్టెతో సహా స్టీల్ అల్మారాలో దాచేశాను. నా ఈ అద్భుతమైన ప్లాన్ తప్పక విజయవంతం అయేదేమోగానీ-ఇంతలో మా రామరాజుగాడి పెళ్ళి వచ్చింది. సరిగ్గా ఆ సమయానికే నా పాత చెప్పులు ఇక రిపేర్‌కి పనికిరావని ఖండితంగా చెప్పేశాడు, అవి గత మూడేళ్ళనుంచీ రిపేరు చేస్తున్న చెప్పుల మెకానిక్.

గత్యంతరం లేక కొత్త చెప్పులు వేసుకునే వాడి పెళ్ళికి చేరుకున్నాను. పొరపాటునయినా వాటికి ఎదురు దెబ్బలూ, గాయాలూ తగలకుండా జాగ్రత్తలు తీసుకుంటూనే ఉన్నాను. ఎందుకంటే వాటిమీద సర్వాధికారాలూ ఇంకా ఆ షాపు యజమానికే ఉన్నాయి కదా.

పెళ్ళి తంతుముగిసింది "ఆ! భోజనాలకు రండి" అని అరిచారెవరో.

మరుక్షణం పందిట్లో జనమంతా హాల్లోకి జొరబడిపోయారు. నేనూ నా చెప్పుల్ని జాగ్రత్తగా వో పక్కన విడిచి భోజనానికని లోపలి కెళ్ళాను. అప్పటికే హాలంతా నిండిపోవడంతో రెండో పంక్తిలో కూచోవచ్చని మళ్ళీ బయటికొచ్చి చూసేసరికి చెప్పులు వాటి స్థానంలో కనిపించలేదు నా గుండెలు జల్లుమన్నాయి.

త్వరత్వరగా ఆవరణ అంతా వెదికాను. ఎక్కడాలేవు.

"ఏం, గురూజీ! ఏమిటి చూస్తున్నావూ?" అడిగాడు భవానీశంకరం. వాడూ, నేనూ ఒకప్పుడు క్లాస్‌మేట్స్‌మి.

"చెప్పులు కనిపించటంలేదు" అన్నాను కంగారు అణచుకుంటూ.

"ఎవడో కొట్టేసి ఉంటాడు-దానికి పెద్ద ఇదేముంది" అన్నాడతను.

"అదేమిటి? నేను వాటిని విడిచి ఒక్కనిమిషమేగా అయింది?"

"ఒక్కనిమిషం చాలా ఎక్కువ వాడికి"

"ఎవడువాడు?"

"అది తెలుస్తే కథ లేదుగా?" నవ్వుతూ అన్నాడు.

నేను పెద్దాడయాక ఎప్పుడూ ఏడవలేదు. చిన్నప్పుడు ఏడవడమే! మరి ఇంతకాలం ప్రాక్టీస్ లేకపోయినా ఇప్పుడు ఇన్‌స్టెంట్‌గా ఏడుపొచ్చింది. వాటికి కట్టవలసిన మిగతా వాయిదాలు తీరకుండానే, వాటిమీద సర్వహక్కులూ ఆ షాపు యాజమాన్యాని కుండగానే పోగొట్టుకుంటే ఇప్పుడు వాళ్ళకేం జవాబు చెప్పాలి?

విచారంగా కుర్చీలో కూలబడ్డాను.

భవానీశంకరం నా పక్కనే కుర్చున్నాడు. కూర్చుని ఆ చెప్పుల వివారాలన్నీ ఒకటొకటీ అడిగి తెలుసుకుని మరీ సానుభూతి ఒలకబోస్తున్నాడు. వాడు సానుభూతి ఒలకబోస్తున్న కొద్దీనాకు మరీ ఏడుపెక్కువై పోతోంది.

"గురూ! నేనో ప్లాన్ చెప్తాను. చేస్తావా?" అన్నాడు వాడు రహస్యంగా.

"ఏమిటి?" అనుమానంగా అడిగాను.

"చేస్తానంటే? చెప్తాను"

"ఏది? అప్పుడు కాలేజ్‌లో ఇచ్చిన ప్లాన్‌లాంటిదేనా?" అడిగాను అనుమానంగా

ఆ కథ ఏమిటంటే అప్పుడు కాలేజీలో మమ్మల్నిద్దరినీ ఏదో విషయంలో ప్రిన్సిపాల్ వారం రోజులపాటు డిబార్ చేయించాడు. ప్రిన్సిపాల్‌మీద ఎప్పటికైనా నేను ప్రతీకారం తీర్చుకుంటానని ప్రతిజ్ఞచెస్తే, భవానీశంకంరం "ఎప్పటిదాకానో ఎందుకురా?ఇవాళే తీర్చుకోవచ్చు. దానికి నేనో ప్లాన్ చెప్తాను" అన్నాడు. ఆప్లానేమిటంటే ప్రిన్సిపాల్‌కి వ్యతిరేకంగా కాలేజీలో గోడలనిండా బొగ్గుతో అశ్లీలపదాలు రాయడం! ఆ ప్లాన్ మహత్తరమైందని వాడు నన్ను నమ్మించడంచేత నేను ఆ రాత్రి గోడలమీద బొగ్గుతో రాస్తూ పోలీసులకు దొరికి పోయాను. వాళ్ళ బారినుంచి తప్పించుకుని బయటపడడానికి నెలరోజులు పట్టింది.

భవానీశంకర్ మనస్ఫూర్తిగా నవ్వాడు.

"ఛఛ! అది వేరు ఇది వేరు! ఇది పర్‌ఫెక్ట్‌ప్లాన్" అన్నాడు

"ఏం చేయమంటావ్?"

"ఏదో మరో మంచి జత చెప్పులు చూసి వేసుకుని వెళ్ళిపో"

నేను ఉలిక్కిపడ్డాను. "ఇంకొకరివా?"

"అవును"

"ఛీ! తప్పు కదూ?"

"మరి నీ చెప్పులు వేసుకెళ్ళినవాడు తప్పు అని అనుకోలేదుగదా?"

"ఓహో అట్నుంచి వచ్చావా!" ఆలోచిస్తూ అన్నాను.

నా వీక్‌నెస్ కనిపెట్టి వాడు మళ్ళీ నా చెవిదగ్గర గొణిగాడు.

"నీకేం సంకోచం అక్కర్లేదురా! ఇదిగో! నా చెప్పులు చూడు! ఇవి నా స్వంతం అనుకుంటున్నావా? అబ్బే! ఇలా కొట్టేసినయ్యే!"

నేను వాడి చెప్పులవంక చూశాను. చాలా కొత్తగా అద్భుతంగా ఉన్నాయి.

"మరి ఎవ్వరూ కనిపెట్టలేదూ?" అనుమానంగా అడిగాను"వాటి ఓనరు నా ముందు నుంచి పధ్నాలుగు సార్లు తిరిగాడు గానీ, గుర్తుపట్టలేదు. ఒకవేళ గుర్తుపట్టినా అడిగే ధైర్యం ఎక్కడినుంచి వస్తుంది? అయినా నీకేం ఫర్లేదు. నేను నీ పక్కనే ఉంటాను!"

నాకు కొంచెం ధైర్యం వచ్చింది.

"ఇప్పుడేం చేయమంటావు?"

"లేచి రంగంలోకి దూకు! వరండాలో కెళ్ళు. అక్కడున్న వాటిల్లో బెస్ట్‌జత సెలెక్ట్‌చేసుకో! అటూ ఇటూ చూడకుండా-సిగరెట్ వెలిగించుకుంటూ వాటిని కాజువల్‌గా తొడుక్కో-అంతే, ఆ తరువాత తిన్నగా ఇంటికెళ్ళిపో-వెనక్కు తిరిగి చూడవద్దు. వెనుక నుంచి కేకలు, అరుపులు, పోలీస్ విజిల్స్-ఇలాంటివేమీ వినిపించినా వెనక్కు తిరక్కు! జయంనీదే!"

"అంతేనంటావా?" వణుకుతున్న గొంతుతో అన్నాను.

"అంతే!"

నేను కుర్చీలో నుంచి నిలబడ్డాను. వరండాలో చిందరవందరగా కనబడుతున్నాయి-చెప్పులు! త్వరగా నడిచి మాంచి కొత్త జత దగ్గర ఆగి సిగరెట్ వెలిగించుకున్నాను. మరుక్షణంలో ఆ చెప్పులురెండూ నా కాళ్ళకు అమరిపోయాయి. వెనక్కు తిరిగిరెండడుగులు వేసేసరికి ఎవరో భుజం తట్టారు. నా ప్రాణాలు పైకి రాకెట్ లా దూసుకుపోయాయి. వణుకుడుని సర్దుకుంటూ వెనక్కుతిరిగి చూశాను. లావుపాటి పొట్టగల ఆకారం నన్ను చూసి నవ్వింది.

"ఏ...ఏ....ఏ....మి...టి...?" అన్నాను ఏడుపు ఆపుకుంటూ.

"చెప్పులు..." అన్నాడు. నేను పట్టుబడిపోయాను. అతనిని కౌగిలించుకుని బావురుమని ఏడ్చేయాలన్న ఫీలింగ్‌నీ బలవంతంగా ఆపుకున్నాను.

"నిజం సార్! ఇవి నావే-భలేవారే! నేనలాంటి పనిచేస్తానా? ఒట్టు! కావాలంటే మా భవానీశంకరం నడగండి-వచ్చేప్పుడు ఇవి వేసుకున్నానో లేదో-" అన్నాను బ్రతిమాలుతున్న ధోరణిలో.

అలావుపాటి ఆకారం మళ్ళీ నవ్వింది.

"అబ్బే-నేననేది అదికాదు. మీకాళ్ళ వంక చూడండోసారి."

నేను నా కాళ్ళవంక చూసుకున్నాను.

రెండుకాళ్ళకూ రెండురకాలు చెప్పులున్నాయి అంటే ఆఖంగారులో నేను రెండురకాల చెప్పులు తొడిగేసుకున్నానన్నమాట! ఒక్కసారిగా ధైర్యంతిరిగి వచ్చేసింది

"ఇదా! నేను చూసుకోలేదులెండి. ఏదో ఆలోచిస్తూ... ఇహిహి..."అంటూ ఆ లావుపాటి ఆకారానికి థాంక్స్ చెప్పి రెండో కాలి చెప్పుతీసేసి దాని తాలూకు జత చెప్పు తొడుక్కుని వరండా దిగి పందిట్లో కొచ్చి భవానీశంకర్ పక్కగా కూర్చున్నాను.

"అలా వణకకు! బావుండదు" అన్నాడు వాడు కోపంగా.

"నే...నే...నే నెక్కడ...వ...వ...ణుకుతున్నాను..." అన్నాను ఖంగారుగా. ఇంకొంచెం ఎక్కువగా వణుకుతూ

"నామాటవిని ఇక్కడి నుంచి మీ ఇంటికి త్వరగా వెళ్ళిపో! నువ్వలావణకడం చూస్తే ఎవరికైనా అనుమానం వస్తుంది."

"మ...మ...రి...భో...జ...జ...నం"

"పోతే పోనీ-వెధవ భోజనం! భోజనంకోసం చూసుకుంటే పట్టుబడిపోతావ్!"

గత్యంతరం లేక లేచి వడివడిగా బయటకు నడవబోయాను. తీరా రెండడుగులు వేశానోలేదో, "ఏవండోయ్ మాస్టారూ" అంటూ ఎవరో నన్ను పిలవడం వినిపించింది. హఠాత్తుగా నాలో మళ్ళీ వణుకు జబ్బు ప్రవేశించింది. ఎవరో నన్ను కనిపెట్టేశారు. ఆ చెప్పులవోనర్ కేకపెట్టి ఉంటాడు.

ఏమిటిప్పుడు చేయడం?

నాకు సడన్‌గా భవానీశంకర్ మాటలు గుర్తుకొచ్చాయి.

"ఇలాంటి మహత్తరమైన కార్యక్రమం చేపట్టినప్పుడు వెనక్కి తిరిగి చూడకు బ్రదర్. అరుపులు కేకలు పోలీస్‌విజిల్స్ ఇలాంటివేవీ వినిపించినా-సరే వెనక్కు, తిరగకు-" అంచేత నేను వెనక్కు తిరగదల్చుకోలేదు. ధైర్యంగా ముందుకు సాగిపోయాను.

కానీ ఆ వ్యక్తి అరుపులతో ఆగలేదు.

పెద్ద అంగలు వేసుకుంటూ నా కెదురు వచ్చి నిలబడ్డాడు. ఇలాంటి చెప్పుల యజమానులు అడ్డం నిలబడే పరిస్థితి వచ్చినప్పుడు ఏం చేయాలో నాకు భవానీశంకర్ క్లూ ఇవ్వలేదు. అందుకని వాడివైపు చూశాను. వాడు ఇదేం పట్టనట్లు సినిమా పత్రిక చదువుకుంటున్నాడు.

"ఇవి నా వేనండీ!" అన్నాను గాభరాగా.

"ఏవి మీవి?" ఆశ్చర్యంగా అడిగాడతను

"ఇవే చెప్పులు...."

"చెప్పులేమిటి?"

"అదే కాళ్ళకేసుకునే చెప్పులు!"

"కాళ్ళకేసుకునే చెప్పులా?"

"అవును"

"అయితే-వాటికేమయింది?"

"అవి నావే అంటున్నాను. కావాలంటే మా భవానీశంకర్‌ని అడగండి అంటూ ఒరేభవానీ!" అని పిలిచాను వాడిని.

"ఆ! ఏమిటి?" అంటూ పరుగుతో వచ్చాడు వాడు.

"ఈ నొప్పులు చెప్పేకదరా?" ఖంగారుగా అని, వెంటనే సరిదిద్దుకుని, "ఈ చెప్పులు నావేకదుట్రా?" అనడిగాను.

"అవును మాస్టారూ! హి ఈజ్ ది వోనర్ ఆఫ్‌దీజ్ చెప్పల్స్! ఆ విషయంనేను ఖండితంగా చెప్పగలను. ఎలా చెప్పగలనంటారా? వాడు అలాంటివాడు కాదుకాబట్టి! నాకు తెలిసినంతవరకూ ఎప్పుడూ ఎవరిచెప్పులూ దొంగతనం చేయలేదు. ఎన్నో మంచి అవకాశాలు వచ్చాయ్. కొత్తవి, అద్భుతమయిన మోడల్స్, విదేశీబూట్లు కూడా కనిపించాయ్, అయినా వాడెప్పుడూ వాటి వంకయినా చూడలేదు. నేనూ అంతే! ఎప్పుడూ నా చెప్పులే వేసుకుంటాను. ఎంత పాతయినా సరే! పెళ్ళిళ్ళకు వెళ్ళినా సరే- మీ చెప్పులే మీరు ఉపయోగింపుడు అన్న ప్రిన్సిపుల్‌కి లోబడి జీవితం గడుపుతున్నాం! అంచేత, దయచేసి వాడిని అనుమానించకండి!

వాడి చెప్పులకు వాడే యజమాని! అలాగే నా చెప్పులకు నేనే  వోనర్ని! ఇద్దరం కేవలం నీతిమీద నిలబడతాం గానీ, పరాయివాడి చెప్పులమీద కాదు."

ఆ పెద్దమనిషి చిరాగ్గా చూశాడు భవానీని!

"ఇప్పుడు చెప్పులు దొంగిలించారని ఎవరన్నారయ్యా! తమరు భోజనం చేయకుండా వెళ్ళడానికి వీల్లేదంటున్నాను అంతే" అన్నాడు నాతో వినయంగా.

నాకు పోయినప్రాణాలన్నీ కేరింతలు కొట్టుకుంటూ తిరిగి వచ్చేసినయి.

"భోజనమా? దాన్దేముంది-తరువాత చేస్తాను అలా వెళ్ళి వచ్చి..."

"అలా వద్దు, సార్! దయచేసి భోజనం చేశాకే వెళ్ళండి! కొంచెం ఆలస్యం అయిన మాట నిజమే! అంతమాత్రాన అలా కోపగించుకుంటే ఎలాగండి-రండి! అలా రెండు నిమిషాలు కూర్చోండి! రెండో బంతి పావుగంటలో రడీ అవుతుంది..." అంటూ నా చేతులు పట్టుకుని తీసుకెళ్ళి కుర్చీలో కూర్చోబెట్టాడు. చేసేదిలేక వెధవముఖం వేసుకుని కూర్చున్నాను. శంకర్  కూడా నా పక్కనే కూర్చున్నాడు.

"మనం తొందరపడి చెప్పుల గురించి మాట్లాడకూడదు" అన్నాడు వాడు.

"అవును! ఇప్పుడు కదా ఆ విషయం తెలిసింది" అన్నాను నేను.

"ఈ సారి ఎవరైనా పిలిచినా ఛస్తే చెప్పుల గురించి మాట్లాడకూడదు" అన్నాడువాడు.

"ఇప్పుడు తదుపరి కార్యక్రమం ఏమిటి?" అడిగాను మళ్ళీ చెప్పుల సంగతి గుర్తు తెచ్చుకుని.

"ఏముందీ? ఈ సారివాడు పిలుస్తున్నా ఆగకుండా బయటకు పరుగెత్తు..."

"అలా పరుగెడితే అందరికీ అనుమానం రాదూ?"

"వచ్చినా సరే-మన దేహ సౌందర్యరక్షణ ముఖ్యం కదా?"

"అంతేనంటావా?"

"అక్షరాలా అంతే!"

"పోనీ భోజనం చేశాకయితే బాగుంటుదేమో. అప్పుడయితే వాడిక అడ్డుపడడు."

"వాడు అడ్డుపడడు గానీ, ఇప్పుడు మొదటి పంక్తిలో కూర్చుని భోజనం చేస్తున్న ఈ చెప్పులవోనరు బయటికొస్తే తప్పక అడ్డుపడతాడు."

"అవునవును! ఆ విషయం మర్చేపోయాను" అన్నాను మళ్ళీ వణుకులోకొచ్చేస్తూ.

"హలో" అన్నగొంతు వినిపించి ఇద్దరం అదిరిపడ్డాం.

మా వెనకాలే నిలబడ్డాడో వ్యక్తి. అలా చిరునవ్వుతో పలుకరించే వాళ్ళను చూస్తేభలే ముచ్చటవేసేది. కానీ ఈ చెప్పులు తస్కరించిన కొద్దిసేపటినుంచీ-ఆ చిరునవ్వు ఎంతో భయంకరంగా గుండెలవిశిపోయేలా కనబడుతూంది

"యస్" అన్నాడు భవానీశంకర్ ధైర్యంగా.

నేను ఆ పెద్దమనిషికి నా చెప్పులు కనిపించకుండా కాళ్ళు కుర్చీకిందకు లాక్కున్నాను అతను మళ్ళీ చిరునవ్వు నవ్వాడు.

నాకు చటుక్కున భవానీ శంకర్ మాటలు గుర్తుకొచ్చాయి, అతను వచ్చింది చెప్పులగురించి కాదేమో! "మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుంది-" అన్నాను సంభాషణ వేరే రంగంలోకి దింపుతూ.

"ఉండొచ్చు-ఉండొచ్చు" అన్నాడతను ఇంకా చిరునవ్వు నవ్వుతూనే.

భవానీశంకర్ నావైపు అభినందిస్తున్నట్లు చూశాడు.

ఆ తరువాతేం మాట్లాడాలో నాకు తెలియటంలేదు. సహాయంకోసం వాడివైపు చూశాను. వాడు వెంటనే అందుకున్నాడు.

"వెదర్ చాలా బావుంది" అన్నాడు పందిరివైపు చూస్తూ.

"అవును! చాలా ఆహ్లాదంగా ఉంది" అన్నాన్నేను.

"ఆ చెప్పులు..." అతనేదో చెప్పబోయాడు గానీ, భవానీశంకర్ అడ్డుపడిపోయాడు.

"మీరెప్పుడైనా డార్జిలింగ్ వెళ్ళారా?" అడిగాడతనిని.

"లేదు ఎందుకు?" ఆశ్చర్యంగా అన్నాడతను.

"అక్కడ ఎప్పుడూ ఇలా కూల్‌గా క్లౌడీగా ఉంటుంది వెదర్!" అన్నాడువాడు.

"ఐ.సీ" అన్నాడా వ్యక్తి.

"నేను త్రీ టైమ్స్ వెళ్ళానక్కడికి!"

ఆ వ్యక్తికి డార్జిలింగ్ గురించిగానీ, ఆహ్లాదకరమైన వాతావరణం గురించిగానీ ఏ మాత్రం ఆసక్తి ఉన్నట్లు లేదు. అందుకని టక్కున మళ్ళీ సబ్జెక్ట్‌లోకి దిగిపోయాడు.

"ఆ చెప్పులు..." అన్నాడు నా కాళ్ళవైపు చూపుతూ. నా మెదడంతా మొద్దుబారి పోయింది. ఇంక దేవుడు కూడా నన్ను రక్షించలేడు. ఈ దెబ్బతో పెళ్ళిపందిట్లో నా పరువంతా గోవిందా !

కానీ శంకర్ పరిస్థితిని చేయిదాటిపోనీకుండా మరో ప్రయత్నం చేశాడు.

"అందాకా ఎందుకూ-కొడైకెనాల్లో కూడా అచ్చం ఇలాగే ఉంటుంది"

కానీ ఆ వ్యక్తి అవేం పట్టించుకోలేదు. జలగలాగా పట్టేసుకున్నాడు.

"ఆ చెప్పులు-ఓసారి చూడనిస్తారా?" అన్నాడు నాతో.

నాకేం తోచలేదు "ఇహిహి-చెప్పులా?" అన్నాను.

"అవును! ఒకసారి చూడనిస్తారా?"

"ఎందుకు?"

"పనుంది!"

"ఏం పని?"

"ఏదో పని!"

"అలాగా?"

"అవును! మరి చూడనిస్తారా?"

"ఎందుకు చూడటం?"

"పనుంది!"

"ఏం పని?"

"మిష్టర్! మీకే చెప్పేది" ఈ సారిగొంతుపెంచి అన్నాడతను. అతనిగొంతు మా ముందు వరుసలో కూర్చున్న మరి కొంతమందిని ఆకర్షించింది. అందరూ మా దగ్గరేదో సినిమా ఆడుతున్నట్లు మా వైపు తిరిగి కూర్చుని చూడసాగారు.

నేను భవానీశంకర్ వైపు చూశాను. వాడు అర్జంటుగా గాలిలోకి చూశాడు. "చూపించండి!" మరింత ధీమాగా అడిగాడతను. నాకు తెలియకుండానే వణుకుతున్న నా కాళ్ళు కుర్చీకింద నుంచి బయటికొచ్చాయి.

భవానీశంకర్ వెంటనే జోక్యం చేసుకున్నాడు.

"చాలా అద్భుతమైన చెప్పులు!" అన్నాడు నాతో "మీక్కూడా నచ్చాయా?" అనడిగాడు ఆ ఎదుటి వ్యక్తిని. అతను ప్రశ్న పట్టించుకోలేదు.

"ఆ చెప్పులు ఎక్కడివి మీకు?" కొత్తగా రిక్రూట్ అయిన పోలీస్‌కానిస్టేబుల్‌లాగా అడిగాడు.

"మీరే కాదు-ఇప్పటికీ ప్రశ్న ఇరవై ముగ్గురు అడిగారు!" అన్నాడు భవానీశంకర్ మళ్ళీ జోక్యం చేసుకుని.

నేనేమీ మాట్లాడకపోవడం చూసి "కదురా" అంటూ నా భుజంచరిచాడు.

"అవును!" ఒప్పుకున్నాను నేను. "ఇతనితో కలసి ఇరవై నలుగురూ" అంటూ సరిదిద్దాను.

"అంత అద్భుతమైన మోడల్ "అన్నాడు వాడు. నేను పుంజుకున్నాను.

"ఆ షాపువాడు మా ఫ్రెండ్ కాబట్టి-ఇచ్చాడు! అసలు ఎంత డబ్బు ఇస్తామన్నా ఎవ్వరికీ అమ్మటంలేదు" అన్నాను.

"అవును! ఆ తరువాత మన ఫ్రెండ్స్ చాలామంది షాపుకెళ్ళి అడిగారు- ఎవ్వడికీ ఇవ్వలేదు!"

"అంతెందుకు-వీటినే ఎంతడబ్బు కావాలంటే అంత ఇస్తాం నాకిచ్చెయ్యమని రామచంద్రపిళ్ళై అడిగాడు"

"అవును! రామచంద్రపిళ్ళై! గుడ్ ఫెలో! హి ఈజ్ ఫ్రమ్ కేరళా! వెరీఫాండాఫ్ దీజ్ చెప్పల్స్" అన్నాడు భవానీశంకర్.

"రామచంద్ర పిళ్ళై కదూ?" కన్‌ఫర్మేషన్ కోసంనన్నడిగాడు మళ్ళీ.

"అవును! అసలు వాళ్ళ వంశమే అంతట-వెరీ ఫాండాడ్ చెప్పల్స్! ఒకసారి 'మీసాలు నీవి, రోషాలు నావి' సినిమా క్యూలో నిలబడినప్పుడు వాళ్ళ పూర్వీకులహిస్టరీ అంతా చెప్పాడు నాకు!"

"ఆ క్యూ అంత పెద్దదా?"

"అవును!"

"మరా సినిమా ఎనిమిదోరోజునే ఎలా వెళ్ళిపోయింది?"

"ఎవడన్నాడు ఎనిమిదో రోజువెళ్ళిపోయిందని"

"అహోలువాడు!"

"ఏడ్చాడు!"

"ఏం ఎందుకు?"

"అది వెళ్ళింది తొమ్మిదో రోజున!"

"మరివాడు ఎనిమిదోరోజున అంటాడేం!"

"వాడి మొఖం! వాడు తొమ్మిదో రోజు ఈసినిమానే చూసి కొత్త సినిమా అనుకుని ఉంటాడు." ఈ సంభాషణ ఆవ్యక్తికి ఏమాత్రం నచ్చినట్లులేదు. అంచేత మళ్ళీ మధ్యలో అడ్డుపడ్డాడు.

"ఆ చెప్పులు మీవా?"

భవానీశంకర్ అతని మాటలు వినిపించుకోలేదు. మళ్ళీ రామచంద్రపిళ్ళైని అర్థం తెచ్చుకున్నాడు.

"రామచంద్ర పిళ్ళై, వాళ్ళ తాతా ఒకసారి ఆగ్రా వెళ్ళినప్పుడు అక్కడ ఫోర్ట్ గేటు పక్కనే ఒక చిన్న చెప్పుల దుకాణంలో అద్భుతమయిన చెప్పులజత చూశాడట. "అవెంత?" అని అడిగాడట వాడిని. వాడు "యాభైరూపాయలు అని చెప్పాట్ట"

"అవి ఎవరు తయారుచేశారు?" అనడిగాట్ట.

"నేనే!" అని జవాబిచ్చాడట వాడు.

"ఇలాంటివి ఎన్ని జతలు చేశావ్?" అనడిగాడు ఆయన.

"ఇదొక్కటే చేశాను. దీన్నే ధర ఎక్కువని ఎవరూ కొనడంలేదు" అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాట్ట వాడు. మరి రామచంద్రపిళ్ళె తాతగారి రోజులంటే మన స్వాతంత్ర్యానికి పూర్వం అన్నమాట. అప్పుడు యాభయ్ రూపాయిలంటే ఎక్కువేకదా!

ఆయన వెంటనే వందనోట్లు అయిదుతీసి వాడికిచ్చి "ఇలాంటివి ఇంకెవ్వరికీ చేయకుండా ఉంటానికిస్తున్నానీ డబ్బు" అని చెప్పి ఆ చెప్పులు తీసుకువచ్చేశాట్ట! ఇప్పటికీ ఆ చెప్పులు అలా ఉంచారు వాళ్ళింట్లో.

"వాళ్ళ ఫాదర్ కూడా మంచి చెప్పుల కోసం మలేసియా వెళ్ళినప్పుడు-ఇలాగే ఒక చిన్న దుకాణం వాడికి-"

రామచంద్ర పిళ్ళే వాళ్ళ వంశం తాలూకూ చెప్పుల కథలు ఆ చుట్టూకూర్చున్న వారికి మహా రసానుభూతిని కలిగిస్తున్నాయేమో కాని, ఆ వ్యక్తిని ఏ మాత్రం కదిలించలేక పోతున్నాయ్, పైపెచ్చు రాన్రాను అతనికి ఆ రామచంద్రపిళ్ళే మీద, వాళ్ళ వంశంతాలూకూ చెప్పుల కథలు మనోజ్ఞకంగా వినిపిస్తున్న భవానీశంకర్ మీదా, ద్వేషం ప్రబలిపోతున్నట్లు దాఖలా కనిపించింది.

"ఆ చెప్పులు మీవా? అని నేను-మిమ్మల్ని-అడుగుతున్నాను." ఒక్కొక్క పదం విడదీసి స్పష్టం చేస్తూ అడిగాడతను.

"ఏ చెప్పులు?" అడిగాను ఏమీ అర్థంకానట్లునటిస్తూ-

"అవిగో-అవి-ఆకాళ్ళకున్నవి?"

"ఏ కాళ్ళకు?"

"మీకాళ్ళకు!"

"వాటికేమయిందిప్పుడు?"

"ఆ చెప్పులు మీవేనా?"

"హిహిహి" చాలాకాజువల్‌గా నవ్వాలనుకుని ప్రయత్నించాను గాని, అదికాస్తా వెర్రి నవ్వయి కూచుంది.

మొట్టమొదటిసారిగా నాతో ఈ వెధవ పనిచేయించి నన్నిలాంటి పరమభయంకర పరిస్థతిలో పడేసిన భవానిశంకర్‌గాడిని హత్య చేయాలన్నంత కోపంవచ్చింది. కానీ అప్పటికప్పుడు హత్యచేయడం అంత తేలికేం కాదు.

"ఏమిటది?" కోపంగా అడిగాడా వ్యక్తి.

"ఏమిటేమిటి?" ఏమీ తెలీనట్లు అడిగాను.

"ఇప్పుడు నా ప్రశ్నకు ఇహ్హిహ్హిహ్హి అంటూ మీరు చేసిన ప్రక్రియ ఏమిటి? అని అడుగుతున్నాను."

"అదా!" తేలిగ్గా అనేశాను.

"అవును! అదే!"

"నవ్వాను."

"యస్-అది నవ్వే!" తనూ వప్పుకున్నాడు భవానీశంకర్

"ప్లీజ్-డోంట్ ఇంటర్ ఫియర్!" భవానిశంకర్‌కి వార్నింగిచ్చాడతను.

భవానీశంకర్ ఆశ్చర్యంగా అతనివేపు చూశాడు.

"డోంట్ ఇంటర్‌ఫియరా?"

"అవును!"

"ఏమిటి డోంట్ ఇంటర్‌ఫియర్?"

"మధ్యలో కల్పించుకోవద్దు అని రిక్వెస్ట్ చేస్తున్నాను."

"ఎవరి మధ్యలో?"

"మా మధ్యలో?"

"మీరు ఏంచేస్తున్నారు?"

"వెరిఫై చేస్తున్నాను. అంటే నిర్ధారించుకోవడం అన్నమాట!"

"ఏ విషయం?"

"చెప్పుల విషయం!"

"అవా? ఇంపాజిబుల్! ఎంత ప్రయత్నించినా మీ కలాంటివి ఎక్కడాదొరకవ్! రామచంద్రపిళ్ళై అనీ వాళ్ళఫ్రెండ్‌కూడా పాపం ఇలానే వాటిమీద ఎంతో మోజుపడ్డాడుట. అసలు వాళ్ళవంశమే చెప్పుల మీద రీసెర్చిచేశారని..."

"టు హెల్ విత్ రామచంద్రపిళ్ళై" అరచాడు ఆవ్యక్తి.

"ఎందుకలా అరచారు?" ఆశ్చర్యంగా అడిగాడు భవానీశంకర్.

"పిచ్చెక్కి!"

"అప్పుడప్పుడూ అలా ఎటాక్ వస్తూంటుందా, ఇదే మొదలా?"

ఆ వ్యక్తి మళ్ళీ నావేపు తిరిగాడు

"మిస్టర్! జవాబు చెప్పండి!"

"ఏం జవాబు?"

"అదే, ఆ చెప్పుల గురించి?"

"ఏ చెప్పుల గురించి?"

"మీ కాలికున్నవి!"

"వాటివివరాలు చెప్పానుగదా"

"నాకావలసింది వివరాలుకాదు-అవి మీవా అని అడుగుతున్నాను."

"ఎందుకు అడగడం?"

"ఎందుకో మీకుతెలీదా?"

"నాకా? నాకేం తెలుస్తుంది?"

"అవును! తెలీదు! ఎందుకంటే "అవి మీవి కావుగనుక!"

ఆ మాటతో ఆ చుట్టుపక్కలున్నాళ్ళందరూ ఉలిక్కిపడ్డారు.

నామొహం కళ తప్పిపోయింది. మెదడు శోషవచ్చి పడిపోయింది. కేవలంమెడల్లా అబ్లాంగేటా దయమీద ఆధారపడి ఉంది పరిస్థితి.

"ఇవి నావి కాదా?"

"కావు"

"మరెవరివి?"

"నావి!"

"ఇంపాజిబుల్!" అన్నాను భవానీశంకర్ వంకచూసి.

"ఎస్. క్వాయిట్ ఇంపాజిబుల్" అన్నాడువాడు.

"యూ ఆర్ మిస్టేకెన్" అన్నాన్నేను, ఇంగ్లీష్‌లోకి పూర్తిగా దిగిపోతూ. ఇలా పదిమందిలో పరువుపోయే పరిస్థితుల్లో కేవలం ఇంగ్లీషే మాట్లాడితే చాలా ఉపయోగం ఉంటుందని వాడే చెప్పాడునాకు.

"యస్! ధరూలీ మిస్టేకెన్" అన్నాడు భవానీశంకర్.

"మిస్టేక్ లేదూ-గాడిదగుడ్డూ లేదు. అవినావి!" ఖండితంగా అన్నాడతను.

"నో నో. దే ఆర్‌మైన్" అన్నాను.

"యస్! హి ఈజ్ ది హోల్ అండ్ సోల్ వోనర్ ఆఫ్ దీజ్ చెప్పల్స్" అన్నాడు భవానీశంకర్.

"నేను కాదు అని చెప్తున్నాను. అవి నావి!" కోపంగా అరచాడతను. సరిగ్గా అదే సమయంలోఫస్ట్ షో సినిమా వదిలినట్లు మొదటి పంక్తిలో కూర్చునిభోజనం చేసిన జనం త్రేవున తేన్చుకుంటూ వచ్చి మా చుట్టూ అప్పటికే గుమికూడిన చిన్న సైజు గుంపుని పెద్దదిగా చేశారు. రోడ్డుపక్కన గారడీవాడికూడా ఇంతమంది ఆడియెన్స్ ఉండరని ఖచ్చితంగా చెప్పవచ్చు. పాత ప్రేక్షకులు క్రొత్తగావచ్చిన వాళ్ళకి ఇంత వరకూ జరిగిన కథక్లుప్తంగా చెప్పడం ప్రారంభించారు.

"కాదు.... నావి!" అన్నాన్నేను-వణుకు తగ్గించడానికి ప్రయత్నంచేస్తూ.

"అవునువాడివే! అందులో అనుమానం లేదు. వాడెప్పటికి ఇంకొకరిచెప్పులుగానీ, లేక మరే ఇతర పాదరక్షలుగానీ, బూట్లుగానీ దొంగిలించేరకం కాదు. అంతేకాదు, చాలా సార్లు మేజోళ్ళు కూడా దొంగతనం చేయలేదు. మీకో విషయం చెప్తే ఆశ్చర్యపోతారు. వాడిప్పటికి నూటముప్పై నాలుగు పెళ్ళిళ్ళకు హాజరయ్యాడు-నూటముప్ఫై నాలుగేకదత్రా?" నన్నడిగాడు కన్‌ఫర్మేషన్‌కోసం.

"ఈ పెళ్ళితో నూట ముప్పయి అయిదు" అన్నాన్నేను.

"కరెక్ట్, నూట ముప్ఫై అయిదుపెళ్ళిళ్ళకు వెళ్ళాడు. అక్కడ వేలకువేలు చెప్పులు, బూట్లు, బెల్ట్ షూ, కాన్వాస్ షూల మధ్యగంటల కొద్దీమసిలాడు. అయినా వాడేమయినా చలించాడా? ఒక్క జతయినా ముట్టుకున్నాడా? లేదు. కేవలం వాడి సొంతచెప్పులతోనే ఇంటికి తిరిగి వచ్చాడు! సిన్సియర్‌గా చెప్పండి! కెన్ ఎనీబడీ డూ ఇట్?నో! ఇంపాజిబుల్! అంతేకాదు. వాడికి ఫారిన్ బూట్లుకూడా కొట్టేయగల అవకాశాలెన్నో వచ్చాయ్. అయినా వాటిని సద్వినియోగం చేసుకోలేకపోయాడు. ఎందుకని? కారణం ఏమిటి?వాడికి ధైర్యం లేకనా?రన్నింగ్ చేతకాదనా? అవేమీకాదు. సింపుల్ రీజన్-మీ చెప్పులే మీరు ఉపయోగించుడు అన్న నీతికి కట్టుబడ్డ మొదటి పౌరుడువాడు. నేను రెండోవాడినని మీకీపాటికే తెలిసి ఉంటుంది. ఇవిగో నా చెప్పులు చూడండి! ఇవెవరివి? నావి. ఎంతోకాలం నుంచీ వీటినే తొడుగుతున్నాను. ఎన్ని పెళ్ళిళ్ళకెళ్ళినా వీటిని మార్చలేదు. కొత్తవాటితో

ఎక్స్‌చేంజ్‌చేయలేదు. ఎక్కడికెళ్ళినా ఎంతమందికీ చూపించినా ఇవి నావి అని ఎవ్వరూ అనలేదు, ఎందుకని?" ఉద్వేగంతో అడిగాడు భవానీశంకర్.

"గుర్తుపట్టి ఉండరు..."ఎవ్వరో గుంపులోనుంచి అరిచారు. అందరూ ఘెల్లుమన్నారుకానీ, భవానీశంకర్ అదేమీ పట్టించుకోలేదు.

"కాదు!" అన్నాడు వెంటనే "గుర్తుపట్టక కాదు! వాళ్ళు అవి తమవే అని తెలిసినా గాని మౌనంవహిస్తారు ఎందుకు? మనుషులను బోలినమనుషులున్నట్లే, చెప్పులును బోలిన చెప్పులుంటాయ్! కనుక నాలాంటి మర్యాదస్తులను- "ఇవి మీవి కావు, నావి..." అని అనడం వారి మర్యాదకు లోపం అవుతుంది" ఇంకా ఎంతసేపు వాడి ఉపన్యాసధోరణి కొనసాగేదో గాని, ఆవ్యక్తి టక్కున అడ్డుపడ్డాడు.

"అయితే ఇవి మీవే నంటారు!" అన్నాడు నాతో.

"నూటికి నూరుపాళ్ళూ" అన్నాన్నేను.

"అంటే ఇవి అచ్చంగా మీరేకొన్నానంటారు!"

"అవును!"

"ఏ షాపులో కొన్నారు?

ఆ ప్రశ్ననాకు భయం కలిగించింది. ఏషాపులో అని చెప్పగలను? ఒకవేళ ఏదయినా షాపు పేరుచెప్తేవాడు ఎంక్వయిరీ చేస్తాడేమో!

"ఎందుకు? షాపుపేరు కూడా చెప్పాలా?"

"చెప్పాలి"

"ఎందుకు చెప్పాలి?"

"అవిమీవి అని తెలియడానికి! నాచెప్పులుదొంగతనం చేయలేదు అని ఋజువు చేయడానికి!"

"అంటే మీ చెప్పులు నేను దొంగతనం చేశానని మీరనుకుంటున్నారా?"

"అనుకోవడమేమిటి? చేశారు!"

నేను ఆశ్చర్యం నటిస్తూ భవానీశంకర్ వేపు చూశాను.

"హౌస్ట్రేంజ్?" అన్నాను ఇంగ్లీషులో

"టూ మచ్‌స్ట్రేంజ్!"అన్నాడు వాడు

"స్ట్రేంజీ, చీంజీలేదు. ముందు షాపు పేరుచెప్పు!" అన్నాడా వ్యక్తి పట్టుదలగా.

"షాపు పేరా?"

"అవును!"

"రాథోడ్ కర్ చెప్పల్‌గంజ్ అనే షాపులో."

"రసీదుందా?" మళ్ళీ అడిగాడు వాడు.

ఇంక చిరాకేసుకొచ్చింది నాకు. ఎలాగూ దొరికిపోక తప్పదు. దొరికేముందు ఆఖరిసారిగా వో విసురు విసిర్తే గానీ పరువు దక్కేట్టులేదు. అంచేతవిరుచుకుపడ్డాను.

"రసీదా?"

"అవును! రసీదే!"

"వాట్ రసీద్"

"ఆ చెప్పులు మీరు రాదోడ్‌కర్ గంజ్‌లో కొన్నట్టు!"

"రాదోడ్‌కర్ గంజ్‌కాదు! రాథోడ్‌కర్ చెప్పల్‌గంజ్".

"అదే రాదోడ్‌కర్ చెప్పల్ గంజ్"

" 'ధ' కి వత్తుంటుంది"

"ఏ థాకి?"

"రాథోడ్‌కర్‌లో 'థో'కి"

"నాక్కావలసింది 'థ' కి వత్తుకాదు. రసీదు! "

"రసీదా?"

"అవును"

"వాట్ రసీద్?"

"ఇదిగో-ఈ నాటకాలు నా దగ్గర కాదు! మర్యాదగా నా చెప్పులు నాకివ్వు!"

"నీ చెప్పులేమిటి? ఇవి నావి! కావాలంటే వాడినడగండి" అంటూ భవానీశంకర్‌ని చూపించాను.

"అవును! అవి వాడివే! నేనే-విట్‌నెస్! కావాలంటే రామచంద్రం పిళ్ళే కూడా విట్‌నెస్సే?"

"అయితే రసీదు చూపించండి." అరిచాడావ్యక్తి.

"రసీదా-చెప్పులు కొన్నవాళ్ళు జేబులో పెట్టుకొని తిరగాలనుందా?" ఎదురుతిరిగాడు భవానీ శంకర్. వాడి లా పాయింటు భలే నచ్చిందినాకు. వాడిని ఎప్పటికయినా హత్య చేయాలన్న ఆలోచన విరమించుకున్నాను.

"జేబులో లేకపోతే ఇంటికెళ్ళి తీసుకురావచ్చుగా?"

నేను-ఏం జవాబు చెప్తాడో అని భవానీశంకర్ వేపు చూశాను.

"ఆ అవసరం మా వాడికి లేదు" అన్నాడు వాడు.

"అవును. ఏ మాత్రం లేదు" అన్నాన్నేను.

"లేకపోతే చెప్పులు ఇక్కడ విడిచి వెళ్ళాల్సిందే!" మొండికేశాడతను చొక్కాచేతులు పైకి మడుస్తూ.

పరిస్థితి క్షణక్షణానికీ క్షీణించిపోతోందని గ్రహించి లావుపాటి పొట్టగల వ్యక్తి రంగంలో దూకాడు.

"అయితే ఇప్పుడు ఆ చెప్పులు వోనర్ షిప్ తేలాలన్న మాట!" అన్నాడు పొట్ట నవరించుకుంటూ.

"అవును తేలాలి-దొంగ ఎవడో ఋజువవుతుంది. అప్పుడు వాడిని కసితీరా ఉతకాలి."

నేను అంతవరకూ మర్చిపోయిన వణుకు మళ్ళీ తిరిగి వచ్చేసింది.

"అవునవును" అన్నాడు ప్రేక్షకవర్గంలోనుంచి ఎవరో. బహుశా అదీ ఎప్పుడో పెళ్ళిలో కొత్త చెప్పులు పోగొట్టుకున్న బాపతయి ఉంటుంది.

"అయితే వో పని చేద్దాం! ఆ చెప్పుల మీద ఆ కంపెనీ పేరు-ధర ముద్ర వేసి ఉంటుందిగా! అది ఎవరుకరెక్ట్ గా చెప్తారో చూద్దాం!" అన్నాడు లావుపాటి పొట్ట.

"బ్రహ్మాండంగా వుంది ఆయన అయిడియా!" ప్రేక్షకుల్లో నుంచి ఇంకెవరో సపోర్ట్ చేశారు.

నాపరిస్థితి చాలా విషమించిపోయిందని అర్థమయింది నాకు. క్షణాలమీదుంది వ్యవహారం. ఆ చెప్పులకంపెనీ పేరు, ధర వాడు ఖచ్చింతంగా చెప్పేయగలడు. దాంతో నా ఆటకట్టు. భవానీశంకరంగాడిని మర్డర్ చేయాలనుకున్న పాత కోరిక మళ్ళీపైకి లేచింది.

"ముందు అతనినే చెప్పమనండి చూద్దాం!" అన్నాడా వ్యక్తి దొరికిందే నందని.

"కాదు ముందు అతనినే చెప్పమనండి!" అన్నాన్నేను చెమటలు తుడిచేసుకుంటూ.

"అబ్బా ఆశే! నేను చెప్తే-నువ్వూ అదే కాపీకొట్టిచెప్తామనా?"

"అహ్హహ్హ" అంటూ ప్రేక్షకులు మనసారా నవ్వారు.

"అవును! ఇద్దరినీ చీటీలు రాసి ఇవ్వమనండి! వాటిని పరీక్షచేసి రెండింట్లో ఏది ఉత్తమమయిన ఎంట్రీయో నిర్ణయించి బహుమతి ప్రదానం చేద్దాం" అది మరో ప్రేక్షకగొంతు.

క్షణాల్లో మా ఇద్దరి చేతుల్లో ఎంట్రీఫారాలు వచ్చిచేరినాయ్!

"అతనిని కూర్చోనీకండి! కూర్చుంటే కాళ్ళు పక్కకు జరిపి చెప్పులమీదున్న పేరు,ధర చూస్తాడు" అన్నాడావ్యక్తి. నా గుండెల్లో మరోరాయిపడింది! ఎలాగోలా కాలు తొలగించి వాటికంపెనీ పేరు రాద్దామనుకున్నాను.

"నాకిలా నుంచుని రాయడంరాదు!" అన్నాను హీనస్వరంతో.

"అవును! ఇప్పుడే కాదు-మొదట్నుంచీ అంతే! స్కూలు గార్డెన్‌లో కొబ్బరికాయలు దొంగతనం చేసినప్పుడు కూడా క్లాసులో టీచర్ నుంచోపెట్టి నోట్సురాయమంటే ఒక్కఅక్షరం కూడా రాయలేక పోయాడు" సపోర్ట్ చేశాడు భవానీశంకర్.

ప్రేక్షకులంతా మళ్ళీ మనశారా నవ్వారు. అందులో అంత హాయిగా నవ్వాల్సిన విషయం ఏముందో మా ఇద్దరికీ అర్థంకాలేదు

"ఫరవాలేదు! ఇది దస్తూరి పోటీకాదు కదా-పేజీలు పేజీలుకూడా రాయనక్కరలేదు. రెండు మూడక్షరాలు మహా అయితే" లావుపాటి పొట్ట సలహా ఇచ్చాడు.

"అవునహో-అవును" మరోప్రేక్షకగొంతు

ఆ వ్యక్తి అటువేపు తిరిగితను రాస్తున్నది నేను చూడకుండా ఏదో కాగితం మీదగికి ఆ ఎంట్రీ ఫారం లావుపాటి పొట్టకు అందజేశాడు.

"రాయవయ్యా! నువ్ కూడా కానీ" ఎవరో చెవిలో అరిచారు.

పెన్ను చేతిలోకి తీసుకుని నాకు తెలిసిన చెప్పుల కంపెనీ పేర్లన్నీ ఆలోచించాను

"నాకు పేరు గుర్తురావడంలేదు" అన్నాను ఏడుపు, బలవంతంగా ఆపుకుని.

"పోనీ పేరు మర్చిపోతే చెప్పుల సైజురాయి"

నాకు తోచిన ధర త్వరత్వరగా రాసి ఆ లావుపాటి పొట్టకిచ్చాను.

"ఆ! ఇప్పుడు చెప్పులు విప్పమనండి!" ఆ వ్యక్తి ఆనందంగా అన్నాడు.

"విప్పవయ్యా?" వణుకుతున్న కాళ్ళు నొక్కిపెట్టి వో చెప్పుజారవిడిచాను.

దానిమీద మెరుస్తోన్న అక్షరాలు ధర చూసేసరికి నాకు కళ్ళు తిరిగినయ్. ఆపేరు అంత వరకూ కనీవినీ ఎరగనిది. ధర తొంభయి ఎనిమిది రూపాయలు. నేను కాగితంలో అరవై రెండు రూపాయలని రాశాను.

"ఇదిగో-ఇతను రాసినపేరు, ధరా, సైజూ అన్నీకరెక్ట్‌గా సరిపోయాయ్. కనుక- ఇతనే బహుమతి పొందిన విజేత!" అంటూ ఆ వ్యక్తి చేతిని పట్టుకుని పైకెత్తాడు లావుపాటి పొట్ట.

నేను చెప్పులు విడిచి దూరంగా జరిగాను. ఆ వ్యక్తి విజయగర్వంతో చెప్పులు ధరించాడు.

అంతా కరతాళధ్వనులు చేశారు. "తరువాతి కార్యక్రమం ఏమిటి?" ఎవరో అరచారు.

నేను పడిపోబోయి కుర్చీ పట్టుకుని నిలబడ్డాను.

"ఇది అన్యాయం! అయ్ ప్రొటెస్ట్ ఇట్!" అంటూ అరచాడు భవానీశంకర్.

"పేరు సైజు ధర చెప్పినంతమాత్రాన చెప్పులమీద హక్కులభించడం అక్రమం" అన్నాడు వాడు. ఎవరూ వాడి మాట వినిపించుకున్నట్లు లేదు.

"వీడిని చూడండి! వీడి మొహం చూడండి! వీడి స్టేటసేమిటి? వీడిహిస్టరీ ఏమిటి?వీడి ఫ్యూచరేమిటి? ఇలాంటి పెద్దమనిషిని-కేవలం ధరా,సైజూ, పేరూ, చెప్పలేక పోవడంవలన చెప్పులు లాక్కుని అవమానపరుస్తారా? అసలు ఈ పద్ధతి..." యింకావాడేం చెప్పేవాడో నాకు తెలీదుగాని, నా గురించివాడు చెబుతున్న మాటలునాకే జాలి కలిగించి కళ్ళ వెంబడి నీళ్ళు తెప్పించాయ్.

ఇంతలో ఎవరో వాడి ప్రవాహానికి పెద్ద ఆనకట్టలా అడ్డుపడ్డారు.

"చాల్లేవయ్యా-చేసేది వెధవపనులు, చెప్పేది బోడికబుర్లు" ఎవరోకసిగా అరచారు.

"ఆ మాట అంది ఎవరో?" లేచి కుర్చీ ఎక్కి నిలబడ్డాడు భవానీశంకర్ చొక్కా చేతులు మడచి. "నేను!" అంటూ ముందుకొచ్చిందో బట్టతల! అతని చొక్కా చేతులు అప్పటికే మడచి ఉన్నాయ్. పైగా కండలు తిరిగిన శరీరం

"మీరా?" కొంచెం తగ్గి అడిగాడు భవానీశంకర్.

"అవును! ఏం చేస్తావ్?"

"ఏం చేస్తానా? అలా అనడం మర్యాద కాదని చెప్తాను" అంటూ కుర్చీదిగిపోయాడు.

"లేకపోతే అతను చేసిన పనేమిటి? అది మర్యాదగలపనా?"

"మీరు ఊరికే అపార్థం చేసుకుంటున్నారు గానీ అది కేవలం పొరపాటువల్ల జరిగి ఉండవచ్చు"

"అంటే?"

"వీడివీ అచ్చం అలాంటి చెప్పులే! అందుకని పొరపాటున అవే వేసుకున్నాడు. ఇందులో వెధవపని ఏముంది, అమర్యాద ఏముంది?"

"అవును! నా చెప్పులూ అచ్చం ఇలాగే ఉంటాయ్" అన్నానేను స్పృహలోకొచ్చి.

"అయితే నీ చెప్పులేవీ మరి?" ఎవరో కూశారు.

"అదే నాకు అర్థం కావటంలేదు." అన్నాను వరండా అంతా వెతుకుతూ.

"మనుజులను పోలిన మనుజులున్నట్టే చెప్పులను బోలిన చెప్పులుండటంవల్లనే ఈ అనర్థం జరిగి ఉంటుంది" అన్నాడు భవానీశంకర్.

"అయితే మరి అతను వేసుకొచ్చిన చెప్పులేమయినయ్?" ఎవరో అడిగారు.

"అదే! మనం ఇప్పుడు వాటిని వెతకటమే ప్రథమకర్తవ్యం!"

నేను వెతకడం ముగించాను."ఎవరో కొట్టేశారు" అన్నాను అప్పుడే నగ్నసత్యం తెలుసుకున్నట్లు

"అరె-పాపం" అన్నాడు భవానీశంకర్ జాలిపడి.

"అవును! కొట్టేశారు"

"దిసీజ్ టూ మచ్-కొత్త చెప్పులు" అన్నాడువాడు.

"చాలా కాస్ట్లీ కూడా!"

"ఇంకాహారిబుల్!" అన్నాడువాడు

"ఇదే మొదటిసారి పోవటం."

"అదీ సొంత చెప్పులు పోతే చాలా బాధగానే ఉంటుంది."

"ఇవి మరీ సొంతచెప్పులు."

"పరాయివాడివయితే కొంత ఫరవాలేదు."

"ఇకనుంచీ ఇలా మన చెప్పులనుబోలిన చెప్పులు కనిపించినప్పుడు ఆ పెళ్ళిలో ఒక్కక్షణంకూడా ఉండను" అన్నాను కోపంగా.

"అవును! ఇలాగే అనుమానంగా కంపెనీపేరు చెప్పమనీ ధరచెప్పమనీ ట్రిక్స్ ప్లేచేసి లాగేసుకుంటారు."

ఇలా చుట్టూఉన్న ప్రేక్షకుల సానుభూతిని సంపాదించడానికి ఇద్దరం విశ్వప్రయత్నాలూ చేస్తాంటే వరండాలో అరుగుఎక్కి వోగొంతు ఖంగుమని అరిచింది.

"ఈ చెప్పులెవరివో చూడండి బాబూ! నేను అర్జంటుగా విడిదింటికెళ్తూ. వెంటనే తిరిగిరావచ్చు కదాని వేసుకెళ్ళాను. అక్కడ పావుగంట ఆలస్యం అయిపోయింది. ఇక్కడ ఈ చెప్పుల యజమాని ఎంతగా విలపిస్తున్నాడో అని పరుగుతో వచ్చాను-ఇవి ఎవరివో తీసుకోండిసార్!" నేనూ, భవానీశంకర్ ఒక్క ఉదుటన పరుగెత్తికెళ్ళి చూశాము.

నా గుండెలు ఆనందంతో కొట్టుకున్నాయ్. మనసు సంతోషంతో ఎగసిపడింది.

"ఏంటి బాబూ, ఇవి మీవేనా?" అడిగాడు ఆ వ్యక్తి.

"అవును" అనబోతుండగా 'కాదు' అరిచాడు భవానీ శంకర్.

"కాదా?" ఆశ్చర్యంగా అన్నాను.

"కాదు!" అన్నాడు వాడు. "నీ చెప్పులు-అదిగో! అతని చెప్పులనుపోలి ఉండాలి కదా! ఇవి నీవెలా అవుతాయ్?" అన్నాడు కన్నుగీటుతూ. నాకు వాడిమాటల్లోని అంతరార్థం అప్పుడుగాని బోధపడలేదు. "అవును! నావి కావు!" అన్నాన్నేను. "నావి కానిచెప్పులను ఎప్పటికి కావనే చెప్తాను" అందరివేపూ సగర్వంగాచూసి. అన్నాను

"అంతేకాని తనచెప్పులుపోయినాయని ఇంకొకరిచెప్పులుకాజేసే వెధవ బుద్ధి వీడికి లేదు" అన్నాడు భవానీశంకర్.

"ఆ చెప్పులు నావి అనిఎవరూ రాకపోయినా, నేనువాటిని అడగను. ఎవరయినా బలవంతంగా ఇచ్చినా తీసుకోను" అన్నాను.

"ఒకవేళ అంతంగా ఇక్కడున్న వారంతా కలసి బలవంతం చేస్తే తప్ప" అన్నాడు భవానీశంకర్. అలా అంటే అందరూ బలవంతం చేసి వాటినినాకిస్తారని వాడి ఆలోచన. కాని ఎవరూ బలవంతం చేయలేదు. కనీసం 'పోనీలేతీసుకో' అనికూడాఅనలేదు.

"అవి బహుశా నీ చెప్పులు పొరపాటున వేసుకెళ్ళినతని చెప్పులయి ఉంటాయ్. కనుక నువ్వుతీసుకోవచ్చు!" అన్నాడు భవానీ అందరి మొఖాలవంకా చూస్తూ.

ఎవ్వరూ వ్యతిరేకంగా మాట్లాడకపోయేసరికి నాకు ధైర్యం వచ్చింది. "నువ్వు తప్పదంటే తీసుకుంటాను" అన్నాను మొఖమాటం, అయిష్టం నటిస్తూ!

"ఈసారి తీసుకో! కాళ్ళకేదొక "రక్ష" ఉండాలికదా! ప్లీజ్ తీసుకో!" అన్నాడు వాడు. అయిష్టం నటిస్తూ. నేను తీసుకోబోతుండగా వో వ్యక్తి ఆదరాబాదరా వచ్చి ఆ చెప్పులు తొడిగేసుకున్నాడు. నాతోపాటు అక్కడున్న వారందరూ కూడా ఆశ్చర్యపోయారు.

"వీటికోసం నేను అరగంట నుంచీ వెతుకుతున్నాను. అయినా అలా అడక్కుండా ఎవరు తీసుకెళ్ళమన్నారు నిన్ను! నువ్వుచేసిన నిర్వాకంమూలాన నేను వీటికోసం ఎక్కడెక్కడో గాలిస్తూన్నాను-" అన్నాడతను ఆ చెప్పులు తెచ్చిన వ్యక్తి మీదకోపంతో

"నాది పొరపాటే అని చెప్తున్నాను కదండి!" అన్నాడా పెద్దమనిషి నొచ్చుకుంటూ.

"ఇంకోసారిలాంటి పనిచేయకు! "అన్నాడా వ్యక్తి.

"ఇంకెందుకు చేస్తానండి-"

నేనూ, భవానీశంకర్ ఉక్కిరిబిక్కిరయిపోతున్నాం! అవి నా చెప్పులు! కొత్తవి! ఆరోజే నేను వేసుకున్నవి. స్పష్టంగా తెలిసిపోతుందా విషయం. మరివాడు అంత నిర్భయంగా అబద్ధంచెప్పి ఎలాదొంగిలించుకుపోతున్నాడు?

"అవి మీవా?" ఆశ్చర్యంగా అడిగాను ఆ వ్యక్తిని.

"అవును! ఏం?"

"అహ-మరేంలేదు-ఊరికే అడిగాను-"

"ఊరికే ఎందుకడగడం?"

"మా ఫ్రెండ్ ఒకతనికి కూడా అచ్చం ఇలాంటివే ఉన్నాయ్."

"మనుజులను బోలిన మజులున్నట్లు-చెప్పులను బోలిన చెప్పులుంటాయి నాయనా!" చిరునవ్వుతో అన్నాడా వ్యక్తి.

"అవునవును" అన్నాడు భవానీశంకర్ చిరునవ్వుతో.

"నామీద మీకేమయినా అనుమానముంటే చెప్పండి! ఈ చెప్పుల కంపెనీ పేరుగెట్రో! ధరతొంభై ఆరు-నిన్నేకొన్నాను- ఇవాళే వాడటం మొదలుపెట్టాను" అని నెమ్మదిగా పందిట్లో నుంచి వెళ్ళిపోసాగాడతను.

నాకు కళ్ళవెంబడినీళ్ళు కారిపోతున్నాయ్. భవానీశంకర్ జేవురించిన మొఖంతో ఆదొంగ వెధవ వంకచూస్తున్నాడు. "రండి బాబు-భోజనానికి రండి!" అన్నారెవరో మా మీదజాలిపడి.

"నాకాకలిలేదు-" అంటూ నేను అక్కడినుంచి బయటపడ్డాను. నా వెనుకే భవానీశంకర్ వచ్చాడు. ఇద్దరం బస్‌స్టాప్‌లో నిలబడ్డాం

"ఒకోసారి ఇలా భలే తమాషాలు జరుగుతుంటాయ్-" అన్నాడు చిరునవ్వుతో.

"ప్లీజ్ గెటెవే ఫ్రమ్‌దిస్ ప్లేస్" అన్నాన్నేను కోపంఅణచుకుంటూ.

"అదేమిట్రా? అంతకోపం ఎందుకు? ఒకోసారి మనప్లాన్ ఫెయిలవుతూంటుంది. అంతమాత్రాన ఇలా నిరుత్సాహ పడకూడదు. వచ్చేనెలలో మన రంగరాజుగాడి పెళ్ళి ఉండనే ఉంది- అప్పుడు మంచి జత చూద్దాం! అయినా నువ్ నేను చెప్పిన ముఖ్యమైన సూత్రం మర్చిపోకూడదు- చెప్పులు తొడుక్కున్నాక వేగంగా వెళ్ళిపోవాలి. నీ సొంత చెప్పులు వేసుకున్న ఆ దొంగవెధవ బులెట్‌లాగా ఎలా వెళ్ళిపోయాడో చూశావ్ కదా! వెనక్కు తిరిగిచూస్తే

చూడకూడదు. ఎవరు పిలిచినా వినిపించుకోకూడదు. కేకలు, అరుపులు పోలీసులవిజిల్స్, ఇవేమీ-"

"మర్యాదగా ఇక్కడి నుంచి పోతావా,లేదా?" పిడికిలిబిగించి అడిగాను.

"ఓ! మనసు పాడయిపోయిందన్న మాట! ఓకే,ఓకే బాగున్నప్పుడు కలుస్తాన్లే మళ్ళీ ఎలాగూ నెక్స్ట్‌మంత్ రంగరాజు గాడి పెళ్ళికి ప్రోగ్రాం ఉందికదా! డోన్ట్‌వర్రీ"

నేనువాడి మొఖంమీద ఒక్కపిడిగుద్దు వేశానుగానీ, అదిగాలిలోకి తేలిపోయింది. వాడు అప్పటికే రెండొందలగజాల దూరంలోఉన్న చౌరస్తా దాటుతున్నాడు. ✷



# బడ్జెట్ భాగోతం



మోపెడ్ అమ్మినతరువాత కొద్దిరోజులవరకూ శాయిరామ్ ఎవరికి కనిపించలేదు. కాలనీ మీటింగ్‌లు కూడా రెండువారాలపాటు నిర్వహించకుండా వదిలేశాడు. రెండు ఆదివారాల పాటు మమ్మల్ని సుఖంగా నిద్రపోనిచ్చినందుకు మేమెంతో ఆనందించాంగాని మా ఆనందం ఎక్కువకాలం నిలవలేదు. మూడో ఆదివారం కొంపమునిగిపోయినట్లు అందరిళ్ళకూ వెళ్ళి మీటింగ్‌కు తరుముకొచ్చాడు.

"ఇప్పుడు మీటింగ్ దేనికిట!" కోపం అణుచుకుంటూ శాయిరామ్ అడిగాడు.

"ఎందుకేమిటి? వచ్చే శనివారమే బడ్జెట్ వస్తోంది."

"అయితే మనకేమిటి హడావిడి?"

దానికి శాయిరామ్ జవాబు చెప్పకుండా మిగతా వాళ్ళందర్నీ పిలిచి, నన్నో తెలివి తక్కువ వాడిలా చూపిస్తూ "చూశారా! ఎడ్యుకేటెడ్ అయున్నా కూడా ఉదయార్కర్‌కు బడ్జెట్ విలువ తెలీదు. మన కాలనీలో ఈ ఒక్క ఉదయార్కరేకాదు. ఇంకెంతోమంది అజ్ఞానులున్నారు. అలాంటి వాళ్ళను నిద్రవేల్కొలవటానికే మనం ఇక్కడ సమావేశమయ్యాం!" అన్నాడు.

అందరూ నావేపు జాలిగా చూశారు.

"బడ్జెట్ విలువ తెలీదా?" అన్నట్లు నవ్వారు.

నేనిక లాభంలేదని సైలంటయిపోయాను. శాయిరామ్ మైక్ ముందు కొంచెం హడావుడిచేశాక రంగారెడ్డి ఉత్సాహంగా మైక్ అందుకున్నాడు.

"సోదరసోదరీమణులారా! ఇన్ని సంవత్సరాలుగా మనందరం ఎంతనష్టపోతున్నామో ఎలా నష్టపోతున్నామో మీకెవరికయినా తెలుసా? ఉదయార్కర్‌గారూ! మీకుతెలుసా?" అడిగాడు నన్ను.

"తెలీదు!" అన్నాను మొఖవాటం లేకుండా

"గోపాల్రావ్ గారు, మీకు తెలుసా?"

"కొంచెం తెలుసుగానీ-మర్చిపోయాను" అన్నాడు గోపాల్రావ్ తప్పించుకుంటూ.

"జనార్ధన్ గారూ మీకు తెలుసా!"

"తెలీదు-"

రంగారెడ్డి విజయగర్వంగా అందరివేపూ చూశాడు.

"కానీ నాకుతెలుసు!" అన్నాడు చిరునవ్వుతో అందరం రంగారెడ్డి వంక ఈర్ష్యగా చూశాము.

మాకు తెలీనీ విషయాలన్నీ అతనికెలా తెలిశాయా అని.

"తెలుస్తే చెప్పు త్వరగా!" అన్నాడు. "నాకు తెల్సిందదికాదు! మీకెవరికీ ఏమీ తెలీదన్న విషయం నాకు తెలుసు" చిరునవ్వుతో అన్నాడు రెడ్డి.

"సంగతేమిటంటే మనకాలనీ శ్యామల్రావ్‌గారు ఏంచేశారనుకున్నారు? కిందటి బడ్జెట్ ముందురోజు గదినిండుగా సబ్బులు కొనుక్కొచ్చి ఇంట్లోపెట్టుకున్నారు. మర్నాడు బడ్జెట్ చూస్తే ఏంజరిగింది అనుకున్నారు? ఒకో సబ్బుమీద పావలాచొప్పున టాక్స్ పెరిగింది. అంటే శ్యామల్రావ్‌కి ఎంతలాభం కలిగిందో మీరే చూడండి! గదినిండా ఉన్న సబ్బులన్నీ కొంచెంచౌకధరకు మన కాలనీవాళ్ళందరికీ అమ్మి వేలరూపాయలు సంపాదించాడు-"

అందరం మొఖ మొఖాలు చూసుకున్నాం

శ్యామ్రావ్ సబ్బులమ్మితే కొన్నాంగానీ-దానివెనుక ఈ కథ ఉందని మాకు తెలీదు. తన అన్న కొడుకు సబ్బుల కంపెనీలో రిప్రజెంటేటివ్ అనీ, అందుచేత ఓఅయిదుపైసలు తక్కువకు దొరుకుతున్నాయనీ మాఅందరికీ  అబద్ధం చెప్పాడు. అది మేము శుంఠల్లా నమ్మేశాము.

"కనుక సోదరులారా! రేపు శనివారం వస్తున్న బడ్జెట్ కి ముందే మనం కూడాతెలివిగా కొన్ని వస్తువులు కొనేసి స్టాక్పెట్టినట్లయితే-మనందరికీఎంత లాభమో ఒక్కసారి ఆలోచించండి."

అందరూ ఒక్కసారి ఆలోచించేసరికిగుండెలు బాదుకోబుద్దేసింది. ఆడాళ్ళలో పెద్దఎత్తున కలవరంచెలరేగింది.

"ఈ విషయం మనకు తెలీనే తెలీదు పిన్నిగారు! చూశారా-మనకాలనీలో ఉండటంవల్ల మనకెన్ని విషయాలు తెలుస్తున్నాయో-నేనూ మా రెండు అల్మారాలనిండుగా బట్టలసబ్బులు కొనిపెట్టేస్తాను."

"నేను చింతపడుకొంటాను-"

"మీరేంకొటారు పార్వతమ్మగారూ."

"స్టీలుగిన్నెలు" అందామె.

తమలో తాము చర్చించుకోవటం పూర్తయ్యాక జనార్ధన్ మైక్ముందుకొచ్చాడు.

"నా ప్రియమైన తెలుగు ప్రజలారా!" అన్నాడు సినిమాఫక్కిలో! "మీకో విషయం చెప్పడం మర్చిపోయాను" జనార్ధన్ ఇటీవల కొంచెంఎన్టీఆర్ని అనుకరిస్తూ మాట్లాడడం. హావభావాలు ప్రదర్శించటం చేస్తూన్నాడు. అతనలా చేయడానికి కారణంఏమిటంటే-ఎన్టీఆర్ఎలాగూ సినిమా ఫీల్డు వదిలేశాడుకాబట్టి అస్థానం అలా ఖాళీగానేఉందికాబట్టి సినిమాల్లో ఎన్టీఆర్ వేసేహీరో పాత్రలు తనకులభించే అవకాశంఉంటుందని ఎవరోచెప్పారుట.

"ముక్కుపచ్చలారని చిన్నారిముద్దుబిడ్డలారా? తెలుగింటి వెలుగులు నా ప్రియమయిన ఆడపడుచులారా!" ఆమాటలతో ఆడాళ్ళందరూ తప్పట్లుకొట్టారు.

మాకు మతిపోయినట్లయింది. ఒకేఒక్కడైలాగ్తో మాకాలనీ ఆడాళ్ళందరి అభిమానం సంపాదించాడే అని.

"నేను మన కాలనీ ప్రెసిడెంటు అయిన దగ్గర్నుంచీ అనుక్షణం, క్షణంక్షణం, ప్రతిక్షణం-మీకేంసేవ చేయగలనా అని ఆలోచనలు పునఃరాలోచనలుచేస్తున్నాను. ఇన్నాల్టికి ఇప్పుడా అవకాశం లభించింది!"

"మళ్ళీ ఆడాళ్ళందరూ తప్పట్లు కొట్టారు."

"ఈ బడ్జెట్‌లో పెరిగేధరలు సాధారణంగా మనలాంటి మధ్యతరగతి ఫామిలీస్ అందరికీ శాపం! కానీ ఈ శాపాన్నివరంగా మార్చుకునేందుకు నేనుసహాయం చేస్తాను. ఢిల్లీలో ఫైనాన్స్ మినిస్ట్రీ బడ్జెట్‌సెల్‌లో మా పిన్నికొడుకు పనిచేస్తున్న విషయం మీకెవరికీ బహుశ తెలిసుండదు. నిన్నటి వరకూ నాకూ తెలీదనుకోండి. అది వేరే విషయం. వాడితో ఫోన్లో మాట్లాడాను. బడ్జెట్‌ప్రెజెంట్ చేయడానికి ఓరోజుముందు, అంటే శుక్రవారం సాయంత్రం మనకు ఏమేం వస్తువుల ధరలు పెరగనున్నదీ రహస్యంగా ఫోన్‌లో ఇన్ ఫర్మేషన్ అందిస్తానని ప్రామిస్ చేశాడు. మనకా ఇన్‌ఫర్మేషన్ అందగానే మనమంతా ఆ వస్తువులు మనఆర్థికశక్తికొద్దీ కొని స్టాక్ చేసి పారేస్తే-మనమూ వాడుకోవచ్చు- ఇంకాలాభానికీ బయట అమ్ముకోవచ్చుకూడా-"

అందరూ తప్పట్లు కొట్టారు. ఈసారి మగాళ్ళందరూ కూడా తప్పట్లు కొట్టడం నాకు ఆశ్చర్యం కలిగించింది. శుక్రవారం వరకూ కాలనీ వాళ్ళందరూ చాలా హడావుడిగా రోజులు గడిపారు. చాలా మంది బ్యాంకుల్లో దాచుకున్నడబ్బంతా విత్‌డ్రాచేసి రడీగా పెట్టుకున్నారు. బ్యాంక్ బాలెన్స్ లేనివాళ్ళు నగలు బాంకులోపెట్టి డబ్బు తీసు కున్నారు.

ఇంకొందమంది బంధువుల నుండి అప్పులు తీసుకున్నారు.

శుక్రవారం సాయంత్రం వచ్చేసింది.

గోపాల్రావ్, శాయిరామ్, రంగారెడ్డి, యాదగిరీ,నేనూ, జనార్ధన్ కలసి మాకు తెలిసిన ఓఫోన్ ఓనర్ఇంటికెళ్ళి కూర్చున్నాము.

సాయంత్రం ఏడుగంటలతరువాత ఢిల్లీనుంచీ ఫోన్‌వచ్చింది జనార్ధన్ ఫోన్ అందుకున్నాడు. ఓచేతిలోపెన్నూ మరోచేతిలో అప్పుడే కొత్తగా కొన్ననోట్‌పుస్తకం పట్టుక్కూర్చున్నాడు గోపాల్రావ్.

"రాసుకో" అన్నాడు జనార్ధన్ హడావుడిగా, "టూత్‌పేస్టులు"!-గోపాల్రావ్ చకచక రాసేశాడు.

"నెక్స్ట్-టేబుల్ ఫాన్లు-అతరువాత సబ్బులు- వనస్పతి-"అయిదు నిమిషాల పాటులిస్ట్ చదివాడు.

అందరం ఆలోచనలో పడ్డాం

అప్పటికప్పుడు లిస్ట్ కాపీలు తయారయాయ్.

"ఇంక ఆలస్యం ఎందుకు పదండి-" అన్నాడు శాయిరామ్. అందరం వెటనే మార్కెట్‌కి పరుగెత్తాం నేనుమాత్రం వీలయినంత టూత్‌పేస్ట్‌స్టాక్ మాఇంట్లో నింపేయాలని నిర్ణయించు కున్నాను.

ఆ రాత్రి పదిగంటలవరకూ మా కాలనీలోకి రిక్షాల్లో రకరకాల వస్తువులు చేరుతూనే ఉన్నాయ్. మిగతా రాత్రి కూడా ఎవ్వరికీ నిద్ర పటినట్లులేదు. అందరిళ్ళల్లోనుంచీ చాలా ఎగ్జయిటింగ్‌గా మాటలు వినబడుతూనేఉన్నాయ్.

తెల్లారిపోయింది. అందరం ఆఫీస్‌కి శెలవుపెట్టి మధ్యాహ్నంనుంచీ రేడియోదగ్గరే కూర్చున్నాం.

సాయంత్రమయేసరికి బడ్జెట్ వివరాలు ఒక్కటొక్కటే బయటకొస్తుంటే అందరి గుండెల్లోనూ ఆందోళన మొదలయింది.

జనార్ధన్‌కి ఫోన్‌లోవచ్చిన లిస్ట్‌లోని వస్తువుల ధరలేమాత్రం పెరగలేదు. అందరి మొఖాలూ పాలిపోయాయ్! కొంతమంది ఆడంగులు గట్టిగా ఎవర్నోతిట్టడం, శాపనార్థాలు పెట్టటం స్పష్టంగా వినిపిస్తూనే ఉంది.

మా ఆవిడ దిగులుగా వచ్చింది టి.వి. దగ్గర్నుంచీ!

"ఇప్పుడా రెండువేలరూపాయల టూత్‌పేస్ట్ ఏమిటిచేయటం?" అంది గాబరాగా.

అప్పుడే జనార్ధన్ భార్యవచ్చింది మాఇంటికి.

"వాళ్ళ పిన్నికొడుకు మాటలు నమ్మవద్దని మొత్తుకుంటూనే ఉన్నాను. అక్కయ్యగారు! వింటేనా? ఇరవై టేబుల్ ఫాన్లు కొనుక్కొచ్చి ఇంట్లోపడేశారు. ఓగదంతా నిండిపోయాయవి. ఇల్లుఇరుకయింది. ఇప్పుడా ఫాన్లు ఏంచేయాలి?" ఏడుపు ఆపుకుంటూ అందామె.

మరికాసేపటికి యాదగిరి వచ్చాడు.

"క్యా పరేషానీ హైయారో! జనార్ధనన్న భరోసామీదికెళ్ళి సబ్బులుకొనిపెట్టినా! నా భార్యేంచేసిందో ఇన్నావు? నీయవ్వ-నాకెరుక లేకుండా చింతపండు వందకిలోలు తెచ్చి స్టాక్ పెట్టింది! బడ్జెట్‌లో చింతపండుధర ఏడయినాపెరుగుతాదివయ్యా?"

ఆ రాత్రికల్లా మరెన్నో ఆసక్తికరమైన వివరాలందాయ్. చాలామందికాలనీఆడాళ్ళు కాలనీలోచెలరేగినపుకార్లునమ్మి గాజులు, పౌడర్లు, స్నోలు,బొట్టుబిళ్ళలు, కొంతమంది కూరగాయలు కూడా కొనేసి స్టాక్‌పెట్టారుట.

జనార్ధన్ ఎవరికీకనిపించలేదు. ఎంతోమంది అతనింటికి వెళ్ళినా ఇంట్లోకనిపించలేదుట! ఎక్కడికెళ్ళాడో ఎవరికీ తెలీదన్నారు. మిగతా రాత్రంతా కూడా ఇంట్లో స్టాక్ ఏం చేసుకోవాలో తెలీక దిగులుతో ఎవ్వరూ నిద్రపోలేదు.

మర్నాడు ఉదయం శాయీరామ్ పరుగుతోవచ్చాడు.

"చూశావా గురూ! ఉప్పు ధర తెగపెరిగిపోయింది! మనం అదయినా స్టాక్‌పెట్టి ఉంటే ఎంతబావుండేది?" అన్నాడు విచారంగా.

"ఉప్పు ధర పెరుగుతుందని ఎవరనుకున్నారు?" అన్నాన్నేను విరక్తిగా!

"మనంకొన్నస్టాక్ నంతా సాయింత్రం తీసుకెళ్ళి మళ్ళీషాపులవాళ్ళకిస్తే తీసుకుంటా రేమో!" అన్నాడు రంగారెడ్డి.

సాయింత్రం అందరం బయల్దేరి మార్కెట్ చేరుకున్నాం.

మా కథంతా వినిషాపువాడు నవ్వాడు.

"ఏం ఫర్లేదుసార్! స్టాకంతా తీసుకొచ్చేయండి! సగంధర ఇచ్చేస్తాను-" అన్నాడు. శాయిరామ్ అదిరిపోయాడు.

"సగం ధరకా?"

"అవున్సార్! ఎంతోకాలంనుంచి తెలిసినవారు కదా! అందుకని మీకు సగంధర ఇచ్చేస్తాను."

"అంటే మిగతావాళ్ళకు అదికూడా ఇవ్వవా?"

"మిగతావాళ్ళ దగ్గర అసలు కొననుగద్సార్?"

"కానీ మరీసగంధర అంటే మాకు సగంనష్టంరాదూ?"

"బిజినెస్ అన్నాక అంతే సార్! ఒకోసారి ఇలాగే నష్టం వస్తూంటుంది!" జాలిగా అన్నాడు.

"కాని మాది,మాది... బిజినెస్ కాదు కదా..."

"నష్టం వచ్చింది కాబట్టి ఇలా అంటున్నారు గురూజీ! ఇదే బడ్జెట్‌లో ఆవస్తువుధర ఒకోదానిమీద రూపాయిపెరిగిందనుకోండి! మీరుబిజినెస్‌చేయరూ?"

అందరం ఇళ్ళకు తిరిగివచ్చాం!

అర్జంటుగా అప్పటికప్పుడే కాలనీమీటింగ్ ఏర్పాటుచేశాడు శాయిరామ్. ఆడామొగా అందరం వాడి పోయిన మొఖాలతో కూర్చున్నాం.

"సోదర సోదరీ మణులారా! అనుకోకుండా అందరందెబ్బతిన్నాం! ఇప్పుడీ భయంకర పరిస్థితినుంచి ఎలా బయటపడాలా అనే విషయం ఆలోచించాలి మనం-" అన్నాడు రంగారెడ్డి. "నష్టానికి అమ్మేద్దాం!" అన్నాడు గోపాల్రావ్. అందరూ 'వద్దు' అనికేక వేశారు.

"ఆ జనార్ధన్ పనిపడతాను! మా ఇల్లంతా సర్వనాశనం చేశాడు-" అన్నాడు వెంకట్రావ్ కోపంగా.

"ఎందుకు? ఏంజరిగింది?" అడిగాడు శాయిరామ్.

"నేను రెండూ క్వింటాళ్ళు వంకాయలు కొన్నాను-"

మానిసార్‌గాడు జనంలోంచి మైక్‌దగ్గరకొచ్చాడు.

"మీక్కావాలీ-తో-నేను ఒక్క అయిడియా చెప్తుయ్!" అన్నాడు చిరునవ్వుతో

"చెప్పరా నాయినా! త్వరగా అఘోరించు" అరచాడు రంగారెడ్డి.

"బార్టర్‌సిస్టమ్ మంచిగ ఉంటాయ్! బార్టర్ సిస్టమ్ బోలేతోమీకీ నమజ్ అవుతున్నాయ్?

మాకు అర్థమయింది. డబ్బు చలామణీలేనికాలంలో వాడేవాళ్ళది.

వస్తువు బదులు వస్తువు మార్చుకోవటం-

"ఒండర్‌ఫుల్ అయిడియా-" అన్నాడు యాదగిరి.

అందరం నిసార్‌ని కౌగిలించుకున్నాం!

"ఇంతమంచి అయిడియా నీకెట్లా వచ్చిందన్నా?" అడిగాడు యాదగిరి.

"నేను వెయ్యిరూపాయల్ బ్రెడ్‌స్టాక్ ఇంట్లోపెట్టినయ్! అదిచూస్తే అయిడియా వచ్చినయ్."

అప్పటికప్పుడే బార్టర్‌సిస్టమ్ అమలుపరచటం ప్రారంభమయింది.

నా దగ్గరున్న టూత్‌పేస్ట్‌లు కాలనీలోఅందరికీ తలకొన్నీ అంటగట్టేశాను. మహా అయితే రెండొందలు నష్టంవచ్చి ఉంటుందంతే.

అలాగే శాయిరామ్ కాఫీపొడిపాకెట్లు అందరికీపంచాడు. నిసార్‌గాడిదగ్గరున్న బ్రెడ్‌స్టాక్ అందరంపంచుకున్నాం. వెంకట్రావ్ కొన్న వంకాయలు ఆ రాత్రే అందరూ చచ్చినట్లు, సయించకపోయినా వండుకుతిన్నారు. పనిలోపనిఅని యాదగిరిభార్య చింతపండు అందరకూ పంచేసింది. ఎటొచ్చీ గొడవంతా ఎక్కడొచ్చిందంటే డిటెక్టివ్ రచయిత్రి రాజేశ్వరి దగ్గర.

ఆమె న్యూస్‌ప్రింట్ ధర పెరుగుతుందన్న నమ్మకంతో బోలెడు న్యూస్‌ప్రింట్‌కొని పెట్టేసింది. అది ఎవ్వరూ పంచుకోవడానికి ఇష్టపడలేదు.

"అసలు అపాడు న్యూస్ ప్రింట్ ఎందుకు కొన్నట్లు?" చిరాగ్గా అడిగాడు రంగారెడ్డి.

"ధరలుపెరిగితే పబ్లిషర్లంతా న్యూస్‌ప్రింట్‌కోసం 'క్యూ'కట్టి నేనడిగినరేటిచ్చి కొనుక్కెళ్ళుతారని అనుకున్నాను..." అందామె కన్నీళ్ళతో.

"అయినా అంత ఆశ ఉండకూడదు మరీనూ?" అన్నాడు గోపాల్రావ్.

"నేను డబ్బుకోసం ఆశపడలేదు. న్యూస్‌ప్రింట్ మామూలు ధరకే ఇచ్చి, అందుకు ప్రతిఫలంగా నా డిటెక్టివ్ నవలలు పబ్లిష్ చేయమని కోరదామనుకున్నాను-" అందామె అసలు విషయం బయటపెడుతూ. చివరకు శాయిరామ్ ఓ అయిడియా ఇచ్చాడు.

"ఎలాగూ ప్రతితెలుగు కుటుంబంలో ఓ కథారచయిత(త్రి)గానీ, గేయరచయిత(త్రి) గానీ, నవలా రచయిత(త్రి)గానీ, కార్టునిస్ట్‌గానీ ఉండక తప్పదుకదా. కనుక ఎవరి రచనలు వాళ్ళు రాజేశ్వరి న్యూస్‌ప్రింట్ కొనుక్కుని అచ్చువేసుకుంటే పదికాలాలపాటు వాళ్ళరచనలు నిలచిపోతాయ్

"ఆ మాట చెప్పాడో లేదో రాజేశ్వరి న్యూస్ ప్రింట్ అంతా ఖర్చయిపోయింది.

బార్టర్‌సిస్టమ్ అమలుచేయటంవల్ల కాలనీలో కొన్ని ఇబ్బందులుకూడా ఎదురయ్యాయ్.

ఆ పద్ధతి ద్వారా నేను కొనాల్సివచ్చిన-సిగరెట్లు, బీడీలు-అలవాటు లేకపోయినాతాగక తప్పటంలేదు.

అలాగే శాయిరామ్ అందరికీ తలోబాటిల్ విస్కీఇచ్చాడు. అది మగవాళ్ళకు బాగానేఉంది. అయితే చాలామందిఆడాళ్ళు దాన్నివెంటనే పారబోసేశారని తెలిసింది.

జనార్ధన్‌ఒక్కడికే చాలాఎక్కువనష్టం వచ్చింది కాలనీమొత్తంలో.

టేబుల్ ఫాన్లన్నీ అలాగే ఉండిపోయాయ్ ఎవ్వరూ తీసుకొలేదు.

మర్నాడు మా ఆవిడ కూరగాయలమ్మాయి దగ్గర తోటకూర కొంటూటే కట్టఒక్కటీ పావలా అనటం వినిపించిందినాకు.

"అదేమిటి?-నిన్నేగా పావలాకి నాలుగుకట్టలిచ్చావ్!" అడిగిందామె ఆశ్చర్యంగా.

"బడిజెట్టంటమ్మా-అదేందోనాకెరుకలేదుగానీ-ధరలు పెరిగినయ్యంట"

బడ్జెట్‌కీ తోటకూరకూ సంబంధం ఏమిటోనాకర్థంకాలేదు.

నేను ఇంకుబాటిల్ కొందామని మాకాలనీ దగ్గర్లోనే ఉన్న షాపు కెళ్ళాను,

"ఆర్రూపాయలుసార్." అన్నాడు షాపతను చిరునవ్వుతో ఇంక్ బాటిల్ ఇస్తూ.

"అదేమిటి? మొన్నటివరకూ నాలుగు రూపాయలేగా?"

"బడ్జెట్ కద్సార్. ధరపెరిగింది"

"కానిబడ్జెట్‌లో 'ఇంక్' ధర పెరగలేదుగా?"

"బడ్జెట్ఎఫెక్ట్‌కి కొన్ని ధరలు పెరుగుతాయ్."

"ఎఫెక్ట్ అంటే?"

"డిఫెక్ట్ సార్-మీకు తెలీదా?"

తెలీదంటే బావుండదని ఇంటి కొచ్చేశాను. ఆపక్కనే హోటల్ అసామీ గట్టిగా అరుస్తున్నాడు "బడ్జెట్ గురించి పెరిగినాయివయ్యా రేట్లు-రేట్లు ఎందుకు పెరిగినాయంటే ఏమన్నమాట?"

అప్పుడే మా కాలనీ ముందు జనార్ధన్ రిక్షాదిగాడు. అతనితో పాటు ఓ మీసాలపెద్దమనిషి కూడా వచ్చాడు-

"నా దగ్గరున్న ఫాన్లు ఈయనకొంటానన్నారు గురూ! అందుకని తీసుకొచ్చాను-" అన్నాడు

నేనూ, రంగారెడ్డి, యాదగిరి కలిసి జనార్ధన్ ఇంటికెళ్ళాం.

ఆ పెద్దమనిషి ఫాన్లన్నీ చూశాడు.

"ఎంతకమ్ముతావ్?" అనడిగాడు మీసాలు దువ్వుకుంటూ.

"నేను ఒకోటీ నాలుగొందలకు కొన్నాను. మీరు మూడొందల పాతిక ఇస్తే చాలు" అన్నాడు జనార్ధన్ దీనంగా.

మీసాలపెద్దమనిషి గట్టిగా నవ్వాడు, తన జేబులోనుంచి అయిడెంటిటీ కార్డ్ తీసిచూపిస్తూ "మిమ్మల్ని అరెస్ట్ చేస్తున్నాను-" అన్నాడు జనార్ధన్ భుజంతడుతూ

అందరం అదిరిపడ్డాం! అతను మఫ్టీలో ఉన్న పోలీస్ ఇన్‌స్పెక్టర్.

"ఆ! అరెస్టెందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు జనార్ధన్.

"ఎందుకేమిటి? బడ్జెట్ ముందురోజు ప్రజావసర వస్తువులను ఎక్కువధరకు అమ్ముకోవడంకోసం స్టాక్ చేసినందుకు! దీనినే 'హోర్డింగ్' అంటారు" అన్నాడతను.

"కానీ...కానీ... ఇరవై ఫాన్లు కొన్నంత మాత్రాన హోర్డింగ్ ఎలా అవుతుంది?" అడిగాడు శాయీరామ్.

"అవునండీ! రేపు బడ్జెట్ అనగా పెట్రోల్‌బంక్‌వాళ్ళు పెట్రోల్‌అమ్మకాలు ఆపేయటం, టీవి, రేడియో,ఇంకా ఇతర పెద్దపెద్ద కంపెనీలవాళ్ళు తమ స్టాక్‌ని రిలీజ్ చేయకపోవటం-ఇవన్నీ హోర్డింగ్ కాదా?" ఆవేశంగా అడిగాడు రంగారెడ్డి.

"వాళ్ళు కోటీశ్వరులు కాబట్టి వాళ్ళ జోలికెళ్ళటానికి మీకు దమ్ముల్లేవు" అన్నాడు గోపాల్రావ్.

ఇన్‌స్పెక్టర్ మళ్ళీమీసాలుదువ్వుకుంటూ చిరునవ్వునవ్వాడు.

"ఆ చిన్నపిల్లల ప్రశ్నలన్నీ రేపుకోర్టులో జడ్జిగారి నడగండి!"

చివరకు అందరం ఇన్‌స్పెక్టర్‌ని బ్రతిమాలక తప్పలేదు.

"బాబ్బాబు! ఈ పాతికరూపాయలుంచుకోండి! మావాడిని వదిలేయండి" అన్నాడు శాయీరామ్. ఇన్‌స్పెక్టర్ మళ్ళీ మీసాలు దువ్వుకున్నాడు.

"పాతికా? అహ్హహ్హ-వెధవరాంగ్ సైడ్ పార్కింగ్‌కేస్ పట్టుకుంటేచాలు యాభయ్ దొరుకుతుంది. ఇంత పెద్దకేస్‌కి పాతికా?"

"పోనీ యాభయ్ తీసుకొండి."

"అహ్హాహ్హా-సినిమాహాల్లో సిగరెట్ తాగినకేసుకే డెబ్బయ్ ఇస్తారు-ఇంతపెద్దకేసుకి యాభయ్యా?"

"బాబ్బాబు-పిల్లలు, ఫాన్లుగలవాడు. వాడిని దయచూడండి. ఓ వందతీసుకుని వదిలేయండి-"

"ఇదే కేసుకి నిన్నయితే వందేతీసుకునేవాడినయ్యా-ఇవాళ కూడా వందే ఇస్తానంటే ఎలా? నూటయాభై ఇవ్వండి."

"అదేమీటి?నిన్నటికీ ఇవాల్టికీ యాభయ్‌పెంచారా?"

"అవ్వునయ్యా-బడ్జెట్ వచ్చింది కదా, మామూళ్ళధరలుకూడా పెంచారు అంటే బడ్జెట్‌లో అనికాదు-బడ్జెట్ ఎఫెక్ట్ అంటారు దీనిని..."

"ఎఫెక్ట్ అంటే?..."అని అడగబోయి "తెలుసులెండి డిఫెక్ట్" అన్నాను. నేను కేసుమాఫీ అయిపోయింది.

"బడ్జెట్‌లో మామూళ్ళకు కూడా రేట్లు ఫిక్స్ చేస్తారా?" అడిగాడు శాయిరామ్

"అయినా ఈ బడ్జెట్‌లో మామూళ్ళ ప్రసక్తేలేదే-" అన్నాడు జనార్ధన్. ✷



# పోలీస్ స్టేషన్



మానిర్భయ్‌నగర్ కాలనీ-హైద్రరాబాదులోని మిగతా కాలనీలతో పోల్చిచూస్తే చాలా ప్రశాంతకరమయిన కాలనీగా భావించవచ్చు. (శాయీరామ్, జనార్ధన్, రంగారెడ్డి, మాకాలనీలోనే ఉంటున్నప్పటికీ కూడా) అయితే ఉండుండి ఓదొంగలముఠా ఏదోక ఇంటిని దోచుకోవటం (మేము రాజీకుదుర్చుకున్న పెద్దముఠాకాదు) వెంటనే పోలీసులువచ్చి మమ్మల్నందరినీ పోలీస్‌స్టేషన్‌కి తీసుకుపోయి నానాప్రశ్నలూ వేయటం, ఇవి మాత్రం తప్పటంలేదు. అదీగాక ఆమధ్య మరోగొడవయింది. మాకాలనీ కల్చరల్ సెక్రటరీ పార్వతీదేవి ఓసారి ఆటోలో కాలనీకొచ్చింది. మీటర్ చార్జి నలభై రూపాయలు అయింది. పైన ఇంకోరూపాయి ఇవ్వాలని వాడు పేచ్చీపెట్టాడు దాంతోమేమంతా రంగంలోకిదిగాల్సి వచ్చింది. వాడిని పోలీస్‌స్టేషన్‌కు లాక్కెళ్ళాలని అనుకున్నాంగానీ అంతదూరం వెళ్ళటానికి బద్ధకం

వేసింది. దానిబదులు వాడికిరూపాయలు ఇవ్వటమే తేలికయిన పద్ధతని గ్రహించి- వాడిని వదిలించుకున్నాము.

ఇలాంటివే మరిన్ని చెదురుమదురు సంఘటనలు జరిగాక మాకాలనీకొక పోలీస్‌స్టేషన్ ఉండటం ఎంతో అవసరమన్న అభిప్రాయానికొచ్చాము. ఇలా అభిప్రాయానికొచ్చామో లేదో- దొరికిందే చాన్స్ అని ఆ ఆదివారంనాటికల్లా కాలనీమీటింగ్ ఏర్పాటుచేసేశాడు శాయిరామ్. నేను మీటింగ్ చేరుకునేసరికే ఉధృతంగా కొనసాగుతోందది. శాయిరామ్ ఆవేశంగా మాట్లాడుతున్నాడు. "మనకాలనీలో తక్కువ జనాభా ఏంలేదు, రెండు పోలీస్‌స్టేషన్లు ఏర్పాటు చేయదగినంత జనాభా ఉంది. కనుక ఒకటయినా వెంటనే నెలకొల్పాలని మనం ఇప్పుడే హోమ్‌శాఖామంత్రిగారిని కోరాలి. పోలీస్‌స్టేషనుంటే మనకెన్నోవిధాల సౌకర్యంకలుగుతుంది. మనకాలనీ చుట్టుప్రక్కల దుకాణాలవాళ్ళు తూకాల్లోమోసంచేస్తే మనంవెంటనే పోలీస్‌ని పిల్వొచ్చు. ఆటోవాళ్ళుమీటర్‌మీద ఎక్స్ట్రాఇమ్మని పేచీలుపెట్టరు. రౌడీలు తాగి కాలనీలోకి రారు. దొంగలభయం అసలే ఉండదు-"

"అవును- అవును" అంటూ తప్పట్లు కొట్టారందరూ.

"రెండేళ్ళ క్రితం నేను మార్నింగ్‌వాక్ కెళ్ళేప్పుడు ఒకడు నామెడలోగొలుసు తెంచుకుపోయాడు. పోలీస్‌స్టేషన్ దగ్గర్లో ఉంటే వెంటనే వాడిని పట్టించేదాననికదా-" అంది పార్వతమ్మ.

"కాలనీవెనక ఉన్న 'ఇందిరానగర్' లో మాట్లాడితే ప్రొద్దుట్నుంచీ సాయంత్రంవరకూ, వరుసగా స్పీకర్‌లో తెలుగు సినిమా తాలూకూ బూతుపాటలు వేయకుండా పోలీస్‌కి కంప్లెయింట్ ఇవ్వవచ్చు-" అంది రాజేశ్వరి.

అప్పటికప్పుడే అందరంకలసి హోమ్‌మినిష్టర్ గారికో అర్జీ తయారుచేశాం-మర్నాడు అందరం శెలవు పెట్టి ఓ చిన్నసైజు ఊరేగింపుగా బయల్దేరి హోమ్‌మినిష్టర్‌గారి దగ్గరకెళ్ళాం! మా కాలనీపేరు చూడగానే-వెంటనే-బయటికొచ్చిమమ్మల్ని కలుసుకున్నారాయన.

"మీ కాలనీ గురించి న్యూస్‌పేపర్స్‌లో చదివాను. దొంగలనందరినీ మీకాలనీకి ఆహ్వానించి వాళ్ళతో రాజీకుదుర్చుకున్నది మీరే కదూ?" అడిగారాయన.

"అవును సార్ మేమే!" అన్నాడు రంగారెడ్డి గర్వంగా.

"చాలాసంతోషం! ఇలా ప్రజలే సమస్యల్ని పరిష్కరించుకుంటే ప్రభుత్వంఎంతో సంతోషిస్తుంది. దేశమంతా కూడా మీకాలనీని ఆదర్శంగా తీసుకోవాల్సిన అవసరం ఎంతయినా ఉంది-ఇంతకూ ఇప్పుడు ఏం పనిమీద వచ్చారు?" ఎంతో అభిమానంతో అడిగారు.

"అదేసార్-మాకాలనీ సిటీకి బయటుంది. అందుకని మాఏరియాలో ఓ పోలీస్‌స్టేషన్ ఏర్పాటుచేస్తే-"

ఆయన వెంటనే తన శెక్రటరీవేపు తిరిగాడు.

"అదేంటోయ్ శెక్రటరీ! ప్రజలు రైల్వేస్టేషన్ కావాలని అడుగుతారు, లేదా రేడియోస్టేషన్, బస్‌స్టేషన్, ఫైర్‌స్టేషన్ అలాంటివి అడగటం గురించి విన్నాం కానీ ఇలా పోలీస్‌స్టేషన్ కావాలని అడగటం వినలేదే?"

"అవున్సార్! ఇలాంటి వింత కోరిక కోరటం నేనూ ఇదే మొదటిసారి చూస్తున్నాసార్!"

"పోనీ ఇంకెవరికయినా పోలీస్‌స్టేషన్లు ఏర్పాటు చేస్తామని మనం హామీలిచ్చామా?"

"లేద్సార్! అసలు 'పోలీస్‌స్టేషన్' కావాలి అని అడిగినవారెవ్వరూ ఇంతవరకూ లేరు సార్! వీళ్ళే మొట్టమొదటి సారిగా అడుగుతున్నారు-"

ఆయన ఆశ్చర్యపోయారు.

"నిజమే! ప్రజలు పోలీస్‌స్టేషన్లు కావాలని ఎందుకడగరసలు? స్కూళ్ళు కావాలనీ, ఆస్పత్రులు కావాలనీ, ఫ్యాక్టరీలు కావాలనీ-ఇలా ఎన్నో కావాలని అడుగుతారు గాని"

"అదే నాకూ అర్థం కావటం లేద్సార్-"

"సరే! మీ నిర్భయ్‌నగర్ కాలనీకి వెంటనే పోలీస్‌స్టేషన్ ఇస్తాను-" అన్నారు మినిష్టర్ గారు.

అందరం తప్పట్లు కొట్టాం.

"హోమ్ మినిష్టర్‌గారికీ-" అని అరచాడు శాయిరామ్.

"జై" అరచాము అందరం. ఇది జరిగిన వారం రోజులకే మాకాలనీ చివర ఉన్న ఓఇంట్లో ఒకొత్తపోలీస్‌స్టేషన్‌కి ప్రారంభోత్సవం జరిగింది. ఆ మీటింగ్‌కి కాలనీ వారందరం హాజరయ్యాం. కాలనీ శెక్రట్రి హోదాలో రంగారెడ్డి కూడా వేదిక మీద కూర్చున్నాడు.

పోలీస్ అధికారి ఒకరు పోలీస్‌స్టేషన్ గురించి, తను సబ్‌ఇన్‌స్పెక్టర్‌గా ఉన్నరోజుల్లో-పద్దెనిమిది గంటల్లో-ఓ హంతకుడిని పట్టుకొన్న కేస్ గురించీ గంటన్నరసేపు వర్ణించాడు.

ఆ తరువాత రంగారెడ్డి మాట్లాడాడు.

"ఈ ఉత్సవానికి విచ్చేసిన గౌరవనీయులయిన కాలనీవారికీ మరియు పోలీసు అధికారులకూ మా స్వాగతం! ఇవ్వాళ మన కాలనీకి నిజంగా పర్వదినం, ఎందుకంటే ఇవాళ మన కాలనీలో మన కోసం ప్రత్యేకంగా ఒకపోలీస్‌స్టేషన్ ప్రారంభించారు గనుక! అసలుపోలీస్‌లంటే ఎవరు? మన స్నేహితులు! ఎన్నో విధాల మనకు సహాయం చేసేవారు. ఇంగ్లీష్ పిక్చర్స్‌లో పోలీసులు ప్రజలకు ఎన్నో విధాలుగా సహాయపడటం మనందరం చూస్తూనే ఉంటాం! అదేదో ఇంగ్లీష్ పిక్చర్లో- ఆసినిమా పేరు నాకు గుర్తురావటంలేదు-ఒక పోలీస్, ఒక సామన్య పౌరుడితో ఎంతో మర్యాదగా మాట్లాడే సీన్-నన్నెంతో కదిలించివేసింది-"

జనార్ధన్ ఠక్కున లేచాడు మా మధ్యలో నుంచి.

"ఆ సినిమాపేరు హెల్ రైడర్స్-" అంటూ గుర్తు చేశాడు.

"కరెక్ట్! హెల్ రైడర్స్-అందులో ఆపోలీస్-పోలీస్ అయుండికూడా ఒకసామాన్య పౌరుడితో ఎలాంటితిట్లూ, అమర్యాదాలేకుండా రెండునిమిషాలు మాట్లాడతాడు. అంతేకాదు. ఆపౌరుడి జేబులో డబ్బు ఉన్నట్లుతెలిసినా-ఒకపైనకూడాతీసుకోడు-" అందరూ తప్పట్లుకొట్టారు.

"కనుక సోదరులారా!-ఇంగ్లీష్ పిక్చర్స్‌లో పోలీసులు ఇంతఉదాత్తంగాకూడా ప్రవర్తిస్తూంటారు-కనుక మనం కూడా-"

"ఇంకచాలు-" వెనుకనుంచి మాకాలనీ స్టూడెంట్ ఎవరోఅరిచారు.

"కనుక మనంకోరగానే ఈ పోలీస్‌స్టేషన్ ఏర్పాటుచేసిన హోంమంత్రిగారికీ, పోలీస్ అధికారులకూ నాకృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను-" అంటూ వేదిక దిగాడతను.

ఆతరువాత కాలనీ కమిటీ ఏర్పాటు చేసిన తేనీటి విందు జరిగింది. కొత్త పోలీస్‌స్టేషన్ తాలూకూ ఇన్‌స్పెక్టర్ మా అందరినీ ఆప్యాయంగా పలుకరిస్తూ ఎవరికెలాంటి ఇబ్బంది కలిగినా తను సహాయం చేయడానికి సిద్ధంగా ఉంటానని హామీఇచ్చాడు. అందరితోనూ కరచాలనం చేశాడు. "మేము మీ సేవకులం" అన్నాడు చిరునవ్వుతో. అందరం అంతమంచి ఇన్‌స్పెక్టర్ దొరికినందుకు ఆనందించాం.

ఆ మర్నాడు సాయంత్రం మేము ఆఫీస్ నుంచి కాలనీకి చేరుకునేసరికి కాలనీఅంతా బోసిపోయినట్లు కనిపించింది. సాయంత్రమయేసరికి కాలనీ మధ్యలోచేరి 'ముచ్చట్లు' చెప్పుకునే ఆడాళ్ళెవరూ మాకు కనిపించలేదు.

"చాలా ఆశ్చర్యంగా ఉందే! వర్షంపడుతున్నాకూడా లెక్కచేయకుండా ఇక్కడ సమావేశమయి ఏవేవో విషయాలు మాట్లాడుకుంటూండే వాళ్ళుకదా?" అన్నాడు శాయీరామ్.

అందరం దగ్గర్లో ఉన్న మా ఇంటికెళ్ళాం.

"ఇవ్వాళ మీ లేడీస్ సమావేశం లేదేమిటి?" ఆశ్చర్యంగా మా ఆవిడనడిగాము.

"భలేవారే! చదవేస్తే ఉన్నమతి కూడా పోయిందట! ఓ పోలీస్‌స్టేషన్ ఉండగా-ఆడవాళ్ళను ఇళ్ళల్లో నుంచి బయటకు రమ్మంటారా?" అందామె చిరుకోపంతో. మేమంతా మొఖాలు చూచుకొన్నాం.

"అదేమిటి-మనకాలనీకి 'రక్షణ' కోసమేగా మనం పోలీస్‌స్టేషన్ అడిగింది!" అన్నాడు జనార్ధన్ ఆశ్చర్యంగా!

"చాల్లెండి! రమీజాబీ కేస్ సంగతి మర్చిపోయామనుకుంటున్నారేమిటి?" అందరం ఉలిక్కిపడ్డాము.

"అవ్! మనం మరచినాం అసంగతి!" అన్నాడు యాదగిరి. అందరి మొఖాల్లోనూ కొద్దిక్షణాలపాటు అశాంతి తాండవంచేసింది.

"అప్పటిపోలీసులు వేరు-ఇప్పటిపోలీసులువేరు" అన్నాడు శాయిరామ్ పోలీస్ డిపార్టుమెంట్ని సమర్థిస్తూ.

"మొన్న పాపం ఆ ఇన్స్పెక్టరూ, కానిస్టేబులూ, ఎంతచక్కగా, మర్యాదగా అభిమానంతో మాట్లాడారు? చాలా మార్పువచ్చింది పోలీసుల్లో!" అన్నాడు రంగారెడ్డి మెచ్చుకోలుగా.

మర్నాడు సాయంత్రం మేము ఆఫీస్ నుంచి వచ్చేసరికి కాలనీ మధ్యలోని కూరగాయల బళ్ళుచుట్టూ ఆడాళ్ళందరూ మూగికనిపించారు. పెద్దెత్తున వాదోపవాదాలు జరుగుతున్నట్లు తెలీడంతో మేమూసరాసరి వాళ్ళదగ్గరకు చేరుకున్నాము.

"మార్కెట్లో టమాటో కిలోరెండ్రూపాయలుంటే నువ్వు అయిదు రూపాయల కమ్ముతున్నావా? కిలోకి ఓ రూపాయి ఎక్కువ వేసుకునేవాడివి ఇంతలోనే ఏంరోగంవచ్చింది? ఒక కిలో మీద మూడు రూపాయలు లాభం వేసుకుంటావా?" పార్వతమ్మ గారు గట్టిగా అరుస్తోంది.

"ఇప్పుడూ నాకుమిగిలేది కిలోకిఓరూపాయికంటే ఎక్కువ ఉండదమ్మా" దీనంగా చెప్తున్నాడతను.

వెంటనే శాయిరామ్ కల్పించుకున్నాడు.

"హరికథలు చెప్పకోయ్! కిలోకి మూడురూపాయలు ఎక్కువ వేసుకుని ఒక్కరూపాయి అంటావేం-"

"ఆ రెండ్రూపాయలూ నాదికాదు సార్! పోలీసులకు మామూలుఇవ్వాలి! కొత్త పోలీస్స్టేషన్ పెట్టారు కదా ఈ ఏరియాలో" రంగారెడ్డి ఆశ్చర్యపోయాడు.

"పోలీసులకు మామూళ్ళుఇవ్వాలా మీరు?"

"అవున్సార్! అందులో కొత్తేముంది? పోలీస్స్టేషన్ చుట్టుపక్కల అమ్మకాలు జరిపే వారందరూ లెక్కప్రకారం మామూళ్ళు ఇవ్వాల్సిందే-"

"మీరు ఇవ్వకపోతే ఏమవుతుంది?"

"ఒకటనేమిటి సార్! వాళ్ళు మా బండిని లాక్కోవచ్చు. వేరేకేస్‌లో మమ్మల్ని ఇరికించి నానా ఇబ్బందీ కలిగించవచ్చు-తూకంరాళ్ళు మోసమని లాకప్‌లో పడేయవచ్చు-" అందరం

మొఖాలు చూచుకున్నాం! పోలీస్‌స్టేషన్ కాలనీ పక్కన ఏర్పాటుచేయడంవల్ల అన్నీలాభాలే ఉంటాయనుకున్నాము. కానీ ఇప్పుడు పరోక్షంగా మాపోలీస్‌స్టేషన్‌కి మేమే మామూళ్ళ ఇచ్చుకోవాల్సి వస్తోంది-కూరగాయలకు ధర ఎక్కువచెల్లించడం ద్వారా!

అయితే ఈ విషయంలో మేము చేయగలిగిందేమీ లేకపోవడంవల్ల మౌనం వహించాము.

మరోవారంరోజుల్లో మాకాలనీ చుట్టుపక్కలున్న అన్ని షాపుల్లోనూ, ధరలు కొంచెం కొంచెంగా పెరిగిపోయాయ్. రోడ్డు మీదున్న 'టీ' హోటల్‌వాడు హఠాత్తుగా నీళ్ళ 'టీ'ఇవ్వటం ప్రారంభించాడు.

"ఏం జేయాల్సర్-దినాము 'పుకట్' చాయ్ పోలీస్‌స్టేషన్‌కి ఇయ్యాలి! లేకుంటే ఆళ్ళతో కిరికిరి-" అన్నాడతను శాయిరామ్‌తో.

మరోవారంగడిచేసరికి హఠాత్తుగా మాకాలనీ పక్కనే ఓ చిన్న గుడంబాదుకాణం వెలిసింది. వెంటనే అందరం కలిసి దుకాణం వాడి దగ్గరకెళ్ళాం.

"ఈదుకాణం ఈ డెందుకు పెట్టినావ్?" అడిగాడు యాదగిరి.

"నువ్వెవరు అడగడానికి?" ఎదురు తిరిగాడు వాడు.

"కాలనీ వాడిని! కాలనీ పక్కన గుడంబ దుకాణం ఉండకూడదు! సాయంత్రానికల్లా తీసేయ్? లేకుంటే పోలీస్ కంప్లెయింట్ ఇస్తాం!" బెదిరించాడు గోపాల్రావ్.

వాడు ఘెల్లున నవ్వాడు.

"నీ యవ్వ! గింతేనా! ఇంకేం లొల్లి పెడతారోనని పరేషానయినా! ఇన్‌స్పెక్టర్‌సాబే పర్మిషనిచ్చిండు నాకు!"

అందరం మొఖాలు చూచుకున్నాం మళ్ళీ.

"పదండి-పోలీస్‌స్టేషన్‌కెళ్ళి ఇన్‌స్పెక్టర్‌నే అడుగుదాం!" అన్నాడు శాయిరామ్.

అందరం పోలీస్‌స్టేషన్ కెళ్ళాం.

"గుడ్ మాణింగ్ సర్" అన్నాడు రంగారెడ్డి.

ఇన్‌స్పెక్టర్ 'కంగారూ' అనే జంతువుని చూసినట్లు చూశాడు మమ్మల్ని.

"ఎవరు మీరు?" అడిగాడు కర్కశంగా.

అందరం షాక్ తిన్నాం! మా అందరినీ భుజంతట్టి షేక్‌హాండిచ్చి ప్రేమగామాట్లాడిన మనిషేనాఇతను అన్నఅనుమానం కలిగింది.

"మేమే సార్!" ఈ కాలనీ కమిటీ మెంబర్స్-"

"ఏంగావాల?"

"కాలనీ పక్కనే గుడంబ దుకాణం తెరచారండీ-ఎవరో-"

"అయితే నన్నేం జేయమంటావ్? చల్-బయటకు నడవండ్రి"

"అదిగాద్సార్!"

"ఒక్కసారి చెప్తే సమజ్ కాదా మీకు? బయటకు నడవండ్రి-" గట్టిగాఅరిచాడు

"దిసీజ్ టూమచ్-" అన్నాడు గోపాల్రావ్. "ఇదంతా మా పత్రికలోరాస్తాను రేపే!"

"ఫార్టీత్రి-" పిలిచాడు ఇన్స్పెక్టర్.

"యస్సార్-" ఓ కానిస్టేబుల్ పరుగుతో వచ్చాడు.

"ఇస్ కో అందర్‌కర్‌దో" అన్నాడు గోపాల్రావ్‌ని చూపిస్తూ.

మరుక్షణంలో ఆ కానిస్టేబుల్ గోపాల్రావ్‌నిలాక్కెళ్ళి లాకప్‌లో పడేశాడు.

"మీరందరూ కూడా బయటకి పోతారా-లోపల వేయాల్నా?" మావంక చూసి మళ్ళీ అడిగాడు.

అందరం బయటకొచ్చి నిలబడ్డాము.

"ఇప్పుడేమిటి చేయడం!" అడిగాడు రంగారెడ్డి.

"నేను టీ.వి డ్రామావేసిన ఆర్టిస్టునని చెప్తే వదిలేస్తారేమో-" అన్నాడు జనార్ధన్ తల హెయిర్‌స్టైయిల్ సరిజేసుకుంటూ.

"పిచ్చిమాటలు మాట్లాడకు-అవిషయం చెపితే నిన్నుకూడా లాకప్‌లో పడేస్తాడు-" అన్నాడు శాయిరామ్.

మరో అరగంట తర్వాత గోపాల్రావ్ బయటకొచ్చాడు.

"ఏం జరిగింది-ఎలా వదిలేశాడు?" అడిగాం అందరం అతని చుట్టూ మూగి

"ఇంకెప్పుడూ పోలీస్‌స్టేషన్ మీద దాడిచేయమని రాసిమ్మన్నాడు. రాసిచ్చాను."

"అదేమిటీ? మనం దాడి ఎప్పుడు చేశాం-"

"నేనూ అదే అడిగానుగానీ వినిపించుకోలేదు అలారాసివ్వకపోతే నాపేరు రౌడీషీట్‌లో కెక్కిస్తానన్నాడు."

మేము మాట్లాడుతుండగానే ఇన్స్పెక్టర్ బయటికొచ్చాడు.

"ఏయ్-ఎవ్వరు మీరు? ఎందుకిక్కడ నుంచున్నారు?"

"వెళ్ళిపోతున్నాం సార్-" అన్నాడు గోపాల్రావ్ భయంగా.

"ఇగో-ఇది లాస్ట్‌వార్నింగ్! ఇక్కడసెక్షన్ 144 అమల్లో ఉన్నది. మీఅందరినీలోపట జేసేస్తా! మంచిగా ఇళ్ళకు పోండ్రి"

అందరం పరుగుతో ఇళ్ళకు చేరుకున్నాం!

మరో వారంరోజులు ప్రశాంతంగా గడిచిపోయినయ్. ఆతరువాత మొదలయింది కథ. జనార్ధన్ మోటర్‌సైకిల్‌మీద ఆఫీసునుంచివస్తూంటే మాకాలనీదగ్గర ఓసైకిల్‌వచ్చి వెనకనుంచి డాష్ ఇచ్చింది. ఆ కన్ ఫ్యూజన్‌లో సైకిల్‌వాడితోపాటు జనార్ధన్‌కూడా కిందపడకతప్పలేదు. పడేప్పుడు బలమంతాచేతి వేలుమీద పడడంతోవేలుఫ్రాక్చర్ అయింది. అందరం అప్పటికప్పుడే జనార్ధన్‌ని ఆటోలోవేసుకుని ఉస్మానియాహాస్పిటల్ చేరుకున్నాము. మామూలుగానే మమ్మల్నందరినీ నానాహింసలూ పెట్టాక జనార్ధన్‌చేతిని ఎక్సేరేతీసీ కట్టుకట్టిపంపించివేశారు. ఈలోగా శాయిరామ్, గోపాల్రావ్ కలిసి రోడ్డుమీదపడిన జనార్ధన్ మోటర్‌సైకిల్‌ని తీసుకెళ్ళి వాళ్ళింటిదగ్గరకుచేర్చారు.

మర్నాడు పొద్దున్నే మేమంతా ఆఫీస్‌కెళ్ళబోతూ ఉండగా పోలీస్ కాని స్టేబుల్ వచ్చాడు మా ఇంటికి.

"నిన్న సాయంత్రం యాక్సిడెంట్ అయిందటగా సార్!" అడిగాడతను.

యాక్సిడెంట్ అయిన మర్నాడే అతనలా పరామర్శించడానికి రావడం మాకెంతో ఆనందం కలిగించింది.

"ఆ! పెద్ద యాక్సిడెంట్ కాదులే! చిన్నది-ఏంఫర్వాలేదు! ఈ వేలుఫ్రాక్చరయింది అంతే! నువ్వేం వర్రీ అవకు-" అన్నాడు జనార్ధన్ ఆప్యాయంగా.

"నేనుకాద్సార్-మా ఇన్ స్పెక్టర్ గారు..."

"ఆయనను కూడా బాధ పడవద్దని చెప్పండి! చాలా చిన్నదెబ్బే తగిలింది-"అన్నాడు రంగారెడ్డి.

"ఈ ఇన్‌స్పెక్టర్ పైకలా ఉన్నా లోపల చాలా మంచిమనిషిలాగున్నాడు! పాపం ఎంత ఆదుర్దాతో కబురుచేశారోచూడు" అన్నాడు గోపాల్రావ్.

"అవును! పోలీస డిపార్ట్‌మెంట్ దృక్పథంలోనే చాలా మార్పు వచ్చింది" అన్నాడు శాయిరామ్.

"ఇదంతా ఎన్టీఆర్ ప్రభుత్వంవల్లే సాధ్యమయిందని నేను నిన్నే మాపేపర్లో రాశాను-" అన్నాడు గోపాల్రావ్ గర్వంగా.

హఠాత్తుగా కానిస్టేబుల్ మొఖంలో ఎక్స్‌ప్రెషన్ మారిపోయింది.

"నిన్ను వెంటనే స్టేషన్‌కి తీసుకురమ్మన్నాడు మా ఇన్‌స్పెక్టర్ సాబ్!" అన్నాడు సీరియస్‌గా జనార్ధన్‌వేపుచూస్తూ.

"నన్నా?"

"అవును"

"ఎందుకు?"

"కేసు రాయడానికి!"

ఈసారి అందరం ఉలిక్కిపడ్డాం

"కేసేమిటి?"

"గదే-మీ మోటర్‌సైకిల్-సైకిల్ తక్కర్ అయినయ్ గదా? దాన్నిగురించి"

"దానిక్కేసెందుకు? మేమేమీ కంప్లెయింట్ ఇవ్వలేదుగదా దాన్ని గురించి"

"అది ఇంకొకగల్తీ-యాక్సిడెంట్ కేస్‌ని పోలీస్‌కిచెప్పకుండా చుపాయించిన్రు! రెండు కేసులు!"

"దిసీజ్ టూమచ్ "అన్నాడు శాయీరామ్.

"బేకార్ ఇంగ్లీషు మాట్లాడకండ్రి! జల్దివస్తరా? రారా?" కోపంగా అడిగాడు కానిస్టేబుల్.

"పదండి! ఇన్‌స్పెక్టర్‌తోనే మాట్లాడదాం!" అన్నాడు రంగారెడ్డి. అందరం పోలీస్‌స్టేషన్ కెళ్ళాం.

"గుడ్ మాణింగ్ సార్!" అన్నాడు శాయీరామ్ ఇన్‌స్పెక్టర్‌తో.

"ఎవర్నువ్వు?"

"నేను శాయీరామ్‌నండి! కాలనీ ఆర్గనైజింగ్ శెక్రటీని"

"నువ్వెందుకొచ్చినావీడకు?"

"అదే మా వాడిని పిలిపించారంటేనూ....."నసిగాడు శాయీరామ్.

"ఇదిగో-మీకులాస్ట్‌వార్నింగ్! నేనెవళ్ళనుపిలుస్తే అళ్ళేరావాల! ఇదేంపెండ్లిల్లుగాదు. బంధుమిత్రులతోని రానికి! నడవండి బయటకు"

శాయీరామ్ రెండడుగులు వెనక్కువేసి రంగారెడ్డివేపుచూశాడు. రంగారెడ్డి యాదగిరివేపు చూశాడు.

అందరం బయటకొచ్చి నిలబడ్డాం. లోపల్నుంచీ జనార్ధన్, ఇన్‌స్పెక్టర్‌ల సంభాషణ వినబడుతూనే ఉంది.

"యాక్సిడెంట్ అయినాక నీ మోటర్‌సైకిల్ ఆ జాగాకెళ్ళి ఎందుకు తీసినావయ్యా?"

"రోడ్ ట్రాఫిక్‌కి అడ్డం అని తీసేసానండీ..."

"పోలీసులొచ్చేవరకూ తియ్యగూడదు గదా!"

"కానీ అది చిన్న యాక్సిడెంటేగదండీ-సైకిల్ వాడు నెమ్మదిగానే డాష్ ఇచ్చాడు"

"ఇదిగో! ఎక్కువతక్కువమాట్లాడకు! యాక్సిడెంట్ గురించి పోలీస్‌కిచెప్పకుండా చుపాయించినందుకు నీమీద కేసుపెడుతున్నా."

"ఇందులో దాయాలని దాచిందేమీలేదండీ-చిన్నదానికి పోలీస్ వరకూ ఎందుకని.."

"ఇగో! ఫాల్తూ మాటలు మాట్లాడకు!" గట్టిగా అరచాడు ఇన్‌స్పెక్టర్. మేమంతా ఉలిక్కిపడ్డాం. పోలీస్ అంటే మాక్కొంత అవగాహనఉందిగాని మరీ ఇంతఅవగాహన కాలేదెప్పుడూ. సరిగ్గా అప్పుడే ఓకానిస్టేబుల్ మాదగ్గరకొచ్చాడు చిరునవ్వుతో.

"ఏమిసార్ ఈ కిరికిరి! మనమంతా ఒక్కజాగాలో ఉండేటోళ్ళం" అన్నాడు ఆప్యాయంగా. వెంటనే "హెల్‌రైడర్స్" ఇంగ్లీషుపిక్చర్లో అయిదునిముషాలపాటు మామూలు మనిషిలా మాట్లాడిన పోలీస్‌పాత్రగుర్తుకొచ్చింది మాఅందరికీ.

"మాదేముందీ-మీ ఇనిస్పెక్టర్‌గారేకదా పిలిపించి గొడవచేస్తోందీ?" కోపంగా అన్నాడు రంగారెడ్డి.

"ఇనిస్పెక్టర్‌సాబ్ చాలా మంచిమనిషి సార్! పై ఆఫీసర్ల దిక్కుకెళ్ళి పరేషాన్ అయికేనులు బుక్‌చేస్తున్నడు! గంతనే! మీరు మన కాలనీ ఓళ్ళేకాబట్టి వెయ్యిరూపాయలిచ్చేయండ్రి! కేస్ మాఫ్ జేస్తడు!"

మాకు మతి పోయినట్లయింది.

"ఏమది? వెయ్యి రూపాయలు మేమివ్వాల్నా" ఆశ్చర్యంగా అడిగాడు యాదగిరి.

"మనకాలనీవాండ్లు కాబట్టి-వెయ్యిరూపాయల్సార్! లేకుంటే రెండు వేలకు ఒక్కపైస తగ్గెడిది కాదు" జాలిగా అన్నాడతను.

"అంటే మేము లంచం ఇవ్వాలా?" కోపంగా అడిగాడు రంగారెడ్డి.

"ఏం 'లంచం' అని గట్టిగా చిల్లాయిస్తున్నావ్! అట్లరుస్తే భయమనుకుంటున్నావా?" తనూ కోపంగా అడిగాడు కానిస్టేబుల్.

శాయీరామ్ ఇద్దరికీ సర్దిచెప్పాడు. "మాగురించి నీకు తెలియదేమో! మేము లంచాలు ఇవ్వము-తీసుకోము" అన్నాడు పౌరుషంగా.

"అవును! మన ఆడాళ్ళకెలాగూ మధ్యాహ్నంపూట పనీపాట ఉండదు. కనుక తీరిక సమయాల్లో వీరికన్నీ నేర్పవచ్చు-" అన్నాడు శాయిరామ్ కూడా.

ఆ విషయమే రాజానందంతో వాళ్ళకు చెప్పించాము. మర్నాడు పొద్దున్నే మళ్ళీ వాళ్ళను కలుసుకుంటామని చెప్పి వచ్చేశాం.

ఆ రోజు ఉదయం ఆదివారం కావడంవల్ల తీరిగ్గా కాఫీ ఫలహారాలుముగించి ఆడా మగా, పిల్లలూ అందరం భిక్షాద్వీప్ ఆదిమానవుల దగ్గరకు చేరుకున్నాం.

అప్పటికే వారు కొండరాళ్ళతో కొండ గుహల్లాగా ఇళ్ళుకడుతున్నారు. మాకు జాలివేసింది వారిని చూస్తుంటే.

"పిచ్చి వాళ్ళలారా! చీకటి గుమారాల్లంటి కొండ గుహల్లో ఉండటం తప్పు. ఆధునిక మానవుడి ఇల్లు చూపిస్తారండి!" అంటూ నచ్చచెప్పాడు రాజానందం వాళ్ళకు.

అందరం శాయిరాం వాళ్ళింటికెళ్ళాం. కానీ పవర్‌కట్ ఉండడంతో ఇల్లంతా పరమ చీకటిగాఉంది ఎక్కడే వస్తువుందో కనబడటంలేదు. అదీగాక లోపలివంటిల్లూ, పడగ్గదీ అసలు ఒక్క కిటికీకూడా లేకపోవటంవల్ల-మరింతగాఢంధకారంగా ఉన్నాయ్. అతనిదే కాదు మాకాలనీలో అందరిళ్ళూ అలాగే ఉంటాయ్. వాటిని 'కబోలా' అనే ఓ మతానికి చెందిన ప్రభుత్వ ఇంజనీర్ డిజైన్ చేశాడు. వాళ్ళ మతాచారాల ప్రకారం ఇంటి ఆడాళ్ళ మీదకు ఎలాంటి వెల్తురూ ప్రసరించకూడదట. బ్రతికున్నన్నాళ్ళూ వాళ్ళు ఆఇంటి గడపదాటి బయటకు రాకూడదు. వాళ్ళు చనిపోయినప్పుడు కూడా వంటింట్లోనే తవ్విపాతి పెట్టేస్తారట.

కనుక ఆ కబోలా ఇంజనీరుగారున్నంతకాలం వాళ్ళకోసం ఆంధ్రప్రదేశ్‌లో అలాంటి కాలనీలే నిర్మించింది ప్రభుత్వం.

"ఇల్లంటే ఇలా ఉండాలి. గాలి వెల్తురూ ధారళంగా రావాలి" అన్నాడు శాయిరామ్. ఆచీకటిలో పక్కకు నడవబోయి ఏదో పీటతగిలి కిందపడి త్వరత్వరగా లేచినిల్చుంటూ.

ఆదిమానవులందరూ మొఖాలు చూసుకున్నారు.

"కాని ఇదీ మా కొండగుహల్లాగానే చీకటిగా ఉంది కదా!" అడిగాడు వాళ్ళ నాయకుడు (రాజానందం ప్రకారం). మాకేం జవాబు చెప్పాలో తెలీలేదు.

"కొంచెం అలాగే ఉందనుకో-కానీ ఈ కాలనీ వదిలేస్తే మిగతా ప్రైవేటు ఇళ్ళు చాలా బాగుంటాయ్-" అంటూ గొణిగాడు రంగారెడ్డి.

వాళ్ళు మాఎక్స్‌ప్లనేషన్‌తో సంతృప్తిపడలేదు.

అందరం కాలనీమధ్య శాయిరామ్ ఏర్పాటు చేసిన వేదిక దగ్గరకు నడిచాము. అప్పటికే వాళ్ళను చూడ్డానికి వందల మంది మాకాలనీ ఆడాళ్ళు గుమిగూడి పోయారు.

"ముందు వాళ్ళను బట్టలు కట్టుకోమని చెప్పండి" అన్నాం రాజానందంతో.

"ముందు మీరంతా బట్టలు కట్టుకోవాలి మాలాగా! శరీరం అంతా బయటకు కనబడటం మీరాతియుగం పద్ధతి!" చెప్పాడు రాజానందం వాళ్ళతో.

వాళ్ళు మాబట్టలవేపు చూశారు కుతూహలంగా.

నిజానికి అది వేసవి కావటంవల్ల వేడి భరించలేక సగంమంది మగాళ్ళం షర్టులు, బనీన్లు కూడా లేకుండా కేవలం లుంగీలతో ఉన్నాం. అదే వాళ్ళమొఖంలో ప్రశ్నగా కనిపించింది.

"మా మగాళ్ళ సంగతివేరు! వేసవివేడివల్ల ఇప్పుడు షర్టులు వేసుకోలేదు. అని సర్ది చెప్పాడు రాజానందం.

"మరి వాళ్ళో?" అంటూ మాకాలనీ ఆడాళ్ళవేపు చూశాడు బిక్షాద్వీప్ నాయకుడు. మేమంతా కూడా వెనక్కు తిరిగి ఆడాళ్ళవేపు చూశాము. దాంతో మా అందరి మొఖాలు వాడి పోయినాయ్. మేము ఈమధ్య సరిగ్గా గమనించటం లేదుగానీ కాలనీలో స్త్రీలు, యువతులుచాలామంది మిడ్డీస్ వేస్తున్నారు. అంచేత సగం వళ్ళుకనబడుతూనే ఉంది. చీరలు కట్టిన వాళ్ళు సరేసరి. జాకెట్‌కి చేతుల్లేవు. పైగాసన్న పట్టీలాంటి వెడల్పుతో మాత్రమే శరీరాన్ని చుట్టేసుకుని ఉంది. ఇక చీరలుచూద్దామా నడుముకి బాగా కిందుగా కట్టారు.

అంటే మా అందరికీ ఇంచుమించుగా మూడొంతుల వళ్ళు కనబడుతూనే ఉంది.

మా పరిస్థితిలా ఉండగా అప్పడే కొంతమంది కాయకష్టం చేసుకునే కూలీలు కేవలం మొలకోచిన్నగుడ్డ చుట్టుకుని మా కాలనీ పక్కనుంచే వెళ్ళటం కనిపించింది.

"అరుగో-వాళ్ళు కూడా అచ్చం మాలాగే ఉన్నారు కదా?" అడిగారు అదిమానవులు.

"అదివేరు లెండి-ఇంచు మించు మేమూ మీలాగే ఉన్నాం. కానీ కట్టుకోడానికి బట్టకొనలేక అలా ఉన్నాం. బట్టల ఖరీదు మరీ ఎక్కువ కదా!" అనేసి ఇంక లాభంలేదని టాపిక్ మార్చేశాం.

మధ్యాహ్నం వాళ్ళ కోసం మేమంతా కొన్ని కూరగాయలు కలెక్షన్‌చేసి వండుకోడానికి ఇచ్చాము-అయితే వాళ్ళు పచ్చివే తినటం చూసి ఆశ్చర్యపోయాము.

"అలా పచ్చివి తినకూడదు! వండుకుని తినాలి మాలాగా!" చెప్పాడు రాజానందం

"వండుకోవడమంటే ఏమిటి? ఎలా ఉంటుందది" అడిగారు వాళ్ళు వెంటనే వాళ్ళందరినీ రంగారెడ్డి ఇంటికి తీసుకెళ్ళాం.

"మా ఆవిడ ఇప్పుడు కూరలు వండుతూంటుంది! చూసి నేర్చుకోండి" అంటూ కిచెన్‌లోకి తీసుకెళ్ళాడతను.

అక్కడి దృశ్యం చూసేసరికి అందరికీ మతిపోయింది.

రంగారెడ్డి భార్య, వాళ్ళపిల్లలు డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని పచ్చి కూరగాయలు తింటున్నారు.

భిక్షాద్వీప్ వాళ్లు ప్రశ్నార్థకంగా మావేపు చూశారు.

"మీరూ మాలాగే పచ్చివి తింటున్నారుగా?" అడిగాడతను వాళ్ళభాషలో.

"నిజమేగానీ ఎప్పుడూ ఇలా తినము. గాస్ అయిపోయినప్పుడల్లా-మళ్ళీగాస్ వచ్చేవరకూ-అంటే సంవత్సరానికి ఆరునెలలు పచ్చివి తింటాము" అని జవాబు చెప్పి ఎందుకయినా మంచిదని టాపిక్ మార్చేశాము.

"అన్నట్లు మీరంతా చాలా దుర్వాసన కొడుతున్నారు, ఎన్నాళ్ళకోసారి స్నానం చేస్తున్నారు?" అడిగాడు రాజానందం వాళ్ళను.

"ప్రతి అమావాస్యకూ, పౌర్ణానికి చేస్తాం" గర్వంగా చెప్పాడు వాళ్ళ నాయకుడు. అందరం ఘొల్లున నవ్వాము.

మరీ ఇంతదారుణంగా ఉంటారనుకోలేదు ఆదిమానవులంటే.

"ఛీ! ఛీ! అదిచాలా చెడ్డ అలవాటు. ప్రతిరోజూ స్నానంచేయాలి వీలయితే రెండుపూటలా చేయాలి. అప్పుడే మురికి, సూక్షజీవులూ అన్నీపోతాయ్! మమ్మల్ని చూడు! ఎంతనీట్‌గా నిగనిగలాడుతున్నామో-"

వాళ్ళు మావేపు పరీక్షగా చూస్తోంటే అనుమానం వచ్చి మావంక మేము చూసుకున్నాం. అందరివంటిమీదా నల్లగా చారలుకట్టి ఉంది మట్టి. దగ్గిరకొచ్చి కొంతమట్టిని కిందకు రాల్చారు వాళ్ళు. ముఖ్యంగా యాదగిరి, జనార్దన్‌లవంటి మీద పావుకిలో మట్టిరాలింది.

"మీరెన్నాళ్ళకోసారి చేస్తారు స్నానం?" అడిగారు వాళ్ళు హఠాత్తుగా ముక్కులు మూసుకుంటూ.

'రోజూ రెండుసార్లు' అనబోయి ఆగిపోయాన్నేను ఎందుకంటే మా కాలనీలో అందరం వారం రోజులుపాటు నీళ్ళు దాచుకుని వారానికో రోజుస్నానం చేస్తున్నాము.

మరికొన్ని చోట్ల నీళ్ళ సమస్యవల్ల పదిహేను, ఇరవై రోజులకొకసారి స్నానంచేస్తున్నారు.

"చెప్పరేం? మీరెన్నిసార్లు చేస్తున్నారు రోజూ?" అడిగారు వాళ్ళు. మేమెవ్వరం సమాధానం చెప్పకుండా టాపిక్ మార్చేశాము.

ఈలోగా వాళ్ళల్లో ఒకడు పెళ్ళాన్ని పట్టుకుని బడితెతో చావబాదటం మొదలుపెట్టాడు.

వాడిపెళ్ళాం భోరున ఏడుస్తోంది. అందరం పరుగుతో వెళ్ళివాడు కొట్టకుండా పట్టుకున్నాం,

"ఏమిటి? ఎందుక్కొడుతున్నావ్?" అడిగాడు రాజానందం వాడిని.

వాడేదో అయిదు నిమిషాలపాటు చెప్పాడు రాజానందంతో.

"ఆ దూరంగా కనిపించే కొండలదగ్గర వీళ్ళ బాచ్ ఇంకొంతమందిని ఉంచిందట ప్రభుత్వం. వాళ్ళల్లోవీడి పెళ్ళాం తాలూకు తల్లిదండ్రులున్నారట. వాళ్ళు పెళ్ళిలో వాడికిస్తామన్న రెండుమేకలు ఇవ్వలేదట అందుకని దాన్ని చావగొడుతున్నాడు-

మా అందరికీ వళ్ల మండిపోయింది.

"నీకేం బుద్ధుందా లేదా! వాటికోసం పెళ్ళాన్ని చావగొడతావా? అసలు ఆడదాన్ని కొట్టడం అనాగరికం! మా దగ్గర చూడు-మా ఆడాళ్ళూ మేమూ సమానంగా ఉంటాం అన్ని రంగాల్లోనూ" అన్నాం గర్వంగా మాతో పాటు వచ్చిన మాకాలనీ స్త్రీలను చూపుతూ.

వాళ్ళనాయకుడు చాలా సేపు ఆలోచించాడు.

"నిజమే! మీరు చాలా అభివృద్ధి సాధించారు. స్త్రీకి గౌరవం ఇచ్చే విషయములో మావాళ్ళందరూ కూడా మీలాగా ఆడాళ్ళను బాధలు పెట్టకుండా కొత్తగా కట్టడి చేస్తాను."

అందరికీ ఆమాట వింటునే ఆనందం కలిగింది. ఈ ఒక్క విషయంలోనయినా వాళ్లకంటే మేం ముందు ఉన్నందుకు గర్వపడ్డాము.

కానీ మా గర్వం రెండు నిముషాలన్నా నిలువకముందే మాకాలనీలో ఓ ఇంటిలో నుంచి పెద్దగా పొగలు బయటకు రాసాగినయ్. దానివెనుకే కేకలు, ఏడుపులు-

అందరం ఆఇంటి దగ్గరకు పరిగెత్తాం. కొత్తగా పెళ్ళయిన అమ్మాయికట్నం తేలేదని ఆమె భర్త ఆమె మీద కిర్సనాయిలు పోసి చంపేశాడు.

"ఏమిటి? ఏంజరిగింది?" అడిగాడు భిక్షాద్వీప్ నాయకుడు.

జరిగినదంతా చెప్పాడు రాజానందం. ఆనాయకుడి కళ్ళల్లో ఆశ్చర్యం కనిపించింది. "అదేమిటి? మీ అధునిక సమాజంలో భార్యను ఏకంగా ఛంపేస్తారా?" అనడిగాడు.

మేము మాట్లాడలేదు. "మాకు అర్జంటు పనుంది" అంటూ అక్కడ నుంచి జారుకున్నాం.

ఆరాత్రి ఆదిమానవులందరూ కలసి కొమ్ముబూర ఊదుతూ చెట్లఆకులు రెండుమాత్రం నడుముకి కట్టుకుని అర్ధనగ్నంగా ఎగురుతూ పిచ్చి పిచ్చిగాకేకలు వేస్తున్నారు.

అలా ఎందుకు చేస్తున్నారో అర్థంగాక అందరం వాళ్ళదగ్గరకు చేరుకున్నాం.

వాళ్ళనాయకుడితో మాట్లాడాక రాజానందం చెప్పాడు

"వాళ్లకు అలా ఓ పద్ధతీపాడు లేకుండా ఎగరటమే వినోదకార్యక్రమం అట."

"మీ ఆదిమానవులు ఇలాంటి పిచ్చిపిచ్చి చేష్టలు మానేయాలి. మమ్మల్ని చూడండి! మేము మీలాగా అర్ధనగ్నంగా ఎగురుతున్నామా?" అడిగాడు రాజానందం వాళ్లతో.

"లేదు" అన్నాడు వాళ్ళ నాయకుడు.

"మీరు అలా ఎగరటం రాతియుగంనాటి సంస్కృతి. ఆధునిక యుగంలో అలా ఎవరూ చేయరు!"

"మరి మీకు వినోదం కావాలంటే ఎలా?" అనుమానంగా అడిగాడు.

"మాకు ఎంతోకాలంనుంచీ ఎందరో మహానుభావులు కృషిచేసి అభివృద్ధి పరచిన సంగీతం సాహిత్యం, నృత్యంలాంటి కళలున్నాయి. మీరుకూడా వాటిని నేర్చుకోవాలి."

"ఎలా ఉంటాయవి?"

"ఇప్పుడు మీ వాళ్ళు ఎగురుతూ పాడుతోన్న ఓ పదం విన్నాను. దానర్థం చాలా పెద్దబూతు మానమాజంలో! అలాంటి బూతులు మేము మాట్లాడం! మాభాష చాలా సాఫిస్టికేటెడ్‌గా ఉంటుంది- కావాంటే మా వినోద కార్యక్రమాల గురించి తెలియజేస్తాం! రండి"

అంటూ వాళ్ళందరినీ వెంబడి తీసుకెళ్ళి రంగారెడ్డి ఇంట్లో టి.వి. లో వస్తోన్న చిత్రలహరి ప్రోగ్రాం చూపించాము.

అప్పుడే కొత్తగా రిలీజయిన అర్ధం తిరిగిన తెలుగుగడ్డ లోపాట ప్రారంభమయింది. హీరో హీరోయిన్ ఇంకా బోలెడు మంది అమ్మాయిలు సగం బట్టకట్టుకుని ఆది మానవులకంటే అన్యాయంగా అధ్వాన్నంగా పిచ్చిగంతులేస్తూ, అంతకంటే బూతుగా వికారంగా పాడసాగారు. భిక్షాద్వీప్ వాళ్ళందరూ అదిచూసి ఆనందంతో గంతులేయసాగారు.

"అచ్చం మావినోదనృత్యంలాగానే ఉందికదా మీదికూడా" సరిగ్గా అప్పుడే కాలనీ బయటనుంచి ఎవరో 'పాము పాము' అంటూ కేకలేయసాగారు. అందరం బయటకు పరుగెత్తాము. బయట చంద్రకాంత్ ఇంటిముందునుంచి సరసరా పాకుతోందో పాము. దాన్ని చూస్తూనే భిక్షాద్వీప్ వాళ్ళు ఒక్కదూకు దూకి పట్టుకుని నేలకేసిగట్టిగా ఓసారికొట్టి తలో ముక్క తుంపుకుని తినేయసాగారు.

మా కందరికీ భయంతో వళ్ళుగగ్గుర్పొడిచింది. డిటెక్టివ్ రచయిత్రి రాజేశ్వరి అదృశ్యం చూళ్ళేక స్పృహతప్పింది.

రాజానందం వాళ్ళమీద మండిపడ్డాడు "పిచ్చి వెధవల్లారా! పామును తింటే ఛస్తారు" అన్నాడు వాళ్ళతో.

"ఎందుకు చస్తాం?"

"అందులో విషం ఉంటుంది"

వాళ్ళు ఫెళ్లున నవ్వారు "మరి మేము ఎప్పటినుంచో వాటిని తింటున్నాంకదా!"

"అదృష్టం కొద్దీ బ్రతికిపోయారు. ఇంక అలాంటివి తినకండి!"

"మరేంతినాలి?"

"మాలాగా అన్నం కూరలు తినాలి! అవి తింటే ఎలాంటి ప్రమాదం ఉండదు-"

రాజానందం చెప్తుండగానే మా బగరా బైగన్ వెంకట్రావ్ హఠాత్తుగా మా మధ్యే వాంతి చేసుకోవటం ప్రారంభించాడు. అప్పటికప్పుడే కాళ్లూ, చేతులూ చల్లబడి పోవటంతో డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాం.

"హాస్పిటల్‌కి తీసుకెళ్ళండి. కల్తీ ఆహారంతిన్నాడు" అన్నాడు డాక్టరు. అప్పటికప్పుడే వెంకట్రావ్‌ని హాస్పిటల్‌కి తీసుకెళ్ళిపోయారు.

"ఏం జరిగింది?" అడిగాడు ఆదిమానవుల నాయకుడు.

"తిన్న భోజనంవల్ల-ప్రాణం మీదకొచ్చింది"

"అదేమిటి మీరు తినే భోజనం మంచిదన్నారుగా"

"అన్నాననుకోండి! కానీ ఎప్పుడు ప్రాణం మీదకొస్తుందో ఎవరికీ తెలీదు. ఎప్పుడు, ఎవడు- ఆ భోజనంలో కల్తీచేస్తాడో కూడా తెలీదు-"

"అయితే మా పాములే మంచివి"

మేమింక మాట్లాళ్ళేదు.

తెల్లారక బయటికొచ్చి చూసేసరికి భిక్షాద్వీప్ వాళ్ళంతా నెత్తిన పెద్దపెద్ద బండరాళ్ళు పెట్టుకుని అవి కిందపడిపోకుండా తాళ్ళతో కట్టుకుని తిరగసాగారు.

వాళ్ళను వెంటనే పిలిపించాము సంగతేమిటో కనుక్కోటానికి.

"మానాయకుడు పెట్టుకోమని ఆజ్ఞాపించాడు అందుకని పెట్టుకున్నాం" చెప్పాడొకడు.

"మీకేం బుద్ధుందా లేదా? మీ నాయకుడేం చెపితే అది గొర్రెల్లా చేసేయటమేనా? రేప్పొద్దున్నవాడు మిమ్మల్ని గంగలోదూకమంటే దూకేస్తారా?" అడిగాడు రాజానందం.

"మా నాయకుడు చెప్పినట్లు చేయకపోతే చాలా పెద్దశిక్ష వేస్తారు మాకు" భయంగా జవాబిచ్చాడు.

రాజానందంతో పాటు మేమూ ఆనాయకుడి దగ్గరకు నడిచాము. ఆ నాయకుడు హాయిగా తన గుహలో పడుకుని ఈతసారా తాగుతున్నాడు.

రాజాచంద్ర ప్రశ్న వింటూనే గట్టిగా నవ్వాడతను.

"మీకామాత్రం తెలీదా? పైగా పెద్ద ఆధునిక మానవుడంటారు. పైనగద్దలు తిరుగుతున్నాయ్ కనబడుతుందా?"

అందరం ఆకాశంవేపు చూశాము. గద్దలు కొన్ని తిరుగుతున్నాయి."అయితే ఏమిటి?"

"ఆ గద్దలు మననెత్తిమీద తంతేప్రమాదంకదా! అందుకనే బండరాళ్ళు నెత్తిన పెట్టుకోమని వాళ్ళకు అజ్ఞాపించాను. ఇప్పుడు గద్దలుతన్నినా రాయికి తగులుతుంది గానీ మావాళ్ళకు దెబ్బతగలదు-"

"నీకేం మతుందా లేదా? అయినా గద్దలెందుకు తంతాయ్?"

"చాలా సంవత్సరాలక్రితం ఓ సారి తన్నింది-"

"అందుకని ఎప్పుడూ రాయి నెత్తిన పెట్టుకుంటారా?"

అందరం ఘెల్లున నవ్వాము. నాయకుడి ముఖం చిన్నబోయింది మేము వెనక్కు తిరిగి ఇంటికి చేరుకుని వెహికల్స్ తీసుకుని ఆఫీస్‌కి బయల్దేరాము. హఠాత్తుగా భిక్షాద్వీప్ వాళ్ళు మమ్మల్ని చుట్టుముట్టేశారు. వాళ్ళ నాయకుడు కోపంగా మాదగ్గరకొచ్చాడు.

"ఇందాక బండరాళ్ళు మేము నెత్తినకట్టుకున్నామని హేళనచేశారుగా! మరిమీరు చేస్తోందేమిటి?" మేము ఆశ్చర్యంగా నెత్తితడుముకున్నాం. తీరా చూస్తే అవి మా హెల్మెట్లు!

"ఇవి బండరాళ్ళుకాదు హెల్మెట్లు-" అన్నాడు రాజానందం.

"ఏదయితేనేం? ఇదెందుకు మోస్తున్నారు మీరు?"

"మాపోలీస్ కమిషనర్ పెట్టుకోమన్నాడు!"

"ఎందుకు?"

అందరం మొఖాలు చూసుకున్నాం. ఎందుకు హెల్మెట్ పెట్టుకోమన్నారో నిజంగానే మాకేం తెలీదు. "ఎప్పుడో ఓ సారి యాక్సిడెంట్ అవుతుందట! అందుకని పెట్టుకోమన్నారు-"

ఆదిమానవులంతా ఘెల్లున నవ్వారు

"ఎప్పుడో ఏదో అవుతుందని జీవితమంతా దీన్ని మోస్తూ తిరుగుతారా?" అన్నారువాళ్ళు మేము సిగ్గుపడి జారుకున్నాం అక్కడినుంచి. ఆసాయంత్రం ఆఫీస్ నుంచి వచ్చేప్పటికి భిక్షాద్వీప్ వాళ్ళందరూ ఓ ముసలావిడ చుట్టూమూగి ఉన్నారు. సంగతేమిటో కనుక్కుందామని వెళ్ళాం.

"ఈ ముసలాడు బండరాయిబరువువల్లదాన్ని మీదేసుకుని కిందపడ్డాడు. బాగారక్తం అదిపోయింది. వీళ్ళ ఆచారంప్రకారం జబ్బువచ్చినవాడిని చావకముందే పాతిపెట్టేస్తారట-"

అందరం వాళ్ళ మీద విరుచుకుపడ్డాం "అది అమానుషం" అంటూ అరచాం.

"మీరేం చేస్తారు జబ్బువస్తే?" అడిగాడు వాళ్ళనాయకుడు ఆశ్చర్యంగా.

"హాస్పిటల్‌లో చేర్పించి జబ్బు తగ్గిస్తాము"

అతను బుర్రగోకున్నాడు "సరే మేమూ మీపద్ధతి అవలంబిస్తాం" అన్నాడు. అప్పుడే గోపాల్రావ్ ఆటోలో వాళ్ళ నాన్నగారిని తీసుకోచ్చాడు. ఆఇంటివాళ్ళంతా పెద్దగా ఏడుస్తూ ఆటో చుట్టూ మూగారు. మేముకూడా షాకతిన్నాము. గోపాల్రావ్ వాళ్ళనాన్నగారిని ప్రభుత్వహాస్పిటల్లో చేర్చాడు. కానీ వాళ్ళ నాన్నగారు ప్రాణాలతో తిరిగి వచ్చారిప్పుడు.

"బాస్టర్డ్స్-మానాన్న చావక ముందే చచ్చిపోయాడని మార్చురీలో పడేశారు. తీరా శవాన్ని తెద్దామని వెళ్ళేసరికి పరుగుతో బయటి కొచ్చాడాయన-" చెప్పాడు గోపాల్రావ్.

ఆవిషయం ఆదిమానవులతో చెప్పటం మాకిష్టం లేకపోయింది. ఎందుకంటే వాళ్ళు పద్ధతులే మన ఆధునిక సమాజం కూడా ఆచరిస్తోందని ఋజువయిందికాబట్టి! ఆరాత్రి హఠాత్తుగా మళ్ళీకేకలు వినిపించినయ్. బయటకు పరుగెత్తి చూసేసరికి కొండల్లో ఉన్న ఆదిమానవులకీ, మాకాలనీలో ఉన్న ఆదిమానవులకూ యుద్ధం జరుగుతోంది యుద్ధంలో ఓపాతికమంది చనిపోయాక అవతలివాళ్ళు మళ్ళీకొండల్లోకి పారిపోయారు.

"ఎందుకు వాళ్ళతో యుద్ధంచేశారు? వాళ్ళూ మీలాగే ఆదిమానవులే కదా?" అడిగాడు రాజానందం వాళ్ల నాయకుడిని.

"వాళ్ళకూ మాకూ శత్రుత్వం ఏమీలేదుగానీ ఎంతో కాలంనుంచీ అప్పుడప్పుడూ యుద్ధంచేసి ఎవరు ఎక్కువో తేల్చుకుంటూంటాం" చెప్పాడతను.

"చూశారా మీరెంత మూర్ఖత్వంలో మగ్గిపోతున్నారో! ఊరికే పోట్లాడుకుని కొట్టుకుని చనిపోతున్నారు. మమ్మల్ని చూడండి! ఎంత నభ్యతతో కలసిమెలసి జీవితం గడుపుతున్నామో"

భిక్షాద్వీప్ నాయకుడు కాసేపు ఆలోచించాడు

"నిజమే! మేమూ మీలాగా మారిపోతాం! ఇకనుంచీ యుద్ధాలు రాకుండా చూసుకుంటాం"

అతనలా చెపుతూండగానే బయట పోలీస్ వాన్లోనుంచి హెచ్చరిక వినిపించసాగింది.

"నగరంలోరెండు వర్గాలమధ్య జరిగినమత కల్లోలాలవల్ల నిరవధికంగా కర్ఫ్యూ విధించడమయినది. వీధుల్లో ఎవరయినా కనిపించినట్లయితే కాల్చివేయడం జరుగుతుంది-"

"ఏమిటి? ఏం చెపుతున్నారు?" అడిగాడు భిక్షాద్వీప్ నాయకుడు కుతూహలంగా.

మేము వారికేం సమాధానం చెప్పలేదు. కర్ఫ్యూ ముగిశాక కూడా వాళ్ళకి కనిపించటానికి మొఖం చెల్లలేదు మాకు. ✱

# పండుగ



నేను అదిరిపడి నిద్రలేచి కూర్చున్నాను. సరిగ్గా అదే సమయానికి అందరిళ్ళల్లో పిల్లలు కెవ్వుమని ఏడుపు మొదలెట్టారు. మాశీనుగాడు కూడా యధాశక్తి ఇల్లెగిరేట్లు అరవసాగాడు. అనలేం జరిగిందో నాకోపట్టాన అర్థంకాలేదు. ఏవో కొంపలు మునిగిపోతున్నాంత శబ్దాలు, గుండెలమీద ఎవరో పరుగెడుతున్నట్లు అడుగులచప్పుడు-ఇంక ఆలస్యం చేయకుండా తలుపు తెరుచుకుని గోపాల్రావ్ వాళ్ళింటికి పరుగెత్తాను. అప్పుడే గోపాల్రావ్ కూడా నిద్రమత్తులో వాళ్ళ పసివాడ్ని భుజానవేసుకుని వాళ్ళావిడతోసహా ఇంట్లోనుంచిబయటకు పరుగెత్తుకొచ్చాడు. సరిగ్గా అప్పుడే రంగారెడ్డి. శాయిరామ్, జనార్ధన్ కూడా పరుగుతో వచ్చేశారు వాళ్ళపిల్లతో సహా.

"ఏమిటది? మన పక్కమేడలో గోడలు ఏమయినా కూలిపోతున్నాయా?" కంగారుగా అడిగాడు గోపాల్రావ్.

"ఆ-మీరు మరీనూ-మన కిటికీ పక్కన రోడ్డుమీద వినాయకుడి ఉత్సవం చేయటంలేదూ? వాళ్ళుమైకులో! సినిమా రికార్డులు, పెట్టినట్టున్నారు! ఇవాళేగా వినాయకచవితి" అంది వాళ్ళావిడ రాజ్యలక్ష్మి.

మరికొద్ది క్షణాలు ఆశబ్దాలు విన్నాక ఆమె చెప్పినమాట నిజమేనని అర్థమయిపోయింది మా అందరికీ.

ఆస్పీకర్ మరీ కిటికీ పక్కనే ఉండడంతో ఆశబ్దాలు సినిమా రికార్డులోని ఆర్కెస్ట్రావని తెలీలేదు. ఈలోగా ఆర్కెస్ట్రా ఆగి పాట మొదలయిపోయింది.

"ఓ సుబ్బారావూ, ఓ అప్పారావూ, ఓ వెంకట్రావూ-"

చెవులు పగిలిపోతునాయ్.

"ఇదేమిటిలా అర్థరాత్రిమైకు?" అడిగాడతను.

"అర్థరాత్రేమిటి? తెల్లవారుజాము మూడయిపోయిందిగా! అందుకని పెట్టివుంటారు!" అందామె తేలికగా.

గోపాల్రావ్ వాళ్ళబాబిగాడిని ఎత్తుకుని అటూఇటూ పచార్లుచేస్తూ నిద్రపుచ్చడానికి ప్రయత్నించసాగాడు.

వాళ్ళావిడ ఆరునెలల పసిగుడ్డుచెవిలో దూదిపెట్టి, ఆమైక్ పాట వినబడకుండా చెవులకు గుడ్డచుట్టేసింది.

గోపాల్రావ్‌కి ఆఏరియా విఘ్నేశ్వర కమిటీమీద వళ్ళుమండిపోయింది.

"ఇప్పుడే వెళ్ళి ఆస్పీకర్ డైరక్షన్ మార్చమని చెప్పివస్తాను..."అన్నాడు రాజ్యలక్ష్మితో.

"వాళ్ళు మీమాట వింటారా ఏమిటి మీపిచ్చిగాని... " దుప్పటి చెవులమీద వేసుకుంటూ అందామె.

గోపాల్రావ్, బాబిగాడితో సహా, అందరం రోడ్డుమీదకొచ్చాము నలుగురు యువకులు గ్రామఫోన్ దగ్గరకూర్చుని బూతులు మాట్లాడుకుంటున్నారు.

"ఈపాట పాడేప్పుడు జయమాలిన్ని సూడాల్రా-నీయవ్వ భలే చేసిద్ది"

"ఈరికార్డప్పుడా?" ఇంకొకడడిగాడు.

"అవ్-"

"ఇస్కిమాకీ-గప్పుడే నేను సిగరెట్ తాగనికి బయటికెళ్ళినా-"

"కల్‌ఫిర్ జాయంగే-చల్తే? ఇస్కీ-మాకీ-ఛోడ్ నాసై-ఉత్‌నా జబర్దస్త్-బతాతీరే-" పాట అయిపోయింది.

మరో రికార్డుతీశాడు మైక్ కుర్రాడు.

"ఏంపాటది?"

"ఇదిగో తెల్లచీరా-ఇవిగో-మల్లెపూలూ..."

"ఊ ఊ ఊపెయ్ నీయవ్వ"

పాట మొదలయిపోయింది.

గోపాల్రావ్ వాళ్ళ దగ్గరకు నడిచాడు. రోడ్డుకడ్డంగాపెద్దస్టేజీ! దాని మీద వినాయకుడు చాలా పెద్దబొమ్మ.

"ఇదిగో! కొంచెం ఆస్పీకర్ అటునుంచి ఇటుపక్కకు తిప్పిపెడతారా"

వాళ్ళందరూ అతనివంక పిచ్చివాడిని చూసినట్లు చూశారు.

"ఎందుకు?"

"అది సరిగ్గా మాకాలనీకెదురుగ్గా ఉంది. ఇంట్లో చెవులుపగిలిపోతున్నాయి."

ఇద్దరు వెకిలిగా నవ్వారు.

"కిటికీ తలుపులు మూసుకోండ్రి!"

"మూసుకున్నా లాభంలేదు"

"స్పీకర్ తిప్పనికి కాదువయ్యా"

"అంటే? ఇవాళంతా ఆవెధవపాటలమోత భరించాల్సిందేనన్నమాట!" కోపంగా అన్నాడు శాయిరామ్.

"ఇయాలా? ఇయాలేమీటి? తొమ్మిద్దినాలుంటదిది"

"అంటే ఆస్పీకర్ మరోవేపుకి తిప్పరన్నమాట-" సీరియస్‌గా అడిగాడురంగారెడ్డి.

"ఛల్ చల్‌మియా! నీకోసం స్పీకర్ తిప్పనికి నువ్వేం మినిష్టరువా? ఎళ్ళెళ్లు"

కొపం అణచుకుని అక్కడనుంచి వచ్చేశాము.

"రేప్రొద్దున్న పోలీస్‌కంప్లెయింట్ ఇద్దాం" అన్నాడు గోపాల్రావ్.

అరగంట గడిచిపోయింది. రెండు చెవ్వుల్లో దూదిపెట్టుకుని పడుకున్నాము. వంటింటివేపు నుంచీ చెవులుపగిలేలా శబ్దమయింది. మళ్ళీ పిల్లలులేచి కెవ్వుమని ఏడుపు మొదలెట్టారు.

"హేకృష్ణా, ముకుందా, మురారి-"

"ఇటు పక్కవీధిలో ఇంకో వినాయకుడిని పెట్టినట్లున్నారండీ..."అంది మా ఆవిడ.

రెండుమైకులు పాటలూ కలబడిపోయినయ్

"హే కృష్ణా! ఇదిగో తెల్లచీరా-ముకుందా ఇవిగో మల్లెపూలు-మురారీ ఇదిగో తెల్లచీరా-జయకృష్ణా-ఇదిగోమల్లె-ముకుందాపూలు మురారీ"

"అబ్బా!" రెండు చేతుల్తో తల పట్టుక్కూర్చున్నాను.

రెండు రికార్డులూ ఒకేసారి అయిపోయేసరికి మొఖం పగిలిపోయేటంత నిశ్శబ్దం

హఠాత్తుగా అంతనిశ్శబ్దం భరించలేక పిల్లలు భయపడిపోయి మళ్ళీ ఏడుపు ప్రారంభించారు.

కొద్దిక్షణాల్లో మళ్ళీ ఒకేసారి రెండు రికార్డులు ప్రారంభమయ్యాయి అప్పుడుగానీ ఏడుపు ఆపలేదు వాళ్ళు.

"ఏడుకొండలస్వామీ- ఏమిటంటే ఏమిచెప్పను- ఎక్కడున్నావయ్యా- ఎందుకంటే ఎలా చెప్పను- ఎన్నిమెట్లెక్కినా- అబ్బా- నిద్దరొస్తుందండీ- కానరావేమయ్యా తొలిరాత్రి-ఏడుకొండలసామీ రాదంట- ఏడుకొండలస్వామీ- ముద్దులాడాలంట- సుద్దులాడాలంట-ఆకాశమంటూ ఈ కొండ శిఖరమ్మునా- అబ్బ- వద్దండీ ఊ- ఏడుకొండలసామీ- వద్దంటే? ఎక్కడున్నావయ్యా- మ్యావ్ మ్యావ్ అందాల ఓ పిల్లీ- ఏచోటాగాంచినా నీవుండువదురే-అబ్బా- ఏమిటో నీమాయా ఎందుకండీ- తెలియకున్నా మయ్యా అందుకే అని ఎలా చెప్పను."

నేను నెత్తిమీద తలగడ విసిరికొట్టి పక్కమీదనుంచి లేచి కూర్చున్నాను. టైము అయిందయింది. ఆ చుట్టుప్రక్కల అందరిళ్ళల్లోనూ లైట్లువెలగటం కనబడుతూనే ఉంది. సాధారణంగా ఆరింటి వరకూ ఏ ఇంట్లోనూ లైటువెలగడం నేనింతవరకూ చూళ్ళేదు.

అంటే నాతోపాటు ఆ చుట్టు ప్రక్కలాళ్ళందరినీ కూడా ఆమైకులు నిద్ర లేపేశాయన్న మాట.

మరి కాలనీ వాళ్ళందరూ ఆమైకువాళ్ళను మందలించరేం? రెసిడెన్షియల్ ఏరియాలో అంతశబ్దాలు చేయడానికి ఎలా అంగీకరిస్తున్నారు?

కోపంగాలేచి బయటికొచ్చాను. అప్పటికే రంగారెడ్డి, శాయిరాం, జనార్ధన్, యాదగిరి, గోపాల్రావ్, రాజేశ్వరికాలనీలో నిలబడి సీరియస్‌గా చర్చించుకుంటున్నారు.

"ఇలా ఊరుకుంటే లాభంలేదు. కాలనీ వాళ్ళందరం కలసివెళ్ళి గొడవచేస్తేగానీ ఆమోత ఆగదు. పదండి! అందరినీ తీసుకెళదాం" అన్నాడు గోపాల్రావ్.

నేనూ వాళ్ళతోపాటు మా పక్కింటికెళ్ళాను. గది కిటికీ దగ్గరే కూర్చుని ఆఫీస్‌ఫైల్స్ చూసుకుంటున్నాడు భుజంగరాజు.

మమ్మల్ని చూసి "హలో! ఏమిటిలా వచ్చారు? మళ్ళీ ఏమయినా మీటింగా?" భయంగా అడిగాడు.

"అబ్బే! కాదు!"

"సంతోషం! మరి ఇంత పొద్దున్నే ఎందుకులేచారు? సాధారణంగా ఎనిమిదివరకూ లేవరుకదా?" చిరునవ్వుతో అడిగాడు.

"మేము లేవలేదయ్యా! ఆవెధవమైకులు లేపేసినయి" చెప్పాడు రంగారెడ్డి.

"ఓ స్పీకర్లా? సంతోషం"

"సంతోషమా, వల్లకాడా? ఆపాడుమోత మీక్కూడా పిచ్చెక్కించటంలేదూ?" చిరాగ్గా అన్నాడు శాయిరాం.

అతను నవ్వాడు.

"అదా! అదిసరిగ్గా వినిపించదుకదా మాహైద్రాబాద్‌వాళ్ళకి"

"అంటే-మాది హైద్రాబాద్ కాదేమిటి?"

"మీరు ఒక తరంనుంచే ఉన్నారు. మేము ఎనిమిది తరాలుగా ఇక్కడే ఉంటున్నాం. అంచేత ఈలౌడ్ స్పీకర్ల మోతకు వంశపారంపర్యంగా మాకు చెవుడొచ్చేసింది. అంచేత ఎంత పెద్దశబ్దాలయినా ఎప్పట్నుంచో హైద్రాబాద్‌లో ఉండేవాళ్ళనేమి చేయలేవు."

"అంటే ఇప్పుడా స్పీకర్ మోత వినిపించడంలేదా?"

"ఎక్కడో దూరంగా హిమాలయాల్లో ట్రాన్సిస్టర్ మోగుతున్నట్లుంది అంతే! మీకు బాగా వినబడుతుందా?" ఆత్రుతగా అడిగాడతను.

"వినబడటమా? చెవులు పగిలిపోతున్నయ్!"

"సంతోషం! ఇప్పుడేం పాటవస్తోంది?"

మాకు కోపం ముంచుకొచ్చింది గానీ తమాయించుకున్నాము. ఇంక అతనితో మాట్లడటం అనవసరమని బయటకు నడిచాము.

"ఇదిగో-మీరెవరయినా ఆస్పీకర్ వాడి దగ్గరికెళ్తే 'ఇదిగో తెల్లచీరా'పాటకొంచెం గట్టిగా సౌండ్ పెట్టవేయమని చెప్పండి-"

ఇంకో ఇంటి దగ్గరకు చేరుకున్నాం.

శ్రీనివాసరావ్ బయటకొచ్చాడు పళ్ళు తోముకుంటూ.

"చూశారా ఆమోత!" అడిగాడు గోపాల్రావ్.

"మూడింటినుంచి చూస్తూనే ఉన్నాను."

"అందరం కలసి అగొడవ ఆపించలేమూ?"

"మనమా?" నవ్వుతూ అడిగాడు.

"అవును-ఏం?"

"ఆ ఉత్సవం చేసేదెవరనుకుంటున్నారు? ఈ ఏరియాలోని గూండాలు. వాళ్ళు మనమాట వింటారా?"

"అయితే ఈతొమ్మిదిరోజులూ-ఈనరకం అనుభవిస్తూనే ఉండాలా?"

"నేనందుకే ఓ ప్లాన్‌వేస్తాను-"

"ఏమిటది? చెవులలో దూది పెట్టుకోవడమా!"

"అదికాదు. అదికూడా పని చేయడంలేదిప్పుడు! వరంగల్ రోడ్డులో ఉప్పల్‌కి అవతల ఊరికి సంబంధంలేకుండా మాఫ్రెండొకడు ఉంటున్నాడు. ఈవారంరోజులూ వాడింటి కెళుతున్నాను-దాంతో శనివదిలిపోతుంది"

"అంతేగాని అమైకులను ఆపే ప్రయత్నం చేయరన్నమాట!"

"వృధా ప్రయాస-అదీగాక గూండాలతో వ్యవహారం-మనకెందుకు చెప్పండి."

"అందరూ ఎవరికివారు ఏదోరకం సర్దుకుపోయేవారే. థూ! దొంగనాకొడుకులు" అన్నాడు యాదగిరి.

మళ్ళీ రెండుక్షణాలు నిశ్శబ్దం.

వెనుకవేపు రోడ్‌లో ఉన్న నర్సింగ్ హడావుడిగా గోపాల్రావ్ దగ్గరకు వచ్చాడు.

"నీయవ్వ-ఫాల్తూనా కొడుకులు. మనం ఆమోతకి బతకాల్నా, సావాల్నా? పసిపిల్లలు ఒకటే ఏడుపు" మాతో అన్నాడతను.

గోపాల్రావ్‌కి ఆనందం కలిగింది. మాలాగా బాధపడుతున్నవాడు ఒక్కడేనా దొరికాడు.

"నేనూ ందే మొత్తకుంటున్నాను. మనముగ్గురికీ తప్పితే ఇంకెవరికీ పట్టినట్టులేదు" అన్నాడు గో. -వ్.

"మీరు నాస్తాగట్గా చేసి తయారుండండ్రి! నేనూ చేసొస్తా! నీయవ్వ ఈమైక్ కిరికిరి ఎట్లఖతం కాదో సూద్దాం!" అన్నాడు నర్సింగ్-

"ఓ మేము అరగంటలో రడీ అయిపోతాం!" ఆనందంగా అన్నాడు గోపాల్రావ్.

అందరం విఠాల్రావ్ ఇంటికి చేరుకున్నాం.

"ఏమిటి సంగతి?" అడిగాడు విఠల్‌రావ్.

"అదేం ఆమైక్ కిరికిరి బంద్ చేయిద్దామనడు" అన్నాడు యాదగిరి.

"ఎందుకు?"

"అలావూరుకుంటే ఈ తొమ్మిది రోజుల్లో ఆరెండుమైకులూ కలిసి మనల్నిశవాలు చేసేస్తయ్"-గోపాల్రావ్ అందుకున్నాడు

"కానీ అపాటలుమంచిగా ఇనొచ్చుకదా" ఆనందంగా అన్నాడు విఠల్‌రావ్.

"అంత మోతపెడుతూంటే ఆపాటలు ఎంజాయ్‌చేస్తావా?" ఆశ్చర్యంగా అన్నాడు యాదగిరి.

"ఎంతమోతగున్న సరే-నాకు పాటలంటే చాలాఇష్టంభయ్! రేడియోలో రోజుకి రెండు పాటలయినా నాపేరుమీద జనరంజనిలో ప్రసారంజేస్తుంటారు. ఇనలే?" అందరం మొఖాలు చూసుకున్నాము. తిరిగి అన్నాడతను. "అన్నింటిలోకి సామజవరగమనా భలే ఇష్టం! అబ్బ! ఎన్నిసార్లయినా గానీ ఇంటా!"

సరిగ్గా అప్పుడే మళ్ళీ రెండు మైకులలో పాటలు తగులుకున్నాయి.

"సామజవరగమనా-సామజవరగమనా-సామజవరగమనా దూరన దూరన తారా దీపం-సాధుహృత్తరసాధ్యకాలాతీత విఖ్యాత-భారమయిన గుండెలో ఆరనితాపం- సామజవరగమనా-అరిమోదు చేరరాదు- ఆశాదీపం సామనిగమ జసుధామయ- ఆతారాదీపం ఈతీరని తాపం-గానవిచక్షణ గుణశీల వికసించిన మందారం నీవయ్యారం-దయాలవాల మాపాలయ సామజవరగమనా-విరియని పసికందు మొగ్గ-నీహృదయం-మనసులోన మధురమయిన-ఆమనికోయిల ఇలా నాజీవనవేణువు లూదగా మరీమరీ తిరిగేను మతిమాలిన తుమ్మెదను-మధురలాలసల దూరాన దూరాన- మధుపలాలసల- తారాదీపం- పెదవిలోని మధువు దూరాన వెత్తముపుని- తారాదీపం- జతకు చేరకు సరిగా- నిసాగని- మగ-గమ"

యాదగిరి కోపంగా విఠల్‌రావ్ వేపుచూశాడు, విఠాల్‌రావ్ మొఖం మాడిపోయింది.

"ఇను, నీకిష్టమన్నావుగా మనసారా ఇను. పదహో" అంటూ గోపాల్రావ్ చేయిపట్టుకుని బయటి కీడ్చుకొచ్చాడు.

అందరం పందిట్లోని మైక్ సిస్టం దగ్గరకొచ్చాము.

"ఇగో-ఈ సౌండ్ తగ్గిస్తారా లేదా?" కోపంగా కుర్రాళ్ళనడిగాడు రంగారెడ్డి. వాళ్ళు అతనివంక నిర్లక్ష్యంగా చూశారు.

"కమిటీ వాళ్ళనడగాలి. వాళ్ళు తగ్గించమంటే తగ్గిస్తాం"

"ఎవరుకమిటీ వాళ్ళు?"

"రాములుదాదా, లింగన్నగౌడ్‌దాదా రెడ్డీసాబ్."

"సరే-వాళ్ళనే అడుగుదాం పద" అన్నాడు గోపాల్రావ్.

ఇద్దరూ రాములుదాదా ఇంటికి చేరుకున్నారు.

"రాములున్నాడా?" ఇంటిముందు కూర్చున్న ఓ ముసలతన్ని అడిగాడు గోపాల్రావ్.

"ఎవళ్ళు మీరు?"

"మేము ఆ ప్రక్కనే కాలనీలోనే ఉంటాం!"

"ఏటిపని ఆడితో?"

"మాట్లాడాలి!" అన్నాడు యాదగిరి.

"మాట్లాడాల్నంటే మధ్యాహ్నం పన్నెండు గంటలకు రాండ్రి"

"ఇప్పుడింట్లోలేడా?"

"ఉన్నడుగానీ పదకొండు గంటలగ్గాని లేవడు."

చేసేదిలేక అందరం కాలనీకితిరిగివచ్చాము.

ఈసారి రెండు హిందీ రికార్డులు కలబడ్డాయి.

"కభి అల్విదనాకహెనా-ఓహమారీటక్కర్‌హై-కభి అల్విద నాకహెనా"

"పన్నెండింటికి వస్తాను-తయారుండు" అని చెప్పివెళ్ళిపోయాడు రంగారెడ్డి.

మధ్యాహ్నం పన్నెండింటికి మళ్ళీ అందరం రాములింటికెళ్ళాం.

"గిప్పుడే వినాయకుడి పూజగురించి పోయిండు" అన్నాడు ముసలాడు.

ఇద్దరూ రికార్డులు మోగేచోటకు చేరుకున్నారు.

"రాములువచ్చిండా ఈడకి?" ఓ యువకుడినడిగాడు విఠల్‌రావ్.

"వచ్చిండు-అగో అబార్‌లో ఉన్నాడు."

"బార్‌లోనా? "

"అవ్!"

"ఆడెందుకున్నాడు?"

అతనునవ్వాడు "బార్ల ఎందుకుంటారో ఎరికిలేదా?"

అందరూ బార్‌లోనికి నడిచారు.

ఎదురుగ్గానే ముగ్గురువ్యక్తులు కూర్చుని రమ్ తాగుతున్నారు.

"వినాయకుడి ఉత్సవకమిటీ నెంబర్లు మీరేనా?" అడిగాడు యాదగిరి

"నువ్వెవలు?"

"మేము ఈకాలనీలోనే ఉంటాం!"

"ఏం గావాల్నీకు?"

"మా ఇళ్ళల్లో అస్పీకర్‌మోతకు బేజారయిపోతున్నాం. వాటిడైరెక్షన్ అయినా మార్చండి-లేదా జరసౌండ్ అయినా తగ్గించండ్రి!"

"మీరంతా హిందువులేనా?" అడిగాడతను రమ్‌గ్లాస్ ఎత్తితాగుతూ.

"అవ్-ఏమట్ల అడిగినవ్?"

"హిందువులయుండి పండగకు లొల్లిపెడతార్వయ్యా-మనదేవుడి పండగ్గాదిది?"

"మనపండగేగాని-దేవుడి మొఖాన్న స్పీకర్లుపడేసి-మనం బార్లల్లో కూసుంటే అవతలోళ్ళకి ఎంత తక్లీఫ్ ఉంటుంది?" కోపంగా అన్నాడు యాదగిరి.

"ఇగో-ఎక్కువ తక్కువ మాట్లాడకండ్రి-ఆసౌండ్ గట్టనే ఉంటది. ఏంజేస్కుంటారో చేస్కోండ్రి" పొగరుగా అన్నాడు.

యాదగిరి ఏదో అనబోయాడుగానీ గోపాల్రావ్ అతనిచేయి పట్టుకుని బయటకు లాక్కొచ్చాడు.

"వాడితో కిరికిరి ఎందుకు మనకి-ఎక్కువమాట్లాడితే మనల్ని ముగ్గురూకలిసి ఉతికేస్తారు" అన్నాడు సమాధానపరుస్తూ.

"అట్లాని ఈదరిద్రం తొమ్మిదిరోజులెట్లనయ్యా భరించేది?"

"పోలీస్‌రిపోర్టిస్తే-దెబ్బకు దారికి వస్తారందరూ"అన్నాడు శాయిరామ్

అందరంకాసేపు తటపటాయించాముగానీ అంతకంటే గత్యంతరంలేదని పోలీస్‌స్టేషన్‌కి బయల్దేరాము.

"ఏంగావాలి?" అడిగాడు హెడ్‌కానిస్టేబుల్ చిరాగ్గా మావంకచూస్తూ.

"కంప్లెయింట్ ఇవ్వడానికొచ్చాం"

"ఎవరు మీరు?"

"అదిగో! ఆనిర్భయనగర్ కాలనీవాళ్ళం."

"ఓహో మీరేనా-సరే సరే!" తలవూపుతూ అన్నాడు "ప్రతిచిన్న విషయానికి కిరికిరిపెట్టేది మీకు అలవాటయిపోయిందని మాపాత ఇన్‌స్పెక్టర్ చెప్పాడ్లే! ఇంతకూ ఇప్పుడు ఏవిషయం గురించి కంప్లెయింట్ ఇవ్వడానికొచ్చారు?"

"ఆవీధి వినాయకుడిదగ్గర స్పీకర్లు పెట్టి మాకాలనీ వాళ్ళందరికీ న్యూసెన్సు చేసేస్తున్నారు. పిల్లలు రాత్రుళ్ళు నిద్రపోవడంలేదు. మాక్కూడా పిచ్చెక్కిపోతోంది."

"పిచ్చెక్కితే ఎర్రగడ్డ పోవాలి? పోలీస్‌స్టేషన్‌కొస్తే మేమేం జేస్తాం?"

"అంటే ఆస్పీకర్స్‌గొడవతో మీకేమీ సంబంధం లేదన్నమాట-"

"లేదని ఎవరన్నారయ్యా! ఇలాంటి పిచ్చివ్యాఖ్యానాలు చేయకండి! వాళ్ళకులైసెన్స్ ఇచ్చింది మా అసిస్టెంట్‌కమిషనర్‌సాబేకదా! సంబంధం లేదని ఎలా అంటాం?"

"అదే-అదేమేమూ అడిగేది! చుట్టుపక్కలుండేకుటుంబాల వాళ్ళకు ఎంతన్యూసెన్స్ అవుతుందో చూడకుండా పర్మిషనెట్లా ఇచ్చారు" గట్టిగా అరచాడు రంగారెడ్డి. హెడ్ కానిస్టేబుల్‌కి కోపంవచ్చింది.

"ఇంకోసారి అలా అరచారంటే మర్యాదగా ఉండదు! ఆ!" అంటూండగానే లోపల్నుంచి ఇన్‌స్పెక్టర్ వచ్చాడు కోపంగా.

"ఎవడాడు అరిచిందిప్పుడు?" అన్నాడు మావంక చూస్తూ.

"నేను" అన్నాడు రంగారెడ్డి.

"ఇంకోసారి అరచావంటే లోపటవేస్తా-" పొగరుగా అన్నాడు.

దాంతో రంగారెడ్డికి కోపం మరింత పేట్రేగిపోయింది.

"ఏమిటి? జైల్లోవేస్తావా? ఏంతప్పుచేశామని జైల్లోవేస్తావయ్యా? వేస్తేగాజులు తొడుక్కుని కూర్చుంటామనుకున్నారా?"

సరిగ్గా అప్పుడే ఓ గిరిజాలజుట్టువాడిని ఈడ్చుకొచ్చి లోపలకు తోశారు కానిస్టేబుల్స్. వాడువచ్చి ఇన్‌స్పెక్టర్‌ముందు నేలమీదపడ్డాడు. "వీడేసార్-చెరుకురసం బండివాడు"

ఇన్‌స్పెక్టర్ వాడిని కాలితో ఒక్కతన్ను తన్నాడు.

"ఏరాకొడకా! మా పోలీసోళ్ళు చెరకురసం తాగి డబ్బివ్వకుండా పోతున్నారని ఈనాడు పేపరోడి ఇంటర్వ్యూలో రాయిస్తావా?"

"అవ్‌సార్! మీరు పైసలిస్తున్రా మరి?" కిందనుంచి లేచి ధైర్యంతో అడిగాడువాడు.

"నీయమ్మ-సాలే! నీకా రోడ్‌మీద బండిపెట్టటానికి లైసెన్స్‌ఉందా? నీ బండిగురించి ఆరోడ్‌ఇరుకయిపోయి ఎన్నియాక్సిడెంట్లు అయినాయిబే! అందులో ఆరుగురు అక్కడిక్కడే చచ్చిన్రు! అయినాగానీ నీబండితియ్యమని నేనెప్పుడూ జెప్పలే. ఇంత మదద్‌జేస్తే-గన్నారస్‌కి పైసలిమ్మంటావ్‌రా" అంటూ ఇంకో తన్ను తన్నాడు.

"ఇదిగో హెడ్‌కానిస్టేబుల్! ఈడికాళ్ళూ చేతులూ ఇరగ్గొట్టి నగ్జలైట్ ఎన్‌కౌంటర్‌లో దొరికాడని అన్యూస్ పేపరోడికే ఫోన్‌జేసి చెప్పు! ఎవడితో చెప్పుకుంటాడో మాద్దాం"

అందరం భయభ్రాంతులయిపోయాం. అంతవరకూ మాలో రంగారెడ్డివల్ల పొంగి పొరలిన కోపం నీళ్ళు కారిపోయింది. వాడిని లోపలకు ఈడ్చుకెళ్ళిపోయారు కానిస్టేబుల్స్. ఇన్‌స్పెక్టర్ మళ్ళీ రంగారెడ్డి దగ్గరకొచ్చాడు.

"ఆ! నువ్వేంటంటావ్? జైల్లో వేస్తేగాజులు తొడుక్కుని కూర్చోనంటావ్? అంతేనా"

రంగారెడ్డి తడబడ్డాడు. "ఏదో కోపంలో అనేశానండీ-"

" నువ్వు ఏదయినా తప్పు చేస్తేనే జైల్లో వేయాలని రూలుందా?"

"లేదని ఇప్పుడే తెలిసిందండి"

"అయితే సక్కగ బయటకు పొండి! ఇంకోసారి ఈఏరియాలో కనిపించొద్దు."

"అలాగే సార్"

అతను కొంచెం శాంతించాడు.

"ఇక్కడి కెందుకొచ్చిన్రు మీరిప్పుడు?"

అంతా వివరించాడు శాయిరామ్.

"అవ్-వినాయకుడి పండగకు మైక్, స్పీకర్లు బరాబర్ బజాయిస్తరు. వద్దననికి మీరెవరు?"

"ఆస్పీకర్ బాధకు తాళలేక మీదగ్గరకొచ్చినం. అది ఆపుజేయిస్తారా లేదా? లేదంటే అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ పోలీస్‌కి కంప్లెయింట్ చేస్తాం-" అన్నాడు యాదగిరి కోపం అణచుకోలేక.

"ఏయ్! ఇగో-ఎక్కువ తక్కువ మాట్లాడిన్రంటే వినాయకచవితి పూజలకు మీరు అడ్డుతగులుతున్రని మతకల్లోలాల సెక్షన్‌కింద కేస్‌బుక్‌చేసి లాకప్‌లఏస్త! సమజయిందా?"

ఎంచేతో తెలీదుగానీ ఆమాట చాలా పవర్ఫుల్‌గా అర్ధమయిపోయింది మాకు. నిశ్శబ్దంగా వెనక్కుతిరిగి బయటకునడుస్తోంటే ఇన్‌స్పెక్టర్ తిట్లు వినబడుతూనే ఉన్నాయ్.

"ఫాల్తూకొడుకులు- ఆ వినాయకపూజలకు చందాలిచ్చెడిది ఈళ్ళే- బంద్ జేయిపించ మని కిరికిరి చేసెడిది ఈళ్ళే- ఇగోత్రినాట్త్రి- ఇంకొసారొస్తే అందరినీ లోపటేసేయ్."

మాకు వళ్ళుమండిపోయింది ఆ మాటలకు. చందాలు మేము ఇచ్చినమాట నిజమేగాని ఇయ్యకపోతే ఆ ఏరియా గూండాల చేతుల్లో ఏమైపోతామో మాకు తెలుసు.

అసిస్టెంట్ కమిషనర్ ఆఫీస్ దగ్గర్రైటర్ మమ్మల్ని బయటే ఆపేశాడు.

"ఏంగావాలి?" కథంతా చెప్పబోయాంగానీ అతను వినిపించుకోలేదు.

"కంప్లెయింట్ రాసివ్వండి."

అందరం రకరకాల ఇంగ్లీష్ ఉపయోగించి కంప్లెయింట్ రాసిచ్చాం-చూస్తూనే చిరాకుపడ్డాడు.

"మీకేం దమాకున్నదా లేదా? దీని మీద స్టాంప్ కొని అంటియ్యాల."

స్టాంప్కోసం అరగంటసేపు ఆటోలో తిరిగి తీసుకొచ్చాడు యాదగిరి. అది అంటించి మళ్ళీరైటర్ కిచ్చాం. అప్పుడు చదివాడతను. "ఏమిది? స్పీకర్స్ గురించి కంప్లెయింటా? థూత్" అంటూ మా మీదకు విసిరేశాడా కాగితం.

"అదేంటండీ? ఏమయింది?"

"మేమే కదయ్యా ఆ స్పీకర్స్‌కి పర్మిషన్ ఇచ్చింది-మళ్ళీ మేమే కంప్లెయింట్ ఎట్లా తీసుకుంటాం?"

"అంటే మేమీస్పీకర్స్ శబ్దాలతో పిచ్చెక్కి ఛావాల్సిందేనా"

"ఇదిగో-ఇంకోసారిలి 'ఛావాల్సిందేనా' అన్నావంటే సూసైడ్ ఎటెంప్ట్ కేస్ కింద జైల్లోవేస్తాం-"

ఆమాటతో యాదగిరి కోపం పెరిగిపోయింది.

"ఏమి? జైల్లో ఏస్తావ్? ఎయ్ సూద్దాం మళ్ళా"

మాగొడవంతా చూసి ఓ ఇన్స్పెక్టర్ బయటికొచ్చాడు.

"ఏయ్ ఏమిటిక్కడలొల్లి?"

రైటర్ జరిగిందంతా రెండుముక్కల్లో చెప్పాడు.

"సర్లే-మీరుపొండి! కానిస్టేబుల్ని పంపిస్తాం-"

మేము కాలనీ చేరుకున్న అరగంటకే ఓ కానిస్టేబుల్ వచ్చాడు మోపెడ్‌మీద. అందరం కలసి అతనితోపాటు వినాయకుడి విగ్రహం దగ్గరకు చేరుకున్నాం.

రికార్డులువేస్తోన్న దాదాతో అయిదు నిమిషాలు మాట్లాడాడతను. తరువాత ఇద్దరూ కలసి ఎదురుగ్గా ఉన్న బార్లోకెళ్ళారు.

గంటసేపటి తర్వాత తూలుతూ బయటికొచ్చాడతను. మోపెడ్ స్టార్ట్‌చేసి,మమ్మల్నిచూసి దగ్గరకు రమ్మని సంజ్ఞ చేశాడు.

"ఇగో-ఇది దేవుడి గురించి చేస్తున్న పూజ! మీరుకూడా సాయంజేయాలిగానీ కిరికిరి పెడితేఎట్ల? నచ్చినంక స్వర్గానికి ఎళ్ళాలని లేదా?" అనేసి వేగంగా వెళ్ళిపోయాడు. అతని వెనుకే వచ్చినిలబడ్డ రాములు మమ్మల్ని చూసి నవ్వుతున్నాడు హేళనగా.

కోపం అణచుకొని కాలనీలోకి నడిచాం.

రాత్రి గొడవ ఇంకా ఎక్కువయిపోయింది.

రికార్డులకు తోడు, బూతు రికార్డుడాన్స్‌లు-వాటిని చూడ్డానికి విరగబడ్డ జనం-వాళ్ళకేకలు-ఈలలు.

పన్నెండింటి వరకూ కంటిమీద కునుకులేదెవ్వరికి.

ఉండండి యాదగిరి "ఫాల్తునా కొడుకులు" అని తిడుతున్నాడు గట్టిగా. వాళ్ళ తండ్రికి ఆరికార్డుల శబ్దంవల్ల బ్లడ్‌ప్రెజర్ పెరిగిపోయిందట. ఒంటిగంటకు రికార్డుమోగటం ఆగింది. అయితే తెల్లారుజామున నాలుగింటికి మళ్ళీ మొదలయినయ్! ఉదయం ఎనిమిదింటికి అందరినీ బూతులుతిట్టుకుంటూ తండ్రిని హాస్పిటల్‌కు తీసుకెళ్ళాడు యాదగిరి.

గోపాల్రావ్ ఆఫీస్‌కెళ్ళి సాయంత్రం ఇంటికి వచ్చేసరికి అతనికోసమే ఎదుర్చూస్తున్నాడతను.

"పదండి-ఎమ్మెల్యేగారింటికెళ్దాం" అన్నాడు హడావుడిచేస్తూ.

"ఎందుకు? ఈమైక్‌ని ఆపేపవర్ ఆయనకెక్కడిది?" అన్నాడు గోపాల్రావ్.

"ఎందుకు లేదు? ఆయన పోలీస్‌స్టేషన్‌కి ఒక్కఫోన్‌కొడితే ఛట్‌మని బంద్‌అయిపోద్ది!"

"సరే! అయితే పదండి!"

అందరూ ఎమ్మెల్యే శంకర్‌దాదాగారింటికి చేరుకున్నాము.

అప్పుడే ఎక్కడికో బయల్దేరుతున్నవాడల్లా మమ్మల్ని చూచి ఆగాడు.

"నమస్కారంసార్!"

"నమస్తే-నమస్తే-నమస్తే-ఎవరు మీరు?"

"మేము ఈపక్కకాలనీ వాళ్ళం సార్! మర్చిపోయినట్లున్నారు! మిమ్మల్ని సహాయం కోరదామని వచ్చాము?"

"ఏమిటది?"

"మా ఇళ్ళపక్కకి రెండువేపులా రెండు విఘ్నేశ్వరుళ్ళను పెట్టి పూజలు చేస్తున్నారు కదండీ! వాటి తాలూకూ మైక్‌లు రాత్రింబగళ్ళు మాచెవులు పగలకొట్టేస్తున్నాయండీ!"

"అయితే చెవి డాక్టరు దగ్గరకెళ్ళాలివయ్యా! నేనేం చేస్తాను?"

"జర ఇనండి సార్! ఈఫాల్తు రికార్డుల శబ్దానికి మాఫాదర్ బ్లడ్ ప్రెజర్ ఎక్కువయింది. హాస్పిటల్లో చేర్చాల్సి వచ్చింది-"

"మరి ఇంకేంకావాల్నయ్యా! ముసలాయనను ఈతొమ్మిద్దినాలూ దవాఖానలోనే ఉండనీ! కావాల్నంటే డాక్టర్‌కి నేను ఫోన్జేసిచెప్తా! డిశ్చార్జ్‌గట్టా ఇయ్యద్దని!"

"అయితే మరి మాసంగతేమిటి సార్?"

"ఎట్లాగట్లా భరాయించాల్నయ్యా! ఆపూజలు చేస్తున్నది ఎవరికోసం? మన నియోజకవర్గంలో ఓటర్లు సుఖంగా ఉండాల్ననేగదా!"

"కానీ ఎవళ్ళింట్లోవాళ్ళు వినాయకుడిని పెట్టిపూజలు చేస్తున్నాంగద్సార్. మళ్ళీవీధుల్లో వినాయకుడెందుకు?"ఆ ప్రశ్నతో శంకర్‌దాదాకు కోపంవచ్చింది.

"మీకేం దమాకున్నదా లేదా? ఇంట్ల దేవుడున్నాడని గుడికెళ్ళటంమానేస్తారువయ్యా! తిర్పతి, కాశీపోయేటోండ్లు పాగల్‌గాళ్ళా? గిసంటి పండగల్లోనే మన పార్టీవర్కర్లు ఖుషామత్ చేసుకోనికి ఛాన్సుంటది. సమజయినాది?"

"అంటే వినాయకచవితి పండగ పార్టీవర్కర్ల ఖుషామత్ గురించిచేస్తున్రా?" రోషంగా అడిగాడు యాదగిరి.

"అవ్ మళ్ళా! ఇందుల రహస్యమేమున్నది? ఖుల్లమ్‌ఖుల్ల జెప్తున్న! ఈ ఎలక్షన్లు అయిదేండ్లకొక్కసారి అస్తయ్. మళ్ళా ఈ అయిదేండ్ల వరకు మా వాళ్ళెట్లబ్రతకాల? ఇగో-గిసంటి పండగలు, గొప్పోళ్ళ సావులు, గిట్టా వచ్చినప్పుడు చందాలు గిట్టవసూల్జేసుకుని మనిషికి ఐదారు లక్షలు సంపాదించుకోని గుజరాయిస్తుంటరు. గిదంతా మనం సూసీ సూడనట్లు పోవాలె! అంతా మనపోరగాండ్రే కదా! అంతేగాని అవిగ్రహాలు రోడ్డుకి అడ్డంగా ఎందుకు పెట్టిన్రు, రోడ్ మీద ష్యామ్యానాలేసి రోడ్ ఎందుకు బ్లాక్‌చేసిన్రు, స్పీకర్లల సినిమా పాటలెందుకేస్తున్రు అంటూ కిరికిరి పెడితే వచ్చే ఎలక్షన్ల పని ఎవళుజేస్తరు? దొంగోట్లు ఎవళ్ళేస్తరు? ఇయన్నీమంచిగ ఆలోచించాలె! వెళ్ళండ్రి ఈనాల్గుదినాలూ కండ్లూ, చెవులూ మూసుకోండ్రి! పోండ్రి!"

అప్పుడే రాములు దాదా వచ్చాడక్కడికి.

"అవ్‌రా రాములూ? ఎట్లా నడుస్తున్నది?"

"దుకాణాలోళ్ళందరూ మనం అడిగినంత చందా ఇస్తున్రు సార్! ఆరాకేష్‌మాల్ దుకాణం ఓనరుమాత్రం నకరాలు జేస్తుండు-"

"గట్లన? ఆడి మొఖంమీద యాసిడ్ కొట్టంన్రి! ఆడిపెండ్లాంమీద కూడా కొడతామని బెదిరించన్రి! సుథరాయించిపోతాడు-ఏంజెప్పున్న?"

"గట్లనేసార్-" శంకర్‌దాదాకార్లో వెళ్ళిపోయాడు.

రాములు బయటికెళ్ళ బోతూ మమ్మల్ని చూసి ఆగిపోయాడు.

"మళ్ళీ ఈడకొచ్చిన్రేమి సంగతి? ఆస్పీకర్స్ కిరికిరి గురించేనా?"

"అవును-" చెప్పాడు రంగారెడ్డి.

"అర్నియవ్వ-మీరెక్కడ లఫంగ్‌గాంగ్ దొరికిన్రుభయ్! మీకు దేవుడిమీద భక్తిగిట్ట లేదా ఏంది?"

"అచెత్తరికార్యలు పెట్టటమే భక్తి అయితే-లేదు."

"ఇగో-మీకు మంచిగచెప్తున్నా, ఇంకొక్కసారి మైక్ గురించి ఎవరికయినా కంప్లెయింట్ చేసిన్రో మంచిగుండది! పోలీసోళ్ళేం చేస్తారువయ్యా? మైక్ గుంజుకు పోతరా? అళ్ళకంత దమ్ములున్నాయ్? ఇగో-ఈ ఇనిస్పెక్టర్‌కాదు-కమీషనరు అయినగాని ఏమీ చేయ్యలేరు! సమజైనాది? ఎమ్మెల్యేకి ఎదురుమాట్లాడానికి యెవరికయా ధైర్యంఉన్నది?"

మేము బయటికొచ్చేశాము

"ఇప్పుడేం చేద్దాం!" అడిగాడు గోపాల్రావ్

"మినిష్టరుగారి దగ్గరకెళ్దాం. ఏమయినాసరే దీని అంతుతేల్చుకోవాలి..."అన్నాడు శాయిరామ్.

అందరం మినిష్టరు గారింటికి చేరుకున్నాం.

బయట ఓవ్యక్తి కూర్చుని ఉన్నాడు.

"ఎవరు మీరు? ఏంకావాలి?"

"మినిష్టరుగారితో మాట్లాడాలి"

"ఏవిషయం?"

"ఆయనతోనే చెప్తాం!"

"ఆయనతోనే మాట్లాడాలంటే వారంరోజులు ముందే అపాయింట్‌మెంట్ తీసుకోవాలి!"

గత్యంతరంలేక వచ్చినపని బయటపెట్టాడు గోపాల్రావ్.

"సంగతేమిటంటే-ఆఇళ్ళదగ్గిర జరుగుతోన్న గణపతి నవరాత్రి ఉత్సవాలమైకులు చాలా న్యూసెన్స్‌గా ఉన్నాయి. ఎవ్వరికీనిద్రలేదు. రాత్రింబగళ్ళు మోత! ఎవరికి చెప్పినా-అఖరికి రిపోర్ట్ చేసినా ఫలితం దొరకడంలేదు."

"అంటే మినిష్టరుగారిది ఇలా మైకుల గురించి ఫోన్లు చేసే ఉద్యోగం అనుకుంటున్నారా?"

"అహహ-అదికాదు-"

"ఇదిగో చూడండి! మీకు తెలీదనుకుంటాను. ఇవాళ ఈమిష్టరుగారే ఎనిమిదిచోట్ల విఘ్నేశ్వర పూజకు హాజరవుతున్నారు. మరి అమైకులు తీసేయమని వాళ్ళకు అయనెట్లా చెప్తారు? కొంచెమయినా మీకు కామన్‌సెన్స్‌లేకపోతే ఎలా?"

"అంటే మేమింకా ఈనరకం భరించక తప్పదంటారు! అంతేనా!"

"మీనరకంసంగతి మాకెందుకయ్యా! మా మినిష్టరుగారిపార్టీ కంటే బి.జె.పి.వాళ్ళు ఎక్కువ విగ్రహాలు పెట్టారని ఇప్పుడే మా మినిష్టరుగారికి తెలిసి నానాబాధాపడుతున్నారు. ఇప్పటికిప్పుడు ఇంకో పద్దెనిమిది వీధుల్లో విగ్రహాలు పెట్టిపూజలు ప్రారంభించాలని అయన పావం పిచ్చికుక్కలాగా తిరుగుతున్నారు ఉదయంనుంచీ! ఇవ్వుడు టైము ఒంటిగంటవుతున్నా ఇంతవరకూ ఒక్కపెగ్గుకూడా తాగలేదు. వినాయకుడి పూజంటే అంత భక్తి ఆయనకు-అవునూ! మీకాలనీలోపల వినాయకుడి విగ్రహాలేమయినా పెట్టారా?" ఆత్రుతగా అడిగాడతను

"ఎందుకు?" భయంగా అడిగాడు శాయీరామ్.

"ఎందుకేమిటయ్యా! అర్జంటుగా ఇంకోపద్దెనిమిది చోట్లవిగ్రహాలు పెట్టాలని మినిష్టరుగారు స్థలాలకోసం తిరుతున్నారని చెప్పలే? మీకాలనీలోకూడా ఒకటో రెండోపెట్టేస్తే సమస్య తీరిపోతుందాయనకు-"

మాకు భయం వేసింది.

మాకాలనీ లోపల విగ్రహం పెట్టలేదని తెలిసిందంటే తక్షణం రెండు విగ్రహాలు వచ్చేస్తాయి. నెమ్మదిగా పదిఅడుగులదూరం వెనక్కునడిచి అక్కడినుంచి వెనక్కుతిరిగి వేగంగా పరుగెత్తాము.

"ఏయ్-మీకాలనీ అడ్రసిచ్చిపోండి! మిమ్మల్నే" అంటూ అతను అరుస్తున్నా వినిపించు కోలేదు. నీరసంగా కాలనీ చేరుకున్నాం.

అప్పటికే స్పీకర్స్‌లో పాటల ఉధృతం పెరిగిపోయింది.

"అంటే మనచావు మనమే ఛావాలన్నమాట" పళ్ళుకొరుకుతూ అన్నాడు గోపాల్రావ్.

"ఇప్పుడేకాదు. మన డెమొక్రసీలో ఎప్పుడూ ఎవడిచావువాడు చావవలసిందే" అన్నాడు రంగారెడ్డి.

ఎవరిళ్ళకు వాళ్ళు చేరుకున్నాం.

హఠాత్తుగా మూడోవేపునుంచి మరోస్పీకర్‌లో సినిమాపాటలు భయంకరమయిన శబ్దంతో వినిపించసాగాయ్. దీంతో అన్నివేపులనుంచీ ముట్టడి ప్రారంభమయింది.

"వందనం-అభివందనం-నాంపల్లి స్టేషన్‌కాడరాజాలింగా-నీ అందమే ఒకనందనం-రాజాలింగా- రామరాజ్యంతీరునూడు-శివాశంభులింగా-నిన్నకురేపుకు సంధిగనిలచిన ఓసుందరీ- లింగా- రామరాజ్యంతీరూసూడు-పాదాభివందనం-శివాశంభులింగా-కన్నులు పొడిచిన చీకటిలో- తిందామంటే తిండీలేదు-ఆరే దీవపు వెలుగుల్లో-ఉదమంటే ఇల్లేలేదు-తీరని ఊహలరేవుల్లో- చేద్దామంటే కొలువూలేదు-తీరంచేరనిపడవల్లో-పోదామైటే నెలవూలేదు- వస్తాననీ, నేను వస్తానని- గుక్కెడు గంజీ కరువైపోయే ఒక్కడి పెళ్ళాం బరువైపోయే తలవులు తలుపుకు తనువిచ్చీ, వలవులగడవకు నడుమిచ్చీ-బీదాబిక్కిపొట్టలుకొట్టి- మేడలుకట్టే చీకటిశెట్టి- ఎదురు చూచిన సారిక, అభిసారిక, సారి వందనం-నాంపల్లిస్టేషన్‌కాడి రాజాలింగా-వందనం---"

నేను ఇంట్లోకొచ్చి పడుకున్నాను. భోజనం కూడా చేయబుద్ధి కావటంలేదు. గుండెలమీదసమ్మెట పోట్లలా, చెవుల్లో హోరెత్తిపోతూ, శబ్దాలు! రాత్రితొమ్మిది- పది- పదకొండు- ఒంటిగంటా.

"హే కృష్ణా, ముకుందా, మురారీ, ఇదిగో తెల్లచీరా, ఇవిగో మల్లెపూలు, రెండూకావాలా? ఆరెండూకావాలా? వందనం,అభివందనం, నాంపల్లిస్టేషన్‌కాడా, సామజవరగమనా, సామజవరగమనా, ఇంటింటి రామాయణం, వింతమయినప్రేమాయణం, దూరానదూరాన తారాదీపం, శంకరా,నూదిలో దారం, సందులోబేరం, సన్నయిరాగానికి ఈ చిన్నారి నాట్యానికి ఆడించు ఆడించు గానుగా, జననీ జన్మభూమిశ్చ, ఓ సుబ్బారావు, ఓ అప్పారావూ, సరిగమలు, లేపమంటావా, నన్నే లేపమంటావా, అంతవాడు అంతకు ఇంతై ఎంతో ఎదిగిపోయాడమ్మా, ఆగదు ఆగదు ఏనిమిషము, ఆగితే సాగదు ఈలోకము, పాలుకావాలా? పండుకావాలా?" మంచం మీదనుంచి హఠాత్తుగా లేచి కుర్చున్నాను.

అప్పుడే స్పీకర్ శబ్దాలు ఆగిపోవటంతో అంతాగాఢనిద్రలోకి జారిపోయారు. ఏదో పూనకం ఆవహించినట్లు బయటకు నడిచాను. ఎదురుగ్గా గొడ్డలి పట్టుకుని నిలబడి

ఉన్నాడు యాదగిరి. అతని వెనుక పక్కన రంగారెడ్డి గడ్డపలుగు పట్టుకుని ఉన్నాడు అతనివెనక గోపాల్రావ్ పారతో.

అందరూ నాలాగానే పూనకంపూనినట్లున్నారు. ఎవ్వరూ ఏమీ మాట్లాడుకోలేదు.

స్పీకర్స్‌లో పాటలన్నీ ఆగిపోయి భయంకరమయిన నిశ్శబ్దం తాండవిస్తోందా ప్రాంతమంతా! నిశ్శబ్దంగా నడవసాగాం అందరం.

* * *

మర్నాడు ఉదయం నాలుగ్గంటలకు మాకాలనీ చుట్టూ ఉన్న మూడు స్పీకర్స్ శబ్దాలు చేయలేదు. నేను ఎనిమిది గంటలవరకూ హాయిగా నిద్రపోతుంటే మా ఆవిడ పరుగుతో వచ్చినిద్రలేపింది.

"చూశారా-ఎంత విచిత్రం జరిగిందో?" అడిగిందామె.

"ఏం జరిగింది?" కళ్ళు మూసుకునే అడిగాను.

"ఆరోడ్‌మీదున్న వినాయకుడి విగ్రహాలు రాత్రిమాయమయిపోయాయట!"

"అలాగా?" ఏమీ తెలీనట్లు నవ్వాపుకుంటూ అడిగాను.

"ఇదేదో ఆదేవుడిలీలే అని జనం తండోపతండాలుగా వచ్చి చూస్తున్నారు పావలా పావలా టికెట్ పెట్టారు ఆ ఉత్సవకమిటీవాళ్ళు."

నేను ఉలిక్కిపడిలేచి కూర్చున్నాను.

అప్పుడే ఓ గొంతుస్పీకర్‌లో వినబడుతోంది.

"అమ్మలారా-అయ్యలారా! అందరూక్యూలోరండి! భగవంతుడు. తనంటతాను మాయమయిన ప్రదేశం చూసి తరించండి" దాని వెనుకే మళ్ళాసినిమా పాటలు. నాకు నిజంగానే పిచ్చెక్కి నట్లయింది.

*



# ఫ్రీ డెలివరీ



మాకాలనీ నగరంబయట అఘోరించిందన్న విషయం మీకు తెలుసుకదా! మాదేకాదు. మాలాంటి మిడిల్‌క్లాస్ పక్షులందరూ నగరానికి చాలాదూరంగా నెట్టివేయబడడంవల్ల వెలసిన కాలనీలు చాలా వున్నాయ్ మాచుట్టుపక్కల. ఈకాలనీల్లో వాళ్ళెవరూ సాధారణంగా ఓట్లువేయరు, వేసినాప్రతి పక్షానికే వేస్తారు. గనుక ఈకాలనీల గురించి పట్టించుకునే వారెవరూ ఉండరు.

ముఖ్యంగా మానిర్భయ్ నగర్ కాలనీ పరిస్థితి మరీదారుణం. మంచినీళ్ళసప్లయ్ ఉండదు. రోడ్లసంగతి మీకు తెలుసుకదా! లైట్లు సరేసరి! దోపిడీలకు వచ్చే దొంగలు టార్చ్‌లైట్స్ వేస్తేనేగాని రాత్రిళ్ళు కాంతి ఎలా ఉంటుందో తెలీదు. (రోడ్‌లాంటి చోట) రాత్రి తొమ్మిదిదాటితే బస్‌లుకనిపించవ్. ఒకటే ఒక్కబ్యాంక్‌వుందిగానీ అది నేషనలైజ్ అయిన దగ్గర్నుంచీ వీలయినంతవరకు కస్టమర్స్‌ని చిత్రహింసలు పెట్టి ఎకౌంట్స్ ఎత్తేసుకుని పారిపోయేలా చేస్తోంది. ఎందుకంటే వర్క్‌లోడ్ తగ్గించడానికని ఉద్యోగులు అనధికార పూర్వకంగా చెప్పారు.

ఇలాంటి పరిస్థితుల్లో ఓ రోజు తెల్లారుజామున నాలుగ్గంటలకు మా ఇంటి తలుపు గట్టిగా కొట్టడం వినిపించి మెలకువ వచ్చింది నాకు. ఛటుక్కున లేచి కూర్చున్నాను. ఒకవేళ దొంగలేమో అని అనుమానం వచ్చింది. కాలండర్‌వేపు చూశాను. అవి నెలాఖరురోజులు గనుక దొంగలయి వుండరని అర్థమయిపోయింది. (వాళ్ళు సాధారణంగా జీతాలు వచ్చిన ఒకటి రెండు రోజుల్లోనే వచ్చేస్తారు) మా ఆవిడనిద్రలో 'విశ్వామిత్ర విశ్వామిత్ర' అంటూ కలవరిస్తోంది.

"ఏయ్ లేలే! ఎవరో తలుపు కొడుతున్నారు చూడు!" అంటూ గట్టిగా అరిచేసరికి ఉలిక్కిపడి లేచి గాబరాగా నావేపు చూసింది.

"ఏవండీ! అన్నగారి విశ్వామిత్రను నిజంగా సుప్రీంకోర్టువాళ్లు ఆపేశారా?" అంది ఖంగారుగా.

"నీమొఖం! అదంతా నీకలగానీ వెళ్ళి తలుపుతియ్ ఎవరొవచ్చారు"అన్నాను సర్దిచెపుతూ. ఆమె అది కల అయినందుకు సంతోషిస్తూ వెళ్ళి తలుపు తెరిచింది. శాయిరామ్ ఆదుర్దాగా లోపలికొచ్చాడు, నాకు వళ్ళు మండిపోయిందతన్ని చూసేసరికి.

"ఏం బ్రదర్! నీకు రాత్రీ, పగలూ, తెల్లారుజామూ, అంటూ తేడాలేమీ లేవా?" అన్నాను కోపంగా.

కానీ శాయిరామ్ మామూలుగానే నన్ను పట్టించుకోలేదు.

"అర్జంటుగా పదగురూ! మనకాలనీరైటర్ చంద్రకాంత్ ఛటోపాధ్యాయభార్యకు నొప్పులొస్తున్నాయట! అర్జంటుగా డెలివరీకి హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి!" అన్నాడు హడావుడిగా.

నాకు నిద్రమత్తంతా ఎగిరిపోయింది.

అడపాదడపా ఇలాంటి సంఘటనలు జరగడంమామూలే మాకాలనీలో! అలాంటి సమయాల్లో ఎంతచిత్రవధ అనుభవించాలో కూడా మాఅందరికీ అనుభవపూర్వకంగా తెలుసు. ఇంకలాభంలేదని మాఆవిడతోపాటు చంద్రకాంత్ ఇంటికిచేరుకున్నాను. బయటే రంగారెడ్డి, గోపాల్రావ్, యాదగిరి, జనర్దన్, డిటెక్టివ్ రచయిత్రి రాజేశ్వరి, పార్వతీదేవి అంతా నిలబడి వున్నారు, చంద్రకాంత్ వాళ్ళందరిమధ్యా తప్పుచేసినవాడిలా తలవంచుకుని నిలబడి వున్నాడు.

"అదికాదోయ్! మీ ఆవిడ ఏ రోజయినా డెలివరీ అవచ్చని తెలుసుకదా! తెలిసికూడా ఊరిబయటకాలనీలో వుంచితే ఎలా అనుకున్నావ్? రెండ్రోజులు ముందే ఏదయినా ప్రైవేట్ నర్సింగ్‌హోంలో ఎందుకుచేర్పించలేదు?" కసురుకుంటున్నాడు రంగారెడ్డి.

"చేర్పిద్దామనుకున్నానుగానీ ప్రైవేటునర్సింగ్‌హోమ్‌లో అయితే 'సిజేరియన్' ఆపరేషన్ చేస్తారుకదా! దానికి బోలెడు డబ్బు కట్టాల్సివస్తుందని-ఇంట్లోనే వుంచేశాను"అన్నాడు భయంగా.

మాకు అతని మాటలు సరిగ్గాఅర్థం కాలేదు.

"ఏమిటి? సిజేరియన్ ఆపరేషన్‌చేస్తారా? నీకేం మతిపోలేదుకదా! సిజేరియన్ ఆపరేషన్ ఎందుకుచేస్తారు? ఎవరికయినా డెలివరీ కష్టం అయితే, తప్పనిసరి పరిస్థితుల్లో చేస్తారు" అన్నాడు గోపాల్రావ్.

"అవి పాతరోజులు గురూ! ఇప్పుడు కావాలని ప్రతివాళ్ళకీ సిజేరియన్ చేసేస్తున్నారు"

"ఎందుకలా?"

"ఫీజు ఎక్కువ వస్తుందని! మామూలు డెలివరీ అయితే బిల్‌ఎక్కువ అవడంలేదని ఈకొత్తపద్ధతి ఇంట్రడ్యూస్ చేశారు. ఈపద్ధతికనిపెట్టాక యిప్పుడు నర్సింగ్‌హోమ్‌ల లాభం తెగపెరిగిపోయిందట."

మాకేం చేయాలో తెలీలేదు

"ఇప్పుడామెని గవర్నమెంట్ హాస్పిటల్ కెలా తీసుకెళ్ళడం?" అడిగాడు గోపాల్రావ్.

"ఎవర్నయినా ఆటోకి పంపించండి"

మరుక్షణం జనార్ధన్ ఓమోపెడ్‌మీద ఆటోవేటకు వెళ్ళిపోయాడు. అతను తిరిగివచ్చే సరికి తెల్లారిపోయిందిగానీ ఆటో రాలేదు.

"ఆటో ఏమయింది?" అడిగాడు రంగారెడ్డి ఆదుర్దాగా.

"ఆటోలు ఎక్కడాలేవు! ఒకే ఒక్కటి ఎన్.టి.ఆర్. నగర్ దగ్గర వుందికానీ డ్రయివర్ ఉదయం ఎనిమిదిగంటలగ్గాని నిద్రలేవడట."

"మీటర్‌మీద అయిదు రూపాయలు ఎక్కువ ఇస్తాననకపోయారా?"

"వందరూపాయ లెక్కువిచ్చినా నిద్ర డిస్టర్బ్ అవనీడట "నేనేం గవర్నమెంట్ సర్వెంట్‌ననుకున్నారా- ఒకటైమూపాడూ లేకుండా పనిచేయడానికి?" అంటూ కసురుకున్నాడు.

అందరం మొఖాలు చూసుకున్నాం.

"ఏం చేద్దాం?" అడిగాడు శాయీరామ్.

నేను టైమ్ చూసుకున్నాను.

ఏడవుతోంది.

"ఎనిమిదయితేగానీ ఆటోలు మనకాలనీవరకూ రావు" అన్నాడు గోపాల్రావ్.

"అయితే అప్పటివరకూ ఆగుదాం! మనందరం కూడా అప్పటికి మొఖాలు కడుక్కుని రడీ అయిపోవచ్చు" అన్నాడు జనార్ధన్.

అతని ఆలోచనబాగానేవుందని ఎవరిళ్ళకు వాళ్ళు బయలుదేరాం. మళ్ళీ ఎనిమిది గంటలకల్లా అందరం చంద్రకాంత్ ఇంటి దగ్గర ఎసెంబుల్ అయ్యాం.

చివరకు ఎనిమిదిన్నరకు ఓఆటో కనిపించింది.

అందరం పరుగుతో వెళ్ళిరోడ్డుకడ్డంగా చేతులుపట్టుకుని నిలబడ్డాం. మా చేతులమధ్య నుంచి దూరిపోవడానికి ప్రయత్నించి వెనుకకూడా ఇంకోరెండువరుసల్లో మాకాలనీవాళ్ళు అడ్డంగానిలబడటంవల్ల గత్యంతరంలేక ఆపేశాడతను.

అందరం కలసి అతనిని బ్రతిమలాడాము. రూల్స్‌ప్రకారం అతనెలాగూ ఆటోనడపడన్న విషయం మాకు తెలుసునని, కేవలం జంటనగరాల పౌరులమీద జాలితో, త్యాగనిరతితో ఆటోనడుపుతున్నాడన్న సంగతి మేము అర్ధంచేసుకున్నామనీ చెప్పాము. ఎలాగయితేనేం, మీటర్‌మీద పదిరూపాయలు ఎక్స్‌ట్రా ఇవ్వడానికి మేమంతా అంగీకరించడంతో అందరం ఆనందంగా ఆటోని జాగ్రత్తగా కాపాడుతూ (వెనక్కి తిరిగి పారిపోకుండా) కాలనీలోకి తీసుకొచ్చాము.

చంద్రకాంత్ భార్యను ఆడాళ్ళు అందరూ కలసి ఆటోలోకి చేర్చారు. మామిసెస్ ఆమెను జాగ్రత్తగా పట్టుకుని కూర్చున్నాక ఆటోబయల్దేరింది.

మేమంతా వెనుక మాకాలనీవాళ్ళ మోపెడ్స్‌మీదా, స్కూటర్లమీదా బయల్దేరాం. సరిగ్గా చాదర్‌ఘాట్ బ్రిడ్జి దగ్గరకొచ్చేసరికి పోలీస్ విజిల్స్ మార్మోగిపోయినయ్. కొంతమంది ట్రాఫిక్‌పోలీసులు గట్టిగా కేకలువేస్తూ మాఆటోనీ, స్కూటర్లనూ మిగతాట్రాఫిక్‌తోపాటు ఆపేశారు.

అన్నివేపులా ట్రాఫిక్ ఆగిపోయింది.

"ఇదేమిటి? ఎటోకటు వెళ్ళనీయాలి కదా! అన్నిసైడ్సూ ట్రాఫిక్ అలా ఆపేశారేమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు శాయిరామ్ నన్ను.

శాయిరామ్ గొంతువినడంతోనే ఓ ఇన్‌స్పెక్టర్‌గట్టిగా కేకలువేస్తూ మా మీదకు దూసుకొచ్చాడు.

"ఏయ్?తుమ్‌లోగోంకో అకల్‌నైహైక్యా? ఖామోషీసే ఖడేహోజావ్" అన్నాడు శాయిరామ్‌ని కొట్టేట్లుచూస్తూ.

"అరే! ఎందుకాపారు అనడిగితే అంత కోపమెందుకండీ?" మొండిగా అడిగాడు శాయిరామ్. ఇన్‌స్పెక్టర్ ఇంకా మండిపడిపోయాడు.

"సైలెన్స్!" అంటూ ఫాక్టరీ సైరన్‌లా అరచాడు.

దాంతో అందరూ నిశ్శబ్దమయిపోయాం.

ఈలోగా మావెనుక ఎవరో ఆటోవాడు హారన్‌కొట్టడంతో పిచ్చికోపంతో అటువేపు పరుగెత్తాడతను.

"సాలే-కోన్‌సైరే హారన్‌మారేసు? షరమ్ నైహై తేరేకో? సబ్‌లోగ్ ఖామోషీసే ఖడేహోజావ్!" అంటూ మరింత క్రూరంగా అరిచాడు.

అందరం సైలెంటయిపోయాం. సెంటర్‌లో వైర్‌లెస్‌సెట్ పట్టుకుని నిలబడ్డ మరోపోలీస్ అధికారిటైమ్ చూసుకున్నాడు.

"అ టైమయింది! విజిల్ వేయండి" అంటూ అరిచాడతను నాలుగు వేపుల్నుంచీ పోలీస్ విజిల్స్ మార్మోగిపోయినయ్ మళ్ళీ.

అంతా ఆశ్చర్యంగా అయోమయంగా చూస్తున్నారు.

"అమ్మా-అబ్బా-" అంటోంది ఆటోలో నొప్పులుపడుతోన్న చంద్రకాంత్ భార్య.

అమె గొంతు వినడంతోనే "ఖామోష్" అంటూ భీకరంగా అరిచాడు మా ముందు నిలబడ్డ కానిస్టేబుల్. ఇన్‌స్పెక్టర్ మండిపడుతూ మాఆటోదగ్గరకొచ్చాడు.

"ఏయ్ ఎవళ్ళిక్కడ దిల్లగీ చేస్తున్ను" తీవ్రంగా అడిగాడు.

"ఆమెకు నొప్పులొస్తున్నాయండీ! అందుకని అరుస్తోంది."

"నొప్పులొస్తే డిస్ప్రిన్ టాబ్‌లెట్స్ వేసుకోమనవయ్యా! అరిస్తేఎలా?" మరో కానిస్టేబుల్ మాదగ్గరకొచ్చాడు.

"అనొప్పులు కాదండీ! అమెకు నెలలు నిండాయ్. డెలివరీకి హాస్పిటల్‌కి తీసుకెళుతున్నాం. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది మా ఆటోని వదిలేస్తే మేము వెళ్ళిపోతాం" చెప్పాడు రంగారెడ్డి.

అమాట వినడంతోనే ఇన్‌స్పెక్టర్ కోపంగా రంగారెడ్డి దగ్గర కొచ్చాడు.

"మీకేందమాకున్నదా? రెండునిమిషాలు నిలబడడానికి లొల్లిపెడతరేమయ్యా! అయినాగాని ఆమెకిదే టైమ్‌దొరికిందా నొప్పులు తెచ్చుకోడానికి?"

"కానీ ఇప్పటికి మమ్మల్ని నిలబెట్టి అయిదు నిమిషాలయింది కద్సార్ "అడిగాడు శాయిరామ్.

"ఇగో ఎక్కువతక్కువ మాట్లాడకండ్రి తొమ్మిదిగంటలకెల్లి తొమ్మిదీ రెండునిమిషాల వరకూ ఖామోషీతోటుండాలె!"

"ఎందుకు సార్! ఇటువేపు సి.ఎమ్‌గానీ, గవర్నర్‌గానీ వెళుతున్నారా?" అడిగాడు ఇంకో స్కూటర్‌వాలా.

"నిన్ననే పేపర్ల ఇచ్చినం ఇయాళ మార్టీర్స్‌డే అని! సదవలే నువ్వు?తొమ్మిదిగంటలకెళ్ళి తొమ్మిదీ రెండు నిమ్షాలవరకూ పూరాశహార్ రుకాయిస్తదని టి.వి.లో గూడా జెప్పిను. ఇనలే?"మరింత కోపంతో అన్నాడతను.

"మార్టీర్స్‌డే అంటే ఏమది?" కుతూహలంగా అడిగాడు యాదగిరి.

ఇన్‌స్పెక్టర్ కొంచెం కన్‌ఫ్యూజయాడు.

"ఏయ్ నీయవ్వ-మార్టీర్స్‌డే అంటే ఎరుకలేదువయ్యా? కైసేకైసే లోగ్‌హైభయ్ యేశహర్‌మే" అనేసి అక్కడనుంచి జారుకున్నాడు

సరిగ్గా తొమ్మిదిగంటలకు మళ్ళీ విజిల్స్ మ్రోగిపోయినయ్.

అందరం రెండునిమిషాలు ఎప్పుడవుతుందా అనివాచీలు చూసుకోసాగాము. మావెనుక పెరిగిపోతున్న వాహనాల హారన్స్, కేకలు, అరుపులు ఇంకా పెరిగిపోతూనేవున్నాయ్.

ఆటోలో చంద్రకాంత్ భార్య వేసేకేకలు ఎక్కువయి పోతూనే వున్నాయ్. సరిగ్గా తొమ్మిదీరెండుకి ట్రాఫిక్ కదిలేందుకు అనుమతి ఇచ్చారు పోలీసులు. అప్పటికే అన్నివేపులా ట్రాఫిక్ పెరిగిపోవడంవల్ల మామూలుగానే ట్రాఫిక్ జామ్ అయిపోయింది.

ఆ జామ్ నుంచి మేమూ, మాఆటో బయటపడేసరికి పదయిపోయింది. అప్పటికే చంద్రకాంత్ భార్యకు నొప్పులెక్కువయిపోయి గట్టిగా ఏడ్చేస్తోంది.

"ఆటో త్వరగా పోనీ" అరిచాడు శాయిరామ్.

ఆటో డ్రైవర్ వేగం పెంచాడుగానీ మళ్ళీగట్టిగా పోలీసులు విజిల్స్‌వేస్తూ ఎక్కడి వాహనాలక్కడ ఆపేస్తూకనిపించారు.

లాఠీతో మావేపు దూసుకొచ్చి మాఆటోనూ, స్కూటర్లనూ, మోపెడ్‌ని రోడ్డుపక్కకు నెట్టేశాడు ఓ కానిస్టేబుల్.

"మళ్ళీ ఏమిటిప్పుడు?" కోపంగా అడిగాడు రంగారెడ్డి ఆకానిస్టేబుల్‌ని.

"గవర్నర్ ఓల్డ్‌సిటీలో 'పౌరుల ఇక్కట్లు' అనేసదస్సు ప్రారంభోత్సవానికెళుతున్నారు. ఆకార్లు వెళ్ళేవరకూ ట్రాఫిక్ ఆగాలి."

"కాని ఇవతల మా ఆవిడ పురిటి నొప్పులతో బాధపడుతోందయ్యా!" ఆదుర్దాగా, అన్నాడు చంద్రకాంత్.

"కుదరదండీ! గవర్నర్ వెళ్ళేవరకూ ఎవరూ కదలడానికి వీల్లేదని మా అసిస్టెంట్ కమీషనర్ గారు గట్టిగా చెప్పారు."

"అంటే డెలివరీకేసుల్ని కూడా ఆపేయమన్నారా?"

"డెలివరీఏమిటిసార్? హార్ట్ఎటాక్ కేసులయినా సరే! గవర్నర్ వస్తున్నారంటే నిలబడిపోవల్సిందే!"

"ఈలోపల ఆ పేషంట్హార్ట్ ఎటాక్తో ఎగిరిపోతే?"

"పోతేపోనీండిసార్! గవర్నర్ ప్రారంభోత్సవం కంటే ఎక్కువా ఒక ఆర్డినరీ సిటిజన్ ప్రాణం?"

అప్పుడే చంద్రకాంత్ భార్యమళ్ళీ బాధగా అరవడం మొదలుపెట్టింది ఆటోలోంచి.

"బాబ్బాబు మమ్మల్ని రోడ్దాటనీయండిసార్! హాస్పిటల్ వరకూ చేరుకున్నాక ఇక్కడిలా ఆపేయడం భావ్యంకాదు" బ్రతిమాలాడు శాయిరామ్.

"అరె! చెపుతూంటే నీక్కాదయ్యా! మిమ్మల్ని వదిలానంటే నాఉద్యోగంపోతుంది?"

"చూడండి! ఆపదలో ఉన్నగర్భవతి ప్రాణం ముఖ్యమా, మీఉద్యోగం ముఖ్యమా మీకు?"

అతను ఓక్షణం ఆలోచించాడు.

"నా ఉద్యోగమే ముఖ్యం" అన్నాడు వెంటనే. "పాతికవేలుపెట్టి కొనుక్కున్నానిది"

అందరం ఉలిక్కిపడ్డాం.

యాదగిరి మోపెడ్దిగి దగ్గరకువచ్చాడు.

"పోనీ ప్రైవేట్ నర్సింగ్హోమ్కి తీసుకెళ్దాం భాయ్! పాపం ఆమెకు నొప్పులు బడాయించి పోయినయ్" అన్నాడు ఆదుర్దాగా.

"ఇక్కడెక్కడుంది నర్సింగ్హోమ్?" అడిగాను నేను.

"ఆరెండోస్ట్రీట్లో ఉంది. వెనక్కుపోదాం పదండ్రి ఈ గవర్నర్ ఎప్పటికొచ్చేనో ఏమో?"

అందరం ఆటో తీసుకుని వెనక్కు తిరిగాం.

చంద్రకాంత్ వాళ్ళావిడ బాధచూడలేక తనూ ఏడ్చేస్తున్నాడు.

తీరా నర్సింగ్హోమ్ ఇవతల చౌరస్తా దగ్గరకొచ్చేసరికి మళ్ళీ పోలీసులు చాలా మంది రోడ్డుకి అడ్డంగా నిలబడి కనిపించారు.

"ఏయ్! ఆటో! రోకో-ఉధర్రాస్తా బంద్హై" అరిచాడు-ఓకానిస్టేబుల్.

మాగుండెల్లో రాళ్ళు పడినయ్.

"రాస్తాఎందుకు బంద్ వుంది?"

"గణేష్ నిమజ్జనం ప్రొసెషన్ వెలుతోంది- డైవర్షన్! లెఫ్టికి వెళ్ళిపోండి" అరిచాడు ఓ ఇన్‌స్పెక్టర్.

"కానీ మేము రైట్‌కి తిరిగి ఆనర్సింగ్‌హోమ్ కెళ్ళాల్సార్. చాలా అర్జెంట్! డెలివరీకేస్" ఆత్రుతగా చెప్పాడు రంగారెడ్డి.

"లెఫ్ట్ కెళ్ళి తిరిగిరండి! కమాన్! ఛలో" మామాట వినిపించుకోకుండా అరిచాడు.

"కానీ లెఫ్ట్ కెళితే ఎక్కడికెళతాంసార్? మళ్ళీకాచిగుడా అంతా తిరిగి రావాలికదా?"

"ఏయ్! పోతారా లేదా?" లాఠీ తీసుకొస్తూ అరిచాడు ఇంకో కానిస్టేబుల్. చేసేదిలేక అందరం లెఫ్టికితిరిగిపోయాం.

ఆ సందు ఎక్కడికెలుతుందో ఎవరికీ తెలీదు.

చాలాసేపు ఆసందులో వెళ్ళాక ఆటో కాచిగుడా చేరుకుంది.

అక్కడినుంచీ ఎక్కడికెళ్ళాలో ఎవరికీ అర్థంకాలేదు.

"పోనీ కింగ్‌కోఠీలో ఇంకో హాస్పిటల్ వుంది అక్కడికెళదాం"అన్నాడు గోపాల్రావ్.

"దానికెలా వెళ్ళాలి?"

"తిన్నగా వెళ్ళడానికి వీల్లేదు వన్‌వే!" అన్నాడు ఆటోడ్రయివర్.

"అయితే నారాయణ్‌గూడా మీదుగా వెళదాం"అన్నాడు జనార్థన్.

ఊరేగింపు మళ్ళీ నారయణ్‌గూడావేపు మళ్ళింది.

హఠాత్తుగా అక్కడ మళ్ళీ పోలీసులు అడ్డంనిలబడి కనిపించారు. మాకు కోపం ఆగడంలేదు.

"బహుశా ఇలా భార్యను డెలివరీకోసం హాస్పిటల్‌కి తీసుకెళడానికి ప్రయత్నించిన వాళ్ళే నగ్జలైట్స్‌గా మారిపోయి వుంటారు" అన్నాడు రంగారెడ్డి కసిగా.

"ఇటువెళ్ళడానికి వీల్లేదు!" అరిచాడు కానిస్టేబుల్.

"ఏం? ఎందుకని?"

"వెస్టిండీస్-ఇండియా క్రికెట్‌మాచ్ కదయ్యా! ఆమాత్రం తెలీదా? ట్రాఫిక్‌డైవర్షన్."

"అవతల ఆడమనిషి పురిటినొప్పులతో బాధపడుతోందయ్యా! అర్జంటుగా హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి. మీకేమాత్రం మానవత్వం లేదా? ఇటు వెళ్ళనివ్వండి మమ్మల్ని" కోపంగా అన్నాడు గోపాల్రావ్.

కానిస్టేబుల్ వినిపించుకోకుండా లాఠితో మాఆటోమీద కొట్టాడు.

"ఛల్ జల్దీ-ఛలో" అంటూ అరిచేసరికి ఆటోడ్రైవర్ గాబరాపడి ఆటోని యూనివర్శిటీ రోడ్‌వేపు తిప్పేశాడు.

"పోనీ తార్నాకా మీదనుంచీ సికింద్రాబాద్ వెళ్ళి గాంధీహాస్పిటల్లో చేర్పిద్దాం" అన్నాడు చంద్రకాంత్.

అప్పటికే అతని భార్యబాధతో స్పృహతప్పేట్లు కనబడుతోంది. అయాసంతో ఒగరుస్తూ అరవడానికికూడా శక్తి చాలనట్లువుంది.

తీరా తార్‌నాకాకెళ్ళేసరికి మళ్ళీ పోలీసులు.

"ఆగండి! రోకో! ఠైరో" అంటూ అరుపులు, విజిల్స్.

"ఏమిటి మళ్ళీ? మీరున్నది జనాన్ని నరకయాతన పెట్టడానికా? ట్రాఫిక్ ఆగకుండా స్మూత్‌గా నడిచేట్లుచూడ్డానికా? మీకేమయినా బుద్ధుందా అసలు? అవతల ఆడకూతురు పురిటి నొప్పులతో బాధపడుతోందయ్యా అంటే ఒక్కనాకొడుకూ వినిపించుకోరేం?" అంటు ఎలుగెత్తి అరిచాడు రంగారెడ్డి.

ఆ కేకలతో ఆగిపోయిన జనం మావేపు తిరిగారు. చంద్రకాంత్ భార్య అప్పటికే స్పృహ తప్పింది.

"సార్! నాభార్యప్రాణం పోయేట్లుందిసార్! ఇంక జన్మలో ఆంధ్రప్రదేశ్‌లో పిల్లల్ని కనని ప్రామిస్ చేస్తున్నాను సార్! ఈ ఒక్కసారికి క్షమించి మా ఆవిడను రక్షించండిసార్!" అంటూ ఏడ్చేస్తూ పోలీస్ ఇన్‌స్పెక్టర్ కాళ్ళమీదపడ్డాడతను.

ఇన్‌స్పెక్టర్‌కి మా అందరినీ చూసి జాలివేసినట్టుంది "ఇదిగో చూడండి బ్రదర్! మేమేమీ చేయలేని నిస్సహాయస్థితిలో వున్నాం! రోజూ ఈటైమ్‌కి మన ముఖ్యమంత్రిగారు 'విశ్వామిత్ర' షూటింగ్‌కి వెళతారని తెలుసుకదా! తెలిసికూడ ఈ రోడ్‌కెందుకొచ్చారు? అయన స్టూడియో కెళ్ళేవరకూ ట్రాఫిక్‌ని వదలడంకుదరదు."

"పోనీ ఈ ఆటో ఒక్కటి వదిలేయండిసార్-ప్రమాదస్థితిలో ఉన్నారంటున్నారు కదా?" పక్కనున్నతను సలహా ఇవ్వబోయాడు.

"ఏయ్! నీసంగతి నువు చూసుకో! అర్థమయిందా? ఈ ఆటోని వదిలామంటే అంతా ప్రమాదస్థితి అంటూ వెళ్ళిపోతారు. మొన్నిట్లనే ఓ యాక్సిడెంట్ జరిగినప్పుడు తలకు దెబ్బలు తగిలినయ్యని వాడెక్కిన ఆటోని హాస్పిటల్‌కి విడిస్తేఏమయింది? ఆటో వీల్‌విరిగిరోడ్ మధ్యలో పడిపోయింది. ఆటోవాడూ, యాక్సిడెంట్‌కి గురయి దెబ్బలు తగిలినవాడూ

ఇద్దరూ చచ్చారు. దాంతో 'విశ్వామిత్ర' షూటింగ్ అరనిమిషం లేటయిపోయింది. ఎంత దారుణమో చూడండి."

చంద్రకాంత్‌కి పిచ్చెక్కిపోయినట్టయింది.

హఠాత్తుగా కానిస్టేబుల్ చేతిలోని లాఠీలాక్కుని పెద్దగా అరుస్తూ పోలీసుల మీదకు దూకాడు.

"అరేయ్-నాభార్య చావుబ్రతుకుల్లో వుందిరా! నీయమ్మ- ప్రారంభోత్సవాలూ, క్రికెట్లూ, దేవుడి ఊరేగింపులూ, సినిమాషూటింగ్‌లూ-కొడకల్లారా-ముందు మనిషిని బ్రతికించండ్రా"

పోలీసులందరూ కలసి చంద్రకాంత్‌ని పట్టుకుని వానులో వేసేశారు. ఇద్దరుకానిస్టేబుల్స్ చంద్రకాంత్‌ని కదలకుండా మీదెక్కికూర్చున్నారు.

మరో అయిదునిమిషాల తర్వాత పోలీస్ సైరనుతో జీపూ, దాని వెనక మేనక కారూ, దానివెనక విశ్వామిత్రకారూ, దానివెనక తెలుగుదేశం పార్టీకారూ అన్నీ వెళ్ళిపోయినయ్.

మేము ఆటోతీసుకుని గాంధి హాస్పిటల్‌వేపు బయలుదేరాం. ఆటోడ్రయివర్ చాలావేగంగా నడపసాగాడు.

ఆటో కొద్దిదూరం వెళ్ళిందో, లేదో హఠాత్తుగా స్పీడ్ బ్రేకర్ అడ్డువచ్చింది.దాంతో బ్రేకింగ్‌డిస్టెన్స్ చాలకపోవడంవల్ల ఆటో ఎగిరిపడింది.

మరుక్షణంలో "కేర్" మంటూపాపాయి ఏడుపు వినిపించింది.

ఆటోడ్రైవర్ ఆటోఆపి ఆనందంగా మాదగ్గరకొచ్చాడు.

"నాకు తెల్సుసార్! ఇదే స్పీడ్‌బ్రేకర్ దగ్గర ఎనిమిది మంది ఆటోలోనే డెలివరీ అయ్యారు. ఇది స్పెషల్ స్పీడ్ బ్రేకర్ సార్! ఎంతనెమ్మదిగా వెళ్ళినా నాలుగడుగులు పైకెగిరి పడేట్లు డిజైన్ చేయించింది మనస్టేట్ గవర్నమెంట్!"

మా ఆవిడ ఆటోలోనుంచి తొంగి చూసింది.

"ఏవండోయ్-ఆడపిల్ల"-అందినవ్వుతూ! "ఆటో వెనక్కు తిప్పమనండి! ఇంటి కెళ్ళిపోదాం!"

ఆటోవెనక్కు పంపించి నేనూ, రంగారెడ్డి, యాదగిరి, పోలీస్‌స్టేషనుకి బయలుదేరాం-చంద్రకాంత్‌ని విడిపించి తీసుకురావడానికి. *

# ఉత్తమ సాహిత్యం జిందాబాద్



**కాలనీ** వాళ్ళందరం పిల్లలతో సహా వేదిక దగ్గర సమావేశమయ్యాము.

సాధారణంగా ఇలాంటి సమావేశాల్లో కనిపించే ఉత్సాహం, హడావుడి, అరుపులూ కేకలూ-ఏమీ కనిపించడంలేదా రోజు.

అంతా అతి భయంకరమైన నిశ్శబ్దం అలుముకుని వుంది.

అందరి ముఖాల్లోనూ వ్యాకులత, భయం, దిగులు అలుముకుపోయినాయ్. నేనూ రంగారెడ్డి, గోపాల్రావ్, యాదగిరి, జనర్ధన్, చంద్రకాంత్ విచారంగా ఓపక్కన కూర్చున్నాం. శాయిరామ్ నెమ్మదిగా వచ్చివేదిక ఎక్కి మైక్ ముందు నిలబడ్డాడు దీనంగా.

చిన్న చిటికె వేసినా వినిపించేత నిశ్శబ్దం.

"సోదరసోదరీమణులారా! ఇవాళ మనకు చాలా విచారకరమయిన రోజు . మన కాలనీలోని డజనుమంది టెన్త్‌విద్యార్థులు- పెద్దలకు తెలీకుండా -రహస్యంగా అతి

జుగుప్సాకరమయిన సాహిత్యం చదువుతుండగా పట్టుబడ్డారు. పన్నెండుమందీ కూడా భయంకరమయిన చెడుమార్గంలోనే ప్రయాణిస్తున్నారంటే కాలనీలోని మిగతా పిల్లలుకూడా ఇదే త్రోవలో నడుస్తున్నారని వేరే చెప్పడం అనవసరం అని నాఅభిప్రాయం. కనీసం ఇప్పటికయినా మనకాలనీ పిల్లలు ఎలాంటి పుస్తకాలు చదువుతున్నారో వారితల్లిదండ్రులుతో పాటు ఇతరులుకూడా తెలుసుకుంటే భవిష్యత్తులో వారు అలాంటితప్పు మార్గంలో వెళ్ళకుండా నివారించడానికి అవకాశం ఉంటుందని నాఆశ. అందుకే ఈరోజు ఈ అత్యవసరసమావేశం ఏర్పాటు చేయవలసి వచ్చింది."

ఇంతవరకూ చెప్పి అందరివంకా ఓసారి చూశాడు శాయిరామ్, అందరిచూపులు తనమీదే నిలచివుండడంతో మరింత విచారంగా ఫోజుఇస్తూ మళ్ళీ ప్రారంభించాడతను.

"ముందుగా యాదగిరినీ, అతని కొడుకు శంకర్‌ని వేదికమీదకు రావలసిందిగా కోరుతున్నాను" అన్నాడతను.

యాదగిరి పాలిపోయిన ముఖంతో తనకొడుకుని తీసుకుని వేదికమీదకు చేరుకున్నాడు.

"యాదగిరి! మీఅబ్బాయి ఏ పుస్తకం చదువుతుండగా పట్టుబడ్డాడో ఒకసారి మన వాళ్ళందరికీ చెప్పు!" అన్నాడు శాయిరామ్.

యాదగిరి ఏదో మాట్లాడాలని తలెత్తి పెదాలుకదపడానికి ప్రయత్నించి కుదరక మళ్ళీ తలదించుకున్నాడు అవమానంతో.

"నేను చెప్పలేను. అడినే అడగండ్రి" అన్నాడు సిగ్గుతో.

"ఏరా శంకర్! నువ్ ఓవర్‌హెడ్ టాంక్ కింద ఎవరికీ కనబడకుండా కూర్చుని చదువుతున్న పుస్తకం ఏమిట్రా" అడిగాడు శాయిరామ్.

"ఇంకెప్పుడూ చదవనంకుల్ ! నన్నొదిలేయండి" భయపడిపోతూ అన్నాడువాడు.

"నిన్నేమీ చేయంలే! పుస్తకమేదో చెప్పు!"

వాడు ఓక్షణం తటపటాయించి చెప్పేశాడు "సత్యహరిశ్చంద్ర"

ఆపేరు వింటూనే అందరూ ఉలిక్కిపడ్డారు.

చాలామంది తమకు తెలియకుండానే హాహాకారాలు చేశారు.

"అయ్యో! అయ్యో! వింటిరా? ఎంత పన్జేసిండో-సత్యహరిశ్చంద్ర చదివిండట! భగవంతుడా! ఇదేంకిరికిరి తెచ్చినావ్ స్వామీ-"అంటూ యాదగిరి భార్య భోరున ఏడ్చేయసాగింది. అందరూ ఆమెను అతికష్టం మీద ఓదార్చసాగారు.

"జరిగిన నష్టమేదో జరిగిపోయింది కదమ్మా! ఆ పిల్లాడిని ఎలా మళ్ళీ మంచి మనిషిగా చేయాలో ఆలోచించాలిగానీ ఏడుస్తే ఏంలాభం?" అంది సావిత్రమ్మ.

"ఊరుకోమ్మా! కాలం అలాంటిది! పిల్లల్ని ఏం లాభం? అదిక్కుమాలిన పుస్తకాలు అమ్మినవాడిననాలి! ఎంత లాభసాటి వ్యాపారమయితే మాత్రం చిన్నపిల్లలని కూడా చూడకుండా అలాంటి బూతుపుస్తకాలమ్ముతాడా?" విరుచుకుపడింది పార్వతమ్మ.

"ఇంతకూ అపుస్తకమంతా చదివేశాడా అకుర్రాడు?" అడిగింది ఇంకొకామె.

శాయిరామ్ యాదగిరి వేపు చూశాడు.

యాదగిరి శంకర్‌వేపు చూశాడు.

"ఏమిరా! ఎన్నిదినాలకెళ్ళి సదువుతున్నావీఫాల్తూ పుస్తకం?" అడిగాడతను కోపంతోనూ బాధతోనూ.

"పదేను దినాలకెళ్ళి!"

అందరూ మళ్ళీ హాహాకారాలు చేశారు."అయితే మొత్తం చదివేసి వుంటాడు! ఇంకెలా బాగుపడతాడు వీడు?" అంది సావిత్రమ్మ.

"అందులో కథంతా సదివినావురా?" అడిగాడు యాదగిరి మళ్ళీ

"అవ్! అంతా సదివినా!"

"గంటే-హరిశ్చంద్రుడు 'సత్యం'కోసం భార్యను అమ్మేసుకొనుడు కాటికాపరిగా పనిచేసుడు అన్నీ సదివినావులే!" మరింత గాబరాగా అడిగాడు.

"అవ్! కత మొత్తం సదివినా! పాపం అరిశ్చంద్రుడు బాకీపైసలు తీర్చనికి ఎంత పరేషానయిండో మంచిగా రాసిండు నాయనా?"

అందరూ మరింత జాలిగా చూశారు వాడివేపు.

"అదంతా చదివినాంక ఇప్పుడు నీకేమనిపిస్తుందిరా?"

వాడు భయపడుతూ అందరివేపూ చూశాడు.

"చెపితే నన్ను కొడతావు నువ్వు!" అన్నాడు అనుమానంగా.

"కొట్టదులే! కొడితే అడ్డుకునే పూచీనాది! చెప్పెయ్" అన్నాడు శాయిరామ్

"నేనుగూడా ఎన్నటికీ నిజమే మాట్లాడాలని వున్నదే" భయంగా అన్నాడు.

అందరూ నిర్ఘాంతపోయారు. వాళ్ళమ్మ బిగ్గరగా ఏడ్వేయసాగింది.

"నాబిడ్డ పూరా ఖరాబయిపోయిండు దేవుడో! ఈదినాల్ల 'నిజం' పలుకుతే ఏమయిపోతాడు దేవుడో! ఈడ్నింకెవరు బచాయిస్తరు దేవుడో!" అందరూకలసి ఆమెను ఓదార్చసాగారు.

"ఏం చేస్తామమ్మా! నీఖర్మ అది! వాడాపుస్తకం పూర్తిగా చదివేసాక ఇంక ఎవరేంజేయగలం చెప్పు! వాడిఖర్మ వాడనుభవించాల్సిందే"

శాయీరామ్ మైక్ దగ్గర కొచ్చాడు మళ్ళీ.

"సోదర సోదరీ మణులారా! యాదగిరి కొడుకు చదివిన దారుణమయిన సాహిత్యం గురించి, దానివల్ల సంభవించిన అనర్థం గురించీ విన్నారు. ఇప్పుడు గోపాల్రావ్ కూడా వాళ్ళబ్బాయిని అలాంటి సాహిత్యమే చదువుతూండగా రెడ్‌హాండెడ్‌గా పట్టుకున్న విషయం గురించి వివరంగా వివరిస్తారు" అన్నాడు.

మరుక్షణం గోపాల్రావ్ దీనంగా వేదికమీదకొచ్చాడు.

"గోపాల్రావ్‌గారూ! మీ అబ్బాయికూడా మనసమాజం నిషేదించిన అశ్లీలపుస్తకాలు చదువుతూ పట్టుబడ్డాడని తెలిసింది నిజమేనా?" అడిగాడు శాయీరామ్.

"అవును!"

"ఏం పుస్తకం అది?"

"భర్తృహరి సుభాషితాలు-సుమతీ శతకం"

ఆమాట వింటూనే అందరూ "అయ్యో! అయ్యో-ఇదెక్కడి ఘోరం? మరీ భర్తృహరి సుభాషితాలా! మనరాష్ట్రం సర్వనాశనమయిపోతోంది" అనుకోసాగారు.

"ఎంతకాలం నుంచి వాడా పుస్తకం చదువుతున్నాడో కనుక్కున్నారా?"

"చెప్పుకుంటే సిగ్గుచేటు! పదిరోజుల్నుంచీ అవే పుస్తకాలు చదువుతున్నాడట."

అందరికీ గుండెలవిసి పోయినంత పనయింది.

"అమ్మో! పదిరోజుల్నుంచే? అన్ని రోజుల్నుంచీ అంత ప్రమాదకరమయిన పుస్తకాలు చదువుతూంటే మీరేం చేస్తున్నారు మరి?" చిరాకుపడ్డాడు. చంద్రకాంత్.

"మాకేం తెలుసు! పైకి కనిపించకుండా యండమూరి వీరేంద్రనాథ్, కొమ్మనాపల్లి, మల్లాది, సూర్యదేవర, యర్రంశెట్టిశాయి నవలలమధ్య పెట్టుకుని చదువుతున్నాట్ట. మేము పైనవలలు చూసి మంచిసాహిత్యమే చదువుతున్నడ్లే అనుకుంటున్నాం! తీరా ఓరోజు అపుస్తకం

చదువుతూ చదువుతూనే నిదరపోయినప్పుడు లోపలున్న సుమతీశతకం కిందపడి అసలు రహస్యం బయటపడింది! అప్పుడు పట్టుకుని చావగొడితే భర్తృహరి సుభాషితాలు కూడా చదువుతున్నానని వప్పుకున్నాడు" దిగులుగా అన్నాడు గోపాల్రావ్.

"ఏం పోయేకాలమొచ్చింది ఈకాలం పిల్లలకు? ఈనాటి సమాజంలో ఎలా బ్రతకాలో ఎలాంటి అవినీతి పనులు చేయాలో నేర్పే ఈకాలం రచయితల అద్భుత ఉత్తమ సాహిత్యం చదవకుండా అలా నీతి, నియమం, మంచీనేర్పే ఆపాతకాలంనాటి బూతుసాహిత్యం చదువుతే ఏమయిపోతారు? అడుక్కు తినాల్సిందేగా?" అంది సావిత్రమ్మ.

"ఈ చెత్తపుస్తకాలు చదివే కాబోలు, మావాడు మొన్నకాలేజ్ రోడ్‌మీదో అమ్మాయి ఎదురొస్తే, ఆ అమ్మాయి చెయ్యిపట్టుకోలేదు సరికదా! కనీసం కన్నూ గీటలేదట. మిగతా పిల్లలంతా రాగానే చెప్పారు. ఆపిల్లకూడా పాపం ఇంటికెళ్ళి ఒకటే ఏడుపట-వీడు తననలా అవమానపరచాడని! వాళ్ళనాన్న మండిపడి వీడిమీద పోలీస కంప్లెయింట్ ఇస్తానని కూర్చుంటే మిగతా వాళ్ళందరూ సర్దిచెప్పి ఆపారట! ఇంకోసారి కూడా అలాగే నీతిగా ప్రవర్తిస్తే అప్పుడు వీడిపని పడదాం అన్నారట" అంది పార్వతీదేవి. రంగారెడ్డి కోపంగా లేచి నిలబడ్డాడు.

"వీళ్ళనిలా వదిలితే లాభంలేదు! మిగతా కాలనీ పిల్లలంతా కూడా రేపు అడివిబాపిరాజు పుస్తకాలు, గోపీచంద్, రాచకొండ విశ్వనాథశాస్త్రి సాహిత్యం, యోగివేమన శతకాలూ, గురజాడ అప్పారావ్ సాహిత్యం, మునిమాణిక్యం, చిలకమర్తివారి సాహిత్యం, కాశీపట్నం,మధురాంతకం రాజారాం కథలు, కొడవటిగంటి కుటుంబరావు నవలలు చదవడం మొదలు పెడితే వాళ్ళ భవిష్యత్తేమయిపోతుంది? ఆసాహిత్యం ప్రభావం పడినీతిగా, బుద్ధిగా బ్రతుకుతామని మొండికేస్తే మనమేం చేయగలం?" ఆవేశంగా అన్నాడతను.

అందరికీ రక్తం ఉడికిపోతున్నట్లయింది. మరోపక్క పిల్లల పరిస్థితి తల్చుకుని భయం.

"అవును! మనం వీళ్ళనిలా వదిలేస్తే మనకే నష్టం! ఇంకోసారిలాంటి దిక్కుమాలిన లిటరేచర్ చదవకుండా కట్టడిచేయాలి!" అరిచాడు జనార్ధన్.

మిగతా పదిమంది కుర్రాళ్ళుకూడా ఒక్కరొక్కరే వేదిక మీదకెక్కి ఇంకెప్పుడూ అలాంటి బుద్ధితక్కువపని చేయమని చెంపలేసుకున్నారు.

వాళ్ళల్లో ఒకడు ఓ ప్రముఖ సెక్స్ వారపత్రిక అడ్డుపెట్టుకుని లోపల చందమామ పుస్తకం చదువుతున్నాడట. మరొకడు స్త్రీ అంగాంగాలూ వర్ణిస్తూన్న సీరియల్స్ ప్రచురించే

మరో తెలుగు వారపత్రిక అడ్డుగా పెట్టుకుని లోపల టామ్‌సాయర్, డాన్ క్విక్సాట్, అల్లాడీన్ మాజిక్‌లాంప్, ట్రెజర్‌అయ్‌లెండ్ లాంటి ఇంగ్లీషు పుస్తకాలు చదువుతున్నాడట.

ఇంకో కుర్రాడు బూతు మాసపత్రిక ఒకటి అడ్డుపెట్టుకుని లోపల పుష్పవిలాపం పద్యాలు చదువుతున్నాడట!

ఈగొడవంతా చూసేసరికి ప్రేక్షకుల్లో నుంచి సరస్వతమ్మగారు ఏడుస్తూ వేదికమీద కొచ్చింది.

"ఈ పిల్లల పరిస్థితి చూస్తేనే గుండె పగిలి పోతోందంటే- మొన్న మా ఆయనేం చేశాడో తెలుసా అన్నయ్యగారు?" అంటూ మళ్ళీ బావురుమంది.

"అరె ఏడుస్తావెందుకమ్మా! ఏం జరిగిందో చెప్పు!" ఓదార్చాడు శాయిరామ్.

"మొన్న-మొన్న-నేను మార్కెట్‌కెళ్ళి హఠాత్తుగా వచ్చి తలుపు తెరిచేసరికి-" అంటూ మళ్ళీ వెక్కి వెక్కి ఏడవసాగింది.

"అరె! ఏడవకమ్మా! త్వరగా చెప్పు! ఏం చేశాడో?"

"నేను తలుపు తెరిచేసరికి -తెరిచేసరికి ఆయన తేనెటీగ, డెత్‌సెల్ పుస్తకాలు అడ్డుగా పెట్టుకుని" మళ్ళీ బావురుమందామె.

"చెప్పమ్మా! అవి అడ్డుగా పెట్టుకుని లోపల ఏ పుస్తకం చదువుతున్నాడు?" అడిగింది పార్వతీదేవి.

"వాడెవరో జులాయి రచయిత విష్ణుశర్మరాసిన 'పంచతంత్రం' పుస్తకం చదువుతున్నాడు" అందరి దృష్టి ఓ మూలగా పాలిపోయిన ముఖంతో కూర్చున్న సరస్వతమ్మ భర్తమీద పడింది. "ఏమయ్యా! పిల్లలకు చెప్పాల్సిందిపోయి ఎద్దులాగుండి నువ్వే అలాంటి క్షుద్ర సాహిత్యం చదువుతున్నావా? నీకేమయినా బుద్ధుందా?" రంగారెడ్డి విరుచుకుపడ్డాడతనిమీద.

అతను దీనంగాలేచి నిలబడ్డాడు.

"పొరబాటయిపోయింది. ఇంకెప్పుడూ అలాంటిచెత్త చదవనని ప్రామిస్ చేస్తున్నాను. ఈసారికి నన్ను క్షమించండి!" అన్నాడు తలవంచుకుని. క్షణాల్లో అంతా గందరగోళంగా తయారయింది.

అతనిని క్షమించడానికి వీల్లేదని కొంతమంది అరవసాగారు. అతను పశ్చాత్తాపం ప్రకటించే వరకూ తులసిదళం నవల పదే పదే చదివిస్తేగానీ తిరిగిదారిన పడడని

మరికొంతమంది సలహా ఇచ్చారు. చివరకు శాయిరామ్ జోక్యం చేసుకోక తప్పలేదు. వెంటనేమైక్ దగ్గరకొచ్చాడు.

"సోదర సోదరీమణులారా! మన సమాజం ఎంతో ప్రగతి సాధించిందని మనం అనుకోవడమేగాని నిజానికి ఎన్నితప్పుదారులు తొక్కుతోందీ, ఎంతవెనక్కు లాగుతోందీ- ఇవాళ ఈ సంఘటనలు ఋజువుచేస్తున్నాయ్. కనుక మనం వ్యక్తుల్ని శిక్షించడం కంటె మరోసారి ఇలాంటి దారుణాలు జరగకుండా చర్యతీసుకోవడం మంచిదని నాఅభిప్రాయం. ఈవిషయంలో మీ మీ సలహాలు తెలియజేస్తే వాటిల్లో అచరణయోగ్యంగా వున్న వాటిని స్వీకరించి అమలు పరచేందుకు మనప్రయత్నాలు మనం చేయవచ్చు" అన్నాడతను. అందరూ రకరకాల సలహాలు ఇవ్వడం మొదలుపెట్టారు.

"ఇక నుంచి అలాంటి పాతకాలం సాహిత్యం చదువుతూ పట్టుబడ్డవాళ్ళని సామాజిక బహిష్కరణ చేయాలి" అన్నాడు బాబు.

"వాళ్ళమీద మనం కేసులు పెట్టి జైలుకి పంపాలి!" అన్నాడు చంద్రకాంత్.

"నన్నడిగితే ఈగొడవంతా వదేబదులు ఆసాహిత్యాన్ని మన ప్రభుత్వంతో నిషేదింపజేయాలి" అన్నాడు రంగారెడ్డి. మరుక్షణంలో తప్పట్లు మార్మోగిపోయినయ్.

"రంగారెడ్డి సలహా బాగుంది! వెంటనే మనమంతా గవర్నర్ ఇంటికి ఊరేగింపుగా వెళ్ళి ఆచెత్త సాహిత్యాన్ని నిషేధించమని అర్జీ సమర్పించుకోవాలి!" అంటూ అరిచారు అందరూ. అప్పటికప్పుడే అర్జీ తయారుచేడంలో నిమగ్నమయిపోయాం అందరం. ✷



# బంద్ - 1999



**ఆరోజు** ఆదివారం. అయితే మాకాలనీ వాళ్ళంతా కాలనీవేదికదగ్గర గుమికూడింది అందుక్కాదు. మర్నాడు రాష్ట్రప్రభుత్వం స్వయంగాజరిపిస్తున్న బంద్‌గురించి మాట్లాడడానికి. మాకాలనీలో రాష్ట్రప్రభుత్వోద్యోగులతోపాటు కొంతమంది కేంద్రప్రభుత్వ ఉద్యోగులు కూడా వుండడంవల్ల మేమంతా బంద్‌లో పాల్గొనాలా వద్దా అనే విషయం చర్చిస్తున్నాం.

కాసేపటి తర్వాత మోటర్‌సైకిల్స్‌మీద ఉద్యోగసంఘ నాయకులు హడావుడిగా వచ్చారు. వస్తూనే స్పీచ్ అందుకున్నాడో నాయకుడు.

"సోదర సోదరీ మణులారా! మనరాష్ట్రప్రభుత్వ ఉద్యోగులందరూ బంద్‌తో సహకరిస్తామని ప్రభుత్వానికి మాట ఇచ్చాము. అందుకు ప్రతిఫలంగా ప్రభుత్వం మనకి ఒక్కొక్క ఉద్యోగికీ అయిదు వందల రూపాయలనగదు, ఒక జతటెర్లిన్‌బట్టలు, ఒకపాలిస్టర్‌చీర జాకెట్టు, ఒకకుంకుమ భరిణ, పిల్లలకు ఆటవస్తువులూ ఇస్తుంది. కనుక మీరంతా వెంటనే మీ మీ ఆఫీసులకెళ్ళి అవన్నీ తెచ్చుకోవలసిందిగా కోరుతున్నాం!"

అంతా తప్పట్లు మార్మోగిపోయినయ్.

ఆడాళ్ళంతా కుంకుమభరిణ, పాలిస్టర్ చీర సంగతి వింటూనే విప్పారిన మొఖాలతో బంద్‌వల్ల ఎన్నిలాభాలున్నయో చర్చించుకోసాగారు.

ఈలోగా కేంద్రప్రభుత్వోద్యోగుల నాయకుడు స్పీచ్ మొదలు పెట్టాడు.

"సోదరీ సోదరీ మణులారా! ఈ బంద్ మన దేశప్రయోజనాలకు భంగకరం అని మన కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. కనుక మనందరం ఈ రాత్రికే ఆఫీసులకెళ్ళి అక్కడేపడుకుని రేపు పూర్తి అటెండెన్స్‌తో పనిచేయడానికి మన కార్మికసంఘం అంగీకరించింది. ఇందుకు ప్రతిఫలంగా మనకు ఒక్కొక్కరికీ ఆరువందలరూపాయలనగదు, ప్రతి కుటుంబానికి రైల్లో ఆలిండియా టూర్‌చేసే ఫ్రీపాసూ, రెండుచీరలు, పిల్లలకు ఉచితంగా యూనిఫారం, పుస్తకాలూ ఇస్తారు. ఇవికాక ఇవాళరాత్రి ఆఫీసుల్లో గడిపేవారికి టైమ్‌పాస్‌కోసం ప్రముఖ సినీ సెక్స్ డాన్సర్‌లు ఒకోఆఫీస్‌కూ ఒక్కొక్కరు చొప్పున వెళ్ళి డాన్స్‌లుచేస్తారు. ఇంతేకాకుండా ప్రతినలుగురికీ రెండుసెట్ల పేకముక్కలు, దానితోపాటు వందరూపాయలు కిట్టి మనీ గూడా ఏర్పాటుచేస్తారు. ఇవికాక రాత్రి నాలుగు రకాల బ్రాందీ విస్కీలు, ఎనిమిదిరకాల నాన్ వెజిటెరియన్ వంటకాలతో భోజనాలు, ఉదయం బెడ్‌కాఫీ, కాఫీ ఫలహారాలు, మళ్ళీమధ్యాహ్నం బఫేడిన్నర్‌లూ ఉంటాయి. రాత్రి మంచాలూ యూఫోంబెడ్స్ కూడా ఏర్పాటు చేసేయడం జరుగుతుంది. రాత్రికి కొంతమందివేశ్యలను ఏర్పాటుచేసే విషయం గురించి కూడా మన యూనియన్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది. కానీ ఇంకా వివరాలు తెలీదు."

దాంతో కేంద్రప్రభుత్వోద్యోగులందరూ తప్పట్లు కొట్టి విజిల్స్‌వేశారు ఆనందంగా. అయితేవాళ్ళ ఆడాళ్ళుమాత్రం కస్సుమంటూ లేచారు.

"ఏమిటి? మా మగాళ్ళకు వేశ్యలను ఏర్పాటుచేస్తారా?" అంటూ చెంగు దోపుతుంటే నాయకుడు ఖంగారు పడ్డాడు. "అబ్బే ఊరికే-జోక్‌కిఅన్నాను" అంటూమాకేసి తిరిగి కన్నుకొట్టాడు.

మా అందరికీ కేంద్ర ప్రభుత్వోద్యోగులను చూస్తే ఈర్షకలిగింది. వాళ్ళు హాయిగా ఆఫీసులో ఎంజాయ్ చేస్తుంటే మేము ఇంటిదగ్గర పడిచావాలి.

అప్పటికప్పుడే అందరం ఆఫీసులకెళ్ళి డబ్బూ, చీరలూ, ఇతర వస్తువులూ అన్నీ డ్రా చేసుకుని ఇళ్ళకు చేరుకున్నాం.

మర్నాడు మేము కూడా నాలుగయిదు కుటుంబాలకు ఒక వి.సి.ఆర్., కొన్ని సినిమా కెసెట్లు తెచ్చుకుని హాయిగా గడపాలని నిర్ణయించుకున్నాం.

మరికాసేపట్లో నాలుగుబస్‌లు వచ్చి కేంద్రప్రభుత్వోద్యోగులకు డబ్బూ యితర వస్తువులూ యిచ్చి ఆఫీసులకు తీసుకెళ్ళిపోయినాయ్.

ఆరాత్రి వెన్నెల్లో కూర్చుని మర్నాడు మగాళ్ళకోసం కాలనీలో ఏమేంఏర్పాట్లు జరపాల్సింది చర్చలు ప్రారంభించాము.

పేకాడేవాళ్ళంతా లక్షణరావ్ వాళ్ళింట్లో సమావేశమయేట్టూ, ప్రత్యేక వంటకాలంటే పడిచచ్చేవారంతా బగారాబైగన్ వెంకట్రావ్ ఇంట్లో కలుసుకునేట్టూ ఇలా రకరకాల ఏర్పాట్లు చేసేస్తున్నారు. సరిగ్గాఅప్పుడే ఓజీప్, దానివెనుకోవ్యాన్ వచ్చి ఆగాయ్ మాకుకొద్దిదూరంలొ.

అందులోనుంచి హోమ్ మినిస్టర్, ఓపోలీస్ అధికారీ దిగారు.

"సోదరులారా! రేపు మనందరం కలసి కేంద్రానికి వ్యతిరేకంగా బంద్ చేస్తున్నామన్న విషయం మీకుతెలిసేవుంటుంది! బంద్‌వల్ల ఎన్నిలాభాలున్నాయో మీకందరకూ తెలిసేవుంటుంది. కేంద్రప్రభుత్వానికి ఒక్కరోజులో ఆరువందల అరవైకోట్లునష్టం వచ్చేలా చూడడం మనందరి ధ్యేయం అని నేను మీకు సవినయంగా మనవిచేస్తున్నాను. ఈటార్గెట్ని సాధించడంకోసం మనందరం ప్రాణాలకుతెగించి కేంద్రప్రభుత్వానికి చెందినటువంటి రైళ్ళు, టెలిఫోన్‌లు, దూరదర్శన్, ఆకాశవాణిలాంటి అనేక సంస్థలకుభారీనష్టం కలుగజేయాల్సివుంటుంది. అవసరమయితే కొన్నిరైళ్ళను ప్రయాణీకులతో సహా తగలబెట్టాలి. ఎందుకంటే బంద్‌నాడు ప్రయాణం చేసేవారంతా కేంద్రంలోని అధికారపార్టీవాళ్ళుగాని, వాళ్ళ సానుభూతి పరులుగానీ అయుంటారని నేనునొక్కి వక్కాణిస్తున్నాను. ఏది! అందరూ ఓసారి గట్టిగా అరవండి! రేపు మేమందరం ఎవరి ప్రోద్బలం లేకుండా మాఅంతట మేమే స్వచ్ఛందంగా బంద్ పాటిస్తున్నాం" అంటూ అరిచాడతను.

మేమెవ్వరం అరవకపోయేసరికి అతనికి మామీద కోపం వచ్చేసింది.

"మీకేచెప్పేది-అరవండి" అన్నాడు మండిపడుతూ.

అయినా మేమెవ్వరం నోరుమెదపక పోయేసరికి పోలీసుఅధికారి వేపు తిరిగాడతను.

మరుక్షణంలో వ్యాన్‌నుంచి పాతికమంది కానిస్టేబుల్స్ తుపాకులు తీసుకుని మమ్మల్నందరినీ చుట్టుముట్టారు. రంగారెడ్డిని బట్‌తో ఒక్కపోటుపొడిచాడో పోలీసుఅధికారి.

"చూస్తారేమిట్రా అరవండి! బంద్ గురించి గవర్నమెంట్ దగ్గర అయిదొందలు తీస్కుని ఇంకేం రోగం అరవకపోటానికి?"

అప్పటికీ అరవకపోతే ఏంజరుగుతుందో మాకు తెలుసు.

అందుకని వెంటనే అరచాము.

"రేపు మేము ఆనందంగా, సంతోషంగా బంద్‌లో పాల్గొంటున్నాము.

ముఖ్యమంత్రీ-దేవుడూ!

ప్రధానమంత్రీ-రాక్షసుడూ!

బంద్- జయప్రదంకావాలి!

కేంద్రం-పడిపోవాలి! నాశనమయిపోవాలీ!

రాష్ట్రం గెలవాలి! వర్ధిల్లాలీ!"

మేము నినాదాలు చేస్తున్నంతసేపూ జీప్‌లోనుంచి ఒకడు మామీద ఫ్లడ్‌లైట్స్‌వేసి వీడియో కెమెరాతో షూటింగ్ చేశాడు.

హోమ్‌మంత్రి కెమెరామెన్ వైపు పరుగెత్తాడు.

"ఒరే వీడియోవాలా! జాగ్రత్తగా తీయి! పోలీసులు వాళ్ళవీపులకు తుపాకి గురి పెట్టటం ఫిల్మ్‌లో ఎక్కడా కనబడకూడదు! అర్థమయిందా!"

"అయిందిసార్" అంటూ హోమ్‌మంత్రి కాళ్ళు కళ్ళకద్దుకున్నాడతను. అప్పుడు చూశాం అతనిని మేము. అతను పబ్లిక్‌రిలేషన్స్ డిపార్ట్‌మెంట్‌కి చెందిన ఐ.ఏ.ఎస్. అధికారి.

"ఇదిగో ముందేచెపుతున్నా వినండి! రేపు ఒక్క పిట్టకూడా ఇళ్ళల్లోనుంచి బయటకు రాకూడదు. ఎవరికైనా జబ్బుచేస్తే పోలీసుల సహాయం తీసుకోండి! వాళ్ళు జబ్బుచేసినవ్యక్తి రెండురోజులు స్పృహతప్పేట్లు కొన్ని మందులిస్తారు. స్పృహవచ్చాక అప్పుడు డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళవచ్చు. రేపెవరయినా చనిపోతేశవాల్ని మీపెరట్లోనేతవ్వి పాతేసుకోండిగానీ శ్మశానాలకు వెళ్ళడానికి కూడా అనుమతి ఇవ్వబడదు. అర్థమయిందా?" గట్టిగా అడిగాడు మినిష్టరు.

అందరం అయిందని తలూపాము.

వెంటనే జీప్,దాని వెనుకే పోలీసులతో వానూ వెళ్ళిపోయాయి.

"దిసీజ్ టూ మచ్" అన్నాడు రంగారెడ్డి కాసేపు నిశ్శబ్దంగా వున్నాక.

"అవును! ప్రజల్ని వీళ్ళు కుక్కలకంటే హీనంగా చూస్తున్నారు" అన్నాడు శాయిరామ్.

అందరూ ఎవరి అభిప్రాయాలు వాళ్ళు చెవుండగానే ఇంకో పెద్దవాన్ చాలా బలమయిన సారావాననతో రివ్వునవచ్చి మాముందాగింది. అందులోనుంచి పాతికమంది లావుపాటివ్యక్తులు తూలుతూ మాదగ్గరకొచ్చారు. అందరి చేతుల్లోనూ కర్రలున్నాయ్. ఒకరిద్దరు మాత్రం తుపాకులు పట్టుకుని నిలబడ్డారు.

"ఏయ్! ఈకాలనీ కమిటీ ప్రెసిడెంట్, శెక్రటరీ ఎవరు?"అడిగాడు ఒకడు. వాడు కింద పడిపోకుండా ఇంకో ఇద్దరు గట్టిగా పట్టుకుని నిలబెట్టారు.

మాకు వళ్ళుమండిపోయింది.

"ఏయ్ అంటావేంది? మంచిగా మాట్లాడడం రాదుబే నీకు?" అన్నాడు యాదగిరి కోపంగా.

"ఏంది? మంచిగా మాట్లాడాలా? నీయవ్వ" అంటూ యాదగిరిమీద నలుగురుపడి చేతులు విరిచి కిందపడేశారు.

పరిస్థితి విషమించేట్లుందని రంగారెడ్డి, గోపాల్రావ్ ముందుకి వచ్చారు.

"నేనే కాలనీసెక్రటరీని! ఈయనప్రెసిడెంట్! మాతో ఏమిటి మీకు పని?" అడిగాడు రంగారెడ్డి.

"గట్ల మంచిగా మాట్లాడాలిభాయ్! ఇగోసూడు! కేంద్రంలోని అధికారపార్టీకి ఈ ఏరియాలీడర్ని నేను! నాపేరు నర్సింహ! సమజైందా?" అడిగాడతను.

"అయింది! ఇంతకూ మాతో ఏమిటిపని మీకు?"మళ్ళీ అడిగాడు రంగారెడ్డి సౌమ్యంగా.

"ఏం లేదన్నా! రేపు ఈఫాల్తూ అపొజిషన్ కొడులు మన రాష్ట్రంల బంద్ చేయనికి కోషిష్ జేస్తున్రు ! బంద్ గిట్లజేస్తే జెన్కోనీగానీ, కిరికిరేదొస్తున్నదంటే ఈబంద్ జబర్దస్తి చేస్తున్రన్నా! మనదేశంల గిట్ల జబర్దస్తి చేసేడిది గలత్ కదా!"

"అ మాటనిజమే!" వప్పుకున్నాడు రంగారెడ్డి.

"అవునా అన్నా! జబర్దస్తి గాకుండా మీదికెళ్ళి మీఅందర్కి పైసలు గిట్ల ఇచ్చి ఇళ్ళల్లోకెళ్ళి బయటకు రావొద్దని చెప్తున్నది. ఎంత బేఇజ్జత్ సంగతిది?"

"అవ్! చాలా బేఇజ్జత్" అన్నాడు గోపాల్రావ్.

"ఇప్పుడు మేమొచ్చిన పనేమంటే రేపు ఎట్లయిన మనం ఈబంద్ని ఫెయిల్ జేయాలె! అంటే మీరంతా ఆఫీసులకు వెళ్ళాలె! సమజైందా?"

మేము ఉలిక్కిపడ్డాం! "ఏమిటి? రేపు మేము ఆఫీస్లకెళ్ళాలా?"

"బరాబర్ ఎళ్ళాలె! ఆఫీస్లకు పోనీకి రెండుబస్లు మేమే ఎరేంజ్చేస్తం! సమజయిందా?"

"అయిందిగానీ-ఆఫీసు కెళ్ళడానికి వీల్లేదని ఇప్పుడే హోమ్మినిష్టర్ వార్నింగ్ఇచ్చి వెళ్ళాడు కదా!" అన్నాడు గోపాల్రావ్ నణుగుతూ.

"అరే ప్రెసిడెంట్! జీనాసైహైక్యారే తేరేకో? రేపు తొమ్మిదిగంటలకు రెండు లారీలు తెస్తున్నా! అందరూ లారీలు ఎక్కకపోయిన్రో బేఇజ్జతవుతది. సమజైందా?" ఇక లాభంలేదని రెడ్డి కల్పించుకున్నాడు.

"ఇదిగో చూడండి నర్సింహగారూ! మీరిలా జబర్దస్తీ చేయడం ఏమీ బాగుండలేదు. ప్రభుత్వమే రేపు ఆఫీ ులు మూసేస్తోంది."

"అదంతా మాకు తెల్వదుభాయ్! మాలీడర్‌సాబ్‌చెప్పిండు. ఆఫీసులు ఖుల్లఉండినా, లేకున్నాగానీ మీరు ఆఫీస్‌లముందు నిలబడాలె! లేకుంటే మీభార్యాబిడ్డలను లోపటజేస్తాం! ఏంజెప్తున్న?"

"సరే" అన్నాడు గోపాల్రావ్ నీరసంగా.

మరుక్షణంలో వాన్‌వెళ్ళిపోయింది.

అందరం ఒకరిమొఖాలొకరు చూసుకున్నాం.

"ఇప్పుడేమిటి చేయడం?" అడిగాడు రంగారెడ్డి.

"ఈ గూండాలతో గొడవెందుగ్గాని మనం ఆఫీస్‌లకెళ్ళడమే మంచిది" అన్నాడు శాయిరామ్.

"కాని స్టేట్‌గవర్నమెంట్ ఆఫీసులకు రాకుండా వుండడానికి కదా! మనకి అయిదువందలు ఇచ్చింది?"

"అయితే ఓ పనిచేద్దాం! అందరం ఆఫీస్‌లకు వెళ్దాంగానీ కాంటీన్ దగ్గరే కూర్చుని మధ్యాహ్నానికి తిరిగి వచ్చేద్దాం!" అన్నాడు గోపాల్రావ్.

ఆ అయిడియా అందరికీ నచ్చింది.

"ఒకే బులెట్‌కి రెండుపిట్టలు" అన్నాడు జనార్ధన్.

ఉదయం ఆఫీస్‌కెళ్ళడానికి అందరం రెడీఅయి గూండాల స్పెషల్‌లారీలకోసం ఎదుర్చూస్తూ వేదిక దగ్గర కూర్చున్నాం. అయితే లారీలకు బదులుగా ఇంకోపెద్ద వాన్‌వచ్చింది. అందులోనుంచి ఓపాతికమంది గూండాలు-తుపాకులు, బాంబులు తీసుకుని దిగారు. వాళ్ళతోపాటు రాష్ట్రహోమ్‌మంత్రి దండలతోదిగాడు.

"ఏయ్! ఇయాళ బందని తెల్సికూడా మళ్ళీ ఆఫీస్‌కెళ్ళడానికి ఈడెందుకు జమయిన్రుబే? తలగిట్ట తిరుగుతున్నదా ఏం?" అడిగాడు మినిస్టరు.

గోపాల్రావ్ లేచి వినయంగా నిలబడ్డాడు.

"అదికాదండీ! రాత్రి ఇంకెవరో గూండాలు వచ్చి ఆఫీస్‌లకెళ్ళకపోతే మా ఇళ్ళమీద ఎటాక్ చేస్తామని చెప్పారు. అందుకని...."

"అందుకని మాదగ్గర అయిదొందలు తీస్కొని మళ్ళీ ఆపార్టీగూండాలు చెప్పినట్టు చేస్తారు? నీయవ్వ మీకేమయినా షరమున్నదా? తినేది స్టేట్ గవర్నమెంట్ ఉప్పు పలికేది

కేంద్రప్రభుత్వం పలుకులా? ఇగో! ఇప్పుడే చెప్తున్నా ఇనంద్రి! ఒక్కడు గూడా ఆఫీసులకు పోయిండో ఈకాలనీ ఖబరసాస్త్ అవుతది! ఏం చెప్తున్న?"

అందరం భయంగా తలూపాం! వాళ్ళు మళ్ళీవాన్‌లో ఎక్కారు.

"ఇగో-నేను గంటకోసారి ఈడకొచ్చి మీ అందరి హాజరు తీసుకుంటా! సాయంత్రం వరకూ ఇట్లా గంటగంటకూ చెకింగ్‌చేస్తనేవుంటా! సమజయిందా?" అడిగాడు హోమ్‌మినిష్టర్.

అందరం తలూపాము. అందరి మొఖాలు పాలిపోయి వున్నాయి.

వాన్ వెళ్ళిపోయింది.

దూరంగా మెయిన్‌రోడ్‌నుంచి లౌడ్‌స్పీకర్ అమర్చిన పోలీస్‌వాన్ బిగ్గరగా హెచ్చరికలు చేసుకుంటూవెళ్తోంది.

"ప్రజలకు పోలీసు హెచ్చరిక! ఇవ్వాళ ప్రభుత్వబంద్ జరుగుతున్నది. కనుక రాత్రి పన్నెండు గంటల వరకు ఇళ్ళనుంచి బయటకు రావడం నిషేధించడమైనది. ఈనిషేధాన్ని ఉల్లఘించిన వారిని నిర్ధాక్షిణ్యంగా చంపుటకు మాకు అధికారం ఉందని తెలుసుకోప్రార్ధన"

మాగుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. అందరి మొఖాల్లోనూ భయం కనిపిస్తూందిప్పుడు.

ఆ వాన్ దూరం వెళ్ళిపోగానే రెండు లారీల్లోగూండాలు కేంద్రంలోని అధికారపార్టీ జెండాలతో రాష్ట్ర ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా నినాదాలు చేస్తూవచ్చేశారు.

"ఛల్‌ఎక్కండి" అన్నారు వాళ్ళు లాఠీలు పట్టుకుని మావేపువస్తూ.

"కానీ ఆఫీస్‌కేళ్తే చంపేస్తామని రాష్ట్రంలో అధికార పార్టీ వాళ్ళన్నారుకదా! ఎవరిమాట వినాలి మేము?"అన్నాడు రంగారెడ్డి ధైర్యంగా.

వాళ్ళంతా రంగారెడ్డి వేపు చూశారు.

"ఎవరి మాట వినాలా? ఎవడిచేతిలో కత్తివుంటే ఆడిమాటవినాలి? తెల్సిందా?" ఒకడు కత్తితీశాడు బయటకు.

ఇంక గత్యంతరంలేక లారీలు ఎక్కసాగాము.

కాలనీలోని ఆడాళ్ళూ, పిల్లలూ అందరూ భోరునఏడుస్తూ లారీలచుట్టూ నిలబడ్డారు.

"ఏవండి! మనపెద్దాడిని టెన్త్ అయాక ఏం చదివించమంటారు?" అంది మా ఆవిడ కన్నీరు తుడుచుకుంటూ.

"వాడిని నేనుంటే ఇంజనీరింగ్ చదివిద్దామనుకున్నానే! కానీ నీకు అంత పెద్ద చదువు చదివించడం కష్టమవుతుందో ఏమో! పాలిటెక్నిక్‌లో చేర్పించు" చెప్పాను.

"ఏమండీ! మీరు పోతే గవర్నమెంట్ మాకెంతిస్తుంది?" అడిగింది ఒకామె తన భర్తను.

"రెండులక్షలు ఇస్తారను కుంటానే! దాంతో ఏ ఆస్ట్రేలియాకో, సింగపూర్‌కో వలస వెళ్ళిపో! పిల్లలయినా బాగుపడతారు" చెప్పాడు అతను.

కాసేపు అప్పగింతలూ, ఏడుపులూ అయాక మాలారీలు బయల్దేరాయి.

రోడ్లన్నీ ఖాళీగా వున్నాయిగానీ చాలాచోట్ల రోడ్డుకి అడ్డంగా ముళ్ళకంచెలు వేసివున్నాయి. వాటిని ఓక్రేన్ తొలగిస్తుంటే వెనుక మాలారీలు నడవసాగినయి. కోఠీచౌరస్తా దగ్గర కొచ్చేసరికి పోలీసులు తుపాకులు పట్టుకుని అడ్డంగా నిలబడ్డారు.

"వెంటనే లారీలు వెనక్కు తిప్పి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోండి! లేకపోతె కాల్పులు జరపాల్సివస్తుంది" అంటూ తుపాకులు ఎక్కుపెట్టారు వాళ్ళు. మాలారీలో గూండాలు వాళ్ళమీద బాంబులు విసిరారు. వాళ్ళుపారిపోతూనే తుపాకీలు కాల్చారు. భయంకరమయిన శబ్దాలకు భయపడిపోయి మేము లారీలో తలవంచుకుని వణుకుతూ కూర్చుండిపోయాము.

అరగంటసేపు యుద్ధం జరిగింది.

పోలీసులు మాములుగానే పారిపోయారు. గూండాలలో అరడజనుమంది బుల్లెట్ దెబ్బలతో చచ్చికిందపడివున్నారు. మాలారీలు మళ్ళా బయల్దేరాయ్. ఆబిడ్స్ వెళ్ళేసరికి ఇంకా చాలామంది పోలీసులు తుపాకులతో చుట్టుముట్టేశారు. గూండాలు కూడా బాంబులు విసిరారుగానీ అవి పేలలేదు. వాళ్ళందరినీ పోలీస్‌వాన్‌లో ఎక్కించేశారు.

"నీయమ్మ! ఈబాంబులు తయారుచేసిన కంట్రాక్టరుగాడు మోసం చేశాడు" అన్నాడు గూండా.

"ఎవరు మీరంతా?" అడిగాడు పోలీస్ అధికారి మమ్మల్ని

"మేము ప్రభుత్వోద్యోగులంసార్! ఈగూండాలు మమ్మల్ని బలవంతంగా యిళ్ళల్లోనుంచి బయటకీడ్చుకొచ్చి ఆఫీసుకి తీసుకెళుతున్నారు."

"ఆల్‌రైట్! వెంటనే వెనక్కుతిరిగి ఇంటికి వెళ్ళిపోండి. ఇంకొకసారి బయటెక్కడయినా కనిపించారో కాల్చిపారేస్తాం! జాగ్రత్త!" హెచ్చరించాడతను.

మేము ఈసురోమంటూ మళ్ళీ మాకాలనీవేపు బయలుదేరాం. దారిలో రోడ్‌పక్కనే నిలబడివున్న పెద్దగూండాగుంపు కనిపించేసరికి మాకు భయంవేసి కొద్దిదూరంలోనే నిలబడిపోయాం.

"ఏయ్ దుకాణాలు ఖుల్లాపెట్టాలని చెపితే ఎందుకు బంద్‌జేసిన్రుబే?" కొంతమంది వ్యాపారస్తుల్ని గద్దిస్తూ అడిగాడు గూండా నాయకుడు.

"తెరుస్తే షాపులు తగలబెడతామని ఆపోజీషనోళ్ళు జెప్పిన్రు భాయ్! మేమంజెయ్యాలి?"

"ఇగో! ఈనకరాలు మన దగర నడవవు. గిప్పుడు ఖుల్లజేస్తరా లేదా? ఒకటే మాట అడుగుతున్న!"

"చేస్తే వాండ్లొచ్చి దుకాణాలు తగలబెడతారు సార్" అతని కాళ్ళమీద పడ్డారు వాళ్ళు.

గూండానాయకుడికి కోపం ఆగలేదు.

"అరేయ్! క్యాదేఖ్రైరే! జలావ్ దుకాణోంకో" అరిచాడు అతను.

మరుక్షణం షాపులన్నింటి లోపలకు పెట్రోల్‌పోసి నిప్పంటించారు వాళ్ళు. పెద్ద ఎత్తున మంటలు లేచేసరికి మేము పరుగు మొదలుపెట్టాము. రెండుగంటలు ఆగకుండా నడిస్తేగానీ మాకాలనీ చేరుకోలేకపోయాము. అప్పటికే అంతదూరంనడవడం అలవాటు లేకపోవడంవల్ల పాదాలు పుళ్ళయిపోయాయి. దానికితోడు భయంకరమయిన నొప్పులు.

ఇళ్ళలోకెళ్ళి రెండురోజులు కదలకుండా మంచాలమీద పడివుంటేగానీ తిరిగి తేరుకోలేమని మాకు అర్థమయింది.

తీరా కాలనీ చేరుకునేసరికి ఇంకో రెండు లారీలు వాటి పక్కనే తుపాకులతో నిలబడ్డ మరోగుంపు కనిపించారు.

కాలనీలో మాఇళ్ళన్నీ ధ్వంసం అయివున్నాయి. సామానంతా ఇంటిబయట తగలబడుతూ కనిపించింది. ఆడాళ్ళూ, పిల్లలూ అంతా బయటే నిలబడి ఏడుస్తున్నారు.

"ఏమిటి? ఏం జరిగింది?" అడిగాము ఆడాళ్ళను.

"అందరూ ఇళ్ళల్లోనే వుండాలని హోంమినిష్టరు చెప్పినా మీరు వినకుండా ఆఫీసుల కెళ్ళారని తెలిసి పోలీసులను తీసుకొచ్చి అంతా ధ్వంసం చేయించాడు దగ్గరుండి."

మాకేం చేయాలో తెలీలేదు.

"ఏయ్ లారీలెక్కండి" అంతవరకు మావంక నిశ్శబ్దంగా చూస్తున్న గుంపులో నుంచి ఒకడు మాకు తుపాకీ గురిపెట్టి అరచాడు.

"మళ్ళీ మీరెవరు?" ఏడుపు ఆపుకుంటూ అడిగాడు రంగారెడ్డి.

"నీయవ్వ! ఆఫీసులకెళ్ళమని లారీలెక్కిస్తే మళ్ళావెనక్కు తిరిగొస్తారా? సాలే! ఎక్కండి లారీ! లేకపోతే అందర్ని పిట్టల్నికాల్చినట్లు కాల్చిపారేస్తాం" అంటూ గాల్లోకి తుపాకీపేల్చాడు. యాదగిరికి పౌరుషం పొడుచుకొచ్చింది మళ్ళీ.

"నీయవ్వ! బయటికెళితే పోలీసుల లాఠీచార్జీ! ఇండ్ల కొస్తే ఈబాడుకవ్‌లు కాల్చి చంపుతామని బెదిరింపు. థూ! నీయవ్వ జిందగీ! గింత బాడుకవ్‌దేశం ప్రపంచంలో ఇంకేడగూడా వుండదు థూ...థూ"

"ఏమిరోయ్ స్పీచ్‌లిస్తున్నావ్? మంచిగ లారీ ఎక్కుతు(నా లేదా?"ఇద్దరు కత్తులు తీసుకుని మామీద కొచ్చారు. పక్షవాతం వచ్చినట్టున్న కాళ్ళను కూడదీసుకుంటూ అందరం మళ్ళీలారీఎక్కాం. ఈసారి లారీ ఎక్కువదూరం వెళ్ళకుండానే హోమ్‌మినిష్టర్ జీప్‌తోపాటు వస్తున్న నాలుగు లారీలు పార్టీగూండాలతో ఎదురువచ్చి అటకాయించినాయి.

"లారీల్లోనూ లోపటున్నోళ్ళనూ అందర్నీ జలాయించం(డి" అంటూ అరిచాడు హోంమినిష్టర్. అప్పటికే మాలారీపక్కన బాంబులు ప్రేలడం మొదలయింది.

ఆతరువాతేం జరిగిందో నాకుతెలీదు.

తిరిగి కళ్ళుతెరిచేసరికి అందరం గవర్నమెంట్ హాస్పిటల్లోని వరండాల్లో వరుసగా నేలమీద పడివున్నాం. అందరికీ బాండేజీలు!

వార్డ్ లోపల్నుంచి టి.వి.వార్తలు వినబడుతున్నాయి.

"నేడు రాష్ట్రప్రభుత్వం నిర్వహించిన బంద్‌సంపూర్ణంగా విజయవంతం అయిందని రాష్ట్ర బంద్‌శాఖామంత్రి శ్రీబందేశ్వర్రావుగారు తెలియజేశారు. రాష్ట్రప్రజలంతా అమితమయిన ఆనందోత్సాహాలతో బంద్‌లోపాల్గొని ఇళ్ళల్లోనుంచి బయటకురాకుండా పూర్తిమద్దతు ఇచ్చినందుకు ముఖ్యమంత్రి వారికి తమ అభినందనలు తెలిపారు. కొన్నిప్రాంతాల్లో తెరచిన కొన్ని దుకాణాలమీద ముఖ్యమంత్రి బృందం అతిధైర్యసాహసాలతో పోలీసుల సాయంతో దాడులు జరిపి తగలబెట్టారు. ముఖ్యమంత్రే స్వయంగా ఆరు కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలకు జ్యోతిని వెలిగించి నిప్పంటించినప్పుడు ఆయన పార్టీ కార్యకర్తలు పెద్దఎత్తున హర్షధ్వానాలు చేశారు. ఒకకేంద్రప్రభుత్వ కార్యాలయానికి నిప్పంటిస్తున్నప్పుడు ప్రతిఘటించిన కొంతమంది కేంద్రసిబ్బందిని స్వయంగా ముఖ్యమంత్రే తమ మిషన్‌గన్‌తో కాల్చిచంపారు. ఈ కాల్పుల్లో అయిదువేలమంది మరణించగా ఎనిమిదివేలమంది గాయపడ్డారు. రాష్ట్రం మొత్తంమీద పదహారు ప్రయాణికుల రైళ్ళను ప్రయాణికులతోసహా తగుల బెట్టినప్పుడు మంట లార్పడానికి ప్రయత్నించిన కేంద్ర రిజర్వ్‌దళాలతో రాష్ట్రపోలీస్ దళాలు రాత్రిపన్నెండు గంటలవరకూ పోరాటంజరిపాయి. రాష్ట్రకాబినెట్ మంత్రులందరూ విధ్వంస కాండలో పాల్గొని ముఖ్యమంత్రికి తమ పూర్తిసహకారం అందజేశారు. అయితే రాష్ట్రప్రభుత్వం నిర్వహించిన బంద్ పూర్తిగా విఫలమయిందని కేంద్రంలోని అధికారపార్టీ నాయకుడు శ్రీబంద్‌జిత్‌యాదవ్ ప్రకటించారు. తాము బంద్‌కు ముందురోజే హైజాక్‌చేసిన రెండువందల రాష్ట్ర ఆర్టీసిబస్‌లను బంద్ రోజుప్రయాణికుల సౌకర్యంకోసం తమపార్టీడ్రైవర్ల సాయంతో నడవగలిగామనీ, రాత్రి పన్నెండింటివరకూ నడిపినతర్వాతనే వాటిని

తగలబెట్టామని, ఆయన తెలియజేశారు. రాష్ట్రప్రభుత్వానికి చెందిన అనేకకార్యాలయాల భవనాలను ధ్వంసంచేసి తగులబెట్టినందుకు ఆయన కేంద్రరిజర్వ్‌పోలీస్‌ని అభినందించారు. తమ పార్టీవలంటీర్లు బంద్‌కి వ్యతిరేకులయిన అనేకమంది ప్రజలకు తమతమ విధులకు హాజరయేందుకు ఎన్నోవిధాలుగా సహాయంచేశారని ఆయన అన్నారు. తాముస్వయంగా నగరమంతా పర్యటించి షాపులుతెరవడానికి నిరాకరించిన అనేకమందిని చంపకతప్పలేదని ఆయన అన్నారు. రాష్ట్రగవర్నర్ శ్రీబజోషి పక్షపాత వైఖరి అవలంభించి కేంద్రప్రభుత్వంతో కుమ్మక్కయితామే ఒకషాపుతెరచి సరకులుఅమ్మారనీ ఇది సహించరాని విషయమని రాష్ట్రహోంశాఖమంత్రి తమాగ్రహాన్ని తెలియజేశారు. మొత్తం మీద బంద్‌ప్రశాంతంగా జరిగిందని, చెదురుమదురు సంఘటనలు మినహా, అవాంఛనీయ సంఘటనలేమీజరగలేదని, అందువల్ల రాష్ట్ర డైరెక్టర్‌జనరల్ ఆఫ్‌పోలీస్‌కి కాబినేట్‌మంత్రి హోదా కలుగజేస్తున్నామని రాష్ట్రముఖ్యమంత్రి అన్నారు. రాష్ట్రవిద్యాశాఖమంత్రి శ్రీనిరక్షరాస్యరావు మాట్లాడుతూ రాష్ట్రంలోని స్టూడెంట్స్ అందరూ బంద్‌లో పాల్గొన్నారనీ, ఆరోజు రాష్ట్రంలోని కాలేజీలు, హైస్కూళ్ళూ అన్నీఫర్నిచర్‌తో సహాతగలబడిపోయి కూలిపోయినందున వారందరికీ కర్నాటక విద్యాలయాల్లో శిక్షణ ఇప్పించేందుకు ప్రయత్నం చేస్తున్నామని చెప్పారు."

ఇంక మేము వార్తలు వినలేదు.

మాపక్కనే కూర్చుని మావంక ఆందోళనగా చూస్తోన్న మాకుంటుంబసభ్యులతో మాట్లాడడం ప్రారంభించాము. *



# చదువుల గారడీ



ఆంధ్రప్రదేశ్‌లో ఓ తమాషావుంది.

అదేమిటంటే ఎప్పుడూ ఏదోవొక తమాషా జరుగుతూనే వుండడం. హఠాత్తుగా జర్నలిస్టులను చావగొట్టి వాళ్ళకెమెరాలు విరగ్గొటటం పోలీసులకు ఓరోజుతమాషా అయితే, పోలీసులను నక్సలైట్స్ కిడ్నాప్ చేసుకెళ్ళటం మరో రోజుతమాషా! ఎంట్రెన్స్ పరీక్షల్లో క్వొశ్చెన్‌పేపర్లు తెగ లీక్ అవటం ఓరోజుతమాషా! దేశంలోని నగరాల మేయర్లందరూ రోడ్లుఊడవటం ఓరోజుతమాషాఅయితే అసలు రోడ్లనేవే కనిపించ కుండా పోవటం నగరంలోని చాలాలొకాలిటీల్లోని మరోతమాషా!

మనప్రజలు ఈతమాషాలన్నిటికీ 'ఇమ్యూన్' అయిపోయారనుకుంటే మాకాలనీ వాళ్ళూ ఇంకో అడుగుముందుకెళ్ళి వాటికి'ఎడిక్ట్'అయిపోయారు.

రోజూ ఏదోఒక వింతగానీ, ఏదో ఒక తమాషాగానీ జరగకపోతే కాలనీలో ఎవరికీ మనశ్శాంతి వుండదు. నిద్రపట్టదు. తిండినయించదు-అహ-హ! సారీ! తిండిబాగానే సయిస్తుంది.

ఎడిక్షన్ తీవ్రత తాలూకూ ప్రధమవిక్టిమ్ మాకాలనీ కమిటీ ఆర్గనైజింగ్ సెక్రటరీ శాయిరామ్.

ఆదివారం అందరం ఇంకా నిద్రయినా లేవలేదు. ఈలోగా పెద్దగా ఓకుర్రాడిఏడుపూ, వాడివెంటపడి కొంతమంది పెద్దాళ్ళు వాడిని చావగొట్టటానికి చేస్తున్నప్రయత్నం మాకంటపడింది. మేమంతా సంగతేమిటోకనుక్కుందామని వెళ్ళేసరికే శాయిరామ్ ఆకుర్రాడినీ, అతని కుటుంబపెద్దలనూ వేరుచేసి ఆకుర్రాడిని కొట్టవద్దని వారికి నచ్చజెపుతున్నాడు.

"ఏం జరిగింది?" ఆవేశంతో ఊగిపోతున్న ఆకుర్రాడితండ్రి శంకర్రావ్‌నీ, బాబాయినీ అడిగాము. "ఇంకేం జరగాలండీ! ఈగాడిదకొడుకు మేము భయపడినంత పనీ చేశాడు" కసిగా అన్నాడు శంకర్రావ్.

"ఏం చేశాడు? దొంగతనంచేశాడా?" అడిగాడు శాయిరామ్.

శంకర్రావ్ శాయిరామ్ వేపు పిచ్చాడిని చూసినట్లు చూశాడు.

"దొంగతనం చేస్తే మేమెందుకు కొడతామయ్యా! అదేంతప్పవనా?బోఫోర్స్ కుంభ కోణాలూ, నాచారంకుంభకోణాలూ,హెల్మెట్‌భాగోతాలూ, రామకృష్ణాస్టూడియోవన్నూ మినహాయిం పులూ-వీటిముందు దొంగతనాల్ని ఇంకదొంగతనాలని ఎవడంటాడయ్యా?" కోపం అణచుకుంటూ అన్నాడు.

"పోనీ ఎవరితోనయినా కొట్లాడాడా?" అనుమానంగా అడిగాడు రంగారెడ్డి.

"ఏమిటి? కొట్లాడితే మేము గొడవచేయటానికి పిచ్చాళ్ళమనుకున్నారా? అసెంబ్లీలో, పార్లమెంటులో కొట్లాటలు, మర్డర్‌ప్రయత్నాలూ వీటిముందు వీధికొట్లాటలేముందయ్యా? వీటిల్లో ఏంతప్పుందని?" మరింత రెచ్చిపోతూ అడిగాడు శంకర్రావ్.

"ఒకవేళ ఏ అమ్మాయినయినా మానభంగం లాంటిది చేశాడా?" హాస్యంగా అడిగాడు జనర్ధన్.

"ఏయ్! ఏం మాట్లాడుతున్నావయ్యా! మానభంగం చేస్తే నేనెందుకుకొడతాను? మావాడు ఎమ్మెల్యే అయే రోజొచ్చిందని మురిసిపోతాను! జయలలితను అసెంబ్లీలో మానభంగం చేయడానికి ఎమ్మెల్యేలు ప్రయత్నించినప్పటినుంచీ అదినేరంకాదని

బుుజువయిపోయిందికదా! అలాంటి పనులేం చేసినా నెత్తినా పెట్టుకుని పూజించేవాళ్ళం. కానీ వీడు వాటన్నింటికంటే దారుణమయిన ఘోరం చేశాడండీ!"

"అంటే ఏం చేశాడు?"

"ఫైస్ట్‌క్లాస్ పాసయ్యాడండి! ఇదిగో చూడండి మార్క్సులిస్టు! ఇవాళేవచ్చింది! అసలు వీడిని టెన్త్‌లోచేర్చవద్దే, ఆ దిక్కుమాలిన కంప్యూటర్ మనరాష్ట్రంలో అందరినీ ముందుఫెయిల్‌చేసి, రివాల్యుయేషన్‌కి అప్లయ్‌చేశాక అందరినీ ఫస్ట్‌క్లాస్‌లో పాస్‌చేస్తుందే అని మాఆవిడతోమొత్తుకుంటూనే ఉన్నా! వింటేనా? వినకుండా వాడిని వెధవగారాంతో టెన్త్‌లో చేర్పించింది! ఈదౌర్భాగ్యపువెధవ ఇప్పుడు ఫస్ట్‌క్లాస్‌లో పాసయి అఘోరించాడు" మేమంతా శంకర్రావ్‌మీదా, ఆపక్కనే నిలబడి కళ్ళొత్తుకుంటున్న అతని భార్యమీదా జాలిపడ్డాము.

"పోనీలెండి! జరిగిందేదో జరిగిపోయింది. పాసయిపోయాక ఇప్పుడింక ఎవరుమాత్రం ఏంచేయగలం?" ఓదారుస్తూ అన్నాడు రంగారెడ్డి.

"నేనూ అలాగే అనుకున్నానండీ! ఛస్తే చావనీ అని వదిలేద్దామనుకున్నాను. కానీ ఏం జరిగింది? ఇప్పుడు కాలేజీలో చేరతానని కూర్చున్నాడు."అందరం ఉలిక్కిపడ్డాం.

"ఏమిటి? కాలేజీలో చేరతానంటున్నాడా? వీడికేంపోయేకాలవొచ్చింది" ఆడవాళ్ళందరూ మెటికలు విరిచారు.

ఆకుర్రాడి తల్లి కూడా భోరున ఏడ్చేయసాగింది.

"నిన్న రాత్రినుంచీ ఇదే వరస పిన్నిగారూ-కాలేజీలో చేరతా అని ఒకటేగొడవ. ఇంక వీడెలా బతికి బట్టగడతాడు?" ఏడుస్తూనే అందామె.

రంగారెడ్డి ఆకుర్రాడి దగ్గరకు నడిచాడు.

"ఏదోపాపం తెలీనివయసు! ఈవయసులో అందరూ ఇలాగే తప్పులు చేస్తుంటారు. మనందరం నచ్చజెప్తే వాడే తెలుసుకుంటాడు లెండి-ఏరా రమణా? ఈ రోజుల్లో చదువులేమిట్రా? తప్పుకదంట్రా? మీవంశం ఎలాంటిది? మీనాన్నగారు వాళ్ళ పెద్దల మాట వినకుండా చదువుకోబట్టేకదా ఈనాడిలా అడుకుతినే పరిస్థితిలో ఊరి బయటపడున్నారు? మేమంతా కూడా మాపెద్దలమాట విని చదువుకునే కదా ఇవాళ ఈకుక్కబ్రతుకు బ్రతుకుతున్నాము?" అతనికి నచ్చచెప్పబోయాడు ప్రేమగా.

వాడికి ఏడుపొచ్చేసింది.

"నేను చదువుతానంకుల్! నాకేండబ్బు ఖర్చుచేయనక్కర్లేదు. నాకు అన్నికాలేజీ ఎంట్రన్సు ల్లోనూ ఫస్ట్‌రాంక్ వచ్చింది. చదువంతా గవర్నమెంట్ స్కాలర్‌షిప్‌తోనే చదివేయగలను-" అన్నాడు ఏడ్చేస్తూ. యాదగిరి వాడి భుజంమీద చేయివేశాడు ఆదరంతో.

"ఒరేయ్ రమణా! గవర్నమెట్ సంగతి నీకెరుకలేదురా! గిట్లనే నీస్కాలర్‌షిప్‌లని, స్పెషల్ కోటాసీట్లనీ పోరగాండ్లకు ఆశపెట్టి కాలేజీల నదివేట్లుజేన్తరు. కొనాకు ఈ చదువుకున్నోండ్లేంజేస్తరు? అడుక్కుతినానికిగూడా పనికిరారన్నట్లు! సమజయిందా? ఎంతమందిని సూడటం లేదురా నువ్? మొన్నే గదా మనకాలనీలో ఎమ్మే సదివినోడు కోడిగుడ్లు వాడితాన కొనమని అందరినీ బ్రతిమ లాడిండు! గుర్తులే?"

యాదగిరి మాటలు కూడా వాడిలో ఎలాంటి చలనం కలిగించలేదు.

"నాకేం? నేనుకాలేజీలోచేరతా? నాకు చదవాలని ఉంది"అన్నాడూ మళ్ళా మొండిగా.

శంకర్రావ్‌కి కోపం వచ్చింది.

"అరె నీయవ్వ-మళ్ళీ అదేమాట మాట్లాడతావు? చదువులేనోళ్ళు ఎంత మంచిగా బ్రతుకుతున్నారో చూసి కూడా బుద్ధి తెచ్చుకోవేరా?"అంటూ రెండు వేసేసరికి రంగారెడ్డి అతనికి అడ్డువెళ్ళాడు.

"ఒరేరమణా! మనదేశచరిత్రంతా ఓసారిచూడరా!'కింగ్‌మేకర్' అనిపేరున్న కామరాజ్ నాడార్ ఏంచదివాడ్రా? అతనికిరాయటం, చదవటం రెండూరావ్‌కదురా! అయినా రాజుల జాతకాలు రాశాడు. అవునా? అందాకా ఎందుకు? మన ఎక్స్ చీఫ్ మినిష్టర్ అంజయ్య నీలాగా చదువుకునివుంటే చీఫ్‌మినిష్టర్ అయేవాడా? మన రాష్ట్రాన్ని మిగతాచదూకున్న చీఫ్‌మిష్టర్లకంటేబాగా పరిపాలించ గలిగేవాడా? మనకాలనీలో ప్రెసిడెంట్ మెడల్ సంపాదించిన ఇంజనీర్ ఏంచేన్తున్నాడు? వేలి ముద్రలువేసే కంట్రాక్టర్‌కింద రోజుకూలీలెక్కన పనిచేస్తున్నాడుకదా" ఏకధాటిగా స్పీచ్ ఇచ్చాడు.

"అందాకా ఎందుకురా! నువుచదివిన స్కూల్స్, కాలేజీలు ఎవరివనుకున్నావ్? ఒకటో క్లాస్‌గూడాచదువని సారాకంట్రాక్టర్‌వి! మరి వాడికిందే ఎమ్.ఏ. పిహెచ్‌డీలూ, ఎమ్మెస్సీ బి.ఇడీలూ, ఎమ్ కామ్‌లూ, పనిచేస్తున్నారా లేదా? నువ్ ఎగబడి చూసే సినిమా డైరెక్టర్లూ, ప్రొడ్యూసర్లూ ఎంతమంది చదువుకున్నారనీ? మనదేశం మొత్తం మీద ఎమ్మెల్యేలు ఎంపీలలో అక్షరంముక్క రాని వాళ్ళే ఎక్కువమంది ఉన్నారన్న విషయం తెలుసా నీకు? వాళ్ళు రకరకాల కమిటీలకు హెడ్స్‌గా పనిచేన్తూ మనదేశ భవిష్యత్తుని నిర్ణయించటంలేదూ?" తనూ కల్పించుకుంటూ అన్నాడు గోపాల్రావ్.

"ఆమాటకొస్తే చాలాపత్రికల ఎడిటర్లూ, కొంతమంది తెలుగు రచయితలకూ ఒక్కలైన్ రాయటం కూడా రాదు. అయినా వాళ్ళను మన తెలుగుప్రజలు పైకెత్తేసి జేజేలు కొట్టటంలేదూ? బాగా చదూకుని ఉంటేపాపం వాళ్ళ గతేమయి ఉండేది?" అంది రాజేశ్వరి.

ఆ కుర్రాడు ఆలోచనలో పడ్డాడు.

"మామాట వినరాబాబూ! గొప్ప గొప్ప వ్యాపారస్తులూ, లక్షాధికారులూ, కోటికి పడగలెత్తిన వారూ మెజారిటీ ఏబీసీడీలు రానివారేరా! క్రిమినల్ 'ప్రొసీజర్' కోడ్ అనేలావుపాటి పుస్తకాలుచదివి సమాజంలోని రుగ్మతలన్నీ అదుపులో పెట్టాల్సిన పోలీసుల్లో నూటికి డెబ్బైమంది చదువు రాని వారేరా! ఎవరిక్కావాల్రా చదువు?" అంది వాళ్ళమ్మ.

"వాటి సంగతలా వుండనీ! నువ్ చదువులేని వాడవయితే మనప్రభుత్వం నీకు ఎన్ని రకాల రాయితీ లిస్తుందోఒక్కసారిచూడు! జనార్ధన్‌పూజారి స్కీంప్రకారం చదువూ సంధ్యా లేకుండా పనిపాటా చేయని వాళ్ళందరికీ ప్రతిసంవత్సరం అయిదువేలు ఉచిత లోన్ దొరుకుతుంది. ప్రతి బాంక్‌లోనూ రకరకాల మారుపేర్లతో ఎన్నో వందలసార్లు లోన్లుతీసుకుని ఎగ్గొట్టవచ్చు! నీలాంటివాళ్ళందరికీ గవర్నమెంట్‌స్థలాలు ఆక్రమించుకునే హక్కు మన ప్రభుత్వం ఇస్తుంది. అంటే అలాంటి స్థలాలు సంవత్సరానికి ఒకటి ఆక్రమించుకుని పట్టాదారగ్గానే అమ్మేసుకుని డబ్బు చేసుకోవచ్చు. ఇదికాక బలహీనవర్గం అని చెప్తే సంవత్సరానికో ఇల్లుకూడా ప్రభుత్వం నీకిస్తుంది.అదీ అమ్మేసుకోవచ్చు. ఇదీగాక నీఓటుని అన్నిరకాల ఎలక్షన్‌లకూ కలిపి అయిదేళ్ళకు టోకున ఏపదివేలకో ఏదోఒకపార్టీకి అమ్మేసు కోవచ్చు" చెప్పాడు రంగారెడ్డి.

"ఇప్పుడు నెహ్రూ రోజ్‌గార్ యోజన స్కీమ్‌లో యింకెంతడబ్బు ముడుతుందో తెలీదు. ఎలక్షన్లలోగానే ఎన్టీఆర్‌రోజ్‌గార్ స్కీమ్ ఒకటి ప్రవేశపెడితే ఇంక నీకూడబ్బుకేంకొదవచెప్పు!" నచ్చజెప్ప సాగాడు గోపాల్రావ్.

"గ్రీన్‌కార్డ్ హోల్డర్‌వయితే నీకెన్ని సౌకర్యాలుంటాయో తెలుసా? నిజామ్‌హాస్పిటల్, అపోలోహాస్పిటల్ లాంటి అతిఖరీదయిన ఆస్పత్రులలో ఉచితంగావైద్యం, కిలోరెండ్రూపాయల బియ్యం, అతిచౌకగాబట్టలు-ఇంతకంటే ఇంకేంకావాల్రా నీకు?" అన్నాడు రంగారెడ్డి.

వాడిలో సంచలనం కలిగింది.

"మీరు చెప్పింది నిజమేననుకో" అన్నాడు నెమ్మదిగా.

అందరికీ ఒక్కసారిగా నెత్తిమీద బరువుదింపినంత సంబరమయింది.

శంకర్రావ్ కొడుకుని కౌగిలించుకున్నాడు.

"ఎంతమంచివాడివిరా నువ్వు! ఎంతత్వరగా అర్థంచేసుకున్నావు?" అన్నాడు ఆనంద భాష్పాలురాలుస్తూ.

"కానీనాకు పెద్దపదవుల్లోకెళ్ళే ఛాన్స్‌పోతుందికదా అంకుల్?" రంగారెడ్డినడి గాడువాడు.

"ఏ పదవులు కావాలనుకుంటున్నావ్ నువ్వు?"

"ఐ.ఏ.ఎస్, ఐ.పి.ఎస్, లాంటివి."

అందరూ ఘెల్లున నవ్వారు.

"పిచ్చివాడా! ఆ పదవులన్నిటికన్నా పైపదవిని చాలా తేలిగ్గా ఎలాంటి చదువూ లేకుండా సంపాదించవచ్చురా?" అన్నాడు రంగారెడ్డి.

"ఎలాగ?"

"ఎలాగేముంది? పాదాభివందనం చేస్తేచాలు! నాలుగయిదేళ్ళు అలా శ్రమపడ్డావంటే పదవి తప్పదు-న్యూస్ పేపర్లలో ఆఫోటోలు చూడలే నువ్వు?"

రమణ మొఖంలో చిరునవ్వు కనిపించింది.

"అయితే సరే! నేను కాలేజిలో చేరను డాడీ!" అన్నాడు నిర్ణయించుకున్నట్టు.

శంకరయ్య, అతని భార్య, రమణను ఆనందంగా ఇంటికి తీసుకెళ్ళిపోయారు.

మేమంతాకూడా తేలికయిన హృదయాలతో ఎవరిళ్ళకువాళ్ళు బయల్దేరాం. ✷



నిజమే సార్! మేడమ్!

మీ ప్రాబ్లెమ్ మా కర్థమయింది.

కాల్ సెంటర్లో మీబాస్ మీ కెప్పుడూ

నైట్ డ్యూటీలే వేస్తున్నాడు. మీ ఇంట్లో వాళ్ళు

టీ.వి. ఛానెల్ విషయంలో మీతో గొడవపడుతున్నారు.

మీ గాళ్/బాయ్ ఫ్రెండ్ ఈ మధ్య కొంచెం

రూట్ మారుస్తున్నట్లుగా మీ కనిపిస్తోంది.

ఇవే కాక ఇంకా సవాలక్షమందితో మీకుచాలా

తలనొప్పిగా ఉంది. వీటిన్నిటి నుంచి విముక్తి కావాలంటే

వెంటనే వాళ్ళందరితో

హ్యూమరాలజీ చదివించండి.

- మీ ప్రాబ్లెమ్ సాల్వ్ అవుతుంది. లేదా

మీరే హ్యూమరాలజీ తీసుకోండి!

వాళ్ళందరి ప్రాబ్లెమ్స్ సాల్వ్

అవుతాయి



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA104B181 |
| పుస్తకం పేరు | హస్త్యామరాలజీ |
| తారీఖు | 11 March 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 347 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CT, BCT |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | akshay |
| స్కాన్ చేసినది | saumya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |